




## శ్రీమద్భాగవత మహాపురాణ సంహిత

### ద్వితీయ స్కంధః

**శ్రీ శుక ఉవాచ**

వరీయానేష తే ప్రశ్నః
కృతో లోక హితం నృప ।
ఆత్మవిత్సంమతః పుంసాం
శ్రోతవ్యాదిషు యః పరః ॥ - 1

**టీ** :- రాజ్ఞః ప్రశ్నమభినందతి. తే త్వయా పుంసాం శ్రోతవ్యాదిషు మధ్యే యః పరః శ్రేష్ఠః తద్గోచరప్రశ్నః కృతః ఏష వరీయాన్. యతో లోకహితమేతత్ మోక్షహేతుత్వాత్. ఆత్మవిదాం బ్రహ్మవిదాం ముక్తానాం సమ్మతో యతః. (1)

శ్రోతవ్యాదీని రాజేంద్ర
నృణాంసంతి సహస్రశః ।
అపశ్యతామాత్మతత్త్వం
గృహేషు గృహమేధినామ్ ॥ - 2

## శ్రీమద్భాగవత మహాపురాణ సంహిత

### శ్రీధరీయ వ్యాఖ్య- ఆంధ్రానువాదము

### ద్వితీయ స్కంధము

**శుకుడు పలికెను.**

**తా** – రాజా ! లోక హితము కొఱకు నీవడిగిన ప్రశ్న చాల ఉత్తమమైనది. మనుష్యులచే వినదగిన, స్మరింపదగిన, కీర్తింపదగిన అంశములన్నింటిలో ఇది శ్రేష్ఠమైనది. ఆత్మవేత్తలకు సమ్మతమైనది.

అవతారిక (శుకుడు)

**టీ** – పరీక్షిత్తు అడిగిన ప్రశ్నను అభినందించుచున్నాడు – తే – నీ చేత – పుంసాం శ్రోతవ్యాదిషు మధ్యే యః పరః – మనుష్యులకు వినదగిన అంశములు మున్నగువానియందు ఏది శ్రేష్ఠమో – శ్రేష్ఠతోగోచరః ప్రశ్నః కృతః – అట్టి ఉత్తమముగ కన్పట్టు ప్రశ్నవేయబడినది. ఏష వరీయాన్ – ఇది ఉత్తమమైనది. యతః లోకహితమేతత్ – ఏలయన ఇది లోకమునకు మేలు చేయునది. మోక్షహేతుత్వాత్ – మోక్షమునకు కారణత్వము కలిగియుండుటవలన – ఆత్మవిదాం –ఆత్మవేత్తలకు – ముక్తానాంచ – ముక్తులకు కూడ – సంమతోయతః – అంగీకార్యమై యుండుట వలన కూడ శ్రేష్ఠమైనది.(1)

***తా*** - రాజేంద్రా ! గృహకృత్యములందు నిమగ్నులై ఆత్మతత్త్వమును గ్రహింపజాలని గృహస్థులకు వినదగినవి, తెలిసికొనదగినవి, ఆలోచింపదగినవియునైన విషయములు వేలకొలదిగనున్నవి.









**టీ** :- తత్ర తావత్స్వాభావిక క్రియాణాం అనర్థహేతుత్వం వదన్ బ్రూహి. యద్వా విపర్యయమిత్యస్యోత్తరమాహ త్రిభిః శ్రోతవ్యాదీనీతి. గృహేషు ఆసక్తానాం - అత ఏవ గృహమేధినాం తద్గతపంచసూనాపరాణాం. మేధీతి హింసార్థకః. (2)

**టీ** - స్వాభావిక క్రియల అనర్థ కారణత్వమునంతయు చెప్పుచు, "బ్రూహి యద్వా విపర్యయమ్" – (వినదగినది, జపింపదగినది, చేయదగినది, స్మరింపదగినది, పూజింపదగినది – లేక వీనికి వ్యత్యస్తమైనది కూడ చెప్పుమని పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు) "శ్రోతవ్యాదీని" అను శ్లోకముతో సహా మూడు శ్లోకములతో సమాధానము చెప్పుచున్నాడు. గృహములందాసక్తులై యుండు వారికి – అనగా గృహమేధులకు – గృహము నందుండెడి అయిదు హింసాకరములగు వస్తువులనాశ్రయించియుండు వారికి – మేధతి, మేధ అను ధాతువు హింసార్థము. (ప్రొయి, నూటెడుఱాయి, సంబారము, ఱోలు, నీటికడవ అనునవి పంచసూనలు. సూనయనగా వధస్థానము, సంబారము బదులుగ మార్జని (చీపురు) అని పాఠాంతరము. ఈ ఐదును సూక్ష్మజీవములను హింసించును) (2)

నిద్రయా హ్రియతే నక్తం
వ్యవాయేన చ వా వయః।
దివా చార్థేహయా రాజన్
కుటుంబభరణేన వా.॥ -3

**తా** – రాజా ! రాత్రి సమయమందు నిద్ర చేతను, లేక రతి చేతను, పగటి వేళయందు ధనము సంపాదించు కోరిక చేతను, లేక కుటుంబ పోషణ చేతను ఆయువు హరింపజేయబడుచున్నది.

**టీ** :- *తతశ్చవృథైవాయుర్వ్యయో భవతీత్యాహ - నిద్రయేతి. నక్తం రాత్రౌ యద్వయః ఆయుః తన్నిద్రయా వ్యవాయేన రత్యా వా హ్రీయతే. దివా అహ్ని. యద్వయః తత్. అర్థేహయా* అర్థార్థముద్యమేన. సిద్ధే ఉ ర్థే కుటుంబభరణస్త్రన చ. చకారావనుక్తసముచ్చయార్థౌ. (3)

**టీ** - వాని వలన వ్యర్థముగనే ఆయువు క్షీణించుచున్నదని చెప్పుచున్నాడు. నక్తం – రాత్రియందు, యద్వయ ః ఏ ఆయువుకలదో అది నిద్రచేత, వ్యవాయేన – రతి చేతనో, హరింపజేయబడును. దివా– పగలు, ఏ ఆయువుగలదో అది – ధనము సంపాదించు ప్రయత్నము చేతను, లేక ధనము సిద్ధింపగా కుటుంబ పోషణము చేతను, 'చ' కారములు రెండును ఇచట పేర్కొనబడని ప్రయోజనములను సాధించుకొనుట కొఱకని గ్రహింపనగును. (3)






దేహాపత్య కలత్రాదిష్వా
త్మసైన్యేష్వసత్ష్వపి ।
తేషాం ప్రమత్తో నిధనం
పశ్యన్నపి న పశ్యతి ॥ - 4

**టీ :-** నను నశ్వరకుటుంబాద్యర్థం కథమాయుర్వ్యయం కుర్యాత్? తత్రాహ - దేహేతి. దేహాదిషు. ఆత్మనః సైన్యేషు పరికరేషు, అసత్సు మిథ్యాభూతేష్వపి. ప్రమత్తః ప్రసక్తః. తేషాం పిత్రాదిదృష్టాంతేన నాశం పశ్యన్నపి నానుసంధత్తే. (4)

**తా -** తన శరీరము, సంతానము, భార్య మున్నగువారియందును, తన పరివారమునందును – ఇవి యన్నియు అసత్య పదార్థములైనను – వీనియందు జీవుడు మిక్కిలి ఆసక్తుడైయుండును. వీని వినాశమును చూచుచున్నను చూడని వాడుగ అజ్ఞానమునను న్నాడు.

**టీ -** నశ్వరములైన కుటుంబము మున్నగువాని కొఱకు ఆయువు ఎట్లు క్షీణింపజేసికొన బడుచున్నదో ఇట చెప్పుచున్నాడు. శరీరము మొదలగు వానియందు – ఆత్మనః సైన్యేషు – పరివారములు – అసత్సు – మిథ్యాభూతములైనను వానియందు – ప్రమత్తః – మిక్కిలి ఆసక్తి కలిగియున్నాడు. తేషాం – వారి యొక్క – తండ్రి మొదలగువారి దృష్టాంతముతో నాశమును చూచుచున్నను తదనుగుణముగ ఆలోచింపడు. (4)

తస్మాద్భారత ! సర్వాత్మా
భగవాన్హరిరీశ్వరః ।
శ్రోతవ్యః కీర్తి తవ్యశ్చ
స్మర్తవ్యశ్చేచ్ఛతా ఉ భయమ్ ॥ - 5

**టీ:-** ఏవం విపర్యయప్రశ్నస్యోత్తరముక్త్వా శ్రోతవ్యాది ప్రశ్నోత్తరమాహ - తస్మాదితి. హే భారత భరతవంశ్య. సర్వాత్మేతి శ్రేష్ఠత్వమాహ భగవానితి. సౌందర్యం. ఈశ్వర ఇత్యావశ్యకత్వం. హరిరితి బంధహారిత్వం. అభవం అపునర్భవం మోక్షం. (5)

**తా -** భరత వంశమునందు జన్మించిన ఓ రాజా ! అందువలన మోక్షమును కోరువాడునగు జీవుడు, సర్వాత్ముడు – భగవానుడు – ఈశ్వరుడునైన హరిని గూర్చి వినవలెను – అతనిని స్మరింపవలెను – కీర్తింపవలెను.

**టీ -** ఈ విధముగ పరీక్షిత్తు అడిగిన విపర్యయ ప్రశ్నకు సమాధానము చెప్పి, వినదగిన వాడెవడు మున్నగు ప్రశ్నలకు సమాధానమును 'తస్మాత్' అను ఈ శ్లోకముతో చెప్పుచున్నాడు – హే భారత! ఓ భరతవంశీయుడా ! సర్వాత్మయని (సర్వాంతర్యామి) ప్రియత్వమును, భగవాన్ (షడ్గుణ సంపన్నుడు) అని సౌందర్యమును, ఈశ్వర (సర్వజగములను నియమించువాడు అని) ఆవశ్యకత్వమును, 'హరి' (ఆశ్రిత పాపహరుడు) యను శబ్దముతో బంధమును తొలగించుటను సూచించినాడు. అభయం – మోక్షమును, ఇచ్ఛతా – కోరువానిచే (వినదగిన, కీర్తింపదగిన, స్మరింపదగినవాడు నారాయణుడని ఉద్ఘాటించినాడు) (5)











ఏతావాన్సాంఖ్య యోగాభ్యాం
స్వధర్మ పరినిష్ఠయా ।
జన్మలాభః పరః పుంసా
మంతే నారాయణస్మృతి ః ॥ - 6

**టీ** :- అతః పరం అన్యచ్ఛ్రేయో నాస్తీత్యాహ - ఏతావానితి. ఏతావానేవ జన్మనో లాభః ఫలం. తమాహ - నారాయణస్మృతిరితి. సాంఖ్యాదిభిస్సాధ్య ఇతి తేషాం స్వాతంత్ర్యేణ లాభత్వం వారయతి. సాంఖ్యం ఆత్మానాత్మ వివేకః. యోగః అష్టాంగః స్వధర్మః విహితానుష్ఠానం. తైః అంతే తత్స్మృతిః పరోలాభః. న తన్మహిమా వక్తుం శక్యత ఇతి భావః. (6)

**తా** - సాంఖ్య యోగములచేతను, స్వధర్మమునందు సంపూర్ణమైన నిష్ఠ కలిగియుండుట చేతను ఎంతటి ఫలము కలుగునో, మనుష్యులకు, చివరకు చేయు నారాయణస్మరణము, అంతకంటే శ్రేష్ఠమైనదగు జన్మ సాఫల్యము నిచ్చునది యగును. (6)

**టీ** - అంతకన్నను మిక్కిలి శ్రేయోదాయకమైనది వేఱొకటి లేదని చెప్పుచున్నాడు. ఇదియే పుట్టువుకు లాభము – ఫలమును గూర్చునది – దానిని గూర్చి 'నారాయణస్మృతి' యని నుడువుచున్నాడు – సాంఖ్యము మొదలగు వానిచేత సాధ్యమేయని చెప్పుచు వానికి స్వతంత్రముగ లాభము సమకూర్చు శక్తిని నివారించుచున్నాడు – సాంఖ్యమనగ ఆత్మానాత్మల వివేకము – అష్టాంగములను తెలుపునది యోగము. అంతము నందు స్మరణము మిక్కిలి లాభదాయకమైనది. దాని మహిమ చెప్పుటకు శక్యము కాదని యర్థము.(6)

ప్రాయేణ మునయో రాజన్
నివృత్తా విధిషేధతః ।
నైర్గుణ్యస్థా రమంతే స్మ
గుణాను కథనే హరేః ॥ - 7

**టీ** :- అత్ర సదాచారం ప్రమాణయతి - ప్రాయేణేతి. విధినిషేధతః విధినిషేధాభ్యాం నివృత్తాః. అత్ర వర్ణాధిక్య మార్షం. నైర్గుణ్యే బ్రహ్మణిస్థితా అపి. స్మ ప్రసిద్ధౌ. (7)

**తా** - రాజా ! ప్రాయికముగా మునులు విధినిషేధములనుండి విరమించి నిర్గుణ బ్రహ్మమునందు ఏకీభూతులైయుండియు శ్రీమన్నారాయణుని గుణములను కీర్తించుచు తన్మయులగుచుందురు.

**టీ** - ఆ విషయమున మహాపురుషుల ఆచారమును 'ప్రాయేణ' అను ఈ శ్లోకముతో ప్రమాణీకరించుచున్నాడు. విధి (ని) షేధతః – చేయవలసినవి, చేయకూడనివి అను రెండు ధర్మములనుండి నివృత్తులై – నిర్గుణ బ్రహ్మమునందు తాదాత్మ్యమున నున్నను – స్మ అనుపదము ప్రసిద్ధిని సూచించునది. (వారు గుణాను కథనము చేయుట "అంతే నారాయణస్మృతిః" అను ప్రమాణ వాక్యమును అనుసంధించుచు కావచ్చును. లోక సంగ్రహముకొఱకైనను కావచ్చును)(7)




ఇదం భాగవతం నామ
పురాణం బ్రహ్మసంమితమ్ ।
అధీతవాన్ ద్వాపరాదౌ
పితుర్ద్వైపాయనాదహమ్ ॥ - 8

**తా -** వేదతుల్యమైన భాగవతమనెడి ఈ పురాణమును నేను నా తండ్రియగు శ్రీ కృష్ణద్వైపాయనుని వలన ద్వాపరాంతమున అధ్యయనముచేసి యుంటిని.

**టీ** :- నను కిమిదం అపూర్వం కథయసి? సత్యం ఉదితపూర్వమే వేదమిత్యాహ - ఇదమితి. ఇదం భగవత్ప్రోక్తం తన్నామైకప్రధానం. పురాణం బ్రహ్మసమ్మితం సర్వవేదతుల్యం. యద్వా - బ్రహ్మసత్యం సమ్యక్ మితం యేన. కుతస్త్వయా ప్రాప్తం? తత్రాహ - అధీతవానితి. కదా? ద్వాపరాదౌ ద్వాపరః ఆదిర్యస్య కాలస్య తస్మిన్ ద్వాపరాంత ఇత్యర్థః. శంతనుసమకాలే వ్యాసావతారాత్. (8)

**టీ -** "ఇదియేమి? పూర్వములేని దానిని చెప్పుచున్నావు? " – "సత్యమే ! మిక్కిలి అపూర్వమైన దానినే చెప్పుచున్నాను" అని ఉపక్రమించుచున్నాడు – ఇది భగవానునిచే – అతని పేరే ప్రధానముగా – చెప్పబడిన పురాణము, బ్రహ్మ సంమితం – సర్వవేదములతో సమానమైనది, లేక బ్రహ్మము దేనితో చక్కగా ప్రమాణీకరింపబడినదో అది – "నీతో ఏల వినిపింపజేయబడుచున్నది;?" – చెప్పుచున్నాడు తండ్రియగు ద్వైపాయనుని నుండి (చే) అధ్యయనము చేసితిని. – ఎప్పుడు? ద్వాపరాదౌ ఏకాలమునకు ద్వాపరము ఆదిగా గలదో ఆ కాలమున – అనగా ద్వాపర యుగము యొక్క అంతమున అని అర్థము. శంతనుని సమకాలమునందే వ్యాసుని అవతారము ప్రసిద్ధమగుట వలన. (8)

పరినిష్ఠితో ఽ పి నైర్గుణ్యే
ఉత్తమ శ్లోక లీలయా ।
గృహీత చేతా రాజర్షే !
ఆఖ్యానం యదధీతవాన్ ॥ - 9

**తా -** ఓ రాజర్షీ ! నిర్గుణ బ్రహ్మమునందు మిక్కిలి నిష్ఠకలిగియున్న నేను, పరమాత్మయని కొనియాడబడు కృష్ణ భగవానుని లీలలచే ఆకర్షింపబడిన మనస్సుగలవాడనై ఆతని కథను అధ్యయనము చేసితిని.

**టీ** :- ననుసిద్ధస్య కుతో ఽ ధ్యయనే ప్రవృత్తిః? తత్రాహ - పరినిష్ఠిత ఇతి. గృహీతచేతాః ఆకృష్ట చిత్తః. (9)

**టీ -** సిద్ధుడనైన నీకు భాగవతాధ్యయనమునందు ఏల ప్రవృత్తి కలిగినదను ప్రశ్ననాశంకించుకొని దానికి సమాధానమును ఇట వివరించుచున్నాడు – 'పరనిష్ఠితోపి' అని ప్రారంభించి చెప్పుచున్నాడు. గృహీత చేతాః – ఆకర్షింపబడిన చిత్తము గలవాడు.(9)

తదహం తే உ భిధాస్యామి
మహాపౌరుషికో భవాన్ ।
యస్య శ్రద్దధతామాశు
స్యాన్ముకుందే మతిః సతీ ॥ - 10

**తా –** మహాపురుషుడైన శ్రీకృష్ణుని పొందుటకు అర్హుడవైన నీకు ఈ భాగవత పురాణమును వినిపించుచున్నాను. శ్రద్ధావంతుని స్వచ్ఛమైన మనస్సు శీఘ్రముగనే ఆ భగవానునియందు తగుల్కొనును.

**టీ** :- తదితి. మహాపురుషో విష్ణుః తదీయః మహాపౌరుషికః యత్ర యస్మిన్ శ్రద్దధతాం శ్రద్ధాం కుర్వతాం సతీ అహైతుకీ.

**టీ –** మహాపురుషుడు విష్ణువు – అతనికి సంబంధించి యుండువాడు మహాపౌరుషికుడు. యస్య – దేని యందెవరు శ్రద్ధ చేయుదురో – సతీ – అహైతుకీ ఏ కారణము కలిగియుండనిది (ఏ కోరికయులేనిది) (10)

ఏతన్నిర్విద్యమానానా
మిచ్ఛతామకుతోభయమ్ ।
యోగినాం నృప ! నిర్ణీతం
హరేర్నామాను కీర్తనమ్ ॥ - 11

**తా –** రాజా ! నిస్సంగులగు ముముక్షువులకు, ఐహికములగు కామనలు గల వారికిని, యోగులకును ఈ హరినామ సంకీర్తనమే భయరహితమైనదిగ నిర్ణయింపబడినది.

**టీ** :- సాధకానాం సిద్ధానాం చ నాతః పరమన్యచ్ఛ్రేయో உ స్తీత్యాహ - ఏతదితి. ఇచ్ఛతాం సకామానాం తత్ఫలసాధనమేతదేవ. నిర్విద్యమానానాం ముముక్షూణాం మోక్షసాధనమేతదేవ. యోగినాం జ్ఞానినాం అకుతోభయం కుతశ్చిదపి భయరహితం ఫలం చైతదేవ నిర్ణీతం. నాత్ర ప్రమాణం వక్తవ్యమిత్యర్థః (11)

**టీ –** సాధన దశలో నున్న వారికిని, సిద్ధులైన వారికిని ఇంతకంటెను ఉత్తమమైన ఇతర శ్రేయస్సాధన మేదియులేదని, 'ఏతత్' అను శ్లోకముతో చెప్పుచున్నాడు. – ఇచ్ఛతాం – కాముకులకు ఆయా ఫలములను సాధించుటకు ఇదియే సాధకము – నిర్విద్యమానానాం – ముముక్షువులకు మోక్ష సాధన మిదియే – యోగినాం – జ్ఞానులకును ఫలమిదియేయని నిర్ణయింపబడినది. ఈ సందర్భమున ప్రమాణము చెప్పనక్కఱలేదని యర్థము.(11)

కిం ప్రమత్తస్య బహుభిః
పరోక్షైర్హాయనైరిహ ।
వరం ముహూర్తం విదితం
ఘటేత శ్రేయసే యతః ॥ - 12

**తా –** తన శ్రేయస్సును గురించి ప్రమాదపడుచున్నవాని విషయమున అనాలోచితముగ గడిపిన అనేక సంవత్సరములతో ఏమి లాభము తెలిసినది? **కలిగినది ?** (వ్యర్థముగ కాలము గడచినదని విదితమైనది) ఏలయన శ్రేయస్సు కొఱకు ఒక ముహూర్తకాలమైనను వరమువలె సార్థకముగ గడవవలెనని తెలిసినది !

**టీ** :- అల్పమేవాఽఽయురవశిష్టం కిమహం సాధయేయం? ఇతి మాశుచ ఇత్యాహ - త్రిభిః కిమితి. పరోక్షైః అలక్షితైః హాయనైర్వర్షైః కింవిదితం వృథాయాతీతివిదితం. జ్ఞాతయంతః యేన జ్ఞానేన ఘటతేయత్నం కరోతి. (12)

**టీ –** "బుద్బుద ప్రాయముగ మాత్రమే ఇక ఆయువు మిగిలినది. నేనేమి సాధింతును?" అనుచు దుఃఖింపవలదని చెప్పుచున్నాడు. – 'కింప్రమత్తస్య' అను శ్లోకము నుండి మూడు శ్లోకములతో చెప్పుచున్నాడు. పరోక్షైః – అలక్షితములైన, హాయనైః – సంవత్సరములచేత – విదితం – వ్యర్థముగ గడచినవి అని తెలిసినది. యతః–ఏ జ్ఞానముచేత – ఘటేత – ప్రయత్నింపవలెను. (వ్యర్థముగ కాలము గడచినదను జ్ఞానము చేత ఇక ఆలసింపక ఉద్యమింపవలెనని తెలిసినది) (12)

ఖట్వాంగోనామ రాజర్షిః
జ్ఞాత్వేయత్తామిహాయుషః ।
ముహూర్తాత్సర్వముత్సృజ్య
గతవానభయం హరిమ్ ॥ -13

**తా.** ఖట్వాంగుడను పేరుగల రాజర్షి, తన ఆయువుయొక్క పరిమితిని తెలిసికొని ఏ మాత్రము కూడ ఆలసింపక సర్వమును పరిత్యజించి ముహూర్త (రెండు ఘడియల) కాలము భాగవతమును విని అభయుడైన శ్రీహరిని పొందెను.

**టీ** :- ఖట్వాంగ ఇతి. ఖట్వాంగో **ఽ** పి దేవపక్షేస్థిత్వా దైత్యానజయత్. తైః ప్రసన్నైర్దేవైర్వరం వృణీష్వేత్యుక్తే తేనోక్తం ప్రథమం మమాయుః కథ్యతామితి? తతో దేవైరుక్తం - ముహూర్తమాత్రమస్తీతి. తతో **ఽ** తి శీఘ్రం విమానేన భువమాగత్య హరిం శరణం గత ఇతి. (13)

**టీ –** ఖట్వాంగుడు దేవతల పక్షమున నుండి రాక్షసులను ఓడించెను. దేవతలు ప్రసన్నులై అతనిని వరమును కోరుకొమ్మనిరి. అప్పుడు అతడు 'నా ఆయువెంతో మొదట చెప్పుడని' వారినడిగెను. ముహూర్త మాత్రమే కలదని దేవతలు బదులు పలికిరి. వెంటనే ఆతడతి శీఘ్రముగ విమానముపై భూమికేతెంచి నారాయణుని శరణుపొందెను. ఏలయన ఈ స్వర్గభూమి రజోగుణము అధికముగా గలది. ఇక భూమండలము కర్మభూమి.(13)

తవాప్యేతర్హి కౌరవ్య !
సప్తాహం జీవితావధిః ।
ఉపకల్పయ తత్సర్వం
తావద్యత్సాంపరాయికమ్ ॥ - 14

**తా –** కురువంశీయుడవగు ఓ రాజా ! ఇప్పుడు నీ ఆయువు కూడ ఏడు దినముల వఱకే ఉన్నది. ఆ వఱకు నీ ఉత్తర జీవితమునకు సంబంధించిన పారలౌకిక సాధనమునంతయు సంపాదించుకొనుము.

**టీ** :- తవేతి. తవ ఏతర్హ్యపి ఇదానీమపి. తావదితి తావతా కాలేన సాంపరాయికం పారలౌకికం సాధనముపకల్పయ సంపాదయ. (14)

**టీ –** తవతు ఏతర్హి + అపి – ఇప్పుడు కూడ – తావత్ + ఇతి – అంత వఱకు గల వ్యవధిలో – సాంపరాయికం – పారలౌకిక సాధనమును (సంపాదించుకొనుము) (14)

అంతకాలే తు పురుష
ఆగతే గత సాధ్వసః ।
ఛింద్యాదసంగ శస్త్రేణ
స్పృహాం దేహే ఉ ను యే చతమ్ ॥ - 15

**తా –** మనుష్యుడు తనకు అవసానకాలము సమీపించినప్పుడు మృత్యుభయమును విడిచి, వైరాగ్యమనెడు ఆయుధముతో దేహముపైన, దానిననుసరించి యుండు పుత్ర మిత్ర కలత్ర బాంధవాదులపైన గల మమకారమును ఖండించివేయవలెను.

**టీ** :- తత్ర వైరాగ్యం తావదాహ - అంతకాల ఇతి. గతసాధ్వసః మృత్యుభయశూన్యః. అసంగః అనాసక్తిః. తేన శస్త్రేణ స్పృహాం సుఖేచ్ఛాం. తం దేహమను. యే పుత్రకలత్రాదయః తేష్వపి స్పృహాం ఛింద్యాత్ (15)

**టీ –** 'అంతకాలే' అను శ్లోకముతో వైరాగ్యమును గూర్చి చెప్పుచున్నాడు – గత సాధ్వసః – మృత్యుభయము లేనివాడై – అసంగ మనగా ఆసక్తి లేకుండుట – ఆ శస్త్రముతో, స్పృహాం – సుఖమునందలి ఇచ్ఛను – తం – దేహముననుసరించి ఉండు పుత్రులు, భార్య మొదలగు వారి యందునుగల ఆసక్తిని కూడా ఛేదింపవలయును. (15)

గృహాత్ప్రవ్రజితో ధీరః
పుణ్యతీర్థ జలాప్లుతః ।
శుచౌ వివిక్త ఆసీనో
విధివత్కల్పితాసనే ॥ - 16

**టీ** :- గృహాదితి. గృహాత్ప్రవ్రజితః గృహాదికం విహాయ నిర్గతః గృహేస్థితస్య పునరాసక్తిసంభవాత్. తత్రాష్టాంగయోగమాహ - ధీర ఇతి బ్రహ్మచర్యాది నియమోపలక్షణం. పుణ్యతీర్థేతి స్నానాది నియమోపలక్షణం. ఆసనమాహ - శుచావితి. వివిక్తే ఏకాంతే విధివత్కుశాజిన చేలైః క్రమేణ నిర్మితే. (16)

**తా** - గృహము నుండి వెడలి, ధైర్యవంతుడై, పవిత్రమైన నదీ జలములలో మున్కలిడి, స్వచ్ఛముగను ఏకాంతముగను ఉన్న ప్రదేశమునందు, శాస్త్ర నియమమునను సరించి సమకూర్చబడిన ఆసనముపై కూర్చొనినవాడై

**టీ** - అదియునుగాక గృహాత్ప్రవ్రజితః - ఇంటినుండి (బయటకు) వెడలి - ఇంటియందున్న వానికి మరల ఆసక్తి కలుగుట సంభవమగుట వలన - ఇక అష్టాంగయోగముచెప్పుచున్నాడు - ధీరః అనుచు బ్రహ్మచర్యము మొదలుగ యమము నకు ఉపలక్షణము - పుణ్యతీర్థమని స్నానము మొదలుగ 'నియమము' నకు ఉపలక్షణము - ఆసనమును చెప్పుచున్నాడు 'శుచౌ' అని వివిక్తే - ఏకాంతమందు, విధివత్ - దర్భ, చర్మము, వస్త్రము అనువానితో క్రమముగ నిర్మింపబడిన ఆసనమునందు. (16)

అభ్యసేన్మనసా శుద్ధం
త్రివృద్బ్రహ్మాక్షరం పరమ్ ।
మనో యచ్ఛేజ్జిత శ్వాసో
బ్రహ్మబీజమవిస్మరన్ ॥ - 17

**టీ** :- జపగర్భం ప్రాణాయామం వక్తుం జప్యమాహ - అభ్యసేదితి. త్రివృత్ త్రిభికారాదిభిర్వ ర్తితం గ్రథితం బ్రహ్మాక్షరం ప్రణవం మనసా అభ్యసేత్ ఆవర్తయేత్. మనసా ఇంద్రియ ప్రత్యాహారం వక్తుం ప్రాణాయామావేన మనోనియమమాహ - మనో యచ్ఛేద్బ్రహ్మబీజం ప్రణవం అనుస్మరన్నేవ జితశ్వాసస్సన్. (17)

**తా.** మనస్సుతో పరమ పవిత్రమైన అ, ఉ, మ అను మూడు వర్ణములుగల ఓంకారమును జపింపవలెను. మనస్సును వశమందుంచుకొని, శ్వాసను జయించి బ్రహ్మబీజమైన ప్రణవమును జపించుట క్షణమైనను మఱువక

**టీ** - జప గర్భమగు ప్రాణాయామమును గూర్చి చెప్పుటకు జపింపదగిన మంత్రమును చెప్పుచున్నాడు. త్రివృద్బ్రహ్మాక్షరం - త్రివృత్ - మూడింటితో అనగా అకారాదులచే వర్తించునది ప్రసిద్ధమైన - బ్రహ్మాక్షరం ప్రణవము - మనసా అభ్యసేత్ - మఱల మఱల ఆవృత్తము చేయవలెను. మనస్సును ఇంద్రియములను విషయముల నుండి మరలించుటను గూర్చి చెప్పుటకు ప్రాణాయామముతో మనస్సును నియమించుటను గూర్చి చెప్పుచున్నాడు - మనో యచ్ఛేత్ - మనస్సును వశీకరించుకొనవలయును. - బ్రహ్మబీజం - ప్రణవమును - అవిస్మరన్ ఏవ (విస్మరింపకుండగనే) జిత శ్వాసః సన్ -(శ్వాస ప్రశ్వాసల గతి విచ్ఛేదము చేసి) (17)

నియచ్ఛేద్విషయేభ్యో ఽ క్షా
న్మనసా బుద్ధి సారథి :।
మనః కర్మభిరాక్షిప్తం
శుభార్థేధారయేద్ధియా ॥ - 18

**టీ** :- ప్రత్యాహారమాహ - నియచ్ఛేదితి. నియచ్ఛేదక్షానింద్రియాణి నిశ్చయాత్మికా బుద్ధిస్సారథిర్యస్య సః ధారణామాహ - మన ఇతి. పునశ్చ కర్మభిః తద్వాసనాభిరాక్షిప్తం ఆకృష్టం శుభార్థే భగవద్రూపే. (18)

**తా –** నిశ్చయాత్మికమగు బుద్ధియే సారథిగా గల సాధకుడు మనస్సుచేత విషయముల నుండి ఇంద్రియములను నిగ్రహింపవలెను. కర్మలచేత (వాసనల చేత) ఆకర్షింపబడియున్న మనస్సును బుద్ధిచేత భగవద్రూపముగ ధారణ చేయవలెను.

**టీ –** ప్రత్యాహారమును చెప్పుచున్నాడు – నియచ్ఛేత్ – నిగ్రహింపవలెను. అక్షాన్ – ఇందిుయములను – నిశ్చయాత్మకమైన బుద్ధియేసారథిగా గలవాడు బుద్ధి సారథి – ఇక ధారణమును చెప్పుచున్నాడు. – మనః అని – ఇంకను – కర్మభిః – కర్మలచేత మఱియు వానిమూలముననేర్పడు వాసనల చేత – ఆక్షిప్తం – ఆకర్షింపబడినది – శుభార్థే – భగవద్రూపమున – (18)

తత్రైకావయవం ధ్యాయే
దవ్యుచ్ఛిన్నేన చేతసా।
మనో నిర్విషయం యుంక్త్వా
తతః కించన నస్మరేత్
పదం తత్పరమం విష్ణోర్మనో యత్ర ప్రసీదతి. - 19

**టీ** :- ఏవం నియమితస్య మనసః కుత్ర సంచారస్సంపాదనీయ ఇత్యతః ధ్యానమాహ - తత్రేతి. ఏకమేకం పాదాద్యవయవం అవ్యుచ్ఛిన్నేన సమగ్రరూపాదవిముక్తేన. ఆత్మవిశేషే సామాన్యతః చిత్తస్థిరీకరణం ధారణా. అవయవవిభావనయా తద్దార్ఢ్యం ధ్యానమితి భేదః. తత్ర చ

**తా –** కృష్ణ భగవానుని సమగ్ర రూపమును, వదలని మనస్సుతో, అతని ఒక్కొక్క అవయవమునే ధ్యానింపవలెను. ఇక మనస్సును నిర్విషయముగ చేసి (భగవానుని కన్న భిన్నమగు ప్రపంచ విషయమేదియు మనస్సు లోనికి రానీయకుండ చేసి) ఇతరమైనదేదియుస్మరింపరాదు. విష్ణుభగవానుని పరమ పదము చేరి మనస్సు అచట ఆనంద పరవశమగును.

**టీ –** ధ్యానమును చెప్పుచున్నాడు – 'తత్ర' అను ఈ శ్లోకముతో – ఏకం – విష్ణుని పాదము మొదలుకొని ఒక్కొక్క అవయవమును – అవ్యుచ్ఛిన్నేన – సమగ్ర రూపమునుండి విడివడక – ఆశ్రయ విశేషముతో సామాన్యముగ చిత్తమును స్థిరముగ చేయుట ధారణ – అవయవమును విశేషముగ భావన చేయుట ద్వారా దానిని దృఢపరచుట ధ్యానము. ఇది భేదము.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

మనోవృత్తేర్విలయస్సమాధిరితి వివేకః. సమాధిమాహ - మన ఇతి. నిర్విషయం మనో యుంక్త్వా సమాధాయ స్థిరీభూతే మనసి స్ఫురత్పరమానందమాత్రాకారం కృత్వేత్యర్థః. (19)

రజస్తమోభ్యామాక్షిప్తం
విమూఢం మన ఆత్మనః ।
యచ్ఛేద్ధారణయా ధీరో
హంతి యాతత్కృతం మలమ్ ॥ - 20

**టీ** :- పదమితి. ప్రసీదతి ఉపశామ్యతి గుణవశాత్ పునరపి క్షోభే సతి ధారణామేవ స్థిరీకుర్యాదిత్యాహ - రజసా విక్షిప్తం తమసా విమూఢం స్వీయం మనో నిరుంధ్యాత్.

యతః సంధార్యమాణాయాం
యోగినో భక్తి లక్షణః ।
ఆశు సంపద్యతే యోగ
ఆశ్రయం భద్ర మీక్షతః॥ - 21

**టీ** :- యచ్ఛేదితి. తత్కృతం రజస్తమోభ్యాం కృతంయతః యస్యాం క్రియమాణాయాం. భద్రం సుఖాత్మకం విషయం పశ్యతస్తత్రైవ ప్రీతిర్భవతి. (21)

ఇక సమాధిని చెప్పుచున్నాడు - నిర్విషయం మనో యుంక్త్వా - సమాధానము చేసి(లయముజేసి) స్థిరమైన మనస్సునందు - తోచుచున్న పరమానంద మాత్రమగు ఆకారముగజేసి అని యర్థము - ప్రసీదతి - ఉపశమించును. (19)

**తా** - ధ్యానసమయమున తన మనస్సు రజో గుణముచేత అడ్డగింపబడినగాని, తమో గుణముచేత మూఢత్వమునొందినను గాని ధీరుడైనవాడు జంకులేక ధారణ చేత దానిని వశీకరించుకొనవలెను. అప్పుడు ఆ రజస్తమస్సులచే కలుగు కాలుష్యమును అది నష్టపఱచును.

**టీ** - గుణముల వశమున మరల ఏదేని బాధ కలిగిన యెడల ధారణచే స్థిరీకరించుకొనవలెనని చెప్పుచున్నాడు. రజోగుణముచేత అడ్డగింపబడిన గాని, తమో గుణము చేత మిక్కిలి మూఢత్వమునొందిన గాని తన మనస్సును నిరోధింపవలెను. తత్కృతం - రజస్తమస్సులచే చేయబడిన (20)

**తా** - ధారణ స్థిరమైనప్పుడు, ధ్యానమునందు తన ఆశ్రయమగు భగవానుని దర్శించు యోగికి వెంటనే భక్తియే లక్షణముగా గల యోగము సంపన్నమగును.

**టీ** - యతః-చేయుచున్న పని యందు (ధ్యానమునందు) భద్రం - సుఖాత్మకమైన ఆశ్రయమును (ఆశ్రయ విషయమగు భగవానుని) చూచునో అటుల చూచుచుండగనే, అదే సమయమున ప్రీతి (భక్తి) కలుగును.(21)

**రాజోవాచ**

యథా సంధార్యతే బ్రహ్మన్
ధారణా యత్ర సమ్మతా ।
యాదృశీవా హరేదాశు
పురుషస్య మనోమలమ్ ॥ - 22

**పరీక్షిత్తు ఇట్లనెను.**

**తా –** బ్రహ్మన్ ! ధారణ ఎట్లు చేయబడును ? ఎచట చేయుట శాస్త్ర సమ్మతము? మనుష్యుని మనః కాలుష్యమును అతి శీఘ్రముగ హరించి వేయుటయన నెట్టిది?

**టీ** :- యథేతి. యథా యత్ర యాదృశీతి చ ఇతి కర్తవ్యతా విషయతద్విశేషాణాం ప్రశ్నా. (22)

**టీ –** ఎట్లు ? ఎచ్చట ? ఎట్టిది? అనునవి చేయదగిన విషయములకు సంబంధించిన విశేషములను గూర్చిన ప్రశ్నలు (22)

శ్రీ శుక ఉవాచ

జితాసనో జితశ్వాసో
జితసంగో జితేంద్రియః ।
స్థూలే భగవతో రూపే
మనః సంధారయేద్ధియా ॥ - 23

**శ్రీ శుకుడు ఇట్లనెను**

**తా –** ఆసనము, శ్వాస, ప్రపంచాసక్తి, ఇంద్రియములు అను వానిపై విజయమును పొంది, బుద్ధి ద్వారా మనస్సును స్థూల రూపుడైన భగవానుని పైన కూర్చవలెను.

**టీ** :- యథేత్యస్యోత్తరం - జితాసనో జితశ్వాసః జితసంగో జితేంద్రియః ఇతి. (23)

**టీ –** 'జితాసనః' అను నీ శ్లోకముతో 'యథా' మున్నగు ప్రశ్నలకు సమాధానములు – 'స్థూలే' అను అర్ధ శ్లోకముతో విషయమును చెప్పుచున్నాడు – "యత్రసంమతా?" అను ప్రశ్నకిది సమాధానము. స్థూలే – విరాట్ దేహమున–(23)

విశేషస్తస్య దేహో ఽ యం
స్థవిష్ఠశ్చ స్థవీయసామ్ ।
యత్రేదం దృశ్యతే విశ్వం
భూతం భవ్యం భవచ్చ సత్ ॥ - 24

**తా.** గడిచినది, గడచుచున్నది, గడవనున్నదియగు కార్యరూపమైన ఈ విశ్వమెచట కన్పట్టుచున్నదో అది అతని విశేషమైన శరీరము – స్థూలమైన వానిలో మిక్కిలి స్థూలమైనది.

**టీ** :- విషయమాహ. సార్ధేన - విషయ ఇతి. విశేషో విరాడ్దేహః అతిస్థూలానామతిస్థూలతరః. సదితి కార్యమాత్రం అస్య చోపలక్షణత్వేన విషయత్వం. (24)

**టీ –** విశేష ః – విరాట్ దేహము. స్థూలమైన వాని కంటెను స్థూలతమము – సత్ – కార్యమాత్రము. (24)

అండకోశే శరీరే౽స్మి
న్సప్తావరణ సంయుతే ।
వైరాజః పురుషో యో౽సౌ
భగవాన్ధారణాశ్రయః ॥ - 25

**తా –** ఏడు ఆవరణములతో కూడిన అండకోశము వంటి ఈ శరీరమునందుగల భగవానుడైన విరాట్పురుషుడు ధారణకు ఆశ్రయమైనవాడు.

**టీ** :- వస్తుతస్తువిరాడ్జీవనియంతా భగవానేనవిషయ ఇత్యాహ - అండకోశ ఇతి. అండకోశే అండకోశాంతర్వర్తిని కటాహేవా. పృథివ్యావరణం తతః అప్తేజోవాయ్వాకాశాహంకార మహత్తత్వాదీని సప్త. (25)

**టీ –** కార్యమాత్ర విరాట్దేహము యొక్క ఉపలక్షణముచేత విషయత్వము (అంతర్యామి యగు భగవానుడు) వస్తుతః , విరాట్ – జీవనియన్త యగు భగవానుడే విషయమని చెప్పుచున్నాడు. అండకోశము యొక్క లోపలి భాగమునగల భాండమే పృథివి యనెడు ఆవరణము–అచటి నుండి నీరు, తేజస్సు, గాలి, ఆకాశము, అహంకారము, మహత్తత్త్వము అని మొత్తము ఏడు (ఆవరణములు) (ఒక్కచో చిత్తమును నిలువరించుట ధారణ) (25)

పాతాలమేతస్య హి పాదమూలం
పఠంతి పార్ష్ణి ప్రపదే రసాతలమ్ ।
మహాతలం విశ్వ సృజో౽థ గుల్ఫౌ
తలాతలం వై పురుషస్య జంఘే ॥ - 26

**తా –** విరాట్దేహుని పాదముల క్రింది భాగము పాతాళమనియు కాలి మడమలు, మీగాళ్ళు రసాతలమనియు, ఇక ఆ విశ్వస్రష్ట యొక్క చీలమండలు మహాతలమనియు, అతని పిక్కలు తలాతలమనియు విజ్ఞులు స్తోత్ర పాఠములు చదువు చుందురు.

**టీ** :–విరాడ్దేహతజ్జీవతదంతర్యామిణామభేదమారోప్యోపాసనం కర్తవ్యమిత్యాశయేనాహ – పాతాలమితి. పాతాలం పాదమూలం

**టీ –** విరాట్ దేహమునకు తదభిమాని యగు అంతర్యామికిని అభేదమును ఆరోపించి ఉపాసనము చేయవలయునను ఆశయముతో చెప్పుచున్నాడు – పాతాలం

పాదస్యాధోభాగః. పాతాలాదీనాం తదవయవతా విధీయతే. పాతాలాదీన్యతలాంతాని అధస్థానాదారభ్య సప్తభూవివరాణి. పఠంతి గృణంతీత్యాది ప్రమాణదర్శనం. పార్ష్ణి ప్రపదే పాదస్య పశ్చాత్పురోభాగౌ. (26)

ద్వే జానునీ సుతలం విశ్వమూర్తే
రూరుద్వయం వితలం చాతలం చ ।
మహీతలం తజ్జఘనం మహీపతే !
నభస్తలం నాభి సరో గృణంతి ॥ - 27

**టీ** :- ద్వే ఇతి. ఊరుద్వయం తస్యాధోభాగే వితలం. ఉత్తర భాగే అతలమితి జ్ఞేయం. నభస్తలం భువర్లోకం నాభిరేవ సరః. (27)

ఉరః స్థలం జ్యోతిరనీకమస్య
గ్రీవా మహర్వదనం వై జనో ౭ స్య ।
తపో రరాటీం విదురాది పుంసః
సత్యంతు శీర్షాణి సహస్ర శీర్ష్ణః ॥ - 28

**టీ** :- ఉరస్థలమితి. ఉరస్థలం జ్యోతిరనీకం జ్యోతిషాం సమూహం స్వర్గం. (28)

పాదమూలం - పాదముల క్రింది భాగము - పాతాలము మొదలగు వానికి విరాట్ పురుషుని అవయవత్వమును విధించుచున్నాడు. పాతాళము మొదలుకొని అతలము వఱకు గల క్రింది తలములు ఏడును భూ వివరములు (బిలములు) - పఠంతి - చెప్పుదురు అని ప్రమాణమును చూపుచున్నాడు - పార్ష్ణి ప్రపదే - పాదము యొక్క వెనుక, ముందు భాగములు. (26)

**తా -** రాజా ! విశ్వస్వరూపుని రెండు మోకాళ్ళు సుతలము. వితలము, అతలము రెండు తొడలు. అతని నడుము మహీతలము. అతని బొడ్డు కొలను ఆకాశతలమని చెప్పుదురు.

**టీ -** తొడల క్రిందు భాగమున, వితలము - పై భాగమున అతలమని తెలియవలెను. నాభియే సరస్సు.(27)

**తా -** ఆదిపురుషుని వక్షః స్థలము స్వర్గలోకమని, మెడ మహర్లోకమని, ముఖమును జనలోకమని లలాటమును తపోలోకమని చెప్పుదురు. ఆ వేయి తలలుగల భగవానుని తలలే సత్యలోకము.

**టీ -** జ్యోతిరనీకం - జ్యోతిస్సుల సమూహమగు స్వర్గము - మహర్లోకము కంఠమని చెప్పుదురు. తపోలోకం రరాటీం - లలాటమని - సత్యం - సత్యలోకమని (చెప్పుదురు) (28)

ఇంద్రాదయో బాహవ ఆహు రుస్రాః
కర్ణౌ దిశః శ్రోత్రమముష్య శబ్దః ।
నాసత్య దస్రౌ వరమస్య నాసే
ఘ్రాణో ౨ స్య గంధో ముఖమగ్నిరిద్ధః ॥ - 29

**టీ** :- ఇద్రాదయ ఇతి. ఉస్రాః దేవాః తేజోమయ శరీర త్వాత్తే బాహవ ఇత్యాహుః దిశః అస్మదాది శ్రోత్రాధిష్ఠాత్ర్యో దేవతాః. కర్ణౌ శ్రోత్రాధిష్ఠానం. శబ్దస్తు శ్రోత్ర విషయః. సత్యస్య శ్రోత్రం ఇంద్రియం. ఏవం నాసికాదిష్వపి. నాసత్యదస్రౌ అశ్వినౌ. నాసే నాసాపుటే. ఇద్ధః దీప్తః. (29)

**తా** - ఇంద్రాది దేవతలు అతని భుజములు, దిక్కులు చెవులు, శబ్దము శ్రవణేంద్రియము. అశ్వినీ కుమారులిరువురును అతని ముక్కు రంధ్రములు, గంధము ఘ్రాణేంద్రియము. దీప్తమగు అగ్ని అతని నోరు.

**టీ** - ఉస్రాః - దేవతలు - తేజోమయ శరీరత్వము వలన వారు బాహువులని చెప్పుదురు. దిక్కులు మనవంటి ప్రాణుల శ్రోత్రములకు అధిష్ఠాన దేవతలు చెవులు - శ్రోత్రేంద్రియమునకు అధిష్ఠానము. ఈ విధముగ ముక్కు మొదలగు వానియందు కూడ - నాసత్య దస్రులను వారు ఇరువురు అశ్వినులు, నాసే - నాసా పుటమునందు - ఇద్ధః - దీప్తుడు. (29)

ద్యౌరక్షిణీ చక్షురభూత్పతంగః
పక్ష్మాణి విష్ణోరహనీ ఉభే చ ।
తద్భ్రూ విజృంభః పరమేష్ఠి ధిష్ణ్య
మాపో ౨ స్య తాలూ రస ఏవ జిహ్వా ॥- 30

**టీ** :- ద్యౌరితి. ద్యౌరంతరిక్షం చంద్రసూర్యాధిష్ఠాన భూతత్వాత్ అక్షిణీ నేత్రగోలకే. చక్షురింద్రియం పతంగః సూర్యః. (30)

**తా** - విష్ణు భగవానుని నేత్రములు అంతరిక్షము. వానిలో చూచెడు శక్తి సూర్యుడు, కనురెప్పలు రెండును రాత్రింబవళ్ళు. అతని కనుబొమ్మల విలాసము బ్రహ్మలోకము. దవడలు జలము, నాలుకయే రసము.

**టీ** - ద్యౌః - అంతరిక్షము - అక్షిణీ - నేత్ర గోళకములు (కనుగ్రుడ్లు) చక్షురింద్రియము - పతంగః - సూర్యుడు. అహనీ - రాత్రింబవళ్ళు - పరమేష్ఠి ధిష్ణ్యం - బ్రహ్మ పదము - తాలు - అధిష్ఠానము - జిహ్వా - ఇంద్రియము.(30)

ఛందాంస్యనంతస్య శిరో గృణంతి
దంష్ట్రా యమః స్నేహకలా ద్విజాని ।
హాసో జనోన్మాదకరీ చ మాయా
దురంత సర్గో యదపాంగ మోక్షః ॥ - 31

**టీ** :- ఛందాంసి ఛందప్రధానా వేదాః శిరోబ్రహ్మరంధ్రం స్నేహకలా పుత్రాది స్నేహలేశాః. (31)

**తా** - వేదములు అనంతుని బ్రహ్మ రంధ్రమని చెప్పుదురు. కోఱలు యముడని, స్నేహకళలు దంతములని, అతని నవ్వు జనములను మోహింపజేయు మాయ అనియు, ఈ అనంతమైన సృష్టి ఆ మాయ యొక్క కటాక్ష విక్షేపమనియు చెప్పుదురు. (అపార సంసారము అతని కటాక్షము)

**టీ** - ఛందాంసి - వేదములు, శిరః - బ్రహ్మరంధ్రము - స్నేహకలాః - పుత్రాదుల యందలి స్నేహలేశములు. ద్విజాని - దంతములు, ద్విజ శబ్దము పుంలిగమైనను నపుంసకలింగమున ఉపయోగించుట ఆర్షము. దురంతః - అపారమైన - సర్గ (సృష్టి) యని చెప్పబడినట్టిది అతని కడకంటి చూపు (కటాక్ష మోక్షః - కడగంటి చూపును వదలుట - ప్రసరింపజేయుట) (31)

వ్రీడోత్తరోష్ఠో ఒ ధర ఏవ లోభో
ధర్మః స్తనో ఒ ధర్మ పథో ఒ స్య పృష్ఠః ।
కస్తస్య మేఢ్రం వృషణౌ చ మిత్రౌ
కుక్షిః సముద్రా గిరయో ఒ స్థి సంఘాః ॥ - 32

**టీ** :- వ్రీడేతి. అధర్మమార్గః తస్య పృష్ఠభాగః కః ప్రజాపతిః . మిత్రౌ మిత్రావరుణౌ. (32)

**తా** - లజ్జ పైపెదవి, లోభము క్రింది పెదవి. ధర్మము స్తనము, అధర్మము వీపు. ప్రజాపతి అతని జననాంగము. మిత్రావరుణులు వృషణములు. సముద్రములు కడుపు. పర్వతములు ఎముకలు

**టీ** - అధర్మ మార్గము ఇతని వీపు - కః - ప్రజాపతి - మిత్రౌ - మిత్రా వరుణులు.(32)

నద్యోఽస్య నాడ్యోఽథ తనూరుహాణి
మహీరుహా విశ్వతనోర్నృపేంద్ర ! ।
అనంత వీర్యః శ్వసితం మాతరిశ్వా
గతిర్వయః కర్మ గుణ ప్రవాహః ॥ - 33

తా - రాజేంద్రా ! విశ్వశరీరుని నాడులు నదులు, వృక్షములు రోమములు, ప్రబలమగు వాయువు అతని శ్వాస, కాలము అతని వయస్సు, అతని కర్మ, గుణములను ప్రవహింపజేయుచుండుట.

టీ :- నద్య ఇతి. అనంతవీర్యస్య వయః కాలః తస్య గమనం గుణప్రవాహః ప్రాణినాం సంసారః కర్మ తస్య క్రియా.

టీ - అనంతమగు వీర్యము గలవాడు అనంతవీర్యుడు. వయః – కాలము, అతని గమనము – గుణ ప్రవాహః – ప్రాణుల సంసారము, కర్మ అతని క్రీడ.(33)

ఈశస్య కేశాన్విదురంబు వాహాన్
వాసస్తు సంధ్యాం కురువర్య ! భూమ్నః ।
అవ్యక్తమాహుర్హృదయం మనశ్చ
స చంద్రమాః సర్వ వికార కోశః ॥ - 34

తా - కురు శ్రేష్ఠుడా ! ఈశ్వరుని వెంట్రుకలను మేఘములనుగ తెలిసికొందురు, సంధ్య ప్రభుని వస్త్రము, అతని హృదయము అవ్యక్తము (మూల ప్రకృతి) అని చెప్పుదురు. అన్ని వికారములకు మూలమగు అతని మనస్సు చంద్రుడనియు చెప్పుదురు.

టీ :- ఈశస్యేతి. భూమ్నః ప్రభోః. అవ్యక్తం ప్రధానం సః ప్రసిద్ధశ్చంద్రమాః హృదయమాహుః. తదీయం మనః సర్వేషాం వికారాణాం కామాదీనాం కోశ ఇవాశ్రయీభూతం. చంద్రోపి సర్వవికారకోశ ఉచ్యతే. ధూమాదిమార్గత్వాత్. (34)

టీ - భూమ్నః – విభుని యొక్క – అవ్యక్తం – ప్రధానము (ప్రకృతి) ప్రసిద్ధుడైన చంద్రుడు అతని మనస్సు – అన్ని వికారములకు కోశము వలె ఆశ్రయభూతమైనది. (34)



విజ్ఞాన శక్తిం మహిమామనంతి
సర్వాత్మనో ఉ ం తఃకరణం గిరిత్రమ్ ।
అశ్వాశ్వతర్యుష్ట్ర గజా నఖాని
సర్వే మృగాః పశవః శ్రోణి దేశే ॥ - 35

**టీ** :- విజ్ఞానశక్తిమితి. విజ్ఞానశక్తిం జ్ఞానరూపాం భగవచ్ఛక్తిం. చిత్తం మహిం మహత్తత్త్వం, అంతఃకరణం అహంకారం. గిరిత్రం శ్రీరుద్రం. గర్దభాద్బడబాయాముత్పన్నా అశ్వతరీ. (35)

**తా** - మహత్తత్త్వమును సర్వాత్మకుని చిత్తముగను, రుద్రుని అంతః కరణముగను, గుఱ్ఱములు, కంచర గాడిదలు, ఒంటెలు, ఏనుగులు అతని గోళ్ళుగను, మృగములు, పశువులు అతని కటి ప్రదేశమున నున్నవిగను భావింతురు.

**టీ** - విజ్ఞానశక్తిం - చిత్తమును, మహిం - మహత్తత్త్వమును, అంతః కరణం - అహంకారమును, గిరిత్రం - శ్రీరుద్రుని - గాడిదవలన ఆడ గుఱ్ఱము నందు బుట్టినది అశ్వతరీ. (35)

వయాంసి తద్వ్యాకరణం విచిత్రం
మనుర్మనీషా మనుజో నివాసః ।
గంధర్వ విద్యాధర చారణాప్సరః
స్వరస్మృతీ రసురానీక వీర్యః ॥ - 36

**టీ** :- వయాంసీతి. వయాంసి పక్షిణః. తస్యవ్యాకరణం. శ్రు. 'నామరూపే వ్యాకరవాణీ'తి శ్రుత్యుక్తం శిల్పినైపుణ్యం. యదాహుః. శ్లో. ' యేన శుక్లీకృతా హంసాః శుకాశ్చ హరితీ కృతాః, మయూరాశ్చిత్రితా యేన స నో వృత్తిం విధాస్యతీ' తి. (36)

**తా** - పక్షులు, ఆ విశ్వరూపుని విచిత్ర నిర్మాణ కౌశలము. స్వాయంభువ మనువు అతని బుద్ధి, మను సంతానమైన మనుష్యుడు ఆతని నివాసస్థానము, గంధర్వులు, విద్యాధరులు, చారణులు, అప్సరలు ఆయన షడ్జాది స్వరముల స్మృతులు, దైత్యసమూహములు ఆతని వీర్యము.

**టీ** - వయాంసి - పక్షులు - తస్య వ్యాకరణం - 'నామరూపములు వ్యాకరింతును' అని శ్రుతిలో చెప్పబడినది. శిల్ప నైపుణ్యము - ఎవరు హంసలను తెలుపు వన్నెలో చేసిరో, చిలుకలను ఆకుపచ్చని వర్ణములో రచించిరో, నెమిళ్ళను ఎవరు చిత్రించిరో, ఆయనయే వానికి వృత్తిని కల్పించి పోషించును". అని యిట్లు చెప్పుచుందురు - మనుః - స్వాయంభువుడు - మనీషా - బుద్ధి, మనుజః - పురుషుడు. నివాసః - ఆశ్రయము, "మనుష్యత్వమునందు ఆత్మపదార్థము అతిశయముగ ప్రకటమగుచున్నది" అను శ్రుతి వలన గంధర్వాదులకు ద్వంద్వ

బ్రహ్మాననం క్షత్రభుజో మహాత్మా
విడూరురంఘ్రిశ్రిత కృష్ణ వర్ణః ।
నానాభిదా భీజ్య గణోపపన్నో
ద్రవ్యాత్మకః కర్మ వితాన యోగః ॥ - 37

**టీ** :- బ్రహ్మానమితి. బ్రహ్మవిప్రః. తస్య ఆననం ముఖం. క్షత్రం క్షత్రియో భుజో యస్య. విట్ వైశ్యః ఊరూ యస్య. అంఘ్రితః కృష్ణవర్ణః శూద్రో యస్య. నానారూపాః అభిధాః నామాని ఏషాం తే. చ తే. అభిజ్యాః దేవాః తేషాం గణైః వసురుద్రాదిభిః. ఉపపన్నో యక్తః. ద్రవ్యాత్మకః హవిర్మ వితానయోగః. (37)

ఇయానసావీశ్వర విగ్రహస్య
యః సంనివేశః కథితో మయా తే ।
సంధార్యతే ౽ స్మిన్వపుషి స్థవిష్ఠే
మనః స్వబుద్ధ్యా న యతో ౽ స్తి కించిత్ ॥- 38

సమాసమున ఏకత్వము – గంధర్వులు మొదలగువారు. స్వరస్మృతీః – షడ్జాదులగు స్వరముల యొక్క తలంపులు అని యర్థము. దైత్యుల సమూహములే వీర్యముగ గలవాడు. "స్వరః స్మృతి రసురానీక వీర్యః" అను పాఠమున గంధర్వాదులు స్వరము – అసుర సమూహ శ్రేష్ఠుడు ప్రహ్లాదుడు – అతని స్మృతియని – (36)

**తా –** విరాట్పురుషునకు బ్రాహ్మణుడు ముఖము, క్షత్రియుడు భుజములు, వైశ్యుడు తొడలు, శూద్రుడు పాదములు, వివిధ దేవతానామములతో చేయబడు ద్రవ్యమయములైన పెద్ద యజ్ఞములు అతడు చేయు కర్మ.

**టీ –** బ్రహ్మ – బ్రాహ్మణుడు – తదాననం – అతని ముఖము. క్షత్రియుడే భుజములుగా గలవాడు క్షత్రభుజుడు – విట్ – వైశ్యుడు – ఊరువులు (తొడలు) గ గలవాడు విడూరుః – అంఘ్రిశ్రిత కృష్ణవర్ణః – పాదములుగా శూద్రుడుకలవాడు – నానాభిధా – అనేకములైన పేరులు గల, అభీజ్యాః – దేవతలు – తేషాం గణైః – వారి గణముల చేత వసురుద్రాదిభిః – వసువులు రుద్రుడు మొదలగువారిచే – ఉపపన్నః – కూడినట్టి ద్రవ్యాత్మకః – హవిస్సులతో సాధ్యమగు – వితాన యోగః – యజ్ఞ ప్రయోగము గలవాడు – తస్య కర్మ – అతని కార్యము. ఆవశ్యకః – ఉద్దిష్టమైనది – అని అర్థము.(37)

**తా –** రాజా ! నేను నీకు చెప్పిన విరాట్ స్వరూపుడైన భగవానుని అవయవ సన్నివేశమిదియే. ఇట్టి యీతని ఈ స్థూల శరీరమునందు బుద్ధి ద్వారా మనస్సును లెస్సగా స్థిరము చేయుదురు. ఇంతకంటెనిక ఏమియులేదు.

**టీ** :- ఇయానసావీశ్వర విగ్రహస్యయస్సన్నివేశః కథితో మయా తే, సంధార్యతే౽ స్మిన్ పురుషే స్థవిష్ఠే మనస్స్వ బుధ్యానయతో౽ స్తి కించిత్. (38)

స సర్వధీవృత్త్యనుభూత సర్వః
ఆత్మా యథా స్వప్న జనేక్షి తైకః ।
తం సత్యమానంద నిధిం భజేత
నాన్యత్ర సజ్జేద్యత ఆత్మ పాతః ॥ - 39

**టీ** :- ససర్వధీవృత్త్యనుభూత సర్వఆత్మా యథా స్వప్న జనేక్షితైకః, తం సత్యమానందవిధిం భజేత నాన్యత్ర సజ్జేద్యత ఆత్మపాతః. (39)

**ఇతి శ్రీమద్భాగవత మహాపురాణే ద్వితీయ స్కంధే మహాపురుష సంస్థానువర్ణనే ప్రథమో౽ ధ్యాయః**

**టీ** – ఇయాన్ – ఇంతవఱకు – సంనివేశః – అవయవముల పొందిక – దీనియందు తన బుద్ధిచేత (అస్మిన్ స్వబుద్ధ్యా) మనః సంధార్యతే ముముక్షుభిః – మోక్షమును కోరువారి చేత మనసున ధరింపబడును. యతః – దీనికి భిన్నముగ – కించిన్నాస్తి తస్మిన్ – ఆవిరాట్ స్వరూపునియందు ఇకనేమియు లేదు. (38)

**తా** – స్వప్నమును గాంచుచున్న మనుష్యుడు తన స్వప్న జగత్తులోని అనేక వస్తువులను ఒకే దృశ్యముగ చూచునట్లు మానవుడు తన బుద్ధి వృత్తులన్నింటి చేతను చూచు ప్రపంచ వస్తువులెల్లను ఆ ఆత్మయే. అట్టి సత్యస్వరూపుని, ఆనంద నిధిని మాత్రమే భజింపవలెను. మనస్సును ఇతరత్ర లక్షింపజేయరాదు. అటుల చేసినచో స్వీయ పతనమగును.

**టీ** – ఈ విధముగ చిత్తమును స్థిరీకరించుకొని యుండుటకు విరాట్ దేహ, జీవేశ్వరులకు భేదములేని విధమున ఉపాసనము చెప్పబడినది, ఆ సందర్భమున దేహ జీవులను ఈశ్వరునిలో లయింపజేసి, అతడే ధ్యానింపతగిన వాడని నిర్ధారణ చేయుచున్నాడు – 'సః' అను ఈ శ్లోకముతో – అందఱకును తమ తమ బుద్ధి వృత్తులతో అనుభూతమగునది అంతయును ఎవనివలననో అతడు ఒక్కడే. సర్వపదార్థముల అంతర్భాగమున నున్న ఆత్మ. అతనినే సత్యమని భజింపవలయును. ఇతరత్ర గల ఉపలక్షణమునందు (అనుక్తమునందు) మనస్సును ఏకీకృతము చేయరాదు – యతః – అటుల మిక్కిలి తగుల్కొని యున్నచో – ఆత్మనః పాతః – సంసారమేయగును. ఒక్కనికే ఆయా ఇంద్రియములచే సర్వమును అనుభూతికి వచ్చుననుటకు దృష్టాంతము, 'యథా స్వప్నజనేక్షితా' అను భాగముతో చెప్పుచున్నాడు. స్వప్నమునందే అనేక దేహములను కల్పించి జీవుడు ఆయా ఇంద్రియములతో మొత్తమును (ఒకే దృశ్యముగ) చూచును. ఆ విధముగనే – ఈశ్వరునకు అనిననో విద్యా శక్తిత్వము వలన బంధములేదు. (39)

**శ్రీ మద్భాగవత మహాపురాణమునందలి ద్వితీయ స్కంధమున మహాపురుష సంస్థానువర్ణనమున మొదటి అధ్యాయము సమాప్తము.**








## అథ ద్వితీయో ఽ ధ్యాయః

**శ్రీ శుక ఉవాచ ..**

ఏవం పురా ధారణయా ఽ ఽ త్మయోని
ర్నష్టాం స్మృతిం ప్రత్యవరుధ్య తుష్టాత్ ।
తథా ససర్జేదమమోఘ దృష్టి
ర్యథాప్యయాత్ ప్రాగ్వ్యవసాయ బుద్ధిః ॥ - 1

**టీ :-** 'ద్వితీయే తు తతస్థూ ౽ల ధారణతో జితం మనః సర్వసాక్షిణి సర్వేశే విష్ణౌ ధార్యమితీర్యతే. దృశ్యాలంబన రూపైవముక్తావైరాజ ధారణా, ఇహోచ్యతే తు తచ్ఛాద్యా సర్వాంతర్యామి ధారణా'. తత్ర తావత్పూర్వోక్త ధారణయా అవాంతరఫలం విశ్వసృష్ట్యాదికమాహ – ఏవమితి. ఏవం ధారణయా తుష్టాద్ధరేః పురా ప్రలయసమయే నష్టాం సృష్టిస్మృతిం ప్రత్యవరుధ్య లబ్ధ్వా అప్యయాత్ప్రలయాత్ప్రాగిదం విశ్వం యథా ఽ సీ త్తథా ససర్జ. వ్యవసాయాత్మికా బుద్ధిర్యస్య అత ఏవామోఘ దృష్టిర్యస్యేతి అతస్తయా ధారణయా విశ్వసృష్టి సామర్థ్యం భవతి. (1)

## రెండవ అధ్యాయము

**శ్రీ శుకుడిట్లనెను**

**తా –** సృష్టి ప్రారంభమున బ్రహ్మదేవుడు ఏ ధారణ ద్వారా అనుగ్రహింపబడి సృష్టి రచన సాగించెనో అట్టి స్మృతిని (ప్రళయకాలమున) కోల్పోయి, దానిని విష్ణుభగవానునిచే తిరిగిపొంది వ్యర్థముకాని దృష్టి కలవాడై మఱల ఈ ప్రపంచమును సృజించెను. ఆ విధముగ అతడు తన పూర్వపు స్మృతిని పొంది కృషితో కూడిన బుద్ధిగలవాడై యథా పూర్వముగ లయమునుండి విశ్వసృష్టి చేసెను.

**టీ –** ద్వితీయాధ్యాయమునందు, పూర్వోక్తమైన స్థూల ధారణ చేతనే మనస్సును జయించి, సర్వసాక్షి, సర్వేశ్వరుడు, అయిన విష్ణుభగవానుని యందు నిలిపియుంచవలెనని చెప్పబడుచున్నది. విరాట్ ధారణ యనునది దృశ్యమును ఆలంబనగా జేసికొని, ఏకాగ్రము చేయునదిగ చెప్పబడినది. సర్వాంతర్యామి ధారణ సాధింపదగినది యని యిట చెప్పబడుచున్నది. పూర్వము చెప్పబడిన ధారణచేత కలుగు అవాంతర ఫలమును చెప్పుచున్నాడు. ఈ విధముగ ఏ ధారణ గలదో దానిచేత, తుష్టాత్ – విష్ణుభగవానుని నుండి, పురా – ప్రలయ సమయము నందు, నష్టాం – నశించి పోయిన సృష్టి స్మృతిని – ప్రత్యవరుధ్య – పొంది, బ్రహ్మ దేవుడు – అప్యయాత్ – నశించిన దాని నుండి – పూర్వమీ విశ్వమే విధముగ నుండెనో తథా అదే విధముగ, ససర్జ – సృజించెను వ్యవసాయాత్మికమైన బుద్ధిగలవాడు వ్యవసాయ బుద్ధిః – అందువలననే వ్యర్థముకాని దృష్టికలవాడు అమోఘదృష్టిః – ఆ విధముగ ఆ ధారణచేత విశ్వమును సృష్టింపగల సామర్థ్యము కలుగును. (1)









శాబ్దస్యహి బ్రహ్మణ ఏష పన్థా
యన్నామభిర్ధ్యాయతి ధీర పార్థైః।
పరిభ్రమంస్తత్ర నవిన్దతే ఽ ర్థా
న్మాయామయే వాసనయా శయానః ॥ - 2

**తా -** బుద్ధి, అర్థరహితమైన (స్వర్గాది) నామములతో పెనవేసికొని వానిని గూర్చియే ధ్యానించుచుండును. శబ్ద సంబంధమగు వేదమునకు ఇదియే మార్గము. మాయామయమగు వాసనలతో కలలు గనుచు ఆయా లోకములలో తిరుగాడుచును అచట ఎట్టి సుఖ ప్రయోజనములను పొందజాలరు.

**టీ :-** ఉపాసనాఫలాదతివిరక్తస్య శుద్ధాత్మధారణాయామధికారః అతో వైరాగ్యార్థం సర్వం కర్మఫలం నిందతి - శాబ్దస్యేతి. శాబ్దం శబ్దమయం బ్రహ్మ వేదః. తస్య ఏష పంథా కర్మఫలబోధన ప్రకారః. కోఽసౌ అర్థశూన్యైరేవ స్వర్గాదినామభిర్ధ్యాయతి తత్తదిచ్ఛాం కరోతీతి యత్. అపార్థత్వమేవాహ - తత్ర మాయామయే పథి సుఖమితి మన్యమానః స్వప్నాన్ పశ్యన్నివ పరిభ్రమన్నర్థాన్ న విందతి. తత్తల్లోకం ప్రాప్తో ఽ పి నిరవద్యం సుఖం న లభత ఇత్యర్థః. (2)

**టీ -** ఉపాసనల ఫలము కన్నను విరక్తునకు శుద్ధమైన ఆత్మను ధారణ చేయుట యందే అధికారము. అందువలన వైరాగ్యము వలన కలుగు ఫలమునకు బదులుగ పొందెడు సర్వకర్మఫలములను తిరస్కరించుచున్నాడు. శాబ్దం - శబ్దమయము, బ్రహ్మ - వేదము - దాని మార్గమే కర్మలు - వాని ఫలములను గూర్చి తెలిపెడు జ్ఞాన ప్రకారము. అదియేది? అర్థరహితమైన స్వర్గాది నామములతో సాధకుని బుద్ధి వేనిని గూర్చి ధ్యానించునో - అనగా ఏయే ఫలములను కోరునో అది - అర్థరహితమనియే చెప్పుచున్నాడు. మాయామయమైన మార్గమునందు సుఖమని వాసనతో, శయానః స్వప్నము చూచుచున్న వానివలె తిరుగాడుచు, ప్రయోజనములను పొందజాలడు. ఆయాలోకములను పొంది కూడ ఆత్యంతిక సుఖమును పొందజాలడని యర్థము. (2)

అతః కవిర్నామసు యావదర్థః
స్యాదప్రమత్తో వ్యవసాయ బుద్ధిః।
సిద్ధే ఽ న్యథార్థే న యతేత తత్ర
పరిశ్రమం తత్ర సమీక్షమాణః ॥ - 3

**తా -** అందువలన విద్వాంసుడు, వివిధ నామములుగల కర్మలతోను ఫలములతోను ప్రయోజన మున్నంత వఱకు మాత్రమే వ్యవహరించుచు అప్రమత్తుడై యుండవలెను. కృషియందాదర బుద్ధి గలవాడై ఆయా సందర్భములలో తాను చేయు పరిశ్రమను సమీక్షించుకొనుచు, అన్యథా ప్రయోజనము సిద్ధించిన యెడల దానిని గూర్చి ప్రయత్నింపకుండ నుండవలెను.

**టీ** :- తర్హి సర్వథా కర్మఫలత్యాగే సద్యఏవ దేహపాత స్స్యాదిత్యాశంక్యాహ – తత ఇతి. తతః కవిః. నామమాత్రేషు నామమాత్ర సారేషు భోగ్యేషు యావతా అర్థో దేహనిర్వాహో యస్య తథాభూతస్స్యాత్. అప్రమత్తః తావన్మాత్రేఽప్యనాసక్తః. వ్యవసాయ బుద్ధిః నేదం సుఖమితి నిశ్చయవాన్. తత్ర తస్మినర్థే అన్యథైవ సిద్ధే సతి తత్ర యత్నే పరిశ్రమం పశ్యన్నయతేత. (3)

**టీ–** అట్లైనచో అన్ని విధముల కర్మఫల త్యాగమునందు తత్కాలముననే దేహపాతము సంభవింప వచ్చునేమో అని శంకించి చెప్పుచున్నాడు, అందుచేతనే విద్వాంసుడు, నామసు – నామ మాత్రములైన, భోగ్యేషు (సుఖములందు) (కర్మఫలములందు) ఎంత వఱకు దేహ నిర్వహణము కొఱకు ఆ ప్రయోజనము అర్థవంతమగునో అంత వఱకు మాత్రమే ప్రవర్తింపవలయును – అప్రమత్తః – అంతమాత్రమునందైనను అనాసక్తుడైయుండవలెను – వ్యవసాయబుద్ధిః – ఇది సుఖము కాదని నిశ్చయించు కొనినవాడై – అప్పుడైనను –ఆ కార్యమునందు ఇతర మార్గమున సిద్ధి గలవాడైనచో ఆ కార్యమునందలి పరిశ్రమమును పరిశీలించుచు నిక దాని కొఱకు ప్రయత్నింపకుండ నుండవలెను. **(3)**

సత్యాం క్షితౌ కిం కశిపోః ప్రయాసై
ర్బాహౌ స్వసిద్ధే హ్యుప బర్హ ణైః కిమ్?
సత్యంజలౌ కిం పురుధాన్నపాత్ర్యా
దిగ్వల్కలాదౌ సతి కిం దుకూలైః॥ -4

**తా –** పరుండు వానికి సత్యమైన భూమి యుండగా పాన్పుల ప్రయాసలతో పనియేమి? స్వతస్సిద్ధములైన బాహువులుండగా తలగడలతో పనియేమి? దోసిలి యుండగా అనేక విధములగు భోజన పాత్రలతో పనియేమి? దిక్కులు, నారలు ఉండగా ధరించుటకు వస్త్రములెందుకు?

**టీ** :- అన్యథాసిద్ధిమాహ – ద్వాభ్యాం. సత్యామితి. కశిపోశ్శయ్యాయాః స్వతస్సిద్ధే బాహౌ సతి ఉపబర్హణైఃకిం? ఉచ్ఛీర్షకైః పురుధా బహుప్రకారయా. అన్నపాత్ర్యా భోజనపాత్రేణ. దిక్షద్భావో నాను నగ్నత్వమేవ. (4)

**టీ –** 'సత్యాం' అను మొదలుగ రెండు శ్లోకములతో అన్యథా సిద్ధి (అప్రయత్నముగ లభించుసిద్ధి) ని గూర్చి చెప్పుచున్నాడు – కశిపోః – శయ్యతో స్వతః సిద్ధౌ బాహౌ సతి (స్వయం సిద్ధములైన భుజములు ఉండగా) – ఉపబర్హణైః – దిండ్లతో (తలగడలతో) పురుధా – అనేక విధములైన – అన్నపాత్ర్యా – భోజన పాత్ర(ల) తో (పనిలేదని భావము) (4)

చీరాణి కిం పథి న సంతి దిశంతి భిక్షాం
నైవాంఘ్రిపాః పరభృతః సరితో౽ ప్యశుష్యన్।
రుద్ధా గుహాః కిమజితో౽ వతి నోపపన్నాన్
కస్మాద్భజంతి కవయో ధన దుర్మదాంధాన్ ॥- 5

**తా -** (ధరించుటకు) దారిలో నారబట్టలు ఉండవా? ఇతరులను పోషించుటయే వృత్తిగా గల చెట్లు (ఆకలి తీర్చుకొనుటకు) భిక్షనీయవా? (దప్పిక తీర్చుకొనుటకు) నదులు (నీరుఈయని రీతిగ) ఎండిపోయినవియా ? (నివసించుటకు) కొండ గుహలు అడ్డగించుచున్నవియా? శరణాగతులైన వారిని శ్రీహరి రక్షింపకుండునా? విద్యాంసులు ధనమదాంధులను ఎందుకు సేవించుచున్నారు?

**టీ :-** సమవల్కలమన్నం తోయం వాసః స్థానం చ యాచ్ఞాప్రయత్నం వినా కథం ప్రాప్యేత? తత్రాహ - చీరాణీతి. చీరాణి వస్త్ర ఖండాని పరాన్ బిభ్రతి పుష్ణంతి ఫలాదిభిర్యే గుహాః సుఖశయనోపవేశనాద్యుపయుక్తాః గిరిదర్యః. రుద్ధాః కిం రాజాభిర్నిరుద్ధాః కిం? నను తేషామలాభే కిం కార్యం స్యాత్? అత ఆహ - అజితో హరిః ఉపపన్నాన్ శరణాగతాన్. కిం నావతి న రక్షతి? కిం శబ్దస్యాపి పూర్వత్ర సంబంధః. ధనేనయో దుర్మదః తేన అంధాన్. (5)

**టీ -** దిక్సద్భావమనగా నగ్నత్వమే యనుట నిశ్చయము, బట్టలు, ఆహారము, నీరు, నివాస స్థానము యాచనా ప్రయత్నము లేకయే ఎట్లు లభించునో ఇట వివరించుచున్నాడు - చీరాణి - బట్టముక్కలు - పరాన్ బిభ్రతి - పుష్ణంతి ఫలాదిభిర్యే పరభృతః - ఇతరులను భరించును - ఫలములు మున్నగు వాని చేత పోషించును కావున పరభృతః - చెట్లు, గుహాః - గిరిదర్యః - కొండగుహలు, ఎప్పుడైనను ఇవి లభింపనప్పుడు ఏమి చేయవలెనో ఇకపై చెప్పుచున్నాడు.(5)

ఏవం స్వచిత్తే స్వత ఏవ సిద్ధ
ఆత్మాప్రియో౽ ర్థో భగవాననంతః।
తం నిర్వృతో నియతార్థో భజేత
సంసార హేతూ పరమశ్చ యత్ర ॥ - 6

**తా -** ఈ విధముగ తన చిత్తమునందు స్వతః సిద్ధుడై, ఆత్మయై, ప్రియతముడై, ఉత్తమ ప్రయోజనమగు మోక్షరూపుడై, భగవానుడైన శ్రీమన్నారాయణుడు ఉన్నాడు - అతనిని - విరక్త భావముతో, నిశ్చయమైన నిఃశ్రేయసమే ప్రయోజనముగా కలిగి - భజింపవలెను. అటుల భజింపగా సంసార హేతువగు అవిద్య నశించి పోవును.

**టీ :-** హరిస్తు సేవ్య ఇత్యాహ - ఏవమితి. ఏవం విరక్తస్సన్ తం భజేత భజనీయత్వే హేతవః. స్వచిత్తే స్వత ఏవ సిద్ధః. యతఏవ ఆత్మా అత ఏవ ప్రియః. ప్రియస్య చ సేవా సుఖరూపైవ, అర్థశ్చ సత్యః. న త్వనాత్మవన్మిథ్యా. భగవాన్ భజనీయగుణశ్చ అనంతశ్చ నిత్యః. ఏవం భూతస్తం భజేత. తదనుభవానందేన నిర్వృతస్సన్నితి. స్వతస్సుఖాత్మకత్వం దర్శితం. కిం చ యస్మిన్ భజనే సతి సంసారహేతోరవిద్యాయా ఉపరమో నాశో భవతి. (6)

కస్త్వాం త్వనాదృత్య పరాను చింతాం
ఋతే పశూనసతీం నామ యుంజ్యాత్ ।
పశ్యన్ జనం పతితం వైతరణ్యాం
స్వకర్మజాన్ పరితాపాన్ జుషాణమ్. ॥ - 7

**టీ :-** ఏతదేవాన్యచింతానిందయా దృఢయతి - క ఇతి. తాం తథాభూతాం. పరస్య హరేరనుచింతాం ధారణామనాదృత్య పశూన్ కర్మజడాన్ వినా. శ్రు. 'యథా పశురేవ సర్వదేవానామితి' శ్రుతేః. అసతీం విషయచింతాం. కోనామ కుర్యాత్. తచ్చింతయా వైతరణ్యాం పతితం. తత్ర చ స్వకర్మజాధ్యాత్మికాదిక్లేశాన్ సేవమానం పశ్యన్ వైతరణీ యమద్వారస్థా నదీ తత్తుల్యత్వాత్సంసృతిర్వైతరణీ. (7)

**టీ -** అప్పుడతని కర్తవ్యమేమి? శ్రీహరియే అతనికి సేవింపదగిన వాడని చెప్పుచున్నాడు. ఇట్లు విరక్తుడై అతడు ఆతనిని భజింపవలెను. భజింపదగిన వాడనుటకు కారణములు, స్వచిత్తే స్వత ఏవసిద్ధః తనచిత్తమున అప్రయత్న సిద్ధుడై నెలకొని యున్నాడు. ఆత్మయైనందు వలన ప్రియమైన వాడు, ప్రియునకు చేయుసేవ సుఖరూపమైనదే - అర్థః - సత్యస్వరూపుడు, అనాత్మకాదు కావున మిథ్యాస్వరూపుడుకాడు - భగవాన్ - భజింపదగిన గుణములు కలవాడు. అనంతశ్చ - నిత్యుడు, ఇట్టి లక్షణములు కలవానిని భజింపవలెను. నియతార్థః - నిశ్చితమైన స్వరూపము గలవాడు. అతనిని భజించుట వలన కలుగు అనుభవము నందలి ఆనందముచేత, నిర్వృతఃసన్ - అని స్వతః సుఖాత్మకత్వము చూపబడినది. అదియు గాక - యత్ర - ఎవని యందు - భజనేసతి - భజనమునందు ఉండగా (భజనము చేయగా) - సంసారహేతోః - అవిద్య యొక్క - ఉపరమః - నాశము - భవతి (అగునో) (అట్టి తం - అతనిని - భజేత - భజింపవలెను) (6)

**తా -** వైతరణీ నదిలో పడి తమ తమ కర్మపరిపాకముల ననుసరించి బాధల ననుభవించుచున్న జనమును చూచుచును, పరమేశ్వరుని చింతనమును అనాదరించి, విషయ చింతలో తగుల్కొని యుండువాడనగా పశువులను పోలినవాడు తప్ప నింకెవడు?

**టీ -** దీనినే ఇతర చింతల నిందతో బలపఱచుచున్నాడు 'కః' అను ఈ శ్లోకముతో - తాం - అట్టి, పరస్య - హరి యొక్క, అను చింతాం - ధారణను అనాదృత్య - (అనాదరించి), పశూన్ వినా - కర్మజడులను తప్ప - వీడును దేవతలకు పశువే అయినట్లు అనుశ్రుతి వాక్యము వలన - అసతీం - విషయ చింతను - కోనామ కుర్యాత్ (ఎవడు చేయును) ఆ చింత చేత వైతరణిలో పడును - అచట స్వకర్మజాన్ - ఆధ్యాత్మికాది క్లేశములను అనుభవించుచున్నవానిని చూచుచు - వైతరణీ - యమపురి ద్వారమునొద్దగల నది. దానితో సమానమైన దగుట చేత సంసారము వైతరణియే. (7)

కేచిత్స్వదేహాంతర్హృదయావకాశే
ప్రాదేశ మాత్రం పురుషం వసంతమ్ ।
చతుర్భుజం కంజ రథాంగ శంఖ
గదాధరం ధారణయా స్మరంతి ॥ - 8

**టీ** :- తామేవ ధారణాం సవిశేషమాహ - షడ్భిః. కేచిదితి. స్వదేహస్యాంతః మధ్యే యద్ధృదయం తత్ర యోఽవకాశస్తస్మిన్ వసంతం ప్రాదేశః తర్జన్యంగుష్ఠయోర్విస్తారః. స ఏవ మాత్రా ప్రమాణం యస్య హృదయపరిమాణం తత్రోపచర్యతే కంజం పద్మం రథాంగం చక్రం. (8)

ప్రసన్న వక్త్రం నలినాయతేక్షణం
కదంబ కింజల్క పిశంగ వాససమ్ ।
లసన్మహారత్న హిరణ్మయాం గదం
స్ఫురన్మహారత్న కిరీట కుండలమ్ ॥ - 9

**టీ** :- ప్రసన్నేతి. నలినం పద్మం తద్వత్ప్రసన్నే ఆయతే దీర్ఘే ఈక్షణే యస్య. కదంబకుసుమస్య కింజల్కః కేసరః. తద్వత్పిశంగే వాససీ యస్య. లసంతి మహారత్నాని యేషు తాని సువర్ణ మయాన్యంగదాని యస్య. స్ఫురంతి చ తాని మహారత్నాని తన్మయాని కిరీటకుండలాని యస్య. (9)

**తా** - కొందఱు తమ తమ శరీరములలోని హృదయాకాశమునందు జిట్టెడు కొలతతో నెలకొనియున్న నాలుగు భుజములవాడు, పద్మము, చక్రము, శంఖము, గద ధరించి యున్న పురుషుని (నారాయణుని) స్థిరమైన మనస్సుతో స్మరించుచుందురు.

**టీ** - అదే ధారణను సవిశేషముగ చెప్పుచున్నాడు. 'కేచిత్' అనునీ శ్లోముతో కలిపి ఆరు శ్లోకములతో విశదము చేయుచున్నాడు. తన దేహములోని మధ్య భాగమున ఏ హృదయము కలదో అచటి ఆకాశమునందు నెలకొని యున్న వానిని - ప్రాదేశః - చూపుడు వ్రేలు బొటనవ్రేలుల మధ్య దూరము (జిట్టెడు). అంతయే కొలత గలది హృదయపు కొలత - అచట సేవింపబడువాడు - కంజం-తామర పూవు. రథాంగం - చక్రము.(8)

**తా** - సంతుష్ట భావముగల ముఖము గలవాడు, తామర రేకుల వంటి విశాలమైన కన్నులు గలవాడును, కడిమి పూల కేసరముల వంటి వన్నె గల వస్త్రములు ధరించిన వాడును ప్రకాశించుచున్న మహారత్నములను పొదిగిన భుజకీర్తులు కలవాడును ఉత్తమమైన జాతి రత్నములు కన్పట్టుచున్న కిరీటము మరియు కుండలములు (కర్ణాభరణములు) కలవాడును - (అయిన అట్టివానిని)

**టీ** - నలినం - పద్మం - దాని వలె ప్రసన్నములు, ఆయతే - దీర్ఘములు నైన ఈక్షణే - కన్నులు గలవాడు. కదమ్బకుసుమస్య (కడిమి పూవుయొక్క) కింజల్కాః - కేసరములు- వానివలె పసుపు పచ్చని వస్త్రములు కలవాడు - వేని యందు మహారత్నములు మెఱయుచుండునో అట్టి బంగారపు భుజకీర్తులు గలవాడు. అదరుచున్న మహారత్నములతో ప్రకాశించుచున్న సువర్ణమయమైన కిరీటము కుండలము ధరించి యున్నవాడు.(9)

ఉన్నిద్ర హృత్పంకజ కర్ణికాలయే
యోగేశ్వరా స్థాపిత పాద పల్లవమ్ ।
శ్రీలక్ష్మణం కౌస్తుభ రత్న కంధర
మమ్లాన లక్ష్మ్యా వనమాలయా ఽ ఽ చితమ్ - 10

**టీ** :- ఉన్నిద్రేతి ఉన్నిద్రం వికసితం యత్ హృత్పంకజం తస్య కర్ణికైవ ఆలయం స్థానం. తస్మిన్ యోగేశ్వరైః స్థాపితౌ పాదపల్లవౌ యస్య. శ్రీః లక్ష్మీరేవ లక్ష్మ చిహ్నం తద్యుక్తం సామాదివిహితో మత్వర్థీయోఽణ్ ప్రత్యయః. కౌస్తుభరత్నం కంధరాయాం యస్య. ఆమ్లానా లక్ష్మీశ్శోభా యస్యాస్తయా వనమాలయా ఆచితం వ్యాప్తం. (10)

**తా -** యోగేశ్వరుల వికసించిన హృదయ కమలములందలి కర్ణిక (దుద్దు) లనెడు ఆలయమునందు స్థాపించబడిన చిగుళ్ళవంటి పాదములు కలవానిని, శ్రీవత్సలాంఛనుని, కౌస్తుభమణితో విరాజిల్లు కంఠముగల వానిని, వాడిపోని శోభతో ప్రకాశించు వనమాలతో (ఆకులు పువ్వులతో అందముగ కట్టిన మాలతో) వ్యాపించి యున్న వక్షః స్థలము గలవానిని.

**టీ -** ఉన్నిద్రం - వికసించిన - యత్ హృత్పంకజం - ఏ హృదయ కమలము గలదో దాని కర్ణిక (దుద్దు) యే - ఆలయః - స్థానముగ కలిగిన దాని యందు యోగేశ్వరైరాస్థాపితౌ పాదపల్లవౌ యస్య - యోగేశ్వరుల చేత అంతటను స్థాపింపబడిన చిగుళ్ళ వంటి పాదములు -ఎవనివో వానిని - శ్రీరేవ లక్ష్మ చిహ్నం తద్యుక్తం - శ్రీయే గుర్తుగా గల దానితో కూడిన దానిని - కౌస్తుభరత్నం - కౌస్తుభమనెడి పేరు గల మణి - కంధరాయాం - గళమునందు, యస్య - ఎవనికి కలదో - తం - వానిని - అమ్లానా లక్ష్మీః యస్యాస్తయా వనమాలయా - వాడిపోని శోభగల వనమాలతో - ఆచితం - వ్యాపించియున్న (వక్షః స్థలము గలవానిని) (10)

విభూషితం మేఖలయా ఽ ంగులీయకై
ర్మహా ధనైర్నూపుర కంకణాదిభిః ।
స్నిగ్ధామలా కుంచిత నీల కుంతలైః
విరోచమానాననహాస పేశలమ్ ॥ -11

**టీ** :- విభూషితమితి. స్నిగ్ధత్వాదివిశిష్టైః కుంతలైర్విరోచమానే యో హాసః తేన పేశలం సుందరం. (11)

**తా -** మిక్కిలి విలువగల మొలనూలు, ఉంగరములు,కాలి అందియలు, కంకణములు మున్నగు ఆభరణములు ధరించియున్నవానిని, నునుపుగను, నిర్మలముగను, వంకరలు తిరిగియున్నవియును నల్లనివియునైన జారువెంట్రుకలతో ప్రకాశించుచున్న ముఖమునందలి చిరునవ్వుతో సుందరమైన వానిని.

**టీ -** నున్నదనము మొదలగు లక్షణములతో కూడిన తలవెంట్రుకలచేత ప్రకాశించు ముఖమునందు ఏ నవ్వుగలదో దానితో- పేశలం- సుందరమైన వానిని.(11)






అదీన లీలా హసితేక్షణోల్లస
ద్భ్రూభంగ సంసూచిత భూర్యనుగ్రహమ్ ।
ఈక్షేత చింతామయమేన మీశ్వరం
యావన్మనో ధారణయా ఽ వతిష్ఠ తే ॥ - 12

తా - ఉదారమైన లీలావిలాసముతో అతడు నవ్వును ; ఆ నవ్వుతో చూచును, ఆ చూపు వలన ఆ ముఖము వికసించును - ఆ వికాసముచే కనుబొమ్మలు పైకి కదులును - ఆ కదలికలో అపారమైన అనుగ్రహము తొంగిచూచును, అట్టి తలంపులతో కూడియున్న ఈ ప్రభువును ధారణ ద్వారా మనస్సు స్థిరమైయుండు వఱకును చూచుచుండవలెను. (ఉపాసించుచుండవలెను)

**టీ** :- అదీనేతి. అదీనం ఉదారం యల్లీలాహసితం తేన యదీక్షణం తస్మిన్. ఉల్లసంతో యే భ్రూభంగాః భ్రూవిక్షేపాః తైస్సంసూచితో భూర్యనుగ్రహో యేన. చింతామయం చింతయా ఆవిర్భవంతం. (12)

**టీ** - అదీనం - ఉదారమైన - లీలతో కూడిన నవ్వుతో చూచు చూపు నందు పైకెత్తబడిన కనుబొమ్మల కదలికలతో సూచింపబడు గొప్ప అనుగ్రహము గలవానిని -చింతామయం - ఆలోచనతో ఆవిర్భవించుచున్న (12)

ఏకైక శో ఽ ంగాని ధియాను భావయే
త్పాదాది యావద్ధసితం గదాభృతః ।
జితం జితం స్థాన మపోహ్య ధారయేత్
పరం పరం శుద్ధ్యతి ధీర్యథా యథా ॥ - 13

తా - గదాధరుడైన భగవానుని పాదములు మొదలుకొని నవ్వుతో కూడిన ముఖము వఱకును ఒక్కటొక్కటిగ అవయవములను మనస్సుతో ధ్యానింపవలెను. స్ఫురించిన స్థానములు (అవయవములు) వదలి, ఆపైన గల అవయవములను ధ్యానించుచుండవలెను. ఆయా అంగములను ధ్యానింపగ ఎట్లెట్లు మనస్సు పరిశుద్ధమగుచుండునో అట్లట్లు తరువాతి అంగములను (ఒక్కొక్కటిగ) ధ్యానించుచుండవలెను.

**టీ** :- తస్యైవ ధ్యానమాహ - ఏకైకశ ఇతి. పాదాది యావద్ధసితం హసితపర్యంతం. అనుభావయేచ్చింతయేత్ యద్యజ్జితమయత్నతః స్ఫురితం పాదగుల్ఫాదిస్థానం అవయవస్తదపోహ్య త్యక్త్వా పరం జంఘాజాన్వాది ధారయేచ్చింతయేత్ శుద్ధ్యతి తస్మిన్నిశ్చలా భవతి. (13)

**టీ** - ఇతని ధ్యానమును గూర్చియే చెప్పుచున్నాడు - 'ఏకైకశః' అని అనుభావయేత్ - ధ్యానింపవలెను - ఏ ఏ అంగము, జితమయత్నతః - స్ఫురించినదో, పాదములు, చీలమండలు మొదలగు అవయవస్థానములను - తత్తదపోహ్య - ఆయా స్థానములను వదలి - పరం పరం - పిక్కలు మోకాళ్ళు మొదలగు తరువాతి అంగములను - ధారయేత్ - ధరింపవలెను - శుద్ధ్యతి - దాని వలన మనస్సు నిశ్చలమగుచుండును.(13)






యావన్న జాయేత పరావరే ౭ స్మి
న్విశ్వేశ్వరే ద్రష్టరి భక్తి యోగః ।
తావత్స్థవీయః పురుషస్య రూపం
క్రియావసానే ప్రయతః స్మరేత ॥ - 14

**తా** - బ్రహ్మాది దేవతలందఱును ఎవని కంటె తరువాతివారో, విశ్వమున కంతటికిని ఎవడు ప్రభువో, అట్టి సాక్షి రూపుడైన భగవానుని యందు (ప్రేమ రూపమగు) భక్తి యోగము కలుగనంత వఱకు, స్థూలరూపుడైన అట్టి పురుషుని రూపమును, ఆవశ్యకమగు నిత్య కర్మానుష్ఠానము ముగిసిన పిదప నియతాత్ముడై స్మరింపవలెను.

**టీ** :- పూర్వోక్తవైరాజధారణాయా ఏతద్ధారణాంగత్వమాహ - యావదితి. పరే బ్రహ్మాదయః తే అపరే యస్మాత్సుతః విశ్వేశ్వరే తన్నింతరి ద్రష్టరి. న తు దృశ్యే చైతన్యఘనత్వాద్భక్తియోగః ప్రేమలక్షణః క్రియావసానే అవశ్యకర్మానుష్ఠానానంతరం అనేన కర్మాపి నియచ్ఛేద్భక్తియోగపర్యంతమేవేత్యుక్తం. (14)

**టీ** - పూర్వము చెప్పబడిన విరాట్ స్వరూపుని ధారణ చేయుటతోబాటు తదంగత్వరూపమున ఈ ధారణమును చెప్పుచున్నాడు - 'యావత్' అను శ్లోకముతో - పరే - బ్రహ్మాది దేవతలు - అపరే యస్మాత్ - ఎవనికంటె తరువాతివారో - విశ్వేశ్వరుడైన ద్రష్టయందే కాని దృశ్యమునందు కాదనుట ఎందులకు? చైతన్యము యొక్క ఘనత్వము వలన - భక్తి యోగః - ప్రేమలక్షణము - క్రియావసానే - ఆవశ్యకముగ చేయవలసిన కర్మను అనుష్ఠించిన తరువాత - దీనితో కర్మకూడ భక్తియోగ పర్యంతమే అని చెప్పబడినది. - ప్రయతః - నియమతత్పరుడై(14)

స్థిరం సుఖం చాసన మాశ్రితో యతిః
యదా జిహాసు రిమ మంగలోకమ్ ।
దేశే చ కాలే చ మనో న సజ్జయేత్
ప్రాణాన్ నియచ్ఛేన్మనసా జితాసుః ॥ - 15

**తా** - రాజా ! ఈ లోకమును విడువదలచినప్పుడు, యతి, స్థిరమైన సుఖాసనమున గూర్చుండి, దేశమును గాని, కాలమునుగాని, మనస్సునకు రానీయక (దేశమునందు, కాలమునందు మనస్సునుపోనీయక) ప్రాణములను జయించి, వానిని మనస్సుతో నిగ్రహించి యుండవలెను.

**టీ** :- ఏతావతా ౭ సన్నమృత్యోః పుంసః కృత్యముక్తం. ఇదానీం తస్యైవ స్వయం దేహం త్యక్తుమిచ్ఛతః కృత్యమాహ - సార్ధైశ్చతుర్భిః. స్థిరమితి. అంగ హే రాజన్. ఏవంభూతో యతిః

**టీ** - ఈ విధముగ మృత్యువు సమీపించిన మనుష్యుని కృత్యము చెప్పబడినది. ఇప్పుడు (అతడే దేహమును విడువబోవువాడుకావున) మరణమును కోరుచున్న పరీక్షిత్తు చేయవలసిన కార్యమును చెప్పుచున్నాడు. 'స్థిర' మనెడి ఈ శ్లోకముతో కలిపి నాలుగున్నర శ్లోకములతో

యదా ఇమం లోకం దేహం జిహాసుః హాతుమిచ్ఛతి.తదా దేశే పుణ్యక్షేత్రే కాలే చోత్తరాయణాదౌ మనో న సజ్జేత్సంగం న ప్రాపయేత్. న దేశకాలౌ యోగినస్సిద్ధిహేతూ కిం తు యోగ ఏవేతి దృఢనిశ్చయో భూత్వా స్థిరం సుఖకరం చ ఆసన మాస్థితస్సన్ ప్రాణానింద్రియాణి నియచ్ఛేత్. (15)

వివరించుచున్నాడు - అంగ - ఓ రాజా ! ఇట్టి యతి ఈ లోకమును దేహమును - జిహాసుః - విడువ గోరునో అప్పుడు, దేశే - పుణ్యక్షేత్రమున - కాలే - ఉత్తరాయణాదులయందు మనోన సజ్జేత - మనస్సున తగులుకొని యుండరాదు - యోగులకు దేశకాలములు సిద్ధిహేతువులుకావు. కాని యోగము మాత్రమే సిద్ధిహేతువని దృఢముగ నిశ్చయించుకొని స్థిరమైనది, సుఖకరమైనదియునగు ఆసనమున కూర్చుండినవాడై ప్రాణమును మనస్సుతో నియమించి ఉంచవలెను. (లేక - ప్రాణములను, మనో నియమ్యములనుగా చేయవలెను - అనగా ఇంద్రియములన్నింటిని ప్రాణములందు లీనము చేయవలయును అని ద్యోతి తార్థము) (15)

మనః స్వబుద్ధ్యా ఽ మలయా నియమ్య
క్షేత్రజ్ఞ ఏతాం నినయేత్తమాత్మని ।
ఆత్మానమాత్మన్యవరుధ్యధీరో
లబ్ధోపశాంతి ర్విరమేత కృత్యాత్ ॥ - 16

**తా -** స్వచ్ఛమైన బుద్ధితో మనస్సును నియమించి (తన్మాత్రముగ చేసి) ఈ మనస్సుతో గూడిన బుద్ధిని సాక్షియగు జీవునిలోను, ఈ జీవుని ఆత్మ యందును, ఈ ఆత్మను పరమాత్మ యందును లయము చేసి, శాంతిని పొందిన ధీరుడు చేయదగు కార్యము నుండి విరమింపవలెను.

**టీ :-** మన ఇతి. తత్తద్గృహీతవిషయం మనః బుధ్యా నిశ్చయ రూపయా నియమ్య తన్మాత్రం కృత్వా మనోనిగ్రహసాధనీభూతాం బుద్ధిం. క్షేత్రజ్ఞే బుద్ధ్యాదిద్రష్టరి. నినయేత్ప్రలాపయేత్. తం చ క్షేత్రజ్ఞం ఆత్మని శుద్ధే తత్త్వే. తం చ శుద్ధమాత్మానం ఆత్మని బ్రహ్మణి అవరుధ్య ఏకీకృత్య లబ్ధోపశాంతిః ప్రాప్తనిర్వృతిస్సన్ కృత్యాద్విరమేత్. (16)

**టీ -** అట్లు నిగ్రహించియున్న మనస్సును నిశ్చయ రూపమగు బుద్ధిచే నియమించి -తన్మాత్రముగచేసి, ఈ బుద్ధిని - క్షేత్రజ్ఞే - బుద్ధ్యాదుల సాక్షియందు - నినయేత్ - లీనము చేయవలెను. ఆ క్షేత్రజ్ఞుని, శుద్ధాత్మయందు (అంతర్యామి యందు) ఆ శుద్ధాత్మను, 'అహం' అనబడు బ్రహ్మము నందు - అవరుధ్య- ఏకీకరించి (లయింపజేసి)లబ్ధోపశాంతిః - నిర్వృతిని పొంది కృత్యాద్విరమేత - దాని తరువాత పొందదగినదియేదియు లేనందువలన - (ఇటుపై ఏదియును చేయక మిన్నకుండవలెను) (16)

న యత్ర కాలో ఽ నిమిషాం పరః ప్రభుః
కుతోను దేవా జగతాం య ఈశిరే ।
న యత్ర సత్త్వం న రజస్తమశ్చ
న వై వికారో న మహాన్ప్రధానమ్ ॥ - 17

**తా –** ఎచట దేవతలకును ప్రభువైన వాడు ఉండగా నచట కాలమే ప్రభువు కాదు. ఇక ప్రస్తుత లోకములను పరిపాలించు దేవతల మాట చెప్పనేల? అచట సత్త్వరజస్తమో గుణములు, అహంకారము, మహత్తు, ప్రకృతి ఏదియును ప్రభువగుటకు సమర్థము కాదు.

**టీ :-** తతః పరం ప్రాప్యాభావాత్. తదేవాహ – న యత్రేతి. యత్రాత్మస్వరూపే. కాలో న ప్రభుః కిమపి కర్తుం న సమర్థః. అత ఏవ దేవా న ప్రభవ ఇత్యాహ – అనిమిషాం దేవానాం పరః ప్రభుః కాలోఽపి యత్ర న ప్రభుః. తత్ర కుతో దేవాః ప్రభవస్స్యుః దేవనియమ్యానాం తు జగతాం ప్రాణినాం తత్ర కా వార్తేత్యాహ – జగతామితి. కుతో న ప్రభవంతీత్యపేక్షాయాం నిరుపాధిక త్వాదిత్యాహ – యద్వా. జగత్కారణాన్యపి యస్య జగత్సృష్ట్యాదౌ న తే ప్రభవంత్యాహ – న యత్రేతి. వికారోఽహంకారః. (17)

**టీ –** 'నయత్ర' అను శ్లోకమున అదియే చెప్పుచున్నాడు – ఎచట ఆత్మస్వరూపముండునో అచట కాలమే ప్రభువు కాదు. ఏది చేయుటకు నైనను సమర్థము కాదు. అందువలననే దేవతలు ప్రభువులు కారని చెప్పుచున్నాడు. అనిమిషాం – దేవతలకు – పరః – ప్రభువు, కాలమే ఎచట ప్రభువు కాదో అచట దేవతలెట్లు ప్రభుత్వమును వహింపగలరు? ఇక ఆ దేవతలచే నియమింపబడదగిన జగతాం – ప్రాణులకు గల సమర్థతను గూర్చి చెప్పనేల ? ఇంద్రాది దేవతలు ఎందు వలన ప్రభుతను (అధికారమును) పొందలేకపోయిరి? అను కుతూహలము కలుగగా 'నయత్ర' అను శ్లోక భాగముతో వారికి పోషణాధిపత్యము లేనందువలననని చెప్పుచున్నాడు 'నయత్ర' అని అతని సృష్టి ప్రారంభమున జగత్కారణములగు మహదహంకారాదులు సత్త్వాది గుణములును ఆధిపత్యము లేనివే యనియు చెప్పుచున్నాడు – వికారః – అహంకారము (17)

పరం పదం వైష్ణవ మామనంతి తద్
యన్నేతి నేతీత్యతదుత్సిసృక్షవః ।
విసృజ్య దౌరాత్మ్యమనన్య సౌహృదా
హృదోప గుహ్యార్థ పదం పదే పదే ॥ - 18

**తా –** అనాత్మ పదార్థములను, 'ఇది కాదు – ఇది కాదు' అని విడిచి పెట్టుటకు నిశ్చయమైన వాంఛ గలవారు, దేహాత్మభావమును విడిచి, అనన్యమైన ప్రేమ భావముతో, మనస్సుతో ఆశ్లేషింపదగిన అర్థము గల ఆ శ్రేష్ఠమైన పదమును (స్థానమును) విష్ణు సంబంధమైనదని మాటి మాటికిని చింతన చేయుచుందురు.

**టీ :-** నిరుపాధికత్వం కుత ఇత్యత ఆహ - పరమితి. యత్ యస్మాత్ అతత్ ఆత్మవ్యతిరిక్తం నేతి. నేతీత్యేపముత్స్రృష్టుమిచ్ఛవో దౌరాత్మ్యం దేహాద్యాత్మత్వం విసృజ్య. అర్హస్య పూజ్యస్య. శ్రీవిష్ణోః పదం పదేపదే క్షణేక్షణే. హృదా ఉపగూహ్య ఆశ్లిష్య నాన్యస్మిన్ సౌహృదం యేషాం తథాభూతాస్సంతః. తద్వైష్ణవం పదం తఏవ పరం సర్వత్రః శ్రేష్ఠం ఆమనంతీత్యన్వయః. (18)

**టీ -** 'పరం పదం' అను ఈ శ్లోకముతో నిరుపాధిత్వము (పోషణాధిపత్యము) ఎందులకో చెప్పుచున్నాడు. యత్ - ఎందువలన, అతత్ - ఆత్మకు వ్యతిరిక్తమైన దానిని, నేతి నేతి - ఇది కాదు ఇది కాదు అని - ఏవం - ఈ విధముగ ఉత్స్రష్టుం - విడుచుటకు, ఇచ్ఛవః - కోరుచున్నవారు, దౌరాత్మ్యం - దేహాదుల యందు ఆత్మభావము, విసృజ్య - విడిచి, పూజ్యుడైన విష్ణువు యొక్క పదం (శబ్దమును, స్థానమును) పదే పదే - క్షణక్షణమును, హృదా - (మనస్సుచేత) ఉపగుహ్య - ఆలింగనము చేసికొని, ఇతరులెవ్వరియందును సద్భావములేని వారలై ఆ విష్ణు సంబంధమైన పదమును, అందులకే పరం - అన్నింటిలోను శ్రేష్ఠమైనదిగ మననము చేయుచుందురని అన్వయము. (18)

ఇత్థం మునిస్తూపరమేద్వ్యవస్థితో<br>
విజ్ఞాన దృగ్వీర్య సురంధితాశయః ।<br>
స్వపార్ష్ణినా ఽ ఽ పీడ్యగుదం తతో ఽ నిలమ్<br>
స్థానేషు షట్ సూన్నమయేజ్జితక్లమః ॥ - 19

**తా -** శాస్త్రము వలన కలిగిన జ్ఞానము యొక్క బలముచేత నశింపజేయబడిన విషయవాసనలు గలవాడై, తన పాదమూలముచేత మూలాధారమును అదిమిపెట్టి, ప్రాణమును ఆఱు చక్రములయందు, పైపైకి కొనిపోవలెను. మునియైన వాడు ఈ విధముగ బ్రహ్మత్వముతో వ్యవస్థితుడై శాంతినొందవలెను.

**టీ :-** ఇత్థమితి. యస్మాదిత్థం బ్రహ్మత్వేన వ్యవస్థితో మునిః ఉపరమేత్. తు శబ్దేన యది ప్రయాస్యన్నితి వక్ష్యమాణాత్సకాశాత్ విశేష ఉక్తః తమాహ - విజ్ఞాయతే అనేనేతి విజ్ఞానం శాస్త్రం. తేన జాతా దృక్ జ్ఞానం. తస్యాః వీర్యం బలం తేన సురంధితా నిర్దగ్ధాః విహింసితా వా ఆశయా విషయవాసనా యస్య సః. ఇదానీం తస్య దేహత్యాగప్రకారమాహ - స్వపార్ష్ణినా పాదమూలేన. గుదం మూలాధారం. ఆపీడ్య నిరుంధ్య. ప్రాణం

**టీ -** అందువలన బ్రహ్మత్వముతో వ్యవస్థితుడై ముని విశ్రాంతిని పొందవలెను. 'తు' శబ్దముతో (ఒకవేళ ప్రయాస పడుచును) 'యది ప్రయాస్యన్' అను ముందు చెప్పబోవు శ్లోకము ద్వారా సకామ గమన సంబంధమగు విశేషము - చెప్పబడినది - దానిని చెప్పినాడు - దేనిచేత తెలసికొనబడునో అది విజ్ఞానము. అనగా శాస్త్రము - దానితో పుట్టిన దృక్ - జ్ఞానము - దాని యొక్క వీర్యం - బలము - దానిచే సురంధితా - మిక్కిలి హింసింపబడిన ఆశయా - విషయ వాసన ఎవనికి కలదో వాడు - ఇప్పుడు అతని దేహమును విడుచు విధానమును చెప్పుచున్నాడు. స్వపార్ష్ణినా - తన పాదమూలముచేత,

ఉన్నమయేత్ జితఃక్లమో యేన. షట్సు స్థానేషు నాభ్యాదిషు. (19)

గుదం - మూలాధారమును, ఆపీడ్య- నిరుధ్య - నిరోధించి, అనిలం - ప్రాణమును, ఉన్నమయేత్ - పై భాగమునకు కొనిపోవలెను. జితక్లమః - శ్రమను జయించినవాడు - షట్సు - ఆఱు స్థానముల యందు నాభి మొదలుకొని యున్న (మణిపూర, అనాహత, విశుద్ధ, తాలుమూల, ఆజ్ఞా చక్ర, బ్రహ్మరంధ్రము) ఆఱు చక్రములకు కొనిపోవలయునని యర్థము. (19)

**తా -** మనస్వియైన ముని నాభియందు (మణిపూరమునందుగల) వాయువును హృదయమందలి అనాహతమునకు, అచటి నుండి ఉదాన వాయువు ద్వారా వక్షఃస్థలముపై భాగమున గల విశుద్ధ చక్రమునకు, మఱల ఆ వాయువును తాలుమూలమున (విశుద్ధము పై భాగమున) కు కొనిపోవలెను.

నాభ్యాం స్థితం హృద్యధిరోప్యతస్మా
దుదాన గత్యోరసితం నయేన్మునిః ।
తతో౽ను సంధాయ ధియా మనస్వీ
స్వ తాలుమూలం శనకైర్నయేత. ॥ - 20

**టీ** :- నాభ్యామితి. నాభ్యాం మణిపూరకే స్థితం. హృది అనాహతచక్రే అధిరోప్య ఉరసి కంఠే కంఠాదధోదేశే విశుద్ధచక్రే మనస్వీయత చిత్తః. స్వతాలుమూలం తస్యైవ చక్రస్యాగ్రదేశం. తతో బహుధాగమన సంభవాచ్ఛనకైరిత్యుక్తం. (20)

**టీ -** నాభ్యాం - మణిపూరమున - స్థితం - ఉన్న - హృది - హృదయమున అనాహత చక్రమును అధిరోహించి - ఉరసి - కంఠమున కటి క్రింది ప్రదేశమున స్థితే విశుద్ధి చక్రే - ఉన్న విశుద్ధి చక్రమున - మనస్వీ - చిత్తమును జయించిన వాడు - స్వతాలుమూలం - దవుడల మూలభాగము - అదే చక్రము యొక్క పై భాగము - అటునుండి పోవుటకు తగిన ప్రదేశము - శనకైః - మెల్లగా అని చెప్పబడినది.(20)

తస్మాద్భ్రువోరంతరమున్నయేత
నిరుద్ధ సప్తాస్వయనో౽నపేక్షః ।
స్థిత్వా ముహూర్తార్థమకుంఠ దృష్టిః
నిర్భిద్యమూర్ధన్ విసృజేత్పరం గతః ॥ - 21

**తా.** అనంతరము, రెండు కన్నులు, రెండు చెవులు, రెండు నాసికా రంధ్రములు, నోరు, అను ఈ ఏడింటిని నిరోధించి, తాలుమూలమునందున్న వాయువును, కనుబొమ్మల నడుమనున్న ఆజ్ఞాచక్రమునకు కొనిపోవలయును. ఏలోకమునకును పోవుటకు ఇచ్ఛలేని వాడగు ఆ సాధకుడు ఆ వాయువును ఒక ముహూర్త కాలమున సగము (పన్నెండు క్షణములు) అచటనే నిలిపి, స్థిర లక్ష్యముతో అచటి నుండి సహస్రారమునకు కొనిపోయి బ్రహ్మ రంధ్రమును భేదించి, అటునుండి - శరీరాదులను విడిచి బ్రహ్మప్రాప్తిని పొందవలెను.

**టీ** :- తస్మాదితి. తస్మాద్భ్రువోరంతరమాజ్ఞాచక్రం. నిరుద్ధానీంద్రియాణి శ్రోత్రే నేత్రే నాసికే ముఖం చేత్యేవం సప్త అస్వయనాని. ప్రాణమార్గా యేన సః. స్థిత్వా ముహూర్తార్ధం అనపేక్షశ్చేత్పరం బ్రహ్మ గతః. స్వమూర్ధన్ మూర్ధని అత్ర సప్తమీలోప ఆర్షః. బ్రహ్మరంధ్రం నిర్భిద్య దేహేంద్రియాణి చ విసృజేత్. (21)

**టీ** – అచటి నుండి భ్రువోరంతరం – ఆజ్ఞాచక్రమును – నిరోధింపదగినవి రెండు చెవులు, రెండు కన్నులు, రెండు నాసికా రంధ్రములు, నోరు అని ఈ విధముగ సప్తాస్వయనాని – ప్రాణ మార్గములు గలవాడై – ఇతరేతరములైన కోరికలు లేని వాడైనచో పరం – బ్రహ్మను, గతః సన్ – పొందినవాడగుచు – మూర్ధన్ – మస్తకమున, బ్రహ్మ రంధ్రమున – నిర్భిద్య – ఛేదించుకొని – దేహమును, ఇంద్రియములను వదలవలెను.(21)

యది ప్రయాస్యన్ నృప ! పారమేష్ఠ్యం
వైహాయసానా ముత యద్విహారమ్ ।
అష్టాధిపత్యం గుణ సన్నివాయే
సహైవ గచ్ఛేన్మనసేంద్రియైశ్చ ॥ - 22

**తా** – రాజా ! ఒకవేళ బ్రహ్మలోకమునకుంబోవుచుండుటకో, లేక సిద్ధ చారణాదులవలె ఆకాశ విహారము చేయుచుండుటకునో, అణిమాద్యష్ట సిద్ధులకు అధికారియగుటకో, గుణ సముదాయముతో కూడిన బ్రహ్మాండమునందలి యే ప్రదేశమునకైన పోవుచుండుటకో ఇచ్ఛగలవాడు మనస్సుతో ఇంద్రియములతో కూడ పయనింపవలెను.

**టీ** :- యదీతి. యది తు పారమేష్ఠ్యం పదం బ్రహ్మణః స్థానం ప్రయాస్యన్ భవతి, ఉతవైహాయసానాం ఖేచరాణాం సిద్ధానాం యద్విహారం క్రీడాస్థానం స్వర్గాదికం, కీదృశం అష్టాధిపత్యాని అణిమాద్యైశ్వర్యాణి యస్మిన్. తదపి ప్రయాస్యన్ గుణిసన్నిపాతే గుణసముదాయరూపే బ్రహ్మాండే సర్వత్రేత్యర్థః. గుణసన్నిపాతే సత్త్వరజస్తమోమేలనే సతి అష్టాధిపత్యం వా అష్టానామాణి మాద్యైవ్వర్యాణామాధిపత్యం వా తాదృశాధికారం వా. యది ప్రయాస్యన్ భవతి. మన ఆదిలింగదేహేన సహైవ గచ్ఛేత్, తేషాం న లింగదేహభంగః ఇతి భావః. తర్హిదేహత్యాగావసరే మనశ్చ ఇంద్రియాణి చ న త్యజేత్, కింతు తైస్సహ తత్తల్లోకభోగార్థం గచ్ఛేత్. (22)

**టీ** – సద్యోముక్తిని చెప్పి ఇక 'యది' అను నీ శ్లోకము నుండి పది శ్లోకములతో క్రమముక్తి ప్రకారము చెప్పుచున్నాడు. ఒకవేళ బ్రహ్మలోకమునకు పోబోవుట జరుగునో – లేక వైహాయసానాం – ఆకాశ సంచారులగు సిద్ధుల యొక్క యద్విహారం – క్రీడాస్థానము – కీదృశమ్ – ఎట్టిది – అష్టాధిపత్య – ఎనిమిది విధములైన ఆధిపత్యములకు – అణిమాదులగు ఐశ్వర్యములు దేనియందు గలవో అదియును సంచరించుచు – ఎచ్చట ? గుణసన్నివాయే – గుణ సముదాయ స్వరూపమగు బ్రహ్మాండమున – అంతట యని అర్థము. అట్లైన దేహమును త్యాగముచేయు సమయమున మనస్సును ఇంద్రియములను కూడ త్యజింపరాదు – కాని వానితో కూడియే ఆయాలోకములందలి అనుభవముల కొఱకు పోవలెను. (22)

యోగేశ్వరాణాం గతి మాహురంత
ర్బహిస్త్రిలోక్యాః పవనాంతరాత్మనామ్ ।
సకర్మభిస్తాం గతిమాప్నువంతి
విద్యాతపోయోగ సమాధి భాజామ్ ॥ - 23

**తా -** ఉపాసన, భగవద్ధర్మము, అష్టాంగాదియోగము, సమాధి (జ్ఞానము) భజించువారలును, వాయువే అంతరాత్మగాగల శరీరులును అయిన యోగేశ్వరుల గమనము, ముల్లోకముల అంతర్బహిస్సుల యందును సాగుచుండునని చెప్పుదురు. కర్మలచేత అట్టి గమనమును పొందజాలరు

**టీ** :- యతః కర్మగతి వన్న యోగగతిః పరిచ్ఛిన్నేత్యాహ - యోగేశ్వరాణామితి. యోగేశ్వరాణాం త్రిలోక్యాః అంతర్బహిశ్చ. మహర్లోకాదిషు. బ్రహ్మాండాద్బహిశ్చ గతిమాహుః. అత్ర హేతుః - పవనస్యాంతః. ఆత్మా లింగశరీరం యేషామితి. విద్యా ఉపాసనా తపో భగవద్ధర్మః. యోగో ఽ ష్టాంగః. సమాధిర్జ్ఞానం. తాన్యేవ భజంతి యే, తేషాం యా గతిః తామ్. (23)

**టీ -** కర్మగతివలె యోగ గతి కాదని, వేఱనియు చెప్పుచున్నాడు. యోగేశ్వరాణాం - యోగేశ్వరులకు - త్రిలోక్యాః - ముల్లోకముల యొక్క - అంతః బహిశ్చ - లోపలను బయటను - మహర్లోకాదులయందు - బ్రహ్మాండము యొక్క వెలుపలి భాగము నందును - గమనము కలదని చెప్పుదురు - ఇట దీనికి కారణము - పవనస్య అంతరాత్మా - లింగశరీరము గలవారు, విద్యా - ఉపాసనము, తపః - భగవద్ధర్మము, యోగః - ఎనిమిది అంగములు గలది, సమాధిః - జ్ఞానము - వీనిని ఎవరు భజింతురో వారికి ఆ గతి కలుగును.(23)

వైశ్వానరం యాతి విహాయసాగతః
సుషుమ్నయా బ్రహ్మ పథేన శోచిషా ।
విధూత కల్కో ఽ థ హరేరుదస్తా
త్ప్రయాతి చక్రం నృప! శైశుమారమ్ ॥ - 24

**తా -** రాజా ! అతడు బ్రహ్మలోక మార్గమున సుషుమ్నానాడితో ఆకాశ మార్గమున పయనించి అగ్ని దేవతాభిమానిని పొందును. అగ్ని లోకమునందలి జ్యోతిర్మయమైన అతనిచే త్యక్త కల్మషుడై, ఇంకను పైనగల శ్రీమన్నారాయణునిచే అధిష్ఠింపబడియున్న శిశుమారమను పేరు గల జ్యోతిశ్చక్రమును చేరును.

**టీ** :- తామాహాష్టభిః - వైశ్వానరమితి. విహాయసాఆకాశేన. తత్ర బ్రహ్మలోకపథేన గతస్సన్. ప్రథమం వైశ్వానరం అగ్న్యభీమానినీం దేవతాం యాతి. కేనోపాయేన?

**టీ -** ఆ గతిని గూర్చి 'వైశ్వానరం' అనెడు ఈ శ్లోకము నుండి ఎనిమిది శ్లోకములతో చెప్పుచున్నాడు. విహాయసా - ఆకాశము ద్వారా - అచట కూడా బ్రహ్మలోక మార్గమున బోవుచు మొదట - వైశ్వానరం - అగ్న్యభిమానియగు దేవతను పొందును -

సుషుమ్నయా నాడ్యా. సా చ దేహాద్బహిరపి వితతాస్తీత్యాహ – శోచిషా జ్యోతిర్మయ్యా విధూతస్త్ర్యక్తః కల్కోమలోయేన సః, క్వాప్యసజ్జమాన ఇత్యర్థః. ఉదస్తాత్ వర్తమానం హరేస్సంబంధి తారారూపం నారాయణాధిష్ఠిత మిత్యర్థః. శైంశుమారం చక్రం. పంచమస్కంధే వక్ష్యమాణం శింశుమారాఖ్యం జ్యోతిశ్చక్రం చ. చక్రస్థానాని ఆదిత్యాది ధ్రువాంతాని పదాని. ప్రయాతీత్యర్థః. (24)

ఏ ఉపాయము చేత? సుషుమ్నయా – సుషుమ్నానాడితో – అదియును దేహమునకు వెలుపలి భాగమున కూడ విస్తరింపబడి యున్నదని చెప్పుచున్నాడు. శోచిషా – జ్యోతిర్మయమైన దాని చేత – విధూత – విడువబడిన – కల్కః – మలము గలవాడై – దేనితోడను ఆవరింపబడని వాడై అని అర్థము – ఉదస్తాత్ – పైన గల – హరికి సంబంధించిన తారారూపము – నారాయణునిచే అధిష్ఠితమైన – అని యర్థము – శైశుమారం – చక్రం – పంచమస్కంధమున చెప్పబోవు శిశుమారాశ్రయమైన జ్యోతిశ్చక్రము – చక్ర స్థితిలోనున్న ఆదిత్యాది ధ్రువాంతము వరకుగల స్థానములకు పయనించునని యర్థము.(24)

తద్విశ్వనాభింత్వతివర్త్య విష్ణో
రణీయసా విరజేనాత్మనైకః ।
నమస్కృతం బ్రహ్మ విదాముపైతి
కల్పాయుషో యద్విబుధా రమంతే ॥ - 25

**తా** – విశ్వమునకు కేంద్రమైన శిశుమార చక్రమును దాటి, సూక్ష్మము, నిర్మలమునైన శరీరముతో ఒక్కడే ప్రయాణించి అతడు బ్రహ్మవేత్తలచే నమస్కరింపబడు మహర్లోకమును చేరును. అచట ఒక కల్పము వఱకును జీవించియుండును దేవతలు ఆనందించుచుందురు.

**టీ** :- తదితి. తద్విష్ణోశ్చక్రం విశ్వస్య నాభిం సూర్యాద్యాశ్రయభూతం. ఆదిష్టలింగత్వాన్నాభిశబ్దస్య న క్లీబత్వం. అతివర్త్య అతిక్రమ్య పరతః స్వర్గిణాం గత్యభావాత్. ఏక ఏవ నిర్మలేన లింగశరీరేణ బ్రహ్మవిదాం స్థానం అనైర్నమస్కృతం మహర్లోకముపైతి. యత్యస్మిన్ విబుధాః కల్పాయుషో భృగ్వాదయః (25)

**టీ** – తత్ – విష్ణుని చక్రము – విశ్వస్యనాభిం – సూర్యాదులకు ఆశ్రయభూతమైనది. అజహల్లింగత్వము వలన నాభి శబ్దమునకు నపుంసకలింగత్వము లేదు. అతివర్త్య – దాటి – దేవతలకు మరియొక మార్గము లేనందున ఒక్కడే నిర్మలమైన లింగశరీరముతో బ్రహ్మవిదుల స్థానము, ఇతరులచే నమస్కరింపబడునదియు నగు మహార్లోకమును చేరును. యత్ – దేనియందు – విబుధాః – మహాకల్పపర్యంతముగ జీవించియుండు భృగువు మున్నగువారు (ఉండు స్థలమో) (25)






అథో అనంతస్య ముఖానలేన
దందహ్యమానం స నిరీక్ష్య విశ్వమ్ ।
నిర్యాతి సిద్ధేశ్వర జుష్ట ధిష్ణ్యం
యద్ద్వైపరార్థ్యం తదు పారమేష్ఠ్యమ్ ॥ - 26

**తా -** అనంతరము కల్పాంతమందు శేషుని నోటి నుండి వెలువడు అగ్నిచే కాల్చబడుచున్న విశ్వమును, అతడు చూచి, సిద్ధేశ్వరుల చేత అనుభవింపబడుచున్నదియు, వారి నివాసమునకు యోగ్యమైనదియు, రెండు పరార్ధముల వఱకును ఉండునదియునైన బ్రహ్మలోకమునకు బోవును. (పరార్ధమనగా ఒకటిపై పదునేడు సున్నలతో నేర్పడు సంఖ్యతో సమానమగు సంవత్సరముల కాలము)

**టీ :-** అథో ఇతి. అథో అనంతరం కల్పాంతే స విశ్వం త్రైలోక్యం. దందహ్యమానం అతిశయేన దహ్యమానం నిరీక్ష్య తత్రావ్యూష్మ ప్రాప్తేః యద్ద్విపరార్థస్థాయి తత్పారమేష్ఠ్యం పదంప్రతి నిర్యాతి. సిద్ధేశ్వరైర్జుష్టాని ధిష్ణ్యాని విమానాని యస్మిన్ తత్. ఉ ఇతి శ్రైష్ఠ్యం సూచితం. (26)

**టీ -** అథో - అటు పిమ్మట (కల్పాంతమునందు) విశ్వం-త్రైలోక్యమును అతడు అతిశయముగ కాలిపోవుచుండగ చూచి - అచట గూడ వేడిమి కలుగు చుండుట వలన, రెండు పరార్ధముల స్థాయి గల ఆ పారమేష్ఠ్యం పదం - బ్రహ్మలోకమునకు - నిర్యాతి - పోవును - సిద్ధేశ్వరైర్జుష్టాని ధిష్ణ్యాని విమానాని యస్మిన్ తత్ - సిద్ధేశ్వరులచే ఆనందింపబడుచు నివసింపబడుచున్న ఏడంతస్తుల భవనములు గలది. 'ఉ' అని శ్రేష్ఠత్వము సూచింపబడినది.(26)

న యత్ర శోకో న జరా న మృత్యు
ర్నార్తిర్న చోద్వేగ ఋతే కుతశ్చిత్ ।
యచ్చిత్తతో ౭ దః కృపయా ౭ నిదం విదాం
దురంత దుఃఖ ప్రభవాను దర్శనాత్ ॥ - 27

**తా -** ఈ సుఖము తెలియని వారి విషయమున కలుగు నిరంతర దుఃఖము, వారి జనన (మరణములు) చూచుట వలన మిక్కిలి దయచేత నేర్పడు చిత్త పీడ కొంత తప్ప అచట శోకము లేదు. ముసలి తనములేదు, మరణము లేదు, బాధలేదు. భయమును లేదు.

**టీ :-** తదేవాహ - నేతి. ఆర్తిర్దుఃఖం. ఉద్వేగో భయం. కిం తు యచ్చిత్తతో హేతోః యద్దుఃఖం అదః ఋతే తదేకం వినా తత్కుతో భవతి? అనిదంవిదాం ఇదం భగవతో ధ్యానమజానతాం

**టీ -** అదియే చెప్పుచున్నాడు 'నయత్ర' అని - ఆర్తిః - దుఃఖము, ఉద్వేగః - భయము - కాని చిత్తమనునది ఉండుట కారణముగ ఆ దుఃఖము. ఋతే - అది యొక్కటి తప్ప - అది యెందులకగును? అనిదం విదామిదం - భగవంతుని ధ్యానము తెలియని ప్రాణులకు దురంతమగు దుఃఖము, ప్రభవః - జన్మము తస్యాను దర్శనాత్ -



ప్రాణినాం. దురంతదుఃఖానాం యఃప్రభవో జన్మ తస్యానుదర్శనాత్. యద్వా – తేషాం కృపయా చిత్తతోదో మనః పీడేతి యత్ తద్వినా కుతశ్చిదపి యత్రశోకాదయో న సంతీతి. (27)

దానిని చూచుటవలన వారికి – కృపయా – దయచేత – లేక చిత్తము వలన ఆ మనః పీడ ఏదికలదో అది తక్క ఎచటనో కొంత శోకము మున్నగునవి కాక అచట (బ్రహ్మలోకమున) అట్టి దుఃఖములుండవు, అచట బ్రహ్మలోకము పోయిన వారికి మూడు విధములైన గతి యుండును. ఎవరి పుణ్యము యొక్క ఉత్కర్ష చేత బ్రహ్మలోకమును పొందిరో వారు కల్పాంతరమున పుణ్యము యొక్క తారతమ్యము చేత అధికారవంతులయ్యెదరు, హిరణ్యగర్భుడు మొదలగు వారి ఉపాసనల బలము చేత అచటికి పోయినవారు బ్రహ్మ దేవునితో కూడ ముక్తులగుదురు. భగవానుని ఉపాసించి అచటికి చేరినవారు స్వేచ్ఛగా బ్రహ్మాండమును భేదించి విష్ణు సంబంధ స్థానమును అధిరోహింతురు. (27)

తతో విశేషం ప్రతిపద్య నిర్భయ
స్తేనాత్మనా ఉ పో ఉ నలమూర్తి రత్వరన్ ।
జ్యోతిర్మయో వాయుముపేత్యకాలే
వాయ్వాత్మనా ఖం బృహదాత్మలింగమ్ ॥ - 28

**తా** – సత్యలోకమునకు చేరిన పిదప ఆ యోగి నిర్భయుడై తన సూక్ష్మశరీరమును పృథ్వితో కలిపివేయును. అటుపిమ్మట నెమ్మదిగా పృథ్వి రూపము నుండి జలరూపమును, జలరూపమునుండి, అగ్ని రూపమును, అటుపై జ్యోతిరూపమును, ఆ పిదప వాయురూపమును పొంది, భోగావసాన కాలమునందు ఆకాశరూపమగు ఆవరణమును పొందును. (ఆత్మ మూర్తిత్వమును పొందును).

**టీ** :- తత్ర బ్రహ్మలోక గతానాం త్రివాధాగతిః. యే పుణ్యోత్కర్షేణ గతాః తే బ్రహ్మణా సహ ముచ్యంతే. యే భగవదుపాసకాః తే స్వేచ్ఛయా బ్రహ్మాండం భిత్త్వైవ వైష్ణవం పదం ఆరోహంతి. తత్ర ప్రస్తుతస్య భగవద్భక్తస్య బ్రహ్మాండభేదన ప్రకారమాహ – తత ఇతి. అత్రేయం ప్రక్రియా ఈశ్వరాధిష్ఠితాయాః ప్రకృతేః కేనచిదంశేన మహత్తత్త్వం భవతి. తస్యాంశేనాహంకారః

**టీ** – ఇచట ప్రస్తుతింపబడిన భగవద్భక్తుని బ్రహ్మాండ భేదన ప్రకారమును చెప్పుచున్నాడు – 'తతః' అనెడు ఈ శ్లోకముతో – ఇచటి ప్రక్రియ ఇది – ఈశ్వరుని చేత అధిష్ఠింపబడిన ప్రకృతి నుండి ఏదో ఒక అంశచేత మహత్తత్త్వ మగును. ఆ అంశతో అహంకారమగును. ఆ అంశచేత శబ్దతన్మాత్ర ద్వారా ఆకాశము, దాని అంశ చేత స్పర్శతన్మాత్ర ద్వారా వాయువు, దాని అంశచేత రూపతన్మాత్ర ద్వారా తేజస్సు,

తస్యాంశేన శబ్దతన్మాత్ర ద్వారా నభః. తస్యాంశేన స్పర్షతన్మాత్ర ద్వారా వాయుః. తస్యాంశేన రూపతన్మాత్ర ద్వారా తేజః. తస్యాంశేన రసతన్మాత్ర ద్వారా ఆపః. తస్యాంశేన గంధతన్మాత్ర ద్వారా పృథివీ. తైశ్చమిలితైః చతుర్దశ భువనాత్మకం విరాట్ఛరీరం. తస్య పంచాశత్కోటి విశాలమిత్యేకే. తతశ్చాబాదీనాం యే పరిణతాః అంశాః తాన్యేవోత్తరోత్తరం దశగుణాన్యావరాణి. అష్టమం తు ప్రకృత్యావరణం వ్యాపకమేవ. తదేవం స్థితే పృథివ్యాద్యావరణ భేదన ప్రకారః కథ్యతే – తత ఇతి. తతో విశేషం ప్రతిపద్య లింగదేహేన పృథివ్యాత్మతాం ప్రాప్యేత్యర్థః. ఏవముత్తరత్రాపి ద్రష్టవ్యం. నిర్భయః కథం యాస్యామీతి శంకాశూన్యః తేనాత్మనా పృథివీరూపేణ తన్నిరంతరా అపః ప్రతిపద్య అత్వరన్ త్వరామకుర్వన్ తత్తదాత్మకత్వేన క్లేదదాహాది శంకాభావాద్యథేష్టం భోగాన్ భుంజాన ఇత్యర్థః. ఏవం జ్యోతిర్మయస్సన్. కాలే భోగావస్థానే బృహతః ఆత్మనః లింగమూర్తిత్వేన ఉపాసనేషూక్తం. యద్వా – శబ్దాత్మనా తస్య ప్రమాపకమితి. (28)

దాని అంశ చేత రస తన్మాత్ర ద్వారా జలము, దాని అంశచేత గంధ తన్మాత్ర ద్వారా పృథివి యగును. అవి అన్నియు కలియుట చేత పదునాలుగు భువనములతో కూడిన విరాట్ శరీరము – ఆ ఏబదికోట్ల యోజనముల విరాట్ శరీరమునకు పృథివియే "అండకటాహ విశేషము" గా చెప్పబడు కోటి యోజనముల వైశాల్యము గలది మొదటి ఆవరణము ఏబది కోట్ల యోజనముల వైశాల్యము గలది యని కొందఱందురు. అటనుండి జలాదులలో ఏ భాగములు పరిణామము చెందినవో అవియే ఒకదాని తరువాత నొకటిగ పదింతలైన ఆవరణములు, ఎనిమిదవది ప్రకృతి ఆవరణము ప్రసిద్ధమే. ఇవి యిటులుంటూ ఉండగా పృథివి మొదలగు ఆవరణములను భేదించు విధానము వివరింపబడుచున్నది. – అట నుండి విశేషమును పొంది, లింగదేహముతో పృథివ్యాత్మత్వమును పొందునని యర్థము. ఈ విధముగ ముందు ముందు కూడ చూడవలెను. – నిర్భయః – ఎటుల పొందగలనో అనెడి సందేహము లేని వాడై – ఆ పృథివి రూపమైన ఆత్మతో ఎడము లేకుండగనే జలమును పొంది – అత్వరన్ – త్వరపాటు పడక ఆయా రూపములతో జలము, అగ్ని మొదలగు సందేహములు లేకుండ యధేచ్ఛగ భోగములనుభవించునని యర్థము. ఈ విధముగ జ్యోతిర్మయుడై – కాలే – భోగసమాప్తి యందు – బృహదాత్మనోలింగం – పరమాత్మ మూర్తిత్వముతో ఉపాసనలయందు చెప్పబడినది – లేక వేద శబ్ద స్వరూపముతో అతని ప్రమాపకము (తులన చేయుట) అని యర్థము.(28)

ఘ్రాణేన గంధం రసనేన వై రసం
రూపం తు దృష్ట్యా శ్వసనం త్వచైవ ।
శ్రోత్రేణ చోపేత్య నభో గుణత్వం
ప్రాణేన చాకూతి ముపైతి యోగీ ॥ - 29

**తా –** ఘ్రాణేంద్రియము చేత గంధతన్మాత్రను, రసనేంద్రియము చేత రసతన్మాత్రను, కన్నుల చేత రూపతన్మాత్రను, త్వగింద్రియముచేత స్పర్శతన్మాత్రను శ్రోత్రేంద్రియముల చేత శబ్ద తన్మాత్రను పొంది, ఇక ప్రాణ శక్తి చేత ఆయాసూక్ష్మ క్రియాశక్తులను పొంది యోగి స్థూలావరణములను దాటుకొనును.

**టీ** :- ఇంద్రియార్థానాం భూతసూక్ష్మాణాం అతిక్రమమాహ - ఘ్రాణేనేతి. ఘ్రాణాధిష్ఠితేన గంధముపేత్య శ్వసనం స్పర్శం నభోగుణత్వం శబ్దాత్మతాం ప్రాణేన తత్తత్కర్మేంద్రియేణ ఆకూతిం తత్తత్క్రియాం. (29)

స భూత సూక్ష్మేంద్రియ సన్నికర్షం
మనోమయం దేవమయం వికార్యమ్ ।
సంసాద్య గత్వా సహతేన యాతి
విజ్ఞానతత్త్వం గుణ సన్నిరోధమ్ ॥ - 30

**టీ** :- తదేవం స్థూలసూక్ష్మభూతాదిక్రమముక్త్వా తదావరణ భూతాహంకారప్రాప్త్యా మహదాదిప్రాప్తిమాహ - స ఇతి. స యోగీ వికార్యం సంప్రాప్య విజ్ఞానతత్త్వం యాతి వివిధం కార్యం యస్యేతి వికార్యహంకారః. స త్రివిధః - తామసో రాజ సస్సాత్త్వికశ్చేతి. తత్రతామసాత్ అజ్ఞాతాని భూతసూక్ష్మాణి జాయంతే. రాజసాద్బహిర్ముఖాని దశేంద్రియాణి. సాత్త్వికాత్ మన ఇంద్రియం దేవతాశ్చ. తేషాం లయశ్చ తత్తదహంకారః తత్ర భూతసూక్ష్మాణాం ఇంద్రియాణాం చ సన్నికర్షం లయస్థానం తామసం రాజసం చ మనోమయం దేవమయం చ సాత్త్వికం సంప్రాప్య గత్యా గమనేన తేనాహంకారేణ సహ విజ్ఞానతత్త్వం యాతి. తతః గుణానాం సన్నిరోధో లయో యస్మిన్ తత్ప్రధానం యాతి. (30)

**టీ** - ఇంద్రియార్థములైన భూత సూక్ష్మములను అతిక్రమించుటను గూర్చి చెప్పుచున్నాడు - ఘ్రాణ శక్తిని అధిష్ఠించిన ఇంద్రియముతో గంధ (తన్మాత్ర) మును పొంది - శ్వసనం - స్పర్శ, నభోగుణత్వం - శబ్దాత్మత్వమును - ప్రాణేన - ఆయా కర్మేంద్రియము చేత - ఆకూతిం - ఆయా క్రియను - (పొంది అని అర్థము) (29)

**తా** - అతడు సూక్ష్మ భూతములను, మనస్సును, ఇంద్రియాధిష్ఠాన దేవతలను అహంకారమున లీనముచేసి దీని లయాత్మకత్వముతో ముందుకు వెడలి మహత్తత్త్వమున ప్రవేశించి సర్వ గుణ లయస్థానమగు ప్రకృతి రూపమైన ఆవరణములో కలిసిపోవును.

**టీ** - ఈ విధముగ స్థూల సూక్ష్మభూతములను అతిక్రమించుటను గూర్చి చెప్పి, వాని ఆవరణ రూపముగనున్న అహంకార ప్రాప్తితో మహత్తు మొదలగు వాని ప్రాప్తిని చెప్పుచున్నాడు - సః - యోగి - అహంకారమును కలుపుకొని విజ్ఞాన తత్త్వమునకు చేరును - వివిధములైన కార్యములు కలది కావున వికార్యం - అహంకారము - అది మూడు విధములు. తామసము, రాజసము, సాత్త్వికము అని - తామసాహంకారమునుండి జడములైన భూత సూక్ష్మములు పుట్టుచున్నవి. రాజసము నుండి బహిర్ముఖములైన దశేంద్రియములును, సాత్త్వికము నుండి మనస్సు, ఇంద్రియదేవతలును పుట్టుచున్నారు, వాని లయము కూడ ఆయా అహంకారములందే జరుగును. భూత సూక్ష్మముల యొక్కయు, ఇంద్రియముల యొక్కయు - సన్నికర్షం - లయస్థానము తామసము. మనోమయము యొక్క లయ స్థానము రాజసము, అట్లే దేవమయము సాత్త్వికమునలయించును గత్వా ఈ విధమైన గమనము చేత - ఆ అహంకారముతో కూడ విజ్ఞాన తత్త్వం మహత్తత్త్వమును పొందును. అటుపై గుణానాం సన్నిరోధః - గుణముల లయము దేనియందో ఆ ప్రధానమును (ప్రకృతిని) పొందును.(30)

తేనాత్మనాత్మానముపైతి శాంత
మానంద మానందమయో ఽ వసానే ।
ఏతాంగతిం భాగవతీం గతో యః
స వై పునర్నేహ విషజ్జతే ఽ ంగ ॥ - 31

**తా** - రాజా ! అట్టి ప్రకృతి రూపుడైన యోగి చివరకు ఆనందరూపమగు ఆత్మను పొంది ఆనందమయుడగును. ఎవడిట్టి భగవత్సంబంధమగు స్థితిని పొందునో అతనికి ఇక పునరావృత్తి ఉండదు. (సంసార సంబంధమగు జనన మరణములు ఉండవు)

**టీ** :- తేనేతి. తేనాత్మనా ప్రధానరూపేణ ఆనందమయస్సన్ ఉపాదీనామవసానే శాంతమవికృతమానందం పరమాత్మనముపైతి. న విషజ్జతే నావర్తత ఇత్యర్థః. (31)

**టీ** - తేనాత్మనా - ప్రధాన (ప్రకృతి) రూపముతో - ఆనందమయుడగుచు - ఉపాధీనామవసానే - ఉపాధుల సమాప్తియందు శాంతము, అవికృతమునైన ఆనందమును - పరమాత్మను పొందును - న విషజ్జతే - ఆవృత్తి పొందదు.(31)

ఏతే సృతీ తే నృప ! వేదగీతే
త్వయాభి పృష్టే హ సనాతనే చ ।
యే వై పురా బ్రహ్మణ ఆహ పృష్ట
ఆరాధితో భగవాన్వాసుదేవః ॥ - 32

**తా** - రాజా ! ఇవి రెండును నీవడిగిన రెండు ప్రశ్నలకు సనాతనములు, వేదముచే కీర్తింపబడినవియునైన సమాధానప్రాయములైన రెండు మార్గములు. పూర్వము బ్రహ్మదేవుడు, వాసుదేవుని ఆరాధించి అతనిని అడిగిన ప్రశ్నలకు వాసుదేవుడు చెప్పిన మార్గములివియే.

**టీ** :- ఏతఇతి. సృతీ మార్గౌ ప్రకారావిత్యర్థః. హే నృప. అనపేక్షో నిర్భిద్యమూర్ధన్విసృజేత్పరం గత ఇతి యా సద్యో ముక్తిస్సైకా సృతిః. యది ప్రయాస్యన్నిత్యాదినా క్రమముక్తిశ్చ ద్వితీయా సృతిః ఏతే సృతీ వేదేన గీతే ఉక్తే, న తు స్వోత్ప్రేక్షితే. తత్ర. శ్రు. " యదా సర్వే ప్రముచ్యంతే కామాయే ఽ స్య హృది శ్రితాః, అథ మర్త్యో మృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుత " ఇతి సద్యో ముక్తిః,

**టీ**- సృతీ - రెండు మార్గములు - ప్రకారములని అర్థము - హేనృప - (ఓ రాజా) "ఏలోకమునకు పోవుటకు ఇచ్ఛలేనివాడై బ్రహ్మరంధ్రమును భేదించి శరీరేంద్రియములను విడువవలెను" అని ఏ సద్యోముక్తి చెప్పబడినదో అది ఒక మార్గము (శ్లో - 21) "యది ప్రయాస్యన్" అను శ్లోకముచే చెప్పబడిన క్రమముక్తి రెండవ మార్గము. ఈ రెండు మార్గములును వేదేన గీతే - వేదముచే చెప్పబడినవి. కాని స్వయముగ ఊహింపబడినవి కావు "ఏ కామనలు ఇతని హృదయము నాశ్రయించి ఉన్నవో అట్టివి అన్నియు వదలిపోయినప్పుడు" మర్త్యుడు అమృతుడగును - అప్పుడు బ్రహ్మమును పొందును" అని ఇది సద్యోముక్తి ప్రకారము.





తే ఉ ర్చిషమభిసంభవంతీత్యాదినా క్రమముక్తిశ్చ వేదేనోక్తే. యద్వా – న కర్మభిస్తాం గతిమాప్నువంతీతి దక్షిణ మార్గస్యాపి సూచితత్వాత్ ఏతే సృతీ ఇతి ద్వివచనం. త్వయాభి పృష్టే యచ్ఛ్రోతవ్యమిత్యాది ప్రశ్నేన అర్థాన్ముక్తివిషయే ద్వే అపి సృతీ పృష్టే. బ్రూహి యద్వా విపర్యయమితి చ దక్షిణమార్గోప్యర్థాత్ప్రష్టః. ఏవం త్వయా చ పృష్టే యచ్ఛ్రోతవ్యమిత్యాది ప్రశ్నే ఏతే సృతీ ఇత్యన్వయః. (32)

"వారు అర్చిరాది మార్గమును పొందెదరు" అను మొదలగు మంత్రముతో క్రమముక్తి కూడ వేదముచే చెప్పబడినది. లేక "కర్మలచే ఆగతిని పొందజాలరు" అని దక్షిణ మార్గము యొక్క సూచితత్వముతో కూడ ఈ రెండు మార్గములు అని ద్వివచనము – "ఏది వినదగినదో" అని నీచే ప్రశ్నింపబడిన ప్రశ్నచే – అనగా మోక్ష విషయమున రెండు మార్గములను గూర్చి అడిగినట్లైనది "బ్రూహియద్వావిపర్యయమ్" (లేక – విపర్యయమును కూడ చెప్పుడు) అని దక్షిణ మార్గము కూడ అర్థతః అడుగబడినది. ఈ విధముగ నీచే ఏవి అడుగబడినవో అవియే ఈ రెండు మార్గములు అని అన్వయము.(32)

నహ్యతో ఉ న్యః శివః పంథా
విశతః సంసృతా విహ ।
వాసుదేవే భగవతి
భక్తియోగో యతో భవేత్ ॥ - 33

**తా –** ఈ లోకమున సంసారమునందు ప్రవేశించియున్న వానికి, భగవానుడైన వాసుదేవుని యందు భక్తియోగము కలుగుట కంటె మఱియొక శుభప్రదమైన మార్గము లేదు.

**టీ :-** సంతి సంసరతః పుంసో బహవో మోక్షమార్గా యోగాదయః సమీచీనస్త్వయమేవేత్యాహ – నేతి. యతో ఉ నుష్ఠితాద్భక్తియోగో భవేత్ అతో ఉ న్యశ్శివస్సుఖరూపో నిర్విఘ్నశ్చ నాస్త్యేవ. (33)

**టీ –** సంసారమునందు చరించుచున్న పురుషునకు తపోయోగము మొదలగు మోక్ష మార్గములనేకములున్నవి. వానిలో ఈ భక్తియోగమే యోగ్యమైనదని చెప్పుచున్నాడు – 'నహి' అను ఈ శ్లోకమున వివరించుచున్నాడు – భక్తి యోగము ననుష్ఠించుట కంటె వేఱొక మంగళప్రదమైన – నిర్విఘ్నకారకమైన విధానము లేనేలేదు.(33)





భగవాన్బ్రహ్మ కార్త్స్న్యేన
త్రిరన్వీక్ష్య మనీషయా ।
తదధ్య వస్యత్ కూటస్థో
రతిరాత్మన్ యతో భవేత్ ॥ - 34

**తా –** బ్రహ్మదేవుడు మూడు పర్యాయములు ఏకాగ్ర చిత్తుడై వేదమును సాకల్యముగ పరిశీలన చేసి (నిర్వికారుడైన) హరియందు ప్రేమ యెట్లు కలుగునో ఆ ప్రకారమును తన బుద్ధిచే నిశ్చయించెను.

**టీ :-** కుత ఇత్యత ఆహ– భగవానితి. భతవాన్ బ్రహ్మ. కూటస్థః నిర్వికారః. ఏకాగ్రచిత్తస్సన్నిత్యర్థః. త్రీన్ వారాన్ కార్త్స్న్యేన సాకల్యేన బ్రహ్మ వేదం అన్వీక్ష్య విచార్య యతః యస్మాదాత్మని హరౌరతిర్భవేత్ తదేవ మనీషయా అధ్యవస్యత్ నిశ్చితవాన్. (34)

**టీ –** ఎట్లు? అదియే చెప్పుచున్నాడు – భగవాన్ – బ్రహ్మదేవుడు – కూటస్థః – నిర్వికారుడు – ఏకాగ్రచిత్తుడగుచు అనియర్థము – త్రిః – మూడు పర్యాయములు – కార్త్స్న్యేన సాకల్యముగ – బ్రహ్మ – వేదమును – అన్వీక్ష్య– విచారించి – యత ఆత్మని రతిర్భవేత్ – హరియందు ప్రేమ ఎట్లు కలుగునో – తదేవ – అదే – మనీషయా – బుద్ధిచేత – అధ్యవస్యత్ – నిశ్చయించెను.(34)

భగవాన్సర్వ భూతేషు
లక్షితః స్వాత్మనా హరిః ।
దృశ్యైర్బుద్ధ్యాదిభిర్ద్రష్టా
లక్ష ణైరనుమాపకైః ॥- 35

**తా –** భగవానుడగు హరి సర్వభూతములయందు తన అంతర్యామి రూపమున, సాక్షిగా కనబడును. బుద్ధి మొదలగు దృశ్యముల చేతను, ఊహింపదగిన లక్షణముల చేతను చూడబడుచుండును.

**టీ:-** నన్వనుభూతే ఉ ర్థే రతిర్భవతి అననుభూతే ఉ ర్థే తద్భగవతి కథం రతిస్స్యాత్? తత్రాహ – భగవానితి. భగవాన్ లక్షితః దృష్టః కథం? స్వాత్మనా క్షేత్రజ్ఞాంతర్యామితయా కైః? దృశ్యైః బుద్ధ్యాదిభిః. తదేవ ద్వేధా దర్శయతి – దృశ్యానాం జడానాం దర్శనం స్వప్రకాశం ద్రష్టారం వినా న ఘటత ఇత్యనుపత్తిముఖేన లక్షణైః స్వప్రకాశాంతర్యామిలక్షకైః తథా బుద్ధ్యాదీని, కర్తృ

**టీ –** అతనిని అనుభూతిపొందుటకు కారణమున్నచో అతని యందు ప్రేమ కలుగుట నిశ్చయమే – కాని అనుభూతి లేనప్పుడు భగవానుని యందు ప్రేమ ఎట్లు కలుగును? ఆ విషయమును చెప్పుచున్నాడు, భగవాన్ (హరి) లక్షితః – చూడబడును – ఎట్లు? స్వాత్మనా – క్షేత్రజ్ఞుని – అంతర్యామిత్వ రూపమున – వేని చేత? దృశ్యైర్బుద్ధ్యాదిభిః – బుద్ధి మొదలగువాని దృశ్యముల చేత – దానినే రెండు విధములుగ చూపుచున్నాడు – జనులకు దృశ్యముల దర్శనము స్వప్రకాశుడైన ద్రష్టలేనిదే ఘటింపదు’ అను విధమున అనుపపత్తి ద్వారా – లక్షణైః – స్వప్రకాశుడైన అంతర్యామి లక్షణముల చేత – అట్లే కర్తచేత ఉపయోగింపబడదగిన





ప్రయోజ్యాని, కరణత్వాత్. వాశ్యాదివదితి వ్యాప్తి ముఖేన అనుమాపకైః స్వతంత్రశ్చ కర్తేత్యేవమీశ్వరసిద్ధిః. (35)

తస్మాత్సర్వాత్మనా రాజ
న్హరిః సర్వత్ర సర్వదా ।
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ
స్మర్తవ్యోభగవాన్నృణామ్ ॥- 36

**టీ** :- యచ్ఛ్రోతవ్యమిత్యాది ప్రశ్నోత్తర ముక్తముపసంహరతి – తస్మాదితి. (36)

పిబంతి యే భగవత ఆత్మనస్సతాం
కథామృతం శ్రవణపుటేషు సంభృతమ్ ।
పునంతి తే విషయ విదూషితాశయం
వ్రజంతి తచ్చరణ సరోరుహాంతికమ్ ॥ - 37

**టీ** :- శ్రవణాదిఫలమభినయేనాహ – పిబంతీతి. సతామాత్మనః ఆత్మత్వేన ప్రకాశమానస్య కథైవామృతం విషయైర్విదూషితం మలినీకృతం ఆశయం పునంతి శోధయంతి తస్య చరణసరోహాంతికం శ్రీవిష్ణుపదం వ్రజంతి. (37)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వితీయస్కంధే పురుష సంస్థావర్ణనం నామ ద్వితీయో ఽ ధ్యాయః**

బుద్ధి మొదలగు వానిని – ఇంద్రియత్వము వలన (కరణ లక్షణము వలన) (ఇండ్లు మొదలగు వాని యందు కార్మికుల పనిముట్ల పనితనము వ్యాప్తి చెంది ఉన్నట్లు) వ్యాప్తి లక్షణము ద్వారా – అనుమాపకములచేత (ఊహించి తెలిసికొన దగిన లక్షణముల చేత తెలిసికొనబడును).(35)

**తా** – రాజా ! అందువలన భగవానుడైన హరి అంతటను, అన్ని వేళల యందును మానవులకు వినదగిన వాడు, కీర్తింపదగిన వాడు, స్మరింపదగిన వాడు.

**టీ** – "తస్మాత్" అను ఈ శ్లోకముతో, ఏది వినదగినది మొదలగు ప్రశ్నలకు సమాధానమును సమాప్తి చేయుచున్నాడు (36)

**తా** – ఆత్మస్వరూపుడైన భగవానుని యొక్కయు, సత్పురుషుల యొక్కయు కథలనెడు అమృతమును చెవులనెడు దొప్పల నిండుగ త్రాగువారు, ఈ విషయ దూషితమైన హృదయమును పవిత్రీకరింతురు. శ్రీహరి పాద పద్మముల స్థానమునకు చేరుదురు.

**టీ** – శ్రవణము మొదలగువాని ఫలమును 'పిబంతి' అను శ్లోకముతో అభినయముచే చెప్పుచున్నాడు – సతాం – (మహాత్ముల యొక్క) ఆత్మనః–ఆత్మత్వముతో ప్రకాశించుచున్నవాని యొక్క – కథామృతం – కథయే అమృతముగా – విషయైర్విదూషితం – మలినీకృతమైన – ఆశయం (మనస్సును) పునంతి – శుద్ధముచేయుదురు – అతని పాద పద్మములతో కూడిన విష్ణు స్థానమును పొందెదరు. (37)

**శ్రీ మద్భాగవతమహాపురాణము నందలి రెండవ స్కంధమున పురుష సంస్థా వర్ణనమను రెండవ అధ్యాయము సమాప్తము**










# అథ తృతీయో ఽ ధ్యాయః

**శ్రీ శుక ఉవాచ**

ఏవమేతన్నిగదితం
పృష్టవాన్యద్భవాన్మమ ।
నృణాం యన్మ్రియమాణానాం
మనుష్యేషు మనీషిణామ్ ॥ -1

# మూడవ అధ్యాయము

**శ్రీ శుక మహర్షి యిట్లనెను.**

**తా –** మనుష్యులయందు బుద్ధిమంతులగువారు మరణింపబోవు సమయమున చేయవలసిన కర్తవ్యమును గూర్చి నీవు నన్నడిగిన ప్రశ్నకీ విధముగ సమాధానము చెప్పబడినది.

**టీ :-** తృతీయేవిష్ణుభక్తేస్తు వైశిష్ట్యం శృణ్వతో మునేః. భక్త్యుద్రేకేణ తత్కర్మ శ్రవణాదర ఈర్యతే, ఇదానీమన్యదేవతాభజనస్యాపి పుత్రాదిభజనవదేవ తుచ్ఛఫలత్వేన హేయత్వం వక్తుం పూర్వోక్తమనువదతి – ఏవమితి. మమేతి మాం మనుష్యేషు కదాచిద్దైవయోగేన మనుష్యత్వం ప్రాప్తేషు జీవేషు. యే మనీషిణః తేషాం తత్రాపి యే మ్రియమాణాః తేషాం విశేషతః ఏవమేతద్ధరికథా శ్రవణాదికం నిగదితం విహితమిత్యర్థః. (1)

**టీ –** ఈ తృతీయాధ్యాయమున వినుచున్న పరీక్షిత్తుకు శుకమునీంద్రుని విష్ణు భక్తి వైశిష్ట్య కథనము. భక్త్యుద్రేకము చేత భగవత్సంబంధమగు కర్మలయందు కథా శ్రవణాదులయందును ఆదరమును గూర్చి చెప్పబడుచున్నది. ఇప్పుడు ఇతర దేవతలకు సంబంధించిన భజనము, పుత్రులు మొదలగు వారి సేవ వలె తుచ్ఛమైన ఫలము నిచ్చునదగుట వలన అట్టిది స్వీకార్యము కాదని చెప్పుటకు పూర్వము చెప్పిన విషయమును 'ఏవం' అను ఈ శ్లోకమున మఱల అనువదించుచున్నాడు. మమ – ద్వితీయా విభక్త్యర్థమున అనగా – నన్ను అనునర్థమున ప్రయుక్తము. ఎప్పుడో దైవయోగమున మనుష్యత్వము పొందిన జీవుల యందు ఎవరు బుద్ధిమంతులో అందునను ఎవరు మరణోన్ముఖులై యున్నారో వారికిట్లు ఈ విధమైన హరికథలు వినుట మొదలగునవి చెప్పబడినవి. ఇట్టిది విహితమైనదని యర్థము.(1)

బ్రహ్మవర్చస కామస్తు
యజేత బ్రహ్మణస్పతిమ్ ।
ఇంద్రమింద్రియ కామస్తు
ప్రజాకామః ప్రజాపతీన్ ॥ - 2

**తా –** బ్రహ్మతేజమును కోరువాడు బృహస్పతిని, ఇంద్రియముల శక్తిని కోరువాడు ఇంద్రుని, సంతానమును కోరువాడు ప్రజాపతులను (దక్షాదులను) ఉపాసింపవలెను.




**టీ** :- కామఫలప్రాప్త్యర్థమన్యేషాం. దేవానాం భజనమాహ – బ్రహ్మవర్చసేతి. బ్రహ్మణస్పతిం వేదపతిం బ్రహ్మాణం. ఇంద్రియపాటవకామస్తు. ఇంద్రం ప్రజాపతీన్ దక్షాదీన్. (2)

**టీ** – బ్రహ్మణస్పతిం – వేదమునకు అధిపతియైన బృహస్పతిని ఇంద్రియ పాటవ కామస్తు – ఇంద్రియముల పటుత్వమును వాంఛించు వాడైనచో – ఇంద్రం – ఇంద్రుని – ప్రజాకామః (సంతానార్థి) ప్రజాపతీన్ – దక్షుడు మొదలగు వారిని.(2)

దేవీం మాయాం తు శ్రీకామ
స్తేజస్కామో విభావసుమ్ ।
వసుకామో వసూన్రుద్రాన్
వీర్యకామో ఽ థ వీర్యవాన్ ॥ -3

**తా** – సంపదను కోరువాడు దుర్గాదేవిని, తేజస్సును కోరువాడు సూర్యభగవానుని (అగ్నిదేవుని), ధనము కావలసిన వాడు వసువులను, ప్రభావము నిచ్ఛయించువాడు వీర్యవంతుడై రుద్రులను పూజింపవలెను.

**టీ** :- దేవీమితి. మాయాం దుర్గాం. విశావసుం అగ్నిం. వసుకామః ధనార్థీవసూన్. వీర్యం ప్రభావః, తత్కామో వీర్యదాన్. రుద్రాన్ యజేత. (3)

**టీ** – మాయాం – దుర్గను, విభావసుమ్ – అగ్నిని, వసుకామః – ధనమును కోరువాడు – వీర్యం – ప్రభావమును – తత్కామః – దానిని కోరువాడు – వీర్యవాన్ సన్ – సాహసవంతుడై రుద్రాన్ యజేత్ – రుద్రులను పూజింపవలెను. (3)

అన్నాద్యకామస్త్వదితిం
స్వర్గకామో ఽ దితేః సుతాన్ ।
విశ్వాన్దేవాన్రాజ్యకామః
సాధ్యాన్సంసాధకో విశామ్ ॥ - 4

**తా** – భక్ష్యభోజ్యాదులు కోరువాడు అదితిని, స్వర్గమును అపేక్షించువాడు అదితి కుమారులైన ద్వాదశాదిత్యులను (దేవతలను), రాజ్యమును కోరువాడు విశ్వేదేవతలను, దేశ ప్రజలు తన స్వాధీనమున నుండగోరువాడు సాధ్యులను పూజింపవలెను.

**టీ** :- అన్నాద్యేతి. అన్నాద్యం భోజ్యం భక్ష్యం, అదితేస్సుతాన్ ద్వాదకాదిత్యాన్, విశాం దేశస్థప్రజానాం. స్వాధీనతామిచ్ఛన్ సాధ్యాన్ యజేత. (4)

**టీ** – అన్నాద్యం – భోజ్యమును భక్ష్యమును – అదితేః సుతాన్ – పన్నెండుగురు సూర్యులను – విశాం – దేశమునందలి ప్రజల యొక్క – స్వాధీనతామిచ్ఛన్ – తన అధీనముననుండుటకు కోరుచున్నవాడు – సాధ్యాన్ యజేత్ – సాధ్యులను పూజింపవలయును.(4)

ఆయుష్కామో ఽ శ్వినౌ దేవౌ
పుష్టికామ ఇలాం యజేత్ ।
ప్రతిష్ఠాకామః పురుషో
రోదసీ లోకమాతరౌ ॥ - 5

**తా –** దీర్ఘకాలము జీవింపఁగోరువాడు అశ్వినీ దేవతలను, పుష్టిని కోరువాడు భూమిని, తన స్థానము నుండి చ్యుతి కలుగకుండ నుండ గోరువాడు ద్యావాపృథ్వులను సేవింపవలెను.

**టీ** :- ఆయుష్కామఇతి. ఇలాం పృథ్వీం. ప్రతిష్ఠా స్థానాద ప్రచ్యుతిః. రోదసీ ద్యావాభూమీ. (5)

**టీ –** ఇలాం – పృథ్విని – ప్రతిష్ఠా – స్థానము నుండి క్రిందకు జారకుండుట, రోదసీ (లోకమాతరౌ) ఆకాశమును లోకమాతయైన భూమిని (5)

రూపాభికామో గంధర్వాన్
స్త్రీకామో ఽ ప్సర ఊర్వశీమ్ ।
ఆధిపత్య కామః సర్వేషాం
యజేత పరమేష్ఠినమ్ ॥ - 6

**తా –** సౌందర్యమును కోరువాడు గంధర్వులను, స్త్రీని కోరువాడు ఊర్వశియను అప్సరను, అందఱికిని అధిపతి కాఁగోరువాడు బ్రహ్మదేవుని పూజింపవలెను.

**టీ** :- రూపేతి. అప్సరాశ్చాసౌ ఊర్వశీ చ తాం. ఆధిపత్యకామ ఇత్యత్ర వర్ణాధిక్యమార్షం. (6)

**టీ –** అప్సర ఊర్వశీం – అప్సరయగు ఊర్వశిని (6)

యజ్ఞం యజేద్యశస్కామః
కోశకామః ప్రచేతసమ్ ।
విద్యాకామస్తు గిరిశం
దాంపత్యార్థ ఉమాంసతీమ్ ॥ - 7

**తా –** కీర్తిని కోరువాడు యజ్ఞోపాధియగు విష్ణువును, వసుసంచయము (ధనము) ను కోరువాడు వరుణుని, విద్యా కాంక్షకలవాడు శంకరుని, దాంపత్యకాముడు పార్వతీదేవిని ఉపాసించవలెను.

**టీ** :- యజ్ఞమితి. యజ్ఞం యజ్ఞోపాధికం విష్ణుం. కోశో దనసంచయః. వసు ఇత్యత్ర ధనమాత్రమితి. భేదః. దాంపత్యం అన్యోన్యప్రీతిః తదేవార్థో యస్య. (7)

**టీ** - యజ్ఞం – యజ్ఞము ఉపాధిగా గల విష్ణువును – కోశః – వసుసంచయము (కూడబెట్టిన సంపదలు) వసుకామః అనియిచట ధనమాత్రమని భేదము. దాంపత్యం – భార్యాభర్తలప్రీతియే ప్రయోజనముగ గలవాడు 'దాంపత్యార్థః' అని – (7)

ధర్మార్థ ఉత్తమ శ్లోకం
తన్తుం తన్వన్పితౄన్యజేత్ ।
రక్షా కామః పుణ్యజనా
నోజస్కామో మరుద్గణాన్ ॥ - 8

**తా** - ధర్మమును కోరువాడు ఉత్తమ శ్లోకుడైన విష్ణువును, సంతానవృద్ధిని కాంక్షించువాడు పితృదేవతలను, బాధా నివృత్తిని కోరువాడు యక్షులను, ఓజస్సును (బలమును) కోరువాడు మరుద్గణ దేవతలను పూజింపవలెను.

**టీ** :- ధర్మార్థ ఇతి. ధర్మార్థకామః ఉత్తమశ్లోకోపాధిం విష్ణుం తంతుం తన్వన్ సంతానవృద్ధిమన్విచ్ఛన్. రక్షా బాధానివృత్తిః. తత్కామః పుణ్యజనాన్ యక్షాన్. ఓజః బలం. తత్కామః. (8)

**టీ** - ధర్మార్థః – ధర్మకాముడు – ఉత్తమ శ్లోకత్వమే ఉపాధిగాగల విష్ణువును, తన్తుం తన్వన్ – సంతానవృద్ధిని అపేక్షించువాడు, రక్షా – బాధానివృత్తి – దానిని కోరువాడు రక్షాకామః –పుణ్యజనాన్ – యక్షులను, ఓజస్ – బలము, దానిని కోరువాడు 'ఓజస్కామః' మరుద్గణాన్ – దేవగణములను.(8)

రాజ్య కామో మనూన్దేవా
న్నిరృతింత్వభిచరన్యజేత్ ।
కామ కామో యజేత్సోమ
మకామః పురుషం పరమ్ ॥ - 9

**తా** - రాచరికమును కోరువాడు మన్వంతరాధిపతులను, శత్రుమారణమును కోరువాడు నిరృతిని,(ప్రాగాదులలో నాల్గవ దిక్కునకు అధిపతిని) భోగేచ్ఛగలవాడు చంద్రుని, వైరాగ్యము నందపేక్ష కలవాడు ప్రకృతి వ్యతిరేకోపాధియగు ఈశ్వరుని పూజింపవలయును.

**టీ** :- రాజ్యమితి. రాజ్యం రాజత్వం. తత్కామో మనురూపాన్ దేవాన్ రాజ్ఞః కర్మ వా రాజ్యం. తత్కామో విశ్వాన్ దేవానితి విశేషః

**టీ** - రాజ్యం – రాజత్వము –దానిని కోరువాడు రాజ్యకాముడు – మనూన్దేవాన్ – మన్వంతర పాలురను – రాజు యొక్క కర్మరాజ్యం – దానిని కోరువాడు విశ్వేదేవతలను

అభిచరన్ శత్రుమరణమన్విచ్ఛన్. నిరృతిం రాక్షసం. కామకామః భోగేచ్ఛుః. అకామః వైరాగ్యకామః. పురుషం పరం ప్రకృతివ్యతిరేకోపాధిమీశ్వరం. నిరృతిం త్వభిచరన్ యజేదిత్యత్రాపి పూర్వవదేవ. వర్ణాధిక్యమార్షం. (9)

అని విశేషము - అభిచరన్ - శత్రువులు మరణింపవలెనని కోరువాడు - నిరృతిం - రాక్షసుని - కామ కామః - భోగేచ్ఛ గలవాడు. అకామః - వైరాగ్యమును కోరువాడు, పురుషంపరం - ప్రకృతి వ్యతిరేకమగు ఉపాధి గలవానిని ఈశ్వరుని - (అకామః - ఏకాంతమును కోరువాడు భక్తుడు లేక - చెప్పబడినవి, చెప్పబడనివియునైన కోరికలు గలవాడు పూర్ణపురుషుని నిరుపాధికుని (యజింపవలెను) (9)

అకామః సర్వకామో వా
మోక్షకామ ఉదారధీః ।
తీవ్రేణ భక్తియోగేన
యజేత పురుషం పరమ్ ॥ - 10

**తా** - కోరిక లేనివాడు, అన్ని కోరికలు గలవాడు, ఉదారమైన బుద్ధిగల వాడై మోక్షమును కోరువాడు, తీవ్రమైన భక్తియోగముతో నిరుపాధిక బ్రహ్మమును ఉపాసింపవలెను.

**టీ** :- అకామఇతి. అకామః. ఏకాంతభక్తః ఉక్తానుక్తసర్వకామో వా. పురుషం పూర్ణం నిరుపాధిం. (10)

**టీ** - అకామః - ఏకాంత భక్తుడు - సర్వకామః - చెప్పబడినవి, చెప్పబడనివియునైన కోరికలు గలవాడు గాని - పురుషం - పూర్ణమైనవాని, ఉపాధి రహితుడైన బ్రహ్మమును (ఉపాసింపవలెను) (10)

ఏతావానేవ యజతా
మిహ నిఃశ్రేయసోదయః ।
భగవత్యచలో భావో
యద్భాగవత సంగతః ॥ - 11

**తా.** ఉపాసన చేయువారలకు మోక్షలాభమును కలిగించుటకై, భగవానుని యందు నిశ్చలమైన భక్తిభావము - భగవత్సంబంధుల సంగతితో నేర్పడు మార్గములు ఇవియే.



**టీ** :- పూర్వోక్త నానాదేవతాయజనస్యాపి సంయోగపృథక్త్వేన భక్తియోగఫలత్వమాహ – ఏతావానితి. ఇంద్రాదీనపి యజతాం ఇహ తత్తద్దేవతాయజనే భాగవతానాం సంగతో భగవత్యచలో భావో భక్తిర్భవతీతి యత్. ఏతావానేవ నిశ్రేయసస్య పరమ పురుషార్థస్య ఉదయో లాభః అన్యత్తు సర్వం తుచ్ఛమిత్యర్థః (11)

**టీ** – పూర్వము చెప్పబడిన వివిధ దేవతల ఉపాసనలకు సంబంధ భిన్నత్వము చేత భక్తియోగఫలత్వమును, 'ఏతావాన్' అను నీ శ్లోకముతో చెప్పుచున్నాడు. ఇంద్రాదులను యజించువారికిని, ఆయా యజనములచేత భగవత్సంబంధమైన వారల సంగతి యేర్పడును. దానితో భగవానుని యందు నిశ్చలమైన భక్తి కలుగును. ఇదియే పరమ పురుషార్థమగు మోక్షము ప్రాప్తించు లాభము. తక్కినదంతయు తుచ్ఛమైనదని యర్థము. (సంయోగ పృథక్త్వేన – సంబంధము యొక్క భిన్నత్వము చేత ననియర్థము. ఆయా దేవతల, ఉపాసనలచేత, ఆయా ఫలములు కలుగుననుట పృథక్త్వము – ఆయా దేవతలను భజించుట చేత, పాపక్షయము కలిగి, దాని వలన, భాగవతుల స్నేహము కలుగును. ఆ స్నేహము వలన భగవంతుని యందు నిశ్చలమైన భక్తి కలుగును. ఇది సంయోగము) (11)

జ్ఞానం యదా ప్రతినివృత్త గుణోర్మిచక్రం
ఆత్మ ప్రసాద ఉత యత్ర గుణేష్వసంగః ।
కైవల్య సమ్మత పథస్త్వథ భక్తి యోగః
కో నిర్వృతో హరికథాసు రతిం నకుర్యాత్ ॥ - 12

**తా** – దేనివలన రాగాదుల సమూహమునుండి అంతటను ఉపరతి కలుగునో, అటుపిమ్మట తత్కారణముగ ఆత్మానుగ్రహము కలుగునో, వేని కారణముగ, మనః స్వాస్థ్యమును ప్రసాదించు విషయ విరక్తి సంభవమగునో – ఇహపరముల (భోగ) వైరాగ్యము కలుగునో, వేని వలన కైవల్య సమ్మతమార్గమగు భక్తితో కలయిక యేర్పడునో – అట్టి హరికథలయందు శ్రవణ సుఖము నొందక ఎవడు శాశ్వత సుఖమునొందును?

**టీ** :- భాగవతసంగత ఇత్యనేన సూచితాం హరికథారతిం స్తౌతి – జ్ఞానమితి. యతః యాసు మనఃప్రసాదహేతుః గుణేషు విషయేష్వసంగః వైరాగ్యం చ. ఉభయత్రేతి పాఠే. ఇహాముత్ర చ గుణేష్వసంగః. కైవల్యమిత్యేవ సంమతః పంథాః యో భక్తియోగః నిర్వృత ఇతి వా. తాసు హరికథాసు కో వా రతిం న కుర్యాత్ (12)

**టీ** – 'భాగవతసంగతిచేత' అను మాటతో సూచింపబడిన హరికథా రతిని స్తుతించుచున్నాడు – "జ్ఞానం" అనునీ శ్లోకము చేత – యత్ – వేని యందు ఏ కథల యందు జ్ఞానము కలుగునో – ఎట్టి జ్ఞానము? ఆ – అన్నివైపులనుండియు ప్రతి నివృత్తం – ఉపరతమును– గుణోర్మిణాం – రాగాదుల యొక్క చక్రం – సమూహము అంతటను – ఉత– తరువాత – దాని కారణముగ ఆత్మానుగ్రహముకూడ – యత్ర – వేనియందు – మనస్సును ప్రసన్నము






చేయు కారణమగు – గుణేషు – విషయముల యందు – అసంగః – ఆసక్తిలేకుండుటయు – అనగా వైరాగ్యము కూడ – 'ఉభయత్ర' అను పాఠము నందు – ఇహాముత్రములయందును – గుణేష్వసంగః (ఇహాముత్రఫలములయందును విషయాసక్తిలేకుండుట)– కైవల్యమే సమ్మతమగు – పన్థాః – ఏ భక్తి యోగము కలదో – నిర్వృతః – శ్రవణసుఖము చేత – ఇతర విధముగ 'అనిర్వృతః' అనియో – తాసు – హరికథల యందు – కోరతిం న కుర్యాత్ – ఎవరు ఆసక్తి కలిగి యుండరు? (కో౽ నిర్వృతః అను పాఠము కూడ ఇట వివక్షింపబడినది) (12)

## శౌనక ఉవాచ

ఇత్యభివ్యాహృతం రాజా
నిశమ్య భరతర్షభః ।
కిమన్యత్పృష్టవాన్భూయో
వైయాసకిమృషింకవిమ్ ॥ - 13

## శౌనకుడిట్లనెను

**తా –** శుకమహర్షిచేత ఇట్లు చెప్పబడినదంతయువిని భరతవంశపు రాజగు పరీక్షిత్తు, మఱల శుక మహర్షిని ఏ విషయమును గూర్చి అడిగెను?

**టీ :-** ఇతీతి. అభివ్యాహృతం ఉక్తం ఋషిం పరబ్రహ్మదర్శినం కవిం శబ్దబ్రహ్మనిష్ణాతం. (13)

**టీ –** అభివ్యాహృతం – చెప్పఁబడినది – ఋషిం – బ్రహ్మదర్శిని – కవిం – శబ్ద బ్రహ్మయందు నిష్ణాతుడైన వానిని – (13)

ఏతచ్ఛుశ్రూషతాం విద్వన్
సూతనో౽ ర్హసి భాషితుమ్ ।
కథా హరికథో దర్కాః
సతాంస్యుః సదసి ధ్రువమ్ ॥ - 14

**తా –** విద్వాంసుడవగు ఓ సూత మహర్షీ! సత్పురుషుల సభయందు నిశ్చయముగ హరికథయే ఉత్తర ఫలముగాగల కథలుండుననునది, వినువారికి మీరు చెప్పవలసిన పనిలేదు.




**టీ** :- ఏతదితి. శ్రవణేచ్ఛాయాం హేతుః – హరికథాఏవ ఉదర్కః ఉత్తరఫలం యాసు తాః కథాః సతాం భాగవతానాం సంసది సభాయాం స్యుః. (14)

సవై భాగవతో రాజా
పాండవేయో మహారథః।
బాల క్రీడనకైః క్రీడన్
కృష్ణ క్రీడాం య ఆదదే.॥ - 15

**టీ** :- ఏతత్ప్రపంచయతి – ద్వాభ్యాం. సఇతి. కృష్ణపూజాది రూపాం క్రీడాం యః స్వీకృతవాన్. (15)

వైయాసకిశ్చ భగవాన్
వాసుదేవ పరాయణః।
ఉరుగాయ గుణోదారాః
సతాం స్యుర్హి సమాగమే ॥ - 16

**టీ** :- వైయాసకిరితి. ఉరుగాయస్య భగవతః గుణైరుదారాః మహత్యః కథాః స్యుః. (16)

ఆయుర్హరతి వై పుంసా
ముద్యన్నస్తం చ యన్నసౌ।
తస్యర్తే యత్ క్షణోనీత
ఉత్తమ శ్లోక వార్తయా ॥ - 17

**టీ** – విన నిచ్ఛయించు కారణము – హరికథో దర్కః – హరికథయే ఉత్తర ఫలముగ వేని యందు ఉండునో అట్టి కథలు – సతాం – భగవద్భక్తుల యొక్క సదసి – సభ యందు – స్యుః – (ప్రవర్తించును) (14)

**తా** – బాల్యావస్థలో ఆట వస్తువులతో ఆడుకొనుచును కృష్ణ పూజాదిరూప క్రీడలనే స్వీకరించిన పాండవేయుడగు పరీక్షిత్తు మహారథుడైన రాజు అయ్యును పరమ భక్తుడు.

**టీ** – 'సవై' అను మొదలగు రెండు శ్లోకములతో ఈ విషయము చెప్పుచున్నాడు– కృష్ణ పూజాది రూపమైన క్రీడను ఎవ్వాడు స్వీకరించుచుండెనో (అట్టి పరీక్షిత్తు భక్తుడు–అని) (15)

**తా** – వ్యాసభగవానుని కుమారుడైన శ్రీశుక మహర్షి కూడ కృష్ణ భక్తి పరాయణుడు, సత్పురుషుల కలయిక కలిగినప్పుడు వేదవేత్తలచేత కీర్తింపబడు భగవద్గుణముల కథల చేత ఆ సభ ప్రవర్తించుచుండును.

**టీ** – ఉరుగాయస్య గుణైరుదారా మహత్యః కథాః స్యుః – వేదవేత్తల చేత కీర్తింపబడు భగవద్గుణముల చేత – ఉదారాః – గొప్పవైన కథలు ప్రవర్తించును.(16)

**తా** – ఉత్తమ శ్లోకుడైన నారాయణుని కథాలాపములతో గడుపబడువాని క్షణము తప్ప తక్కిన మనుష్యుల ఆయువును ఈ సూర్యుడు ఉదయించుచు, అస్తమించుచును హరించివేయును.

**టీ**:- కిం చ వృథైవ క్షీయమాణమాయుః హరికథయామేవ సఫలం కుర్విత్యాశయేనాహ – త్రిభిః. ఆయురితి. అసౌ సూర్యః ఉద్యన్ ఉద్గచ్ఛన్ యత్ క్షణో నీతః తస్య ఆయుః ఋతే వర్జయిత్వా. వృథైవ హరతి. (17)

**టీ** – అదియునుగాక వ్యర్థముగ తఱిగిపోవుచుండు ఆయువును హరికథా ప్రవచన శ్రవణముల చేత సఫలము చేసికొనవలయునను ఆశయముతో చెప్పుచున్నాడు – మూడు శ్లోకములతో – 'ఆయుః' అనెడి ఈ శ్లోకముతో కలిపి మూడు శ్లోకములతో ఆ విషయమునే చెప్పుచున్నాడు. అసౌ – సూర్యుడు – ఉద్యన్ – ఉదయించుచు, అస్తం – అదృశ్యమగుచు (అస్తమించుచు) యత్ – ఎవని చేత క్షణము గడుపబడునో– తస్య ఆయుః – అతని ఆయువు – ఋతే – తప్ప (విడిచి) వృథైవ హరతి – వ్యర్థముగనే హరించివేయును.(17)

తరవః కిం నజీవంతి
భస్త్రాఃకిం నశ్వసంత్యుత ।
నఖాదంతి నమేహంతి
కిం గ్రామ పశవో ఽ పరే ॥ - 18

**తా** – చెట్లు జీవించుటలేదా? మరియు తోలుతిత్తులు శ్వసించుటలేదా? ఇతరములైన (నరాకార) పశువులు తినుటలేదా? మైథునము చేయుట లేదా?

**టీ** :- నను జీవనమేవ తేషామాయుషః ఫలమస్తి తత్రాహ – తరవ ఇతి. నను తేషాం శ్వాసో నాస్తి తత్రాహ – తర్హి భస్త్రాశ్చర్మకోశాః. నను తాసామాహారాదికం నాస్తి, తత్రాహ – న ఖాదంతి నాశ్నంతి. న మేహంతి రేతస్సేకం మైథునం న కుర్వంతి కిం? తమపి నరాకారం పశుం మత్వాహ – తదేవాహ – అపర ఇతి. (18)

**టీ** – 'తరవః' అను శ్లోకముతో 'జీవించుటయే వారి ఆయువునకు ఫలమని యిట చెప్పుచున్నాడు. నిశ్చయముగ వానికి శ్వసించుటలేదు. అయినను భస్త్రాః – చర్మకోశములు (తిత్తులు) (గాలిని పీల్చుట వదలుట చేయుచున్నవి) – వానికి ఆహారము మొదలగునవి లేవు – వానిని గూర్చియు చెప్పుచున్నాడు – తినుట లేదు, శ్వసించుటలేదు. మైధునక్రియ చేయుటలేదా? ఇంకను – నరాకార పశువులను కూడ భావించి 'అపరే' – ఇతర పశువులు అనుమాటతో చెప్పుచున్నాడు.(18)

శ్వవిడ్వరాహోష్ట్రఖరైః
సంస్తుతః పురుషః పశుః ।
న యత్కర్ణ పథోపేతో
జాతునామ గదాగ్రజః ॥ - 19

**తా** - ఎవని శ్రవణ మార్గమున, ఎప్పుడైనను శ్రీకృష్ణుడు ప్రవేశించి యుండడో అట్టివాడు, కుక్క, ఊరపంది, ఒంటె, గాడిదలతో సమానముగ చెప్పుకొనదగిన మనుష్య రూపమున నున్న పశువు.

**టీ** :- శ్వేతి. శ్వాదిభిః సంస్తుతః పురుషో నిరూపితః యస్య కర్ణపథం కదాచిదపి న గతం సః అవజ్ఞానస్పదత్వాత్, శ్వభిః కశ్మలవిషయాసక్తత్వాత్. విడ్వరాహైః గ్రామసూకరైః కంకటవద్దుఖవిషయత్వాత్. ఉష్ట్రైః భారవాహిత్వాత్ కాముకత్వాత్ పదాఘ్నంతీమపి ప్రియాం త్యక్తుమసమర్థత్వాచ్చ ఖరైస్తుల్య ఇత్యర్థః (19)

**టీ**- అదియే చెప్పుచున్నాడు - శ్వాదిభిః సంస్తుతః - కుక్కలు మొదలగు వానితో సమానుడని నిరూపింపబడియున్నాడు. ఎవని కర్ణపథము (శ్రవణ మార్గము) ఎప్పుడును - (గదాగ్రజః - శ్రీకృష్ణుడు) నాగతః - రాలేదో - అట్టివాడు అవమానాస్పదములైన కుక్కలచేతను, కశ్మల వస్తువులను ఇష్టపడు విట్ + వరాహైః - గ్రామసూకరముల చేతను, కంటక ప్రాయమైన దుఃఖమును కలిగించు విషయములందాసక్తిగల ఒంటెలతోను, బరువును మోయుచుండుట చేత గాడిదలతోను సమానమైన వాడు అని యర్థము.(19)

బిలే బతోరుక్రమ విక్రమాన్ యే
నశృణ్వతః కర్ణపుటే నరస్య ।
జిహ్వాసతీ దార్దురికేవ సూత
నచోపగాయత్యురుగాయ గాథాః ॥ - 20

**తా** - ఓ సూత మహర్షీ ! శ్రీకృష్ణుని లీలా విశేషములను ఏ మనుష్యుడు వినజాలడో అట్టివాని చెవులు, రంధ్రమాత్రములే సుమా! అయ్యయ్యో ! శ్రీకృష్ణుని గాథలు గానము చేయజాలని వాని నాలుక - అది ఉండియును కప్ప నాలుకయే.

**టీ** :- తస్యాంగాని నిష్ఫలానిత్యాహ - పంచభిః, బిలేతి. బతేతి ఖేదే. న శృణ్వతః అశృణ్వతః. నరస్య యే కర్ణపుటే బిలే వృథా రంధ్రే సర్పాదిప్రవేశార్హరంధ్రే వా న చోపగాయతి తస్య జిహ్వా అసతీ దుష్టా. దుర్దురోభేకః. తదీయా జిహ్వేవ వ్యర్థశబ్దైవ. (20)

**టీ** - 'బిలే' అను ఈ శ్లోకముతో కలిపి ఐదు శ్లోకములచే వాని అంగములు కూడ నిష్ఫలములైనవని చెప్పుచున్నాడు - 'బత!' అను పదము ఖేదమును తెలుపును - నశృణ్వతః - వినజాలని వాని యొక్క - నరస్య యే కర్ణపుటే - మనుష్యుని ఏ రెండు చెవులు గలవో- తా - అవి, బిలే - వ్యర్థమైన రంధ్రములు - నచేదుప గాయతి - కీర్తింపజాలనివాని - తస్యజిహ్వాఅసతీ- అతని నాలుక దుష్టమైనది. దర్దురః - కప్ప - తదీయా జిహ్వేవ - దాని నాలుక వంటిదే (బెక బెక లాడుటకు తప్ప పనికి రానిది) (20)

భారః పరం పట్ట కిరీట జుష్ట
మప్యుత్తమాంగం న నమేన్ముకుందమ్ ।
శావౌ కరౌనో కురతః సపర్యా
హరేర్లసత్కాంచన కంకణౌవా ॥ - 21

**టీ :-** భారఇతి పట్టవస్త్రేణోష్ణీషేణ పట్టేన అభిషేకకాలే శిరసి నిక్షిప్తేన రాజ్యాధికార సూచకేన వస్త్రేణ కిరీటేన వాజుష్టమపి శిరోయది ననమే తర్హి కేవలం భారఏవ. శవో మృతకః తత్తుల్యౌ. లసంతి కాంచనకంకణాని యయో స్తౌ. అప్యర్థే వా శబ్దః. (21)

**తా –** పట్టు వస్త్రముతో చేయబడిన తలపాగతోడి కిరీటము ధరింపబడినను ఎవని తల ముకుందునికి నమస్కరింపదో అది కేవలము బరువు మాత్రమే యగును. అట్లే మెరయుచున్న బంగారపు కంకణములు ధరించియున్నవైనను భగవానుని సేవ (పూజ) చేయజాలని చేతులు, పీనుగు చేతులే యగును.

**టీ –** పట్టు వస్త్రముతో సిద్ధపరుపబడిన తలపాగాతో చుట్టబడియున్నను ఉత్తమాంగం – శిరస్సు – యది న నమేత్ ముకుందం – ముకుందునకు నమస్కరింపనిదైన యెడల – కేవలం భార ఏవ – బరువు మాత్రమైనదే – శావౌ– శవసంబంధములు – అనగా మృతుని చేతులతో సమానము – లసతీకాంచన కంకణే యయౌస్తౌ – మెఱయుచున్న బంగారు కంకణములు వేనికి గలవో ఆ రెండు చేతులు – 'వా' అను శబ్దము 'కూడా' అనునర్థమున ప్రయుక్తము.(21)

బర్హాయితే తే నయనే నరాణాం
లింగాని విష్ణోర్న నిరీక్షతో యే ।
పాదౌ నృణాం తౌ ద్రుమ జన్మభాజౌ
క్షేత్రాణి నానువ్రజతో హరేర్యా ॥ - 22

**టీ:-** బర్హాయిత ఇతి. యే నయనే విష్ణోః శ్రీమూర్తిం అసాధారణాని శంఖచక్రాది చిహ్నితాని వా న నిరీక్షేతే, తే బర్హాయితే మయూరపింఛ నేత్ర తుల్యే. శిఖిపింఛవర్తి నేత్రస్య నేత్రాకారసద్భావే ఽ పి యథాదర్శనాయోగాదానర్థక్యమితి భావః ద్రుమవజ్జన్మ భజత ఇతి తథా వృక్షమూలతుల్యావిత్యర్థః. (22)

**తా –** విష్ణు భగవానుని మూర్తులను చూడలేని వారి కన్నులు, నెమిలి పింఛపు కన్నుల వంటివి. హరి క్షేత్రములను తిరగజాలని వారి పాదములు వృక్షమూలములతో సమానమైనవి.

**టీ –** యే నయేనే – ఏ కన్నులు – విష్ణోర్మూర్తీర్ననిరీక్షేతే – విష్ణుభగవానుని మూర్తులను చూడజాలవో – తౌ – అవి – బర్హాయితే – నెమిలి పింఛపు కన్నులతో సమానమైనవి – ద్రుమవజ్జన్మ భజత ఇతి ద్రుమ జన్మభాజౌ – చెట్టువలె జన్మనుభజించినవి. (వృక్షపాదముల వంటివి) (22)

 




జీవచ్ఛవో భాగవతాంఘ్రిరేణుం
న జాతు మర్త్యో ఽ భిలభేత యస్తు।
శ్రీవిష్ణు పద్యా మనుజస్తులస్యాః
శ్వసన్ శవో యస్తు నవేద గంధమ్ ॥ - 23

**తా –** శ్రీకృష్ణుని పాదధూళి రేణువును ఎప్పుడైనను పొందజాలని మనుష్యుడు బ్రతికి యుండియు శవము వంటి వాడు. శ్రీవిష్ణుని పాదములయందు చేరియున్న తులసీ దళము నాఘ్రాణించియు, దాని పరిమళమును తెలియజాలని మనుష్యుడు శవమే.

**టీ :-** జీవన్నితి. నాభిలభేత అభితో న స్పృశేత్ న ధారయేత్. శ్రీవిష్ణుపద్యాః విష్ణుపదలగ్నాయాః తులస్యాః గంధం నవేద అభిఘ్రాయ నాభినందతీత్యర్థః. (23)

**టీ –** నాభిలభేత – అభితః – దాపున – స్పృశింపనివాడు, ధరింపనివాడు – శ్రీవిష్ణు పద్యాః – శ్రీ విష్ణుని పాదములందు లగ్నమైయున్న – నవేద + ఇతి – ఆఘ్రాణించి, ఆనందింపడో అని యర్థము.(23)

తదశ్మసారం హృదయం బతేదం
యద్గృహ్యమాణైర్హరి నామధేయైః।
న విక్రియే తాథ యదా వికారో
నేత్రేజలం గాత్రరుహేషు హర్షః ॥ - 24

**తా –** అయ్యో ! హరినామములను వినునప్పుడు గాని, ఉచ్చరించునపుడు గాని ఎవని హృదయము వికారమునొందదో (చలింపదో), అటుల చలనము కలిగినప్పుడు, కన్నులలోనీరు, శరీరమునందలి రోమకూపములందు, సంతోషముతో పులకాంకురములు పుట్టవో అట్టి మనుష్యుని హృదయము లోహముకదా!

**టీ :-** తదితి. అశ్మవత్సారో బలం కాఠిన్యం యస్య విక్రియాలక్షణం. అథేతి. గాత్రరుహేషు రోమసు. హర్షః ఉద్గమః యస్మాదభక్తస్య సర్వమేతద్వ్యర్థం. (24)

**టీ –** ఇూయివలె బలము కాఠిన్యము గలది అశ్మసారము (ఇనుము) హృదయమునందలి చలనము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. 'అథ' శబ్దము నుండి – గాత్ర రుహేషు – రోమ (కూప) ములందు – హర్ష ఉద్గమః – సంతోషము ఉబుకుట.(24)

 






అథాభిధేహ్యంగ మనో ఽ ను కూలం
ప్రభాషసే భాగవత ప్రధానః ।
యదాహ వైయాసకిరాత్మవిద్యా
విశారదో నృపతిం సాధుపృష్టః ॥ - 25

**టీ** :- అథేతి. మనసో ఽ నుకూలం ప్రియం చ ప్రభాషసే. అథ అతస్సాధు పృష్టస్సన్ వైయాసకిః నృపతిం ప్రతి యదాహ తదభిధేహీతి. (25)

***ఇతి శ్రీమద్భాగవత మహాపురాణే ద్వితీయ స్కందే టీకాయాం తృతీయో ఽ ధ్యాయః***

**తా** – సూత మహర్షీ ! తమరు ఏది చెప్పినను హృదయంగమముగ చెప్పెదరు. పరీక్షిత్తు, భగవత్ప్రధానమైన ప్రశ్నను లెస్సగ అడిగినప్పుడు, ఆత్మవిద్యావిశారదుడైన శుక మహర్షి ఏమి వివరించెనో దానిని మాకు వినిపించుడు.

**టీ** – అభక్తునకిదియంతయు వ్యర్థమే యగుట వలన – (మేము భక్తులమగుట చేత మాకు వినిపింపుడు) మనోఽ ను కూలం – మనస్సున కనుకూలమగునట్లు – ప్రియమైన దానిని చెప్పుదురు. అథ అతః సాధు పృష్టం – ఇక అందువలన (పరీక్షిత్తుచే) లెస్సగా అడుగబడిన దానిని శుకుడు పరీక్షిత్తుకు చెప్పిన దానిని మాకు చెప్పుడు.(25)

**శ్రీ మద్భాగవతమహాపురాణము నందలి రెండవ స్కంధమున మూడవ అధ్యాయము సమాప్తము**











**అథ చతుర్థో உ ధ్యాయః**

**సూత ఉవాచ**

వైయాసకేరితి వచ
స్తత్త్వనిశ్చయమాత్మనః ।
ఉపధార్యమతింకృష్ణే
ఔత్తరేయః సతీం వ్యధాత్. ॥ - 1

**టీ** :- తుర్యే పరీక్షితా పృష్టం సృష్ట్యాది హరిచేష్టితమ్, శుకేనబ్రహ్మతత్పుత్ర సంవాదేనోపవర్ణ్యతే రాజ్ఞః ప్రశ్నం కథయితుం తస్య ప్రాక్తనీం స్థితిమాహ - వైయాసకేరితి. ఇత్యేవం భూతం ఆత్మనస్తత్త్వస్య నిశ్చయో యస్మాత్తద్వచః ఉపధార్య ఆకలయ్య. సతీం శ్రేష్ఠాం మతిం. కృష్ణ ఏవ సేవ్యో నాన్య ఇత్యేవంభూతాం. (1)

## నాలుగవ అధ్యాయము

**సూతమహర్షి యిట్లనెను.**

**తా -** ఆత్మ తత్త్వమును నిశ్చయించు శుకమహర్షి వాక్యమును పరీక్షిత్తు లెస్సగ ధారణచేసి తన బుద్ధిని అవ్యభిచారిణియైన పతివ్రతగా చేసి కృష్ణునకు సమర్పించెను.

**టీ -** సృష్టి ప్రారంభము నుండియు నారాయణుని చేష్టితమును, ఆత్మతత్త్వమును గూర్చి పరీక్షిత్తు అడుగగా శ్రీశుకుడు సమాధానమును బ్రహ్మ నారద సంవాద రూపమున వర్ణించును - రాజు అడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పుటకు "వైయాసకేః" (శుకుని యొక్క) అని మొదలిడి నాలుగు శ్లోకములలో పూర్వస్థితిని చెప్పుచున్నాడు. - 'ఇట్టిది ఆత్మతత్త్వము యొక్క నిశ్చయము' అని శుక మహర్షి చెప్పిన వాక్యమును - ఉపధార్య- ఆకళించుకొని - సతీం - కృష్ణుడే సేవింప దగిన వాడనియు, ఇతరుడు కాడనియు ఇట్టి అవ్యభిచారిణియైన బుద్ధిని (కృష్ణునకు సమర్పించెను).(1)

ఆత్మజాయాసుతాగార
పశుద్రవిణ బంధుషు ।
రాజ్యేచావికలే నిత్యం
విరూఢాం మమతాం జహౌ ॥ - 2

**టీ** :- ఆత్మేతి. ఆత్మా దేహః. పశవో గజాదయః. అవికలే వైరిభిరనుపద్రుతే. రాజ్యేచ. (2)

**తా -** దేహము, భార్య, పుత్రులు, గృహములు, పశువులు, ధన సంపదలు, బంధువులు, అవిచ్ఛిన్న రాజ్యము మున్నగు వాని యందు నిరంతరముగ రూఢమైయుండు మమత్వమును (నాది, నావి) అనుభావమును విడిచిపెట్టెను.

**టీ -** ఆత్మా - దేహము, పశవః - గజములు మొదలగునవి. (2)







పప్రచ్ఛ చేమమేవార్థమ్ ।
యన్మాం పృచ్ఛథ సత్తమాః ।
కృష్ణానుభావ శ్రవణే ।
శ్రద్దధానో మహామనాః ॥ - 3

**టీ** :- పప్రచ్ఛేతి. ఇమమేవార్థం హరిలీలా లక్షణం. (3)

**తా** - ఓ ఋషి పుంగవులారా ! శ్రీకృష్ణుని ప్రభావమును వినుటయందు మిక్కిలి శ్రద్ధగలవాడు, విశాలమైన మనస్సు గల వాడునగు పరీక్షిత్తు అడిగినదీ హరి లీలా విలాసమే. మీరు నన్నడిగినదీ ఈ అంశమే కదా !

**టీ** - ఇమమేవార్థం - హరిలీలా లక్షణము. (3)

సంస్థాం విజ్ఞాయ సంన్యస్య
కర్మ త్రైవర్గికం చ యత్ ।
వాసుదేవే భగవతి
ఆత్మభావం దృఢం గతః ॥ - 4

**టీ** :- సంస్థామితి. సంస్థాం మృత్యుం. త్రైవర్గికం ధర్మార్థకామ ప్రధానం. సన్న్యస్య త్యక్త్వా ఆత్మభావం పరం పరమప్రేమ్ణా భగవదాత్మకత్వం గతః ప్రాప్తస్సన్. పప్రచ్ఛ. (4)

**తా** - మృత్యువును తెలిసికొని, ధర్మ, అర్థ, కామములకు సంబంధించిన కర్మనువదలిపెట్టి, భగవంతుడైన వాసుదేవుని యందు ఆత్మభావమును దృఢముగ పొందిన వాడై అడిగెను.

**టీ** - సంస్థాం - మరణమును, త్రైవర్గికం - ధర్మార్థకామ ప్రధానమైన - కర్మ (కర్మలను) సంన్యస్య - విడచి, ఆత్మభావం - మిక్కిలి ప్రేమతో భగవంతుని ఆత్మత్త్వమును - గతసన్ - పొందినవాడై, పప్రచ్ఛ - అడిగెను.(4)

***రాజోవాచ -***

సమీచీనం వచో బ్రహ్మ
న్సర్వజ్ఞస్య తవానఘ !
తమో విశీర్యతే మహ్యం
హరేః కథయతః కథామ్ ॥ - 5

టీ :- సమీచీనమితి. మహ్యం మమ. తమః అజ్ఞానం. నశ్యతి తవ కథయతస్సతః అతస్సమీచీనం. (5)

***రాజు ఇట్లనెను***

**తా** - బ్రహ్మ స్వరూపుడవైన ఓ మునివరా! పాపరహితుడా! సర్వజ్ఞుడవైన నీ మాట సత్యమైనది. నీవు వాసుదేవుని కథను నాకు చెప్పుచుండగా నా అజ్ఞానము నశించుచున్నది.

**టీ** - మహ్యం - నా యొక్క (షష్ఠ్యర్థమున చతుర్థి) - తమః - అజ్ఞానము - విశీర్యతే - నశించుచున్నది - తవ కథయతః సతః - నీ కథనము సాగుచుండగా - అతః సమీచీనమ్ - అందువలన సమంజసమైనది.(5)

భూయ ఏవ వివిత్సామి
భగవానాత్మమాయయా ।
యథేదం సృజతే విశ్వం
దుర్విభావ్యమధీశ్వరైః ॥ - 6

**టీ** :- భూయఇతి. పునశ్చ వివిత్సామి వేదితుమిచ్ఛామి. ఇదం దుర్విభావ్యం అవితర్క్యం విశ్వం యథా సృజతే. (6)

**తా** – భగవన్ ! శుకదేవా! ఆత్మయొక్క మాయచేత, బ్రహ్మాది దేవతలకు కూడ ఊహకందని రీతిగ, ఈ విశ్వమెట్లు సృష్టింపబడినదో అను విషయమును గూర్చి ఇంకను వినగోరుచున్నాను. (తెలిసికొన గోరుచున్నాను)

**టీ** – పునశ్చ వేదితుమిచ్ఛామి – మఱల తెలసికొనగోరుచున్నాను – ఇదం – ఈ– దుర్విభావ్యం – తర్కించుటకు సాధ్యముకాని – విశ్వంయథా సృజతి – ఈ విశ్వమును పరమాత్ముడు ఎట్లు సృజించెనో (వివిత్సామి – తెలియగోరుచున్నాను) (6)

యథా గోపాయతి విభుర్యథా సంయచ్ఛతే పునః
యాం యాం శక్తి ముపాశ్రిత్య ।
పురు శక్తిః పరః పుమాన్
ఆత్మానం క్రీడయన్క్రీడన్ కరోతి వికరోతి చ । - 7

**టీ** :- యథేతి. గోపాయతి పాలయతి. సంయచ్ఛతే సంహరతి. పురుశక్తిః అనంతశక్తిమాన్. (7)

**తా** – ప్రభువగు భగవానుడు, మహాశక్తి యుక్తుడు, పరమపురుషుడు ఏయే శక్తులను వినియోగించుకొని ఈ విశ్వమునెట్లు పరిపాలించును? ఎట్లు సంహరించును? తాను క్రీడించుచు, బ్రహ్మాది దేవతలను క్రీడింపజేయుచు ఎట్లు సృష్టిచేయును? ఎట్లు వివిధములనుకల్పించుచుండును?

**టీ** – గోపాయతి –పాలించును – సంయచ్ఛతే – సంహరించును, పురుశక్తిః – బహుశక్తిమంతుడు – క్రీడన్ యథా కరోతి – లీలతో ఎట్లు చేయును. ఆత్మానం – బ్రహ్మాది రూపముగలవానిని – క్రీడయన్ – ఆడించుచు – వికరోతి – వివిధములగు వస్తు విశేషములను కల్పించును?(7)

నూనం భగవతో బ్రహ్మన్
హరేరద్భుత కర్మణః ।
దుర్విభావ్యమివాభాతి
కవిభిశ్చాపి చేష్టితమ్ ॥ - 8

**తా** – బ్రహ్మన్ ! అద్భుతమైన కర్మలు చేయగల భగవానుడగు విష్ణుని లీల జ్ఞానులగు విద్వాంసులకు కూడా అర్థము చేసికొనుటకు సాధ్యము కానట్లుగ రహస్యమై ప్రకాశించుచుండును. (ప్రతీతమగుచుండును)

**టీ** :- ఆత్మానమితి. క్రీడన్ యథా కరోతి. ఆత్మానం బ్రహ్మాదిరూపిణం క్రీడయన్ వికరోతి వివిధం కరోతి. 8

**టీ** - (స్పష్టము, కావున ఈ శ్లోకమునకు టీక వ్రాయబడలేదు) (8)

యథా గుణాంస్తు ప్రకృతే
ర్యుగపత్క్రమశో ఽపి వా।
బిభర్తి భూరి శస్త్వేకః
కుర్వన్కర్మాణి జన్మభిః ॥ -9

**తా** - పరమాత్ముడు ఒక్కడే పురుష రూపమున నొకే తడవ ప్రకృతి గుణముల నన్నింటిని భరించునా? లేక బ్రహ్మాద్యవతారములతో ఆయా సృష్ట్యాది కర్మలు చేయుచు క్రమముగ స్వీకరించునా? ఎట్లు?

**టీ** :- యథేతి. ఏకః పురుషరూపేణ యుగపజ్జన్మభిః బ్రహ్మాద్యవతారైః క్రమశోవా. యథా ప్రకృతేర్గుణాన్ గృహ్ణాతి.(9)

**టీ** - ఏకః పురుష రూపేణ యుగపత్ – ఒక్కడే పురుషాకృతితో ఒకేసారి – జన్మభిః – బ్రహ్మాద్యవతారములతో – క్రమశోవా– లేక ఒకదాని వెనుక ఒకటిగ యథా ప్రకృతేర్గుణాన్ గృహ్ణాతి – ప్రకృతి గుణముల నెట్లు స్వీకరించును?(9)

విచికిత్సితమేతన్మే
బ్రవీతు భగవాన్ యథా।
శాబ్దే బ్రహ్మణి నిష్ణాతః
పరస్మింశ్చ భవాన్ ఖలు ॥ - 10

**తా** - శుకమహర్షీ! నాకిది సందిగ్ధముగ నున్నది? అది యెట్లు జరుగునో తాము చెప్పుదురు గాక. ఏలయన తమరు శబ్దబ్రహ్మమునందును, అనుభవమునందును ఆరితేరిన వారు కదా!

**టీ** :- విచికిత్సితమితి. విచికిత్సితం సందిగ్ధం. శాబ్దే బ్రహ్మణి విచారేణ నిష్ణాతః నితరాం స్నాతః పరస్మిన్ననుభవేన. (10)

**టీ** - విచికిత్సితం – సందిగ్ధము – శబ్దే బ్రహ్మణి – విచారణ యందు – నిష్ణాతః – నిపుణుడవు, పరస్మిన్ + అనుభవము చేతను – బ్రహ్మానుభవముచేతను. (10)








**సూత ఉవాచ**

ఇత్యుపామంత్రితో రాజ్ఞా
గుణాను కథనే హరేః ।
హృషీకేశ మనుస్మృత్య
ప్రతివక్తుం ప్రచక్రమే ॥ - 11

**సూత మహర్షి యిట్లనెను.**

**తా -** శ్రీకృష్ణుని గుణాను కథనము చేయుటకై పరీక్షిత్తు చేత ఈ విధముగ ప్రార్థింపబడిన వాడై శుకమహర్షి ఆ వాసుదేవుని స్మరించి సమాధానము చెప్పుటకు ఉపక్రమించెను.

**టీ :-** ఇతీతి. రాజ్ఞా ఉపమంత్రితః ప్రార్థితః ప్రచక్రమే దేవతానమస్కారాదిరూపం ఉపక్రమం కృతవానిత్యర్థః. (11)

**టీ -** ఇతి రాజ్ఞా ఉపామంత్రితః - ఇట్లు రాజు చేత ప్రార్థింపబడినవాడై - ప్రచక్రమే - దేవతా నమస్కారాది రూపముగ ఉపక్రమించెనని యర్థము. (11)

***శ్రీశుక ఉవాచ***

నమః పరస్మై పురుషాయ భూయసే
సదుద్భవస్థాన నిరోధ లీలయా ।
గృహీత శక్తి త్రితయాయ దేహినా
మంతర్భవాయానుపలభ్య వర్త్మనే ॥ - 12

***శుకమహర్షి యిట్లనెను.***

**తా -** సర్వోత్తముడు, అపరిమితమైన మహిమగలవాడు, ప్రపంచము ఉద్భవించుటకు నిమిత్త మాత్రమైన లీలగలవాడు, బ్రహ్మాది రూపములతో సత్త్వాది గుణములను మూడింటిని స్వీకరించినవాడు, సకల భూతముల యందు అంతర్యామి రూపమున అంతర్భవించి యుండువాడును, అందువలన తెలిసికొనుటకు శక్యముకాని రూపము (మార్గము) గల వాడును అయిన పరమపురుషునకు నమస్కారము.

**టీ :-** తదేవాహ - త్రయోదశభిః. నమఇతి. పరస్మై సర్వోత్తమాయ. తత్రహేతుః - భూయసే అపరిమిత మహిమ్నే. తద్దర్శయతి - అసతః ప్రపంచస్య. ఉద్భవాదిషు నిమిత్తభూతయా లీలయా గృహీతం బ్రహ్మాదిరూపేణ రజ ఆదిశక్తి త్రితయం యేన తస్మై అంతర్భవాయ అంతర్యామిణే.

**టీ -** 'నమః' అను ఈ శ్లోకముతో కలిపి పదమూడు శ్లోకములచేత అదియే (పరీక్షిత్తు ప్రశ్నకు సమాధానము) చెప్పుచున్నాడు. పరస్మై - సర్వోత్తముడైన వాని కొఱకు - దానికి కారణము - భూయసే - పరిమితి లేని మహిమ గలవాని కొఱకు, దానిని చూపుచున్నాడు - సతః - ప్రపంచము యొక్క - ఉద్భవాదిషు - పుట్టుట, మొదలగువాని యందు - నిమిత్త భూతయా లీలయా - కారణభూతమగులీ×లతో గృహీతం రజ ఆది, శక్తి త్రితయం




అత ఏవ సర్వాంతర్గతత్వాదనుపలభ్యవర్త్మనే అనుపలభ్యం జ్ఞాతుమశక్యం. వర్త్మ స్వరూపం యస్య తస్మై. (12)

యేన–బ్రహ్మాది రూపముగ రజస్సు మొదలగు మూడు శక్తులను స్వీకరించిన వాని కొఱకు – అంతర్భవాయ – అంతర్యామి కొఱకు – అత ఏవ సర్వాంతర్గత త్వాదనుపలభ్య వర్త్మనే – అందు వలననే అన్నింటి యందు అంతర్గతుడై యుండుటచే – అనుపలభ్యం – తెలిసికొనుటకు అశక్యమైన – వర్త్మ – స్వరూపముతో నున్న వాని కొఱకు – (నమస్కారము) (సదుద్భవస్థాన నిరోధలీలయా' అనుసమాసమున గల సత్ అను శబ్దమునకు టీక యందు – 'అసతః – ప్రపంచస్య' అని వావిళ్ళ వారి ప్రతిలో నున్నది. సత్పదార్థమునకు ఉద్భవములేకున్నను అంతర్యామితయా ఉద్భవము భావింపబడుచున్నందున నాగరలిపి ప్రతి యందు గల – 'సతః – ప్రపంచస్య' అను విధమున గల టీకయు సమంజసమైనదే) (12)

భూయోనమః సద్వృజినచ్ఛిదే ఽ సతా
మసంభవాయాఖిల సత్త్వమూర్తయే ।
పుంసాం పునః పారమహంస్య ఆశ్రమే
వ్యవస్థితానామనుమృగ్య దాశుషే ॥ - 13

**తా –** ధర్మవర్తనులైన సత్పురుషుల దుఃఖములను నశింపజేయువాడును, అధర్మశీలురైన దుష్టులకు ఉత్పత్తి వినాశమును చేయువాడును, సమస్తములైన ఫలములను ఆయా దేవతా స్వరూపములతో ఇచ్చువాడును, ప్రత్యగాత్మనిష్ఠలో అంతర్ముఖులైయున్న పురుషులకు ఆత్మతత్త్వమును అందింపగలవాడును అయిన భగవానునకు మఱల మఱల నమస్కారము.

**టీ :-** విచిత్ర ఫలదాతృత్వమనుస్మరన్ ప్రణమతి – భూయ ఇతి. భూయః పునశ్చ నమః సతాం ధర్మవర్తినాం వృజినచ్ఛిదే దుఃఖహంత్రే. అసతాం అధర్మశీలానాం అసంభవాయ ఉత్పత్తివినాశకాయ. అఖిలసత్త్వమూర్తయే తత్తద్దేవతారూపేణ తత్తత్ఫలదాయిన ఇత్యర్థః. ససమగ్రసత్త్వమూర్తయ ఇతి వా. పునంతి పూర్వోక్తోభయవైలక్షణ్యమాహ– పారమహంస్యే ప్రత్యఙ్నిష్ఠారూపే ఆశ్రమే వ్యవస్థితానాం

**టీ –** 'భూయః' అను ఈ శ్లోకమున భగవానుని విచిత్ర ఫలదాతృత్వమును స్మరించుచు నమస్కరించుచున్నాడు. భూయః – మఱల – నమః – నమస్కారము. సతాం – ధర్మముతో వర్తించు సత్పురుషుల యొక్క – వృజినచ్ఛిదే – దుఃఖమును నశింపజేయువాని కొఱకు – అసతాం – అధర్మశీలురకు – అసంభవాయ – ఉత్పత్తి వినాశములను కలిగించువాని కొఱకు, అఖిల సత్త్వమూర్తయే – ఆయా దేవతల రూపముతో ఆయా ఫలములనిచ్చువాని కొఱకు – 'పునః' అని పూర్వము చెప్పబడిన రెండు విలక్షణత్వములను చెప్పుచున్నాడు –పారమహంస్యే – ప్రత్యగ్బ్రహ్మనిష్ఠారూపమైన – ఆశ్రమే – స్థితియందు – వ్యవస్థితానాం

పుంసామనుమృగ్యం అతన్నిరసేన పునఃపునర్మృగ్యం యదాత్మతత్త్వం తస్య దాశుషే దాత్రే. (13)

నమో నమస్తే ఽ స్త్వృషభాయ సాత్త్వతాం
విదూర కాష్ఠాయ ముహుః కుయోగినామ్ ।
నిరస్త సామ్యాతిశయేన రాధసా
స్వధామని బ్రహ్మణి రంస్యతే నమః ॥ -14

టీ :- నమ ఇతి సాత్వతాం భక్తానాం ఋషభాయ పాలకాయ. కుయోగినాం భక్తిహీనానాం విదూరాకాష్ఠా దిగపి యస్య. దుర్జ్ఞేయాయేత్యర్థః. తదేవం వైషమ్యప్రతీతావపి నిర్దోషత్వాదచింత్యైశ్వర్య మాహ - నిరస్తం సామ్యం అతిశయశ్చ యస్య యదపేక్షయా అన్యస్య సామ్యం అతిశయశ్చ నాస్తి తేన రాధసా ఐశ్వర్యేణ స్వధామని స్వరూపే బ్రహ్మణి రమమాణాయ. (14)

యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణం
యద్వందనం యచ్ఛ్రవణం యదర్హణమ్ ।
లోకస్య సద్యో విధునోతి కల్మషం
తస్మై సుభద్ర శ్రవసే నమో నమః ॥ - 15

పుంసాం - ఉండిన పురుషులకు - అనుమృగ్యం - ఆత్మేతర పదార్థమును నిరసించుచున్న ప్రయత్నముతో - పునర్పునర్మృగ్యం యదాత్మతత్త్వం - మఱల మఱల వెదుక దగిన ఏ ఆత్మతత్త్వము గలదో - తస్య - అట్టి దానిని - దాశుషే - ఇచ్చువాని కొఱకు. (13)

**తా.** భక్తులను పాలించువాడును, ఎప్పుడును అభక్తులకు తెలియరాని వాడును, ఏ అపేక్షతోనైనను ఇతరుని సామ్యమెంత మాత్రమును లేనివాడును, అందుచేత ప్రభుతచే స్వస్వరూపమునందు - అనగా బ్రహ్మము నందు రమించువాడునునైన పరమ పురుషునకు అనేకానేక నమస్కారములు.

**టీ** - సాత్త్వతాం - భక్తులకు, ఋషభాయ - పాలించువాని కొఱకు, కుయోగినాం - భక్తిహీనులకు, విదూరా కాష్ఠా - మిక్కిలి దూరమైన దిక్కుగలవాడు ఎవడో అట్టివానికి -తెలియరాని వాని కొఱకని యర్థము - ఈ విధముగ వైషమ్యప్రతీతి యందుకూడ నిర్దోషత్వము, చింతించుటకు సాధ్యముకాని ఐశ్వర్యమును చెప్పుచున్నాడు. నిరస్తం సామ్యమతిశయశ్చ యస్య యదపేక్షయా అన్యస్య - ఇతరునితో ఏ అంశమునందైనను ఎవనికి బొత్తిగా పోలిక లేదో - ఎంత మాత్రమును, ఎవని తోడను సామ్యములేని వాని - తేన రాధసా - అట్టి ప్రభుత్వము చేత - స్వధామని - స్వస్వరూపముతో బ్రహ్మమునందు రమించువాని కొఱకు (నమస్కారములు) (14)

**తా.** ఎవని కీర్తనము, స్మరణము, దర్శనము, వందనము, శ్రవణము, పూజనము మనుష్యుని పాపమును తక్షణమే నశింపజేయునో అట్టి మంగళకరమైన యశస్సు గల ఆ నారాయణునకు నమస్కారములు.

**టీ** :- సర్వసాధనేభ్యో భక్తేః శ్రైష్ఠ్యం అనుస్మరన్ ప్రణమతి – ద్వాభ్యాం. యదితి. అర్హణం పూజనం శ్రూయతే సర్వైరితి, శ్రుతః సుభద్రం సుమంగలం శ్రవో యశో తస్మై. (15)

**టీ** – అన్ని సాధనముల కన్నను 'భక్తి' యొక్క శ్రేష్ఠత్వమును స్మరించుచు నమస్కరించు చున్నాడు. – 'యత్' అను మొదలుగ రెండు శ్లోకములతో – అర్హణం – పూజించుట (శ్రూయతే సర్వైరితి శ్రుతః – అందఱిచే వినబడును కావున శ్రుతము) సుభద్రం సుమంగలం – మంగళప్రదమైన – శ్రవః – యశస్సు – యస్య – ఎవనికో – తస్మై – అతని కొఱకు (నమస్సు)(15)

విచక్షణా యచ్చరణోపసాధకా
త్సంగం వ్యుదస్యోభయతో ఉ ంతరాత్మనః ।
విదంతి హి బ్రహ్మగతిం గతక్లమా
స్తస్మై సుభద్ర శ్రవసే నమోనమః ॥ - 16

**తా.** వివేకము గలవారు ఎవని పాదముల శరణాగతి వలన, ఇహపరముల యందలి సంగమము మనసా వదలిపెట్టి, ప్రయాసలేనివారై, బ్రహ్మపదమును పొందెదరో అట్టి మంగళమయమైన కీర్తిగల భగవానుని కొఱకు నమస్కారములు.

**టీ** :- విచక్షణాఇతి. విచక్షణాః వివేకినః యస్య చరణయోరుప సాధనాత్ ఉపసత్తేః భజనాదిత్యర్థః. అంతరాత్మనః మనసః ఉభయత్ర ఇహ చ పరత్ర చ సంగం వ్యుదస్య నిరస్య గతక్లమాః ప్రయాసరహితాః. (16)

**టీ** – విచక్షణాః – వివేకము గలవారు – యస్య – ఎవని యొక్క – చరణయోః – పాద ద్వంద్వమును – ఉపసాదనాత్ –శరణాగతి నొందుట వలన – భజనము చేత అతరాత్మనః – మనస్సు యొక్క – ఉభయత్ర – ఇహపరములందు – సంగం – ఆసక్తిని – వ్యుదస్య – నిరసించి – గతక్లమాః – ప్రయాసలేని వారై – (బ్రహ్మగతినందుదురు) (16)

తపస్వినో దానపరా యశస్వినో
మనస్వినో మంత్రవిదః సుమంగలాః ।
క్షేమం న విందంతి వినా యదర్పణం
తస్మై సుభద్ర శ్రవసే నమో నమః ॥ - 17

**తా.** తపస్వులు, దానపరాయణులు, కీర్తిమంతులు, యోగులు, సదాచార సంపన్నులు, మంత్రవేత్తలు, తమ తమ తపశ్శక్త్యాదులను భగవానునకర్పణ చేయనిదే క్షేమమును పొందరో అట్టి మంగళకరమైన కీర్తిగల భగవానునకు నమస్కారములు.

**టీ** :- భక్తిశూన్యానాం సర్వసాధనవైఫల్యం దర్శయన్నమస్యతి – తపస్విన ఇతి. మనస్వినః యోగినః. సుమంగలాః సదాచారాః యస్మిన్. తప ఆద్యర్పణం వినా. సుభద్రశ్రవస ఇత్యస్యావృత్తిః యశశ్శ్రవణాదేః ప్రాధాన్యజ్ఞాపనాయ. (17)

**టీ** – భక్తిలేని వారలకు అన్నివిధముల సాధనలు నిష్ఫలములని చూపుచు నమస్కరించుచున్నాడు. 'తపస్వినః' అను ఈ శ్లోకముతో – మనస్వినః – యోగులు – సుమంగలాః – సదాచారులు – యస్మిన్ – ఎవని యందు – తప ఆద్యర్పణం వినా – తపస్సు మొదలగు వానిని సమర్పించకుండ, సుభద్రశ్రవసే అను దాని ఆవృత్తి, యశశ్శ్రవణాదుల ప్రాధాన్యమును జ్ఞాపకము చేయుట కొఱకు.(17)

కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
ఆభీరకంకా యవనాః కషాదయః ।
యేఽ న్యేచ పాపా యదుపాశ్రయాశ్రయాః
శుద్ధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః ॥ - 18

**తా.** కిరాతులు, హూణులు, ఆంధ్రులు, పుళిందులు, పుల్కసులు, ఆభీరులు, కంకులు, యవనులు, కషాదులు (ఖసాదులు) ఇంకను ఇతర పాపజాతి వారలు, ఎవని నాశ్రయించి పరిశుద్ధులగుదురో అట్టి ప్రభవనశీలుడైన భగవానునకు నమస్కారములు.

**టీ** :- భక్తేః పరమశుద్ధిహేతుత్వం దర్శయన్నాహ –కిరాతేతి. కిరాతాదయో యే పాపజాతయః, అన్యే చ యే కర్మభిః పాపరూపాః యదుపాశ్రయాః భాగవతాః. తదాశ్రయాస్సంతః శుధ్యంతి. అసంభావనాశంకాం పరిహరతి – ప్రభవిష్ణవే ప్రభవితుం శీలం యస్యేతి. (18)

**టీ** – భక్తియొక్క పరమశుద్ధి కారణత్వమును చూపుచు చెప్పుచున్నాడు. కిరాతులు మొదలగు ఏ పాప జాతుల వారుకలరో ఇతర పాప జాతుల వారును – కర్మ చేత కూడ ఎవరు పాపరూపులో – యదుపాశ్రయాః – భాగవతులు – వారిని ఆశ్రయించినవారు కాగా శుద్ధులగుదురు, అసంభావ్య శంకను పరిహరించుచున్నాడు – ప్రభవిష్ణవే – ప్రభవన శీలునకు అని (అట్టివానికి నమస్కారము) (18)

స ఏష ఆత్మాత్మవతామధీశ్వర
స్త్రయీమయో ధర్మమయస్తపోమయః ।
గతవ్యళీకై రజ శంకరాదిభి
ర్వితర్క్య లింగో భగవాన్ప్రసీదతామ్. ॥ - 19

**తా.** అతడు ధీరులకు ఉపాస్యుడైన ఆత్మ, వేదమయుడు – ధర్మమయుడు, తపోమయుడు నిష్కపటులైన బ్రహ్మరుద్రాది దేవతలచేత మిక్కిలిగ ఆలోచింపదగిన (మూర్తిత్వము) చిహ్నాములు గలవాడు. అట్టి భగవానుడు ప్రసన్నుడగుగాక.

**టీ** :- సర్వోపాస్యత్వమనుస్మరన్ ప్రార్థయతే – స ఇతి. స ఏష ఆత్మవతాం ధీరాణాం. ఆత్మా ఆత్మత్వేనోపాస్య ఇత్యర్థః. త్రయీమయత్వాది విశేషణైః తత్తన్మార్గేణోపాస్యత్వం వివక్షితం. గతవ్యలీకైర్నిష్కపటైర్భక్తైః వితర్క్యం అత్యాశ్చర్యేణ వివక్షణీయం లింగం మూర్తిర్యస్య సః ప్రసీదతు. (19)

**టీ** – అందటి చేతను ఉపాసింపదగిన భగవానుని లక్షణమును స్మరించుచు ప్రార్థించుచున్నాడు. సః ఏషః – ఆ ఇతడు – ఆత్మవతాం – ధీరులకు – ఆత్మా – (ఉపాసింపదగిన ఆత్మపదార్థము) ఆత్మ రూపముగా ఉపాసింపదగినవాడని యర్థము. త్రయీమయత్వము మొదలగు విశేషణములచేత ఆయా మార్గములచేత ఉపాస్యత్వము చెప్పబడినది. గతవ్యలీకైః – నిష్కపటులైన భక్తుల చేత – వితర్క్యం – మిక్కిలి ఆశ్చర్యముతో చూడదగిన – లింగం – మూర్తి యెవనికి గలదో అట్టి భగవానుడు ప్రసన్నుడగుగాక.(19)

శ్రియః పతిర్యజ్ఞపతిః ప్రజాపతి
ర్ధియాం పతిర్లోక పతిర్ధరాపతిః ।
పతిర్గతిశ్చాంధక వృష్ణి సాత్త్వతాం
ప్రసీదతాం మే భగవాన్సతాం పతిః ॥ - 20

**తా.** సకల సంపదలకు స్వామియు (లక్ష్మీదేవికి భర్తయు) యజ్ఞములన్నిటికిని భోక్తయును, ఫలప్రదాతయును, సమస్త ప్రాణుల బుద్ధులకు నియామకుడును, పదునాల్గు లోకములకు అధిపతియు, భూమికి భర్తయును, సర్వరక్షకుడును, అంధక, వృష్ణి, యదువంశీయులందఱకును పాలకుడును, సత్పురుషులకు రక్షకుడును అయిన భగవానుడు నాకు ప్రసన్నుడగుగాక.

**టీ** :- సర్వపాలక త్వమనుస్మరన్నాహ – శ్రియఃపతిరితి. గతిశ్చ సర్వాపత్సు రక్షకః. (20)

**టీ** – భగవానుని సర్వపాలకత్వమును స్మరించుచు 'శ్రియః పతిః' మున్నగు విధముగ వివరించుచున్నాడు – గతిః + చ – ఆపదలన్నింటి యందు రక్షకుడు –(20)

యదంఘ్ర్యభిధ్యాన సమాధి ధౌతయా
ధియాను పశ్యంతి హి తత్త్వమాత్మనః ।
వదంతి చైతత్ కవయో యథారుచం
స మే ముకుందో భగవాన్ ప్రసీదతామ్. ॥ - 21

**తా.** ఎవని పాదముల అభిధ్యానమనెడు సమాధితో పరిశుద్ధము కావింపబడిన బుద్ధితో, విద్వాంసులు ఆత్మతత్త్వమును వీక్షింతురో – ఆ వీక్షించిన ఆత్మతత్త్వమునే వారు తమ అభిరుచిననుసరించి – లేక ప్రతిభననుసరించి ఇతరులకు చెప్పెదరో అట్టి భగవానుడైన ముకుందుడు నా యెడ ప్రసన్నుడగుగాక.

టీ :- జ్ఞానప్రదత్వమనుస్మరన్నాహ - ద్వాభ్యాం. యదితి. యస్యాంఘ్ర్యోరభిధ్యానమేవ సమాధిః తేన ధౌతయా శోధితయా యథారుచం రుచ్యనుసారేణ సగుణనిర్గుణభేదైః. యద్వా - రుక్ప్రతిభా యథామతీత్యర్థః. (21)

టీ. భగవానుని జ్ఞానప్రదత్వమును స్మరించుచు - 'యదంఘ్రి' యను ఈ శ్లోకముతో రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు - యస్యాంఘ్రియోరనుధ్యానమేవ సమాధిః - ఎవని పాద ద్వంద్వమును ధ్యానించుటయే సమాధియో - దానితో - ధౌతయా - శుద్ధిచేయబడిన - (ధియా - బుద్ధితో) - యథారుచం - రుచిననుసరించి - సగుణ - నిర్గుణాది భేదములతో - లేక రుక్ - ప్రతిభ, వారిబుద్ధిననుసరించి యని అర్థము.(21)

ప్రచోదితాయేన పురా సరస్వతీ
వితన్వతా ఽ జస్య సతీం స్మృతిం హృది ।
స్వలక్షణా ప్రాదురభూత్కిలాస్యతః
స మే ఋషీణామృషభః ప్రసీదతామ్. ॥ - 22

తా. పూర్వకాలమున (కల్పాదియందు) బ్రహ్మదేవుని హృదయమునందు, పూర్వసృష్టిననుసరించిన స్వచ్ఛమైన స్మృతి, ఎవనిచే సంపాదింపబడినదో, అట్టి సరస్వతి ఎవనిచే ప్రేరేపింపబడి బ్రహ్మదేవుని ముఖము నుండి, తన లక్షణములతో ప్రకటమైనదో అట్టి సాధు రక్షకుడగు వాసుదేవుడు నాకు ప్రసన్నుడగుగాక.

**టీ** :- ప్రచోదితేతి. కించ పురా కల్పాదౌ అజస్య హృది సృష్టివిషయాం స్మృతిం వితన్వతా యేన ప్రచోదితా సరస్వతీ. ముఖతః కిల ప్రాదుర్భూతా. స్వాని లక్షణాని శిక్షాద్యుక్తాని యస్యాస్సా. ఋషీణాం జ్ఞానప్రదానాం ఋషభః శ్రేష్ఠః. (22)

**టీ** - అదియుగాక - పురా - కల్పాదియందు అజస్యహృది - బ్రహ్మదేవుని హృదయమందు - సతీం - సృష్టివిషయమైన - స్మృతిం - జ్ఞాపకమును - వితన్వతాయేన- ఎవనిచే విస్తరింపబడుచు - ప్రచోదితాసతీ - ప్రేరేపింబడిన దగుచు - సరస్వతీ - (జ్ఞానదేవత) వాగ్దేవీ తస్య ముఖతః - అతని ముఖము నుండి - కిల ప్రాదుర్భూతా - అవతరించినదట - స్వాని లక్షణాని శిక్షాద్యుక్తాని యస్యాఃసా - శిక్ష మొదలగు శాస్త్రములతో కూడిన తన లక్షణములెవతెకు గలవో అట్టిది - ఋషీణాం - జ్ఞానప్రదులలో - ఋషభః - శ్రేష్ఠుడు.(22)

భూతైర్మహద్భిర్య ఇమాః పురో విభు
ర్నిర్మాయ శేతే యదమూషు పురుషః ।
భుంక్తే గుణాన్ షోడశ షోడశాత్మకః
సో ఽ లంకృషీష్ట భగవాన్వచాంసిమే ॥ - 23

తా. ఎవడు మహత్తు మొదలగు భూతములతో ఈ శరీరములను నిర్మించి, వానిలో అంతర్యామి రూపమున వసించుచుండునో, ఎవడు పదునొకండు ఇంద్రియములు పంచభూతములు అను పదనాఱు గుణములను పదునాఱు కళలను ప్రకాశింపజేయునో అట్టి భగవానుడు నా వాక్కులను అలంకరించునుగాక.

**టీ** :- ఇదానీం స్వవాచాం శ్రోతృజనాహ్లాదినీం శృంగార కరుణాది శోభాం ప్రార్థయతే – భూతైరితి. స మే వచాంసి అలంకృషీష్ట అలంకరోతు. అన్యస్య వచసామన్యేనాలంకారా సంభవమాశంక్య తస్యాంతర్యామితామావిష్కరోతి – యో మహద్భిః భూతైరిమాః పురః శరీరాణి సృష్ట్వా అమూషు పూర్షు అంతర్యామితయా శేతే వసతి. అత్ర పురుషసమాఖ్యాం ప్రమాణయతి – యత్ యస్మాత్పూరుష ఇతి. అత ఏవ యః ఏకాదశేంద్రియ పంచతన్మాత్రరూపాన్ షోడశగుణాన్ కలాః భుజ్తే క్ష. ప్రకాశయతి పాలయతీతి వా. భుఙ్క్తే క ఇత్యాత్మనే పదమార్షం. తత్ర హేతుః – యః షోడశానామాత్మా చేతయితా తత్స్వామీతి యావత్. స్వార్థే కః. న త్వత్ర జీవత్వముచ్యతే. ప్రార్థనా విరోధాత్. (23)

**టీ** – ఇప్పుడు తన వాక్కును, వినువారి మనస్సులకు ఆహ్లాదపరచునట్లుగ, శృంగార కరుణాది శోభనిమ్మని ప్రార్థించుచున్నాడు 'భూతైః' అను ఈ శ్లోకము ద్వారా – స మే వచాంస్యలం కృషీష్ట – అతడు నా మాటలను అలంకరించును గాక – ఇతరునకు వాక్కులను అలంకరించుట సంభవము కాదను విషయమును శంకించి అతని (భగవానుని) అంతర్యామిత్వమును ఆవిష్కరించుచున్నాడు. ఎవడు మహత్తు మొదలగు భూతములతో – ఇమాః పురః – ఈ శరీరములను – నిర్మాయ – సృష్టించి – ఈ శరీరముల యందు అంతర్యామి రూపమున – శేతే – వసించునో – ఇచట 'పురుష' అను పేరును ప్రమాణీకరించుచున్నాడు. 'యదమూషు పురుషః' అని – అందువలననే ఎవ్వాడు పదునొకండింద్రియములు, పంచభూతములను – అనగా పదునాఱు గుణములను వాని కళలను – భుంక్తే – ప్రకాశింపజేయును – లేక పాలించునో – ఇట కారణము – పదునాఱింటిచే ఆత్మా – చేతనము నిచ్చువాడై – స్వార్థము నందు 'కః' (ఆత్మకః) ఇచట జీవత్వము చెప్పబడుట లేదు – ప్రార్థనకు విరోధమగుట వలన.(23)

నమస్తస్మై భగవతే
వ్యాసాయామిత తేజసే ।
పపుర్జ్ఞానమయం సౌమ్యా
యన్ముఖాంబురుహాసవమ్ ॥ - 24

**తా.** ఎవ్వాని ముఖ కమలము నుండి స్రవించిన జ్ఞాన పూర్ణమగు మకరందమును భక్తులు గ్రోలుచుందురో అట్టి గొప్పతేజస్వియైన వ్యాస భగవానునకు నమస్కారము.

**టీ** :- వ్యాసం నమస్కరోతి – నమ ఇతి. సౌమ్యాః భక్తాః. యస్య ముఖాంబుజే. అసవః మకరందః తం. (24)

**టీ** – శ్రీవ్యాసునికి నమస్కరించుచున్నాడు. 'నమః' అను ఈ శ్లోకముతో – సౌమ్యాః – భక్తులు – యస్యముఖాంబురుహే – ఎవని ముఖమనెడు పద్మము నందు – ఆసవః– తేనెగలదో – తం – వానిని గూర్చి (నమస్కారము) (24)






ఏతదేవాత్మభూ రాజ
న్నారదాయ విపృచ్ఛతే ।
వేదగర్భో ౽ భ్యధాత్సాక్షా
ద్యదాహ హరిరాత్మనః ॥ - 25

**తా.** రాజా ! వేదగర్భుడు, స్వయంభువు అయిన బ్రహ్మదేవుడు, నారదుడుగగా – సాక్షాత్తుగ హరి తనకు (బ్రహ్మకు) చెప్పిన ఈ విషయమునే చెప్పెను.

**టీ** :- ఇదానీం ప్రశ్నోత్తరతయా బ్రహ్మనారద సంవాదం స్తౌతి – ఏతదితి. ఉత్పత్తి సమయ ఏవ వేదాః గర్భే యస్య సః సాక్షాద్ధరిర్యదాహ. (25)

**టీ** – ఇప్పుడు 'ఏతత్' అను ఈ శ్లోకముతో ప్రశ్నోత్తర రూపమున జరిగిన బ్రహ్మనారద సంవాదమును స్తుతించుచున్నాడు – ఉత్పత్తి సమయఏవ వేదాగర్భే యస్య సః వేదగర్భః – పుట్టిన సమయముననే వేదములు ఎవని గర్భమునందుండెనో అతడు వేదగర్భుడు – సాక్షాద్ధరి రాహ – ప్రత్యక్షముగ నారాయణుడు చెప్పెను.(25)

**(ఇతి శ్రీమద్భాగవత మహాపురాణే ద్వితీయ స్కంధే టీకాయాం చతుర్థోఽ ధ్యాయః)**

**శ్రీ మద్భాగవతమహాపురాణము సందలి రెండవ స్కంధమున నాల్గవ అధ్యాయము సమాప్తము**








 ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. 

## పంచమో ఽ ధ్యాయః

**నారద ఉవాచ**

దేవ దేవ నమస్తేస్తు
భూతభావన పూర్వజ ।
తద్విజానీహి య జ్ఞాన
మాత్మతత్త్వ నిదర్శనమ్ ॥ -1

**టీ** :- పంచమే నారదేనాథ పృష్టః సృష్ట్యాది వక్త్యజః, హరేర్లీలాం విరాట్సృష్టిం కాలకర్మాది శక్తిభిః. నారదాయ పృచ్ఛతే వేదగర్భో ఽ భ్యధాదిత్యుక్తం. తత్ర నారదప్రశ్నమాహ – దేవదేవేతి. హే భూతభావన అత ఏవ సర్వేషాం పూర్వజ అనాదే. జ్ఞాయతే అనేనేతి జ్ఞానతత్సాధనం యత్ తద్విజానీహి విశేషేణ జ్ఞాపయేత్యర్థః. కథంభూతం ఆత్మతత్త్వం నితరాం దృశ్యతే యేన తత్. (1)

యద్రూపం యదధిష్ఠానం
యతః సృష్టమిదం ప్రభో !
యత్సంస్థం యత్పరం యచ్చ
తత్తత్త్వం వద తత్త్వతః ॥ - 2

## ఐదవ అధ్యాయము

**నారదుడిట్లనెను.**

**తా.** సకల ప్రాణుల పుట్టుకకు కారణమైన వాడా ! సృష్టికి ముందే జన్మించిన వాడా ! దేవతలందఱికిని దేవుడవైన వాడా! నీకు నమస్కారమగుగాక ! ఆత్మతత్త్వమును లెస్సగ దర్శింప జేయగల ఏ జ్ఞానము కలదో అట్టి దానిని నాకు తెలియఁజేయుము.

**టీ** – ఈ పంచమాధ్యాయము నందు నారదుడు బ్రహ్మదేవునడగగా, ఆతడు హరిలీలను, విరాట్ సృష్టిని, కాలము, కర్మ, శక్తి మున్నగు వానిచే ప్రాదుర్భవించిన సకల సృష్టి ప్రారంభ విశేషములను గూర్చి వివరించును. ప్రశ్నించిన నారదునకు వేదగర్భుడైన బ్రహ్మ చెప్పిన సమాధానమిట వివరింపబడినది. ఈ శ్లోకమున నారదుని ప్రశ్నను చెప్పుచున్నాడు – హే భూత భావన ! (ప్రాణుల ఉనికికి కారణమైన వాడా!) – అత ఏవ సర్వేషాం పూర్వజ – అందువలననే అందఱికన్న ముందు పుట్టినవాడా ! – జ్ఞాయతే ఽ నేనేతి జ్ఞానం – దీనిచే తెలియబడును గావున జ్ఞానము. తత్సాధనం – అట్టి జ్ఞానమును సాధించు దానిని – యత్ తత్ విజానీహి – ఏదియో దానిని విశేషముగ తెలుపుము అని యర్థము – కథం భూతమ్? – ఎట్టిది? – ఆత్మతత్త్వం నితరాందృశ్యతే యేనతత్ – దేనిచేత ఆత్మతత్త్వము చక్కగ కనబడునో దానిని. (1)

**తా.** ఈ ప్రపంచ లక్షణమేమి? దీని ఆధారమేది? ఎవరిచే సృష్టింపబడినది? ఎవరి యందు లీనమగును? ఎవరి ఆధీనమున నున్నది? వాస్తవమున ఇదియేమి? దీని తత్త్వమేమి? ప్రభూ! దీని యాథార్థ్యమును నాకు తెలియజెప్పుము.



**టీ** :- ఉపలక్షణభూత ప్రపంచజ్ఞానమేవాత్మజ్ఞాన సాధనం అతస్తద్విశేషం పృచ్ఛతి – యద్రూపమితి. యద్రూపం యేన రూప్యతే ప్రకాశ్యతే యదధిష్ఠానం యదాశ్రయం యతః యేన సృష్టం యత్సంస్థం యస్మిన్ లీయతే యత్పరం యదధీనం యచ్చ యదాత్మకం స్వతః కారణతోవేత్యర్థః. తస్య తత్త్వం యథార్థం తత్త్వతోపద. (2)

**టీ** – ఉపలక్షణభూతమైన విశ్వమే ఆత్మజ్ఞాన సాధనమగుటచేత దాని విశేషము నడుగుచున్నాడు. యద్భూతం – దేనిచే రూపింపబడును? ఎట్లు ప్రకటమగును? – యదధిష్ఠానం – దానికి ఏది ఆశ్రయము ? – యతః – ఎవనిచే సృష్టింపబడినది? యత్సంస్థం – దేనియందు (ఎవనియందు) లీనమగును? యత్పరం – ఎవని అధీనమున నున్నది. – యత్ (యధా) దేనితో నిబిడమైయున్నది? స్వతస్సిద్ధమా? లేక సత్పదార్థకారణముగనా? అని యర్థము –తస్య తత్త్వం – దానియాధార్థ్యమును – తత్త్వతః – దాని స్వభావ – లక్షణములతో సహా – వద –చెప్పుము(2).

సర్వం హ్యేతద్భవాన్వేద
భూత భవ్య భవత్ప్రభుః ।
కరామలకవద్విశ్వం
విజ్ఞానావసితం తవ ॥ - 3

**తా.** పుట్టినది, పుట్టబోవునది, పుట్టుచున్నదియునైన ఇది అంతయును తమకు తెలియును. ఈ విశ్వము అఱచేతిలోని ఉసిరికాయవలె తమకున్న విశిష్టమైన జ్ఞానము విశ్వసింపదగినది. ఈ విశ్వవస్తువులకు ప్రభువెవరో కూడ తెలియును.

**టీ** :- పరం న జానామీతి న వక్తవ్యమిత్యాహ – సర్వమితి. భూతం జాతం, భవ్యం జనిష్యమాణం, భవత్ జాయమానం, తేషాం ప్రభుర్యతః అతః విశిష్టేన జ్ఞానేనావసితం. (3)

**టీ** – నాకు తెలియదని చెప్పక దాటవేయవలదని చెప్పుచున్నాడు. 'సర్వం' అను ఈ శ్లోకముతో – భూతం – పుట్టినది – భవ్యం – పుట్టబోవునది భవత్ – పుట్టుచున్నది – తేషాం ప్రభుః – వానికి అధిపతి – యతః – ఏలనో– అతః విశిష్టేన జ్ఞానేన – అందువలన విలక్షణమైన జ్ఞానముతో – అవసితం – శ్వాసవలె వదలబడినది.(3)

యద్విజ్ఞానో యదాధారో
యత్పరస్త్వం యదాత్మకః ।
ఏకః సృజసి భూతాని
భూతైరేవాత్మమాయయా ॥ - 4

**తా.** మీకీ జ్ఞానమెటనుండి కలిగినది? మీకేది ఆధారము? మీ స్వామి యెవరు? మీ స్వరూపమేమి? తాము ఒక్కరే తమ మాయతో, పంచభూతములతో స్వతంత్రముగ ఈ ప్రాణులను (ప్రపంచమును) సృష్టింతురా?

**టీ** :- ఆస్తామిదం, ఆదౌ ఆవత్త్వామేవ కథయేత్యాహ - యద్విజ్ఞాన ఇతి. యతః విజ్ఞానం యస్య కస్తవ విజ్ఞానపద? ఇత్యర్థః. యదాధారః కస్తవ ఆశ్రయః? యత్పరః యదధీనః యదాత్మకః యత్స్వరూపః. మమ తు త్వమేవ స్వతంత్రః పరమేశ్వర ఇతి బుద్ధిః. తవ తపశ్చరణేన తు పరశంకయా పృచ్ఛామిత్యాహ - సార్ధైశ్చతుర్భిః ఏకః అసహాయః. (4)

**టీ** - ఆత్మ, విశ్వములను గూర్చిన మాట అటులుండెను గాక - మొదట అంతవఱకు నిన్ను గూర్చియే చెప్పుము. ('త్వామేవ' అనుమాటకు ఆత్మను గూర్చియే చెప్పుమనుట యుక్తమని వంశీధరుని యభిప్రాయము') - యతో విజ్ఞానం యస్య - ఈ విజ్ఞానమెవరిది? నీకీ విజ్ఞాన మిచ్చిన వారెవరు? అని యర్థము. - యదాధారః - నీ ఆశ్రయమెవరు? యత్పరః - నీవెవరి అధీనమున నుండువాడవు? యదాత్మకః - ఏ స్వరూపము గలవాడవు? - మమతు త్వమేవ స్వతంత్రః, పరమేశ్వర ఇతి బుద్ధిః - నాకైతే నీవే స్వతంత్రుడవని, పరమేశ్వరుడవనియు తోచుచున్నది. నీతపశ్చర్యచేత నీవే సర్వశ్రేష్ఠుడవని అడుగుచున్నాను" - అని నాలుగున్నర శ్లోకములతో చెప్పుచున్నాడు - ఏకః - ఎవరి సహాయము లేని వాడవు (అసహాయుడవు) (4)

ఆత్మన్భావయసే తాని
న పరాభావయన్స్వయమ్ ।
ఆత్మశక్తిమవష్టభ్య
ఊర్ణ నాభిరివాక్లమః ॥ - 5

**తా.** ఎట్టి శ్రమయు లేక సాలెపురుగు తనలో నుండియే దారము తీయుచుండునట్లు, నీ స్వయం శక్తినే ఆశ్రయించి, ఇతరుల నుండి పరాభవమేదియు లేకుండగ, ఆ భూత జాలములను స్వయముగనే సృష్టించుచున్నావు. పాలించుచున్నావు.

**టీ** :- ఆత్మన్నితి. ఆత్మన్ ఆత్మని భావయసే పాలయసి. స్వయమేవ పరాభవమప్రాపయన్. అక్లమః శ్రమరహితః యథోర్ణనాభిః ఆత్మన ఏవ శక్తిమవష్టభ్య సృజతి తద్వత్. (5)

**టీ** - ఆత్మని భావయసే - నీయందే సృష్టించి పోషించుచున్నావు - స్వయమేవ - స్వతంత్రముగనే - పరాభవమప్రాపయన్ - ఓటమిని పొందకుండ - అక్లమః - శ్రమలేకుండగ - యథోర్ణనాభిరాత్మన ఏవ శక్తిమవష్టభ్య - సాలెపురుగు వలె (తన) స్వయంశక్తినాశ్రయించి (దారమును) సృజించి నట్లు-(5)

నాహం వేద పరం హ్యస్మి
న్నాపరం నసమం విభో ।
నామరూప గుణైర్భావ్యం
సదసత్కించిదన్యతః ॥ - 6

**తా.** ఈ విశ్వమునందు, పరమనియు, అపరమనియు (ఉత్తమము, అసమము) మధ్యమమనియు, మనుష్యాది నామములనియు, ద్విపాద చతుష్పాదాదిరూపములనియు, శుక్లత్వ, కృష్ణత్వాది గుణములచే భావింపదగిన వనియు, స్థూలములు సూక్ష్మములనియు నాకేమియును తెలియదు. కాని నీ వలననే ఈ సర్వము సృజింపబడినదని మాత్రము తలంచెదను. ఇతరులెవరి వలనను ఇది కల్పింపబడియుండలేదనియు తలంచెదను.

**టీ** :- నేతి. తస్మాదహం తు అస్మిన్ విశ్వసిన్ పరం ఉత్తమం, అపరం అధమం, సమం మధ్యమం చ. తత్రాపి సదసత్ స్థూలం సూక్ష్మం చ కించిదప్యన్యతో న వేద, కిం తు త్వత్త ఏవ సర్వం భవతీతి మన్యే. (6)

**టీ** - అందువలన నేను ఈ విశ్వమునందు - పరం - ఉత్తమమైనది - అపరం - అధమమైనది, సమం - మధ్యమమైనది - అందునను - నామ - మనుష్యాది పేర్లు గలది - రూపం - ద్విపాదత్వాది రూపము గలది - గుణః - తెల్లదనము మొదలగు గుణముల - తైః - (వాని ) చేత - భావ్యం - భావింపదగినది - సాధింపదగినది - అందునను - సత్ అసత్ - స్థూలము, సూక్ష్మము అని కూడ కొంచెమైనను - అన్యతః - ఇతరుల వలన (అని) నవేద - తెలసికొనజాలకున్నాను. కింతు - కాని - త్వత్తః ఏవ సర్వం భవతి ఇతి మన్యే - నీ వలననే సర్వము కలిగినదని తలచెదను.(6)

స భవానచరత్ ఘోరం
యత్తపః సుసమాహితః ।
తేన ఖేదయసే నస్త్వం
పరశంకాం ప్రయచ్ఛసి ॥ - 7

**తా.** అట్టి నీవు ఏకాగ్ర చిత్తుడవై చేసిన ఘోరమైన తపస్సుచేత మమ్ము ఖేదపరచుచున్నావు. అంతేకాక ఈ విశ్వకర్త అన్యుడేమో అను సందేహమును కలిగించుచున్నావు.

**టీ** - సః - భవాన్ తపః ఆచరత్ ఇతి - యత్తేన నః - ఖేదయసే- యతః - పరశంకాం - ప్రయచ్ఛసి - (7)

**టీ** - సః -అట్టివాడవైనను - భవాన్ తపః ఆచరత్ ఇతి- నీవు తపస్సు చేసితివి అని - యత్తేన - దానిచేత, నః - మమ్ము, ఖేదయసే-దుఃఖింపజేయుచున్నావు. యతః - ఎందువలననైతే - పరశంకాం - మరియొక ఈశ్వరుడను సందేహమును - ప్రయచ్ఛసి - కలిగించుచున్నావు.(7)

ఏతన్మే పృచ్ఛతః సర్వం
సర్వజ్ఞ ! సకలేశ్వర! ।
విజానీహి యథైవేద
మహం బుధ్యే ఽ ను శాసితః - 8

**తా.** ఓ సర్వజ్ఞా ! సకలమునకును ప్రభువైన వాడా! నేనడుగుచున్న విషయము నంతయును, నీవు నాకు శిక్షణ నిచ్చు పద్ధతిలో నేను తెలసికొన గల్గునట్లు - అడుగుచున్న నాకు, సర్వమును తెలియజెప్పుడు.

**టీ** :- యథైవాహం త్వయా అనుశాసితస్సన్ బుధ్యే బుధ్యేయం, తథా విజానీహి విశేషేణ జ్ఞాపయ. (8)

**టీ** – యథైవాహం త్వయాఽ ను శాసితః శిక్షితః సన్ – నేనెట్లెట్టు నీ చేత శిక్షింపబడిన వాడనగుచుందునో – బుధ్యే – తెలసికొందును – బుధ్యేయం తథా విజానీహి – నేను తెలిసికొనునట్లుగ తెలుపుము. విశేషేణ జ్ఞాపయ – ఆ విధముగ విశేషముగ తెలుపుము.(8)

## బ్రహ్మోవాచ

సమ్యక్ కారుణి కస్యేదం
వత్స ! తే విచికిత్సితమ్ ।
యదహం చోదితః సౌమ్య
భగవద్వీర్యదర్శనే ॥ - 9

## బ్రహ్మ యిట్లనెను

**తా.** వత్సా ! సరళ స్వభావుడా ! జీవులపైగల అనుగ్రహముతో నీలో కలిగిన ఈసందేహము, భగవానుని గుణ గణములను దర్శించుటకు (వర్ణించుటకు) నాలో ప్రేరణ కలిగించినది.

**టీ** :- ప్రశ్నమభినందతి – త్రిభిః. సమ్యగితి. హే వత్స హే పుత్ర, తవేదం విచికిత్సితం సందేహః తత్పూర్వక ప్రశ్నో ఽ యం సమ్యగత్యర్థం. యతః కారుణికస్య తవాయం ప్రశ్నః తత్రహేతుః – యత్ యతః అహం ధర్మనే భగవద్వీర్య ప్రకాశనే ప్రకాశితో ఽ స్మి, అతస్త్వం జిజ్ఞాసురపి మయి కృపామేవ కృతవానిత్యర్థః. నను త్వమేవ భగవానిత్యుక్తం మయా – 'ఏకస్సృజసి భూతా ' నీత్యాదినా. సత్యం. (9)

**టీ** – ప్రశ్నను అభినందించుచున్నాడు. వత్స ! ఓ కుమారా ! – తవేదం విచికిత్సితం – ఈ నీ సందేహము – తత్సందేహ పూర్వకమగు ప్రశ్న కల్యాణప్రదమైనదని యర్థము – యతః కారుణికస్య తవాయం ప్రశ్నః – దయామయుడవైన నీ ఈ ప్రశ్న అయినందు వలన – దానికి కారణము – యత్ – ఎందువలన నన – పరధర్మ ప్రదర్శనే – భగవంతుని ఘనతను ప్రకాశింపజేయుట యందు – ప్రవర్తితోఽ స్మి – ప్రవర్తించుచున్నాను. అతస్త్వం – అందువలన నీవు – జిజ్ఞాసురపి – తెలిసికొననిచ్ఛగలవాడవయ్యును – మయి కృపామేవ కృతవానిత్యర్థః – నాయందు దయనే చేసితివి. (చూపితివి) అని యర్థము.(9)

నానృతం తవ తచ్చాపి
యథా మాంప్రబ్రవీషిభో !
అవిజ్ఞాయ పరం మత్త
ఏతా వత్త్వం యతోహి మే ॥ -10

**తా.** ఇంతవఱకును, నాకన్న శ్రేష్ఠుడగు భగవానుడున్నాడని తెలియక నన్ను అడిగిన ప్రశ్నయు, చేసికొనిన నిర్ణయమును అసత్యముకాదు.

**టీ** :- నేతి. యథా మామీశ్వరత్వేన ప్రభాషసే భావః ఏతావత్త్వం మే ఽ స్తి. కిం తు మత్తః పరం ఈశ్వరమవిజ్ఞాయ బ్రూషే. అతస్సాదృశ్యాత్త్వేయం భ్రాంతిః. న తు బుద్ధిపూర్వమనృతమిత్యర్థః యత ఈశ్వరాన్మమ ఏతావత్త్వం. తమవిజ్ఞాయేతి చాన్వయః. (10)

**టీ** – 'విశ్వము నందలి ప్రాణులను, వస్తువులను ఒక్కడే సృజించును' మొదటగ 'నీవే భగవానుడవు' అని నాతో నీవు చెప్పినది ఒక విధముగ నిశ్చయమే. అది సత్యమే. నన్ను ఈశ్వరత్వముతో వ్యవహరించిన నీ మాటలు పూర్తిగా అసత్యములు కావు. ఏ కారణము వలన నాకీ ప్రభావము కలిగినదో – అంత వఱకు అది ఉన్నది. కాని నా కంటెను అధికుడైన ఈశ్వరుని గూర్చి, తెలసికొననేరక నీవు అట్లు వచించితివి. అందువలన, సాదృశ్య వశమున కలిగిన నీ ఈ భ్రమ, భ్రమయే కాని బుద్ధిపూర్వకముగ నీవాడినది అసత్యము కాదని యర్థము. ఈశ్వరుని కంటె ఇంత వఱకును నాకు గల భేదమును తెలసికొనజాలక – అనియు అన్వయము చేయదగును.(10)

యేన స్వరోచిషా విశ్వం  
రోచితం రోచయామ్యహమ్ ।  
యథా ఽ ర్కో ఽ గ్నిర్యథా సోమో ।  
యథర్క్ష గ్రహ తారకాః ॥ - 11

**తా.** ఏ విధముగ సూర్యుడు, అగ్ని, చంద్రుడు, నక్షత్రములు, గ్రహములు, తారకలు తమ ప్రకాశముచే జగత్తును ప్రకాశింపజేయుదురో, అటులే నేను కూడ స్వయంప్రకాశుడైన భగవానుని ప్రకాశముతో నేను ప్రకాశించుచు ఈ విశ్వమును ప్రకాశింపజేయుచున్నాను.

**టీ** :- తర్హి కో ఽ సావీశ్వరః? ఇత్యపేక్షాయాం భక్త్యా నమస్కుర్వన్నేవ కథయతి – త్రిభిః. యేనేతి. యేన స్వప్రకాశేన రోచితం ప్రకాశితమేవ ప్రకాశయామి సృష్ట్వా అభివ్యక్తం కరోమి. యథార్కాదయః చైతన్య ప్రకాశ్యమేవ ప్రకాశయంతి. తథా చ శ్రుతిః "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతో ఽ యమగ్నిః, తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి." ఇతి. (11)

**టీ** – అయినచో ఈ ఈశ్వరుడెవడు? అను ఆకాంక్షతో – అతనికి భక్తితో నమస్కరించుచునే – నారదునకు మూడు శ్లోకములతో చెప్పుచున్నాడు – యేన స్వరోచిషా – ఏ స్వప్రకాశుని చేత – రోచితం – ప్రకాశింపజేయబడుచున్నదో – దానినే – రోచయామి – ప్రకాశింపజేయుచున్నాను. – సృష్ట్వా ఽ భివ్యక్తం కరోమి – సృజనతో అభివ్యక్తము చేయుచున్నాను. యథా ఽ ర్కాదయ శ్చైతన్య ప్రకాశ్యమేవ ప్రకాశయంతి – ఏ విధముగ సూర్యుడు మొదలగువారు, భగవానుని చేత ప్రకాశింపజేయబడిన సృష్టినే ప్రకాశింపజేయుచున్నారో – శ్రుతికూడ అదే విషయమును చెప్పుచున్నది, అచట సూర్యుడు ప్రకాశింపడు చంద్రుడు, తారకలు ప్రకాశింపవు, ఈ మెఱుపులు ప్రకాశింపవు, ఇక అగ్నిమాట






తస్మై నమో భగవతే
వాసుదేవాయ ధీమహి ।
యన్మాయయా దుర్జయయా
మాం బ్రువంతి జగద్గురుమ్ ॥ -12

**టీ** :- తస్మా ఇతి. తస్మై నమో ధీమహి. యస్య మాయయా మోహితాస్సంతః యుష్మదాదయో మాం జగద్గురుం జగత్కారణం వదంతి తస్మై. యన్మాయయేతి మాయాసంబంధోక్తేః తస్యాదుర్జయత్వోక్తేశ్చ. (12)

విలజ్జమానయా యస్య
స్థాతు మీక్షాపథే ఽ ముయా ।
విమోహితా వికత్థంతే
మమాహమితి దుర్ధియః ॥ - 13

**టీ** :- తస్యాపి కిమస్తి సంసారః? నైవేత్యాహ – విలజ్జమానయేతి. మత్కపటమసౌ జానాతీతి యస్య దృష్టిపథే స్థాతుం విలజ్జమానయేవ తస్మిన్ స్వకార్యమకుర్వంత్యా అముయా మాయయా మోహితా అస్మదాదయో దుర్ధియః అవిద్యావృతజ్ఞానా

చెప్పనేల? అతడు తన స్వప్రకాశముతో వెలుగుచుండగా అతని ఆ వెలుగు తోడనే ఈ సర్వవిశ్వము వెలుగుచున్నది" అని(11)

**తా.** అట్టి భగవానుడైన వాసుదేవునకు మనస్సుతో ధ్యానించుచు నమస్కరించుచున్నాము. అతని జయింపరాని మాయచేతనే నన్ను జగత్కారణుడని మీరు చెప్పుచున్నారు.

**టీ** – తస్మై నమో ధీమహి – అతనికి మనస్సుతోనే నమస్కరింతుమని యర్థము. యస్య మాయయా విమోహితాః సంతః – ఎవని మాయచే మిక్కిలి అజ్ఞానముతో మోహితులై – మాం – నన్ను – జగద్గురుం – జగత్తుకు కారణమైన వానిని అని – వదంతి – చెప్పుచున్నారో– తస్మై – అట్టివానికొఱకు – (నమః – నమస్కారము) (12)

**తా.** ఏ భగవానుని కనుచూపు మార్గమునందుండుటకు సిగ్గుపడుచున్నదో, మాయచేత మోహితులైన దుర్బుద్ధులు, 'నాది', 'నేను' అని తమను తాము ప్రశంసించుకొనుచుందురు.

**టీ** – 'యన్మాయయా' అని మాయాసంబంధము చెప్పుటచేతను, అది జయింపరాని లక్షణము గలదియని చెప్పుట చేతను, భగవానునకు కూడ సంసార (సంబంధ) మేమికలదు? ఏమియు లేదని చెప్పుచున్నాడు – "నా కపటము నితడు తెలిసికొనిన వాడని" ఎవని దృష్టి పథమున నుండుటకు సిగ్గుపడుచున్నదో – – భగవానునియందు తన కృత్యము




ఏవ వికత్థంతే శ్లాఘంతే. అనేన యద్రూపమిత్యస్య ప్రశ్నస్యోత్తరముక్తం భవతి. (13)

చేయజాలకున్నదో అట్టి మాయ చేత మిక్కిలి మోహితులమైన మన వంటివారు – దుర్ధియః – అవిద్యచే ఆవరింపబడియున్న జ్ఞానము గలవారయియే కేవలముగ – వికత్థంతే – (నాది – నేను అని) ప్రశంసించుకొనుచున్నారు. దీనితో 'యద్రూపమ్' అను ప్రశ్నకు సమాధానము చెప్పినట్లైనది. (13)

ద్రవ్యం కర్మ చ కాలశ్చ
స్వభావో జీవ ఏవచ ।
వాసుదేవాత్పరో బ్రహ్మన్న
చాన్యో౽ ర్థో౽ స్తి తత్త్వతః ॥ -14

**తా.** నారదా ! ఉపాదానరూపమున ద్రవ్యము, జన్మనిమిత్తమైన కర్మ, దానిని క్షోభింపజేయు కాలము, దాని పరిణామహేతువైన స్వభావము, భోక్తయైన జీవుడు – ఇవి యన్నియు ఉన్నట్లు కన్పట్టుచున్నను, వాసుదేవుని కంటె ఇతరమైన అర్థమేదియును తత్త్వతః లేదు.

**టీ** :- తదేవ త్వస్మాదన్యం పరమేశ్వరం నిరూప్య ఇదానీం యదధిష్ఠానమిత్యాది. ప్రశ్నానాం స ఏవాధిష్ఠానాదికం సర్వమిత్యుత్తరం వక్తుం తద్వ్యతిరేకేణాన్యస్యాసత్త్వమాహ – ద్రవ్యమితి. ద్రవ్యం మహాభూతాని ఉపాదానరూపాణి. కర్మ జన్మనిమిత్తం. కాలః తత్ క్షోభకః. స్వభావః తత్పరిణామహేతుః జీవో భోక్తా వాసుదేవాత్పరః అన్యో ౽ ర్థో నాస్తి. కారణావ్యతిరేకాత్కార్యస్య. (14)

**టీ** – బ్రహ్మదేవుడీ విధముగ తన కన్న ఇతరుడైన పరమేశ్వరుడొకడున్నాడని నిరూపించి – ఇప్పుడు 'ఏది ఆశ్రయము?' ఇత్యాదిగ తొమ్మిది ప్రశ్నలకు – 'అతడే ఆశ్రయుడు' మొదలుకొని సర్వమును అతడే అని సమాధానము చెప్పుటకు, అతనికి వ్యతిరిక్తముగ గలదంతయు అసత్పదార్థమని చెప్పుచున్నాడు. 'ద్రవ్యం' అను శ్లోకముతో – ద్రవ్యం – ఉపాదాన రూపములగు మహాభూతములు – కర్మ – జన్మలకు కారణమైనది. కాలః – దానిని క్షోభింపజేయుకాలము – స్వభావః – దానిని పరిణమింపజేయునది – జీవః – భోక్త (అనుభవించువాడు) – వాసుదేవాత్పరో- ౽ న్యో౽ ర్థో నాస్తి – వాసుదేవున కన్న ఇతరమగు అర్థమేదియును లేదు. కారణమునకు భిన్నమైన కార్యమేదియును ఉండదు.(14)

నారాయణ పరా వేదా
దేవా నారాయణాంగజాః ।
నారాయణ పరాలోకా
నారాయణ పరామఖాః ॥ - 15

**తా.** వేదములు నారాయణుడే కారణములుగా గలవి దేవతలందఱును నారాయణుని అంగముల నుండియే జన్మించిరి. లోకములు నారాయణుని వలననే కలిగినవి. యజ్ఞములన్నియు నారాయణుని సాధనకు కారణములు.

**టీ** :- తత్ప్రపంచయతి – ద్వాభ్యాం. నారాయణేతి. నారాయణః పరం కారణం యేషాం తే. అనేనైవ శాస్త్రయోనిత్వ ప్రతిపాదనేన ఈశ్వరే ప్రమాణం సర్వజ్ఞత్వాదికం చోక్తం. దేవాశ్చ తదంగాజ్జాతాః అతోన తద్వ్యతిరిక్తాః లోకాః స్వర్గాదయః తదానందాంశాః. మఖాః తత్సాధనభూతాః. (15)

**టీ** – ఆ విషయమును రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. – నారాయణ పరః – నారాయణుడే కారణముగ గలది. దీనితోనే 'శాస్త్ర యోనిత్వ' ప్రతిపాదనము చేత ఈశ్వరుని యందు సర్వజ్ఞత్వ ప్రమాణమును, ఈశ్వరుని ప్రామాణ్యమును చెప్పుట జరిగినది. దేవాశ్చ తదంగజాతాః – అతో న తద్వ్యతి రిక్తాః – దేవతలు అతని అవయవముల నుండి జన్మించిరి. అందుచే అతని కంటె భిన్నులు కారు – లోకాః – స్వర్గము మొదలగునవి అతని ఆనందాంశములు – మఖాస్తత్సాధన భూతాః – యజ్ఞములు అతనిని ప్రాప్తించుటకు సాధన రూపములు.(15)

నారాయణ పరో యోగో
నారాయణ పరం తపః।
నారాయణ పరం జ్ఞానం
నారాయణ పరాగతిః॥ - 16

**తా.** యోగము నారాయణపరమైనది. తపస్సు నారాయణునకే చెందినది. జ్ఞానము నారాయణుని లక్ష్యముగా జేసికొనబడునది. గతియు నారాయణుడే ఫలస్వరూపముగా కలిగినట్టిది.

**టీ** :- నారాయణేతి. యోగః ప్రాణాయామాదిః. తపః తత్సాధ్యం తత్రైకాగ్ర్యం. జ్ఞానం తత్సాధ్యం. గతిః తత్ఫలం అనేనైవ సర్వం తదధీనమిత్యుక్తం. (16)

**టీ** – యోగః – ప్రాణాయామము మొదలగునది–తపః – అతడే సాధింపదగిన వాడుగ గల చర్య – చిత్తము యొక్క ఏకాగ్రభావము – జ్ఞానం – అతడే సాధింపదగిన వాడుగ గలది. గతిః – అతడే ఫలముగా గలది – ఈ కారణము చేతనే సర్వము అతని అధీనమని చెప్పబడినది.(16)

తస్యాపి ద్రష్టురీశస్య
కూటస్థ స్యాఖిలాత్మనః।
సృజ్యం సృజామి సృష్టో ఉ హ
మీక్షయై వాభిచోదితః॥ -17

**తా.** ద్రష్ట, కూటస్థుడు, అఖిలాత్ముడునైన ఆ ఈశ్వరుని యొక్క చూపు తోడనే ప్రేరితుడనై సృజింపదగిన దానిని సృజించుచున్నాను. నేను కూడ అతని వలననే సృజింపబడితిని.

**టీ** :- తర్హిత్వం కిం కరోషి? ఇత్యపేక్షాయామాహ – తస్యేతి. తస్య సృజ్యమపి తేన సృష్టో ఽ హం సృజామి ఈక్షయా కటాక్షేణ. తత్ర హేతవో ద్రష్టురిత్యాదయః. (17)

**టీ** – "అయినచో నీవేమి చేయుదువు" అను ఆకాంక్ష కలుగగా చెప్పుచున్నాడు. అతని సృష్టియే యైనను – అతనిచే నేను సృష్టింపబడితిని. సృష్టించుచున్నాను – ఈక్షయా – కటాక్షము చేత – దానికి కారణములు, ద్రష్ట మొదలగు ఆతని విశేషణములు.(17)

సత్త్వం రజస్తమ ఇతి
నిర్గుణస్య గుణాస్త్రయః ।
స్థితి సర్గ నిరోధేషు
గృహీతా మాయయా విభోః ॥ - 18

**తా.** నిర్గుణుడైన పరమేశ్వరుడు, సత్త్వరజస్తమస్సులను మూడు గుణములు సృష్టి, స్థితి, లయములందు తన మాయచే గ్రహింపబడుచున్నవి.

**టీ** :- నను కుతో ఽ యం జీవేశ్వరవిభాగః? యతస్త్వం ప్రేర్యః సచప్రేరకః స్యాదిత్యపేక్షాయాం జీవేశ్వరవిభాగహేతుమాహ – త్రిభిః సత్త్వమితి. నిర్గుణస్యాపీశ్వరస్య త్రయోగుణాః బధ్నంతీత్యుత్తరేణాన్వయః. తే కథంభూతాః? తేనైవ స్వాతంత్ర్యేణ స్థిత్యాద్యర్థం మాయయా గృహీతాః. (18)

**టీ** – జీవ, ఈశ్వర విభాగము నిశ్చయముగ చేయబడినది. అతడు ప్రేరకుడు నీవు ప్రేర్యుడవైనందున కాబోలునను ఆకాంక్షతో జీవేశ్వర విభాగమునకు కారణమును మూడు శ్లోకములచే చెప్పుచున్నాడు. 'సత్త్వం' ఇత్యాదిగ గల శ్లోకముతో నిర్గుణుడైనను ఈశ్వరుని ఈ మూడు గుణములు బంధించుచున్నవి – అని ముందు శ్లోకములతో కూడ అన్వయము – ఎట్టివి? అతని చేతనే స్వతంత్రముగ స్థిత్యాదుల కొఱకు మాయచే గ్రహింపబడినవి. (18)

కార్య కారణ కర్తృత్వే
ద్రవ్యజ్ఞాన క్రియాశ్రయాః ।
బధ్నంతి నిత్యదా ముక్తం
మాయినం పురుషం గుణాః ॥ -19

**తా.** వస్తుతః సంసారము నుండి ముక్తభావనను పొందియున్న, మాయయే విషయముగా గల పురుషుని – మహదాది భూతములను, బుద్ధిని, ఇంద్రియములను ఆశ్రయించి, కార్యమునందు, కారణమునందు, కర్తృత్వమునందు బంధించును.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

**టీ** :- కార్యేతి. వస్తుతః నిత్యదా ముక్తమపి మాయినం మాయావిషయం పురుషం జీవం బధ్నంతి స్వకార్యం అధిభూతం కారణం అధ్యాత్మకం కర్తా అధిదైవతం తేషాం భావః తత్త్వం తస్మిన్ ద్రవ్యం మహాభూతాని జ్ఞానశబ్దేన దేవతాః క్రియాః ఇంద్రియాణి తదాశ్రయాః తేషాంకారణభూతాః తత్తదభిమానేన బధ్నంతి. స ఇతి.. (19)

**టీ** – వస్తుతః సర్వదా ముక్తమపి – నిజమునకు ఎల్లప్పుడును సంసారము నుండి ముక్తుడై యున్నను – మాయినం – మాయా రూపములగు దేహేంద్రియాదులకు విధేయుడై యుండు – పురుషం – జీవుని – బధ్నంతి – బంధించివేయును. – క్వ?–ఎట్లు ? కార్యం – అధిభూతం – కారణం – అధ్యాత్మం, కర్తా – అధిదైవతం – వాని భావమున – తత్త్వమున, – ద్రవ్యం – మహాభూతములు, జ్ఞానశబ్దే – దేవతలు, క్రియాః – ఇంద్రియములు – తదాశ్రయాః – వానినాశ్రయించినవియై – తేషాం కారణభూతాః – వానికి కారణభూతములై – తత్తదభిమానేన – ఆయా అభిమానములచేత – బధ్నంతి – బంధించును. (19)

స ఏష భగవాన్ లింగై
స్త్రిభిరేభి రధోక్షజః ।
స్వ లక్షిత గతిర్బ్రహ్మన్
సర్వేషాం మమచేశ్వరః ॥ - 20

**తా.** నారదా ! అట్టి ఈ భగవానుడైన అధోక్షజుడే ఈ గుణత్రయము యొక్క ఆవరణములచేత (ఉపాధులచేత) సర్వ ప్రాణులను తమ తమ అభిరుచులననుసరించి రూపించి వారికి దిక్కగుచున్నాడు. నాకు కూడ అతడే ప్రభువు.

**టీ** :- స ఏషః వశ్యమాయః. ఏభిర్లింగైర్గుణైః జీవానామావారకైః ఉపాధిభిస్సుష్ఠు ఆలక్షితా గతిస్తత్త్వం యస్య సః స్వైర్భక్తైరేవ లక్షితా గతిర్యస్యేతిహి. (20)

**టీ** – అందువలన ఆ భగవానుడు, వశీకరించుకొని – ఏభిర్గుణైర్లింగైః– ఈ గుణముల చేత – లక్షణములచేత – జీవానామాపరకైః – జీవుల ఉపాధుల చేత – సుష్ఠులక్షితా గతిస్తత్త్వం యస్య సః – చక్కగా లక్షించిన తత్త్వము గలవాడై – స్వైర్భక్తైరేవ లక్షితా గతిస్తత్త్వంయస్యేతివా – లేక తన భక్తులచే ఊహింపబడిన తత్త్వము గల వాడై అనియు – (20)

కాలం కర్మ స్వభావం చ
మాయేశో మాయయాస్వయా ।
ఆత్మన్య దృచ్ఛయా ప్రాప్తం
విబుభూషురుపాదదే ॥ - 21

**తా.** మాయకు అధీశ్వరుడైన పరమేశ్వరుడు తన యందు యాదృచ్ఛికముగ ప్రాప్తించిన కాలము, కర్మ, స్వభావము అనువానిని – అనేకమగుదునని కోరుచు – తన మాయచే స్వీకరించెను.

**టీ** :- తస్య సృష్టిప్రకారమాహ – కాలమితి. కర్మ జీవాదృష్టం విబుభూషుః వివిధం భవితుమిచ్ఛుస్సన్. (21)

**టీ** – అతని సృష్టి ప్రకారము చెప్పుచున్నాడు 'కాలం' అను ఈ శ్లోకముతో కర్మ – జీవునికి కానుపింపనిది – విబుభూషుః – వివిధమయ్యేదనని కోరుచు (21)

కాలాద్గుణ వ్యతికరః
పరిణామః స్వభావతః ।
కర్మణో జన్మ మహతః
పురుషాధిష్ఠితాదభూత్ ॥ - 22

**తా.** కాలము కంటె గుణము క్షోభకరము, పరిణామము స్వాభావికము. ఇక కర్మ, మహత్తత్వము పుట్టుటకు కారణమైనది, ఈ మూడింటికిని (కాల, పరిణామ కర్మలకు ఈశ్వరుడే అధిష్ఠానము అగుటవలన ఇది సంభవించినది)

**టీ** :- కాలాదితి. గుణానాం వ్యతికరః క్షోభః సామ్యత్యాగః పరిణామో రూపాంతరావృత్తిః పురుషః ఈశ్వరః తేనాధిష్ఠితత్వం త్రయాణాం విశేషణం. మహతః మహతత్త్వస్య. (22)

**టీ** – గుణానాం వ్యతికరః – క్షోభః – సామ్యత్యాగము, స్వభావతః – నిసర్గముగనే –పరిణామః – రూపాంతరత్వమును పొందుట, పురుషః – ఈశ్వరుడు అతనిచేత ఈ మూడింటికి అధిష్ఠితత్వము విశేషణము, మహతః – మహత్తత్త్వము యొక్క. (22)

మహతస్తు వికుర్వాణా
ద్రజః సత్త్వోపబృంహితాత్ ।
తమః ప్రధానస్త్వభవ
ద్ద్రవ్య జ్ఞాన క్రియాత్మకః ॥ - 23

**తా.** రజోగుణ సత్త్వగుణముల వృద్ధియగుటచేత కలిగిన మహత్తత్త్వ వికారము వలన, ద్రవ్యజ్ఞాన క్రియాత్మకమైన తమః ప్రధాన వికారమేర్పడినది.

**టీ** :- మహత ఇతి. మహత్తత్త్వాది కుర్వాణాద్విక్రియమాణాత్ తస్య చ క్రియాజ్ఞానశక్తిత్వాత్ త్రిగుణత్వే ఽ పి రజస్సత్త్వాభ్యాముప బృంహితత్వం, అహంకారస్య త్వావారకత్వాత్ తమః ప్రధానత్వం. అత ఏవ అహంకారకార్యేషు తామసం కామరాగాదికం బహురాజసం సాత్త్వికం చాల్పం. ఏవం తదుపాధిషు జీవేష్వపి తథైవ తామసాధిక్యం. (23)

**టీ** – మహత్తత్త్వము వికారమునొందుట చేత దాని యొక్కయు, క్రియాజ్ఞాన శక్తిత్వము వలన త్రిగుణత్వము నందు కూడ రజస్సత్త్వముల వృద్ధి యగును. అహంకారపు ఆవరణత్వము చేత తమస్సు యొక్క ప్రాధాన్యము, ఇంకను అహంకార కార్యములందు తమము, ఆకాశాదికము పెరుగును. రాజసతత్త్వము, సాత్త్విక తత్త్వము అల్పములగును. ఈ విధముగ ఆ ఉపాధులయందు, జీవులయందు కూడ అట్లే తమము అధికమగును. (23)

సో௨ హంకార ఇతిప్రోక్తో వికుర్వన్సమభూత్త్రిధా
వైకారికస్తైజసశ్చ తామసశ్చేతి యద్భిదా
ద్రవ్యశక్తిః క్రియా శక్తిర్జ్ఞాన శక్తిరితి ప్రభో - 24

**టీ** :- స ఇతి. స చ వికుర్వన్ రూపాంతరం గచ్ఛన్. త్రైవిధ్యమేవాహ - వైకారిక ఇతి వైకారికః స్వాత్త్వికః. తైజసః రాజసః. యద్భిదా యస్య భేదః ద్రవ్యశక్తిరిత్యాదిప్రాతిలోమ్యేన త్రయాణాం లక్షణాని. ద్రవ్యే మహాభూతాఖ్యే శక్తిర్యస్య. క్రియాసు ఇంద్రియేషు శక్తిర్యస్య. జ్ఞానేషు దేవేషు శిక్తిర్యస్య. హే ప్రభో బోద్ధుం శక్త. (24)

**తా.** అది అహంకారమనబడును. అది వికారము చెంది మూడువిధములగును. అవియే సాత్త్విక, రాజస, తామసములు. నారదా! అవియే క్రమముగ జ్ఞానశక్తి, క్రియాశక్తి, ద్రవ్యశక్తి ప్రధానములగును.

**టీ** - సచ వికుర్వన్ - రూపాంతమునొందుచు - త్రైవిధ్యమేవాహ - మూడు విధములగునని చెప్పుచున్నాడు. వైకారికః - సాత్త్వికము, తైజసః - రాజసము, యద్భిదా - దేని భేదములు - ద్రవ్యశక్తి మొదలగునవి. ప్రాతిలోమ్యేన - ప్రతిలోమముగ (అనగా జ్ఞానక్రియా ద్రవ్యశక్తులు అనుక్రమమున) - త్రయాణాం లక్షణాని - మూడింటి లక్షణములు - ద్రవ్యే - మహాభూతమను పేరుగల శక్తి దేనికో అది ద్రవ్యశక్తి - క్రియాసు - ఇంద్రియములయందు - శక్తిర్యస్య - శక్తిదేనికో అది క్రియా శక్తి - జ్ఞానేషు - వేదములందు దేనికి శక్తియో అది జ్ఞాన శక్తి. హే ప్రభో - తెలసికొనగలిగితివా? (అనుటకు ఈ సంబోధన) (24)

తామసాదపి భూతాదేర్వి
కుర్వాణా దభూన్నభః ।
తస్య మాత్రా గుణః శబ్దో
లింగం యద్ద్రష్టృదృశ్యయోః ॥ -25

**టీ** :- తామసాది. భూతాదేరితి తామసస్య విశేషణం. నను తామసాత్ప్రథమం శబ్దో భవతీతి ప్రసిద్ధం. సత్యం. స తు తస్య నభసో మాత్రా సూక్ష్మరూపం. గుణశ్చ వ్యావర్తకో ధర్మః. శబ్దద్వారా నభ ఉత్పద్యత ఇత్యర్థః. ఏవ మేవ స్పర్శాదిష్వపి ద్రష్టవ్యం. శబ్దస్య లక్షణం లింగమితి కుడ్యాద్యంతరి తేన కేనచిదుచ్చైర్గజ ఇత్యుక్తే

**తా.** పంచమహాభూతముల కారణ రూపమగు భూతాది నామకమగు తామసాహంకారము నందు వికారముకలుగగా ఆకాశమేర్పడును. ఆకాశము యొక్క తన్మాత్ర, గుణము శబ్దము, ఈ శబ్దము ద్వారానే ద్రష్ట యొక్కయు, దృశ్యము యొక్కయు బోధ కలుగును.

**టీ** - 'భూతాదేః' అనునది తామసమునకు (తామసాహంకారమునకు) విశేషణము. తామసాహంకారము నుండియే మొదట శబ్దము కలుగునని ప్రసిద్ధము. సత్యము. ఆకాశము యొక్క తన్మాత్ర సూక్ష్మ రూపమైనది. గుణము అనునది అసాధారణముగ విస్తరించు ధర్మము. శబ్దము ద్వారా ఆకాశము కలుగునని యర్థము. ఇట్లే స్పర్శాదుల యందు కూడ చూడదగును. శబ్దము యొక్క లక్షణము 'లింగము' అని - గోడ అవతలివైపు నుండి ఎవరైనను బిగ్గరగా

యో గజద్రష్టా యశ్చ తేన దృశ్యో గజః తయోర్లింగం బోధకం. లింగవిశేషణత్వాద్యచ్ఛబ్దస్య క్లీబత్వం. (25)

"ఏనుగు", "ఏనుగు" అని అరచినచో, ఆ ఏనుగును చూచువాడును, అతనిచే చూడబడు ఏనుగు – ఆ రెండింటికిని అది బోధకమగును. లింగ విశేషణత్వము వలన యత్ అను శబ్దమునకు నపుంసక లింగత్వము. (25)

నభసో ఽ ధవికుర్వాణా
దభూత్ స్పర్శ గుణో ఽ నిల ః।
పరాన్వయాచ్ఛబ్దవాంశ్చ
ప్రాణ ఓజః సహో బలమ్ ॥ - 26

**తా.** ఆకాశము వికారము చెందుట వలన స్పర్శగుణము గల వాయువేర్పడును. ఆకాశ కారణము వలన వాయువు – దాని లక్షణమగు ప్రాణము – దేహధారణమగును. ఆపై ఓజస్సు, శక్తి, బలము కలుగును.

**టీ** :- నభసఇతి. పరస్యనభసః కారణత్వేనాన్వయాత్. శబ్దవాంశ్చ వాయుః. తస్యైవ లక్షణం ప్రాణః దేహధారణం. ఓజస్సహోబలాని ఇంద్రియ మనశ్శరీరాణాం పాటవాని. తేషాం హేతురిత్యర్థః.(26)

**టీ** – పరస్య – ఆకాశము యొక్క కారణత్వముచే అన్వయము వలన, శబ్దవాన్ + చ – వాయువు – తస్యైవ లక్షణం ప్రాణో దేహధారణము – దాని లక్షణమే ప్రాణము, దేహధారణము – ఓజః సహోబలాని – ఇంద్రియములు, మనస్సు, శరీరముల యొక్క పటుత్వములు మున్నగువానికి కారణమని యర్థము.(26)

వాయోరపి వికుర్వాణా
త్కాల కర్మ స్వభావతః।
ఉదపద్యత తేజో వై
రూపవత్స్పర్శ శబ్దవత్ ॥ - 27

**తా.** కాలము, కర్మ, స్వభావము అనువాని వలన వాయువునకు కూడా వికారము కలిగినది. దానితో తేజస్సు ఉద్భవించినది. దీని ప్రధాన గుణము రూపము. ఆకాశ వాయు గుణములగు శబ్ద స్పర్శలు కూడ తేజస్సు (దీని) లో నున్నవి.

**టీ** :- వాయోరితి. స్వతో రూపవత్తేజః, వాయునభసోః కారణభూతయోరన్వయాత్ స్పర్శశబ్దవచ్చ. ఏవమంభసశ్చ పృథివ్యాశ్చపరాన్వయాధిక్యాద్గుణాధిక్యం. (27)

**టీ** – ఉదపద్యత – ఉత్పన్నమైనది. స్వతః రూప గుణము కలిగిన వాయ్వాకాశముల – కారణ భూతముల అన్వయము వలన స్పర్శ శబ్దములతో కూడ తేజస్సు కూడినదైనది. ఈ విధముగ జలము యొక్కయు, పృథ్వి యొక్కయు పరాన్వయాధిక్యముచే గుణాధిక్యము.(27)

తేజసస్తు వికుర్వాణా
దాసీదంభో రసాత్మకమ్ ।
రూపవత్స్పర్శ వచ్చాభ్యో
ఘోష వచ్చ పరాన్వయాత్ ॥ - 28

**తా.** తేజస్సు యొక్క వికారము చేత రస గుణము కల్గిన జలము కలిగినది. రూపస్పర్శలతో బాటుగ వీనికి పరాన్వయము వలన శబ్దగుణము కూడ చేరినది.

**టీ** :- తేజసఇతి. ఘోషః శబ్దః. (28)

**టీ** – ఘోషః – శబ్దము (28)

విశేషస్తు వికుర్వాణా ।
దంభసో గంధవానభూత్ ।
పరాన్వయాద్రస స్పర్శ ।
శబ్దరూప గుణాన్వితః ॥ - 29

**తా.** జలము వికారము చెందుట వలన పృథ్వి ఏర్పడినది. దీని గుణము గంధము. కారణ గుణములు కార్యమునకు వచ్చునను న్యాయమున శబ్ద స్పర్శ రూప రసములు అను నాలుగు ఇందున్నవి. (విశేషస్తు అని ఆరంభింపబడిన శ్లోకమునందలి విశేష శబ్దమునకు పృథ్వి అని అర్థము)

**టీ** :- విశేషఇతి. విశేషః పృథ్వీ. (29)

**టీ** – విశేషః పృథ్వి – పృథ్వి యొక్క పరాన్వయాధిక్యము చేత గుణాధిక్యము కలిగినది. (29)

వైకారికాన్మనో జజ్ఞే
దేవా వైకారికా దశ ।
దిగ్వాతార్క ప్రచేతో ఽ శ్వి
వహ్నీంద్రోపేంద్ర మిత్రకాః ॥ -30

**తా.** అహంకారము నుండి మనస్సు, పది ఇంద్రియములు, వాని అధిష్ఠాన దేవతలును పుట్టిరి. దిశలు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీకుమారులు, అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, మిత్రుడు, ప్రజాపతి అనువారు.

**టీ** :- వైకారికాదితి. మనశ్శబ్దేనైవ తదధిష్ఠాతా చంద్రో ఽ పి ద్రష్టవ్యః. అన్యే చ దశదేవావైకారికాః సాత్త్వికాహంకారకార్యాః. తానాహ – దిశశ్చ వాతశ్చ అర్కశ్చ ప్రచేతాశ్చ అశ్వినౌ చ. ఏతే

**టీ** – మనశ్శబ్దము చేతనే దాని అధిష్ఠాతయైన చంద్రుడు కూడ గ్రహింపదగినవాడు, ఇతర దేవతలు పదుగురు సాత్త్వికాహంకార కార్యములగు తద్వికృతులైన దేవతలను చెప్పుచున్నాడు. దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినులు – ఈ ఐదుగురును, శ్రోత్ర త్వక్చ

పంచ శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణానాం అధిష్ఠాతారః. వహ్నిశ్చ ఇంద్రశ్చ ఉపేంద్రశ్చ మిత్రశ్చకశ్చ ప్రజాపతిః. ఏతే పంచ వాక్పాణి పాదపాయూపస్థానాం. (30)

క్షుర్జిహ్వాఘ్రాణములకు అధిష్ఠాన దేవతలు. అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, మిత్రుడు, ప్రజాపతి – ఈ ఐదుగురు వాక్పాణి పాదపాయూపస్థలు అను కర్మేంద్రియములకు అధిష్ఠాన దేవతలు.(30)

తైజసాత్తు వికుర్వాణాదింద్రియాణి దశా భవన్ ।
జ్ఞానశక్తిః క్రియాశక్తిర్బుద్ధిః ప్రాణస్తు తైజసౌ ।
శ్రోత్ర త్వగ్ఘ్రాణ దృగ్జిహ్వావాగ్దోర్మేఢ్రాంఘ్రి పాయవః - 31

**తా.** తైజసాహంకారము వికారము చెందగా పది యింద్రియములు కలిగినవి, జ్ఞానశక్తి రూపమగు బుద్ధి, క్రియాశక్తి రూపమగు ప్రాణము తైజసాహంకార కార్యములు. శ్రోత్రము, త్వక్కు (చర్మము) ఘ్రాణము (నాసిక) దృక్ (నేత్రము) జిహ్వ (నాలుక) ఈ ఐదు జ్ఞానేంద్రియములు, వాక్కు, చేతులు, కాళ్ళు, జననేంద్రియము, విసర్జనేంద్రియము అను ఈ ఐదు కర్మేంద్రియములు పుట్టినవి.

**టీ** :- తైజసాదితి. యతో విజ్ఞానశక్తిః బుద్ధిః, క్రియాశక్తిః ప్రాణశ్చ తైజసాహంకారకార్యౌ అతో జ్ఞాన క్రియావిశేషణ స్వరూపాణీంద్రియాణ్యపి తైజసాదభవన్నిత్యర్థః. (31)

**టీ** – జ్ఞానశక్తి బుద్ధియగుట వలన, ప్రాణము క్రియా శక్తి యగుట వలన క్రియాశక్తి, ప్రాణము అనునవి తైజసాహంకార కార్యములు. అందువలన జ్ఞానక్రియా విశేషరూపములగు ఇంద్రియములు కూడ తైజసము నుండియే పుట్టినవని యర్థము. శ్రోత్రమాదిగ వానిని చెప్పినాడు – దోః – చేయి – మేఢ్రం –ఉపస్థ – ఇక ఇచట క్రమము వివక్షింపబడలేదు. (31)

యదైతే ౨ సంగతా భావా
భూతేంద్రియ మనో గుణాః ।
యదాయతన నిర్మాణే
న శేకుర్బ్రహ్మవిత్తమ ॥ - 32

**తా.** బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠతముడవైన ఓ నారదా! పంచభూతములు, ఇంద్రియములు, మనస్సు, గుణములు, అసంఘటితములై (విడివిడిగ) ఉండుట చేత శరీర నిర్మాణమునందు ఇవి సమర్థములు కాకుండెను.

టీ :- తాన్యాహ – శ్రోత్రమితి. దోః పాణిః. మేఢ్రం ఉపస్థః. క్రమస్తు అత్ర న వివక్షితః. ఏవం కారణసృష్టిముక్త్వా కార్యసృష్టిమాహ – యదా ఏతే అసంగతాః. (32)

**టీ** – ఈ విధముగ కారణ సృష్టిని చెప్పి, కార్య సృష్టిని చెప్పుచున్నాడు. ఈ భూతేంద్రియాదులు అసంగతముగ – పరస్పరము కలువకుండ నుండినప్పుడు, ఆకారణమున ఆయతనము యొక్క – (శరీరము యొక్క) నిర్మాణము చేయలేక పోయినవి.(32)

తదా సంహత్య చాన్యోన్యం
భగవచ్ఛక్తి చోదితాః ।
సద సత్త్వముపాదాయ
చోభయం సస్పృజుర్హ్వ్యదః ॥ -33

**తా.** అప్పుడు ఇవియన్నియు భగవానుని శక్తిచే ప్రేరేపింపబడి, ప్రధాన గుణ భావమును స్వీకరించి, పరస్పరము మేళనము పొంది, వ్యష్టి, మరియు సమష్టి రూపమగు ఆ సృష్టిని రూపొందించినవి.

**టీ** :- యదితి. అతఏవ యదాయతస్య బ్రహ్మాండాఖ్య శరీరస్య నిర్మాణే న శేకుః తదా. (33)

**టీ** – తదా – అప్పుడు, సదసత్త్వం – ప్రధాన గుణభావమును (ముఖ్య గౌణ భావమును) ఉపాదాయ – స్వీకరించి, ఉభయం – సమష్టి వ్యష్టిరూపమున గల శరీరము, (బ్రహ్మాండ పిండాండమను పేర్లు గల దానిని) (సృజించినవి) (33)

వర్షపూగ సహస్రాంతే
తదండముదకే శయమ్ ।
కాలకర్మ స్వభావస్థో
జీవో ఽ జీవమజీవయత్. ॥ - 34

**తా.** ఆ బ్రహ్మాండము ఒక వేయి సంవత్సరముల వఱకు నిర్జీవముగ జలమునందు పడియుండెను. ఆ పిదప కాల కర్మ స్వభావస్థుడై భగవానుడు అచేతనమును (అండము) జీవింపజేసెను. (పూగః – సమూహము – కుప్ప)

**టీ** :- సదితి. సదసత్త్వం ప్రధానగుణభావముపాదాయ స్వీకృత్య ఉభయం సమష్టి వ్యష్ట్యాత్మకం శరీరం.(34)

**టీ** – కాల, కర్మ, స్వభావములను అధిష్ఠించియుండు – జీవయతి + ఇతి జీవః – జీవింపజేయువాడు జీవుడు – పరమాత్ముడు – అజీవం – అచేతనమును – అజీవయత్ – చేతనముగ చేసెను. (34)

స ఏవ పురుషస్తస్మా
దండం నిర్భిద్య నిర్గతః ।
సహస్రోర్వంఘ్రి బహ్వాక్ష
స్సహస్రానన శీర్షవాన్ ॥ - 35

**తా.** ఆ అండమును ఛేదించి, దాని నుండి ఆ పురుషుడే, వేలకొలదిగా గల ఊరువులు, పాదములు, బాహువులు, నేత్రములు, ముఖములు, శిరస్సులు కలిగిన విరాడ్రూపమున బయటకు వచ్చెను.



**టీ** :- కాలఇతి. కాలకర్మస్వభావానధిష్ఠాయ స్థితః జీవయతీతి జీవః పరమాత్మా అజీవం అచేతనం అజీవయత్ చేతయతి స్మ నిర్భిద్య పృథక్కృత్య స్థిత ఇత్యర్థః. (35)

**టీ**– నిర్భిద్య – పృథక్కరించి – స్థితః – లోననున్నవాడని యర్థము. (35)

యస్యేహావయవైర్లోకా
న్కల్పయంతి మనీషిణః।
కట్యాదిభిరధః సప్త
సప్తోర్ధ్వం జఘనాదిభిః॥ - 36

**తా.** విద్వాంసులు, ఆ విరాట్పురుషుని అవయవముల చేత – నడుము నుండి క్రింది అవయవములతో ఏడు అధోలోకములను, మొలనుండి పై భాగము నందలి అవయవములతో ఏడు ఊర్ధ్వలోకములను, (ఉపాసన కొఱకు) భావింతురు.

**టీ** :- తదవయవైశ్శ్లోకం చ నామాహ – యస్యేతి. కటిః ఊరుమూలయోః పశ్చాద్భాగః జఘనం పురోభాగః అధస్సప్త లోకాన్ అతలాదీన్. ఊర్ధ్వం భూతాదీన్ సప్త. (36)

**టీ**. – అతని అవయవములతో లోకరచనమును చెప్పుచున్నాడు – 'యస్య' అని మొదలగు ఈ శ్లోకముతో – కటిరిత్యూరు మూలయోః పశ్చాద్భాగః – నడుము లేక తొడల మూలము నుండి క్రిందు భాగము – జఘనం పరోభాగః – మొల నుండి పై భాగము. అధః – అతలము మొదలుగ ఏడు క్రింది భాగమున గల లోకములను, ఊర్ధ్వం – భూః మొదలుకొని ఏడు ఊర్ధ్వలోకములను.(36)

పురుషస్య ముఖం బ్రహ్మ
క్షత్రమేతస్య బాహవః।
ఊర్వోర్వైశ్యో భగవతః।
పద్భ్యాం శూద్రో ఉ భ్యజాయత॥ - 37

**తా.** భగవంతుడగు ఈ పురుషుని ముఖము నుండి బ్రాహ్మణుడు, బాహువుల నుండి క్షత్రియుడు, తొడల నుండి వైశ్యుడు, పాదముల నుండి శూద్రుడు పుట్టెను.

**టీ** :- వర్ణానాముత్పత్తిం దర్శయతి – పురుషస్యేతి. బ్రహ్మ బ్రాహ్మణః ముఖమితి. కార్యకారణయోరభేద వివక్షయోక్తం. బాహవ ఇతి క్షత్రం క్షత్రియః. (37)

**టీ** – వర్ణముల ఉత్పత్తిని తెలుపుచున్నాడు 'పురుషస్య' అని మొదలగు ఈ శ్లోకమున – బ్రహ్మ బ్రాహ్మణుడు – ముఖం – అని కార్యకారణముల అభేద వివక్షచే చెప్పబడినది. బాహవః – చేతులు అనియు – క్షత్రం – క్షత్రియుడు. (37)



భూర్లోకః కల్పితః పద్భ్యాం
భువర్లోకో౽స్యనాభితః।
హృదాస్స్వర్లోక ఉరసా
మహర్లోక మ్మహాత్మనః ॥ - 38

**తా.** విరాట్పురుషుని పాదములతో భూలోకము, నాభితో (స్థానమునుండి) భవర్లోకము, హృదయ స్థానముతో స్వర్లోకము, వక్షః స్థలముతో మహర్లోకము కల్పింపబడెను.

**టీ** :- ఇదానీముపాసనార్థం లోకకల్పనాభేదాన్ దర్శయన్ సప్తలోకపక్షమాహ – ద్వాభ్యాం. భూర్లోక ఇత్యాది. భూర్లోకః పాతాలమారభ్య పద్భ్యాం కటిపర్యంతాభ్యాం. (38)

**టీ** – ఇప్పుడు ఉపాసన కొఱకు లోక కల్పనము నందలి భేదములను చూపుచు రెండు శ్లోకములతో సప్తలోక పార్శ్వమును చెప్పినాడు. భూర్లోకః – పాతాళము మొదలుకొని – పద్భ్యాం – నడుము వఱకు గల వానితో... (38)

గ్రీవాయాం జనలోకశ్చ
తపోలోకః స్తనద్వయాత్ ।
మూర్ధాభిః సత్యలోకస్తు
బ్రహ్మలోకః సనాతనః ॥ -39

**తా.** కంఠమునందు జనలోకము, రెండు స్తనముల నుండి తపోలోకము, శిరస్సుల నుండి సనాతనమగు బ్రహ్మలోకము – సత్యలోకము కల్పింపబడినవి.

**టీ** :- గ్రీవాయామితి. స్తనద్వయాదిత్యుపాసనార్థత్వాదూర్ధ్వాధో భాగ వైపరీత్యం న దోషః యద్వా – స్తనత్ శబ్దం కుర్వత్ యదోష్ఠ ద్వయం తస్మాదిత్యర్థః. బ్రహ్మలోకో వైకుంఠాఖ్యః సనాతనః నిత్యః న తు సృజ్యప్రపంచాంతర్వర్తీత్యర్థః. (39)

**టీ** – స్తనద్వయము నుండి అని ఉపాసనార్థత్వమువలన ఊర్ధ్వ, అధోభాగముల వైపరీత్యము, దోషము కాదు. లేక స్తనత్ – శబ్దము చేయుచున్న రెండు పెదవుల నుండి అని యర్థము. బ్రహ్మలోకమనగా వైకుంఠమను పేరుగలది. సనాతనః – నిత్యమైనది. అంతేకాని సృజింపదగిన ఈ ప్రపంచములోనిది కాదని యర్థము.(39)

తత్కట్యాం చాతలం క్లృప్త
మూరుభ్యాం వితలంవిభోః।
జానుభ్యాం సుతలం శుద్ధం
జంఘాభ్యాం తు తలాతలమ్ ॥ - 40

**తా.** ఆతని నడుము భాగమున అతలము, తొడలనుండి వితలము, మోకాళ్ళ నుండి సుతలము, పిక్కల నుండి తలాతలము, చీలమండలతో మహాతలము, ముంగాళ్ళ నుండి రసాతలము, పాదతలముల నుండి పాతాళము కల్పింపబడినది. ఈ విధముగ ఆ విరాట్ పురుషుడు (పదునాలుగు) లోకములతో కూడియున్న వాడు. (40,41)






మహాతలం తు గుల్ఫాభ్యాం
ప్రపదాభ్యాం రసాతలమ్ ।
పాతాలం పాదతలత
ఇతి లోకమయః పుమాన్ ॥ - 41

**టీ** :- ఇదానీం చతుర్దశ లోకపక్షం దర్శయతి – తత్ర జఘనాదిభిః భూరాదయః పూర్వోక్తాఏవ సప్త. కట్యాదిభిః అధస్సప్త లోకానాహ – తదిత్యాదిద్వాభ్యాం. శుద్ధం హరిభక్తనివాసత్వాత్. (40,41)

**టీ**– ఇప్పుడు పదునాలుగు లోకములను చూపుచున్నాడు. జఘనాదుల నుండి భూలోకము మొదలగు ఏడులోకములు పూర్వము చెప్పబడినవియే. కటి క్రింది ఏడు అధోలోకములను ఇట చెప్పినాడు – తత్కట్యాం' మొదలుకొని రెండు శ్లోకములతో వీనిని చెప్పుట జరిగినది. శుద్ధం – హరిభక్తి యుండుట వలన (40,41)

భూర్లోకః కల్పితః పద్భ్యాం
భువర్లోకో ఽ స్యనాభితః ।
స్వర్లోకః కల్పితో మూర్ధ్ని
ఇతి వా లోక కల్పనా ॥ - 42

**తా.** పాదముల నుండి భూలోకము, నాభి నుండి భువర్లోకము, శిరస్సునందు స్వర్లోకము కల్పింపబడినవి అనియు విరాట్పురుషుని యందు లోక కల్పన చెప్పవచ్చును.

**టీ** - త్రిలోకపక్షమాహ – భూర్లోక ఇత్యాదినా. భూర్లోకః పాతాలాదిసహితః. (42)

**టీ** – ఇచట త్రిలోక పక్షము చెప్పుచున్నాడు. భూర్లోకః – పాతాలము మొదలగు లోకములతో కలుపుకొని. (42)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వితీయ స్కంధే పంచమోఽధ్యాయః**
**ఇతి టీకాయాం పంచమోధ్యాయః**

**శ్రీమద్భాగవతము నందలి ద్వితీయ స్కంధమున ఐదవ అధ్యాయము సమాప్తము.**
**శ్రీ మద్భాగవత మహాపురాణ ద్వితీయ స్కంధ మందలి శ్రీధరీయ టీక ఐదవ అధ్యాయము సమాప్తము.**









# అథ షష్ఠోఽధ్యాయః

## బ్రహ్మోవాచ

వాచాం వహ్నేర్ముఖం క్షేత్రం
ఛందసాం సప్త ధాతవః ।
హవ్య కవ్యామృతాన్నానాం
జిహ్వా సర్వ రసస్య చ ॥ - 1

**టీ** :- షష్ఠే విరాడ్విభూతిశ్చ ప్రోక్తాధ్యాత్మాదిభేదతః, దృఢీకృతం తు పూర్వోక్తం సర్వం పురుషసూక్తతః. ఇదానీం వైరాజ్యసవిభూతిః సప్రపంచమనువర్ణ్యతే - వాచామితి. వాచాం అస్మదాదినా వాగింద్రియాణాం తదధిష్ఠాతుర్వహ్నేశ్చ. తస్య ముఖం. క్షేత్రం ఉత్పత్తిస్థానం. ఛందసాం గాయత్ర్యాదీనాం సప్తానాం. తస్య ధాతవః త్వగాదయః క్షేత్రం హవ్యం దేవానామన్నం కవ్యం పితౄణామన్నం. అమృతం తదుభయశేషం మనుష్యాణామన్నం. ఏషాం అన్నానాం సర్వరసస్యమధురాదేః, షడ్విధస్యచ. చకారాదస్మదాది రసనేంద్రియస్య. తదధిష్ఠాతుర్వరుణస్యచ. ఏతస్య జిహ్వాక్షేత్రం. ఏవం సర్వత్రానుక్తమున్నేయం. (1)

# ఆఱవ అధ్యాయము

## బ్రహ్మదేవుడిట్లనెను

**తా.** విరాట్పురుషుని ముఖము నుండి వాక్కు మరియు అధిష్ఠాన దేవతయగు అగ్నియు ఉత్పన్నమయ్యెను. ఏడు ఛందములు అతని ఏడు ధాతువుల నుండి యేర్పడినవి మనుష్యుల యొక్కయు, పితరుల యొక్కయు, దేవతల యొక్కయు అన్నములు, అన్ని విధములైన రసములు ఆతని నాలుక నుండి పుట్టినవి.

**టీ** - ఈ ఆఱవ అధ్యాయమున ఆధ్యాత్మికాది భేదములతో విరాడ్విభూతి చెప్పబడినది. పూర్వము చెప్పబడిన దంతయును పురుషసూక్తమునందున్నట్లు దృఢీకరింపబడినది. ఇక ఇప్పుడు విరాట్పురుషుని విభూతి సప్రపంచముగ వర్ణింపబడుచున్నది. వాచాం - మనకున్నట్టి వాగింద్రియముల యొక్క, వాని అధిష్ఠాన దేవత యగు అగ్ని యొక్కయు తస్యముఖం క్షేత్రం - అతని ముఖమే ఉత్పత్తి స్థానము, ఛందసాం - గాయత్రి మొదలగు ఏడు ఛందములకు - తస్య సప్తధాత్వస్త్వగాదయః క్షేత్రం - అతని త్వక్కు మొదలగు ఏడు ధాతువులు ఉత్పత్తి స్థానము - హవ్యం - దేవతల అన్నము - కవ్యం - పితరుల అన్నము - అమృతం- ఆ రెండు జాతుల వారు కాక మిగిలిన మనుష్యుల అన్నము - తేషామన్నానాం సర్వరసస్య మధురాదేః షడ్విధస్య - తీపిమొదలగు ఆఱు (విధములగు) రసములకు - చకారము వలన అస్మదాదుల రసేంద్రియము (ల) యొక్కయు - తదధిష్ఠాతుర్వరుణస్యచ - ఆ రసముల అధిష్ఠానదేవతయగు వరుణుని యొక్కయు - తస్య జిహ్వా - ఆ విరాట్పురుషుని నాలుక. క్షేత్రం - ఉత్పత్తి స్థానము - ఈ విధముగ అంతటను చెప్పబడని వానిని గ్రహింపవలెను. (1)




సర్వాసూనాంచ వాయోశ్చ
తన్నాసే పరమాయనే ।
అశ్వినోరోషధీనాం చ
ఘ్రాణో మోదప్రమోదయోః ॥ - 2

టీ :- సర్వేతి. సర్వాసూనాం అస్మదాదిప్రాణాదీనాం. తస్య నాసే నాసారంధ్రే. పరమాయనే ఉత్తమక్షేత్రే. మోదప్రమోదయోశ్చ సామాన్య విశేషగంధయోః ఘ్రాణేంద్రియం పరమాయనం. (2)

**తా.** సర్వ ప్రాణములకు, వాయువులకు, సామాన్య విశేష గంధములకు, అశ్వినీ కుమారులకు, ఓషధులకును ఆ విరాట్పురుషుని ఘ్రాణేంద్రియము – అతని నాసికారంధ్రములు ఉత్తమమైన ఉత్పత్తి క్షేత్రములు.

**టీ** – సర్వాసూనాం – అస్మదాదుల ప్రాణములకు, తస్య నాసే – అతని నాసికా రంధ్రములు – పరమాయనే – ఉత్తమ క్షేత్రములు – (అంతటను షష్ఠీవిభక్త్యంతములగు పదములకు ప్రథమా విభక్త్యంతమగు క్షేత్రము చూచుకొనవలెను) మోద ప్రమోదయోః + చ – సామాన్య విశేష గంధములకు – ఘ్రాణః – ఘ్రాణేంద్రియము – పరమాయనమ్ – (ఉత్తమ క్షేత్రము) (2)

రూపాణాం తేజసాం చక్షు
ర్దివః సూర్యస్య చాక్షిణీ ।
కర్ణౌ దిశాం చ తీర్థానాం
శ్రోత్రమాకాశ శబ్దయోః ॥ - 3

**టీ** :- రూపాణామితి. తేజసాం రూపప్రకాశానాం. చక్షురింద్రియం అక్షిణీ నేత్రగోలకే. సర్వత్ర షష్ఠ్యంతానాం ప్రథమాంతం క్షేత్రం ద్రష్టవ్యం. కర్ణౌ శ్రోత్రాధిష్ఠానే. శ్రోత్రమింద్రియం.(3)

**తా.** అతని నేత్రేంద్రియము రూపములకు తేజస్సులకు, అతని నేత్రగోళములు స్వర్గమునకు సూర్యునకు, అతని చెవులు, దిక్కులకు తీర్థములకు, శ్రోత్రేంద్రియము ఆకాశమునకు, శబ్దమునకును ఉత్పత్తి స్థానములు.

**టీ** – రూపాణాం తేజసాం – రూప ప్రకాశములకును – చక్షురింద్రియము – నేత్రేంద్రియము అక్షిణీ – నేత్ర గోళములు – అంతటను షష్ఠీ విభక్త్యంతములగు పదములకు ప్రథమా విభక్త్యంతమగు క్షేత్రం – (ఉత్పత్తి స్థానము) అన్వయించుకొనవలయును – కర్ణౌ – శ్రోత్రాధిష్ఠానములగు చెవులు – శ్రోత్రం – శ్రోత్రేంద్రియము.(3)

తద్గాత్రం వస్తుసారాణాం
సౌభగస్య చ భాజనమ్ ।
త్వగస్య స్పర్శవాయోశ్చ
సర్వమేధస్య చైవ హి ॥ - 4

**తా.** విరాట్పురుషుని శరీరము వస్తువుల యొక్కయు వాని సారాంశముల యొక్కయు స్థానము, సర్వయజ్ఞరూపుడగు అతని చర్మము స్పర్శకును వాయువునకును జన్మస్థానము.

**టీ** :- తదితి. తస్య గాత్రం శరీరం. వస్తూనాం యే సారాంశాః తేషాం భాజనం స్థానం. అస్య త్వక్. స్పర్శస్య చ వాయోశ్చేత్యర్థః సర్వమేధస్య యజ్ఞస్య. (4)

**టీ** – తస్యగాత్రం – అతని శరీరము – వస్తూనాం – వస్తువుల యొక్క –యే సారాంశాః – ఏసారాంశములు గలవో వానికి – భాజనం – స్థానము – అస్యత్వక్ – అతని చర్మము– స్పర్శస్య – స్పర్శ యొక్క – వాయోః చ ఇత్యర్థః – గాలికిని (స్థానమని) అర్థము – సర్వస్య మేధస్య యజ్ఞస్య – అన్ని యజ్ఞములకును. (4)

రోమాణ్యుద్భిజ్జ జాతీనాం
యైర్వా యజ్ఞాస్తు సంభృతః ।
కేశశ్మశ్రు నఖాన్యస్య
శిలాలోహాభ్ర విద్యుతామ్ ॥ - 5

**తా.** అతని రోమములు అన్ని వృక్ష జాతులకును, ఏ వృక్ష జాతులతో యజ్ఞము చక్కగా సాధింపబడియుండునో వానికి గాని, వెంట్రుకలు, మీసములు, గోళ్ళు, ఱాతి యొక్కయు, లోహము (ఇనుము) యొక్కయు, బంగారము యొక్కయు, విద్యుత్తు యొక్కయు ఉత్పత్తి స్థానములు.

**టీ** :- రోమాణీతి. ఉద్భిజ్జజాతీనాం సర్వవృక్షాణాం యైరశ్వత్థోదుంబర ఖదిర పాలాశాది వృక్షైర్యజ్ఞస్సమ్యక్సాధితః తేషామేవవా. కేశామేఘానాం క్షేత్రం. పూర్వం తథోక్తే శ్మశ్రూణి విద్యుతాం పాద కర నఖాని శిలాలోహానామితి సాదృశ్యాదూహ్యం.(5)

**టీ** – ఉద్భిజ్జ జాతీనాం – సర్వవృక్షములకు – యైర్వృ క్షైర్యజ్ఞః సమ్యక్ సాధితఃతేషామేవవా – ఏ వృక్షములచే యజ్ఞము చక్కగా సాధింపబడునో వాని యొక్కయు గాని – కేశాః – మేఘములకు క్షేత్రము (పూర్వమట్లు చెప్పబడుట వలన) – శ్మశ్రూణి – మీసములు – విద్యుతామ్ విద్యుత్తులకు – పాదకరనఖాని – పాదములు, చేతులు, గోళ్ళు – శిలా లోహానామితి సాదృశ్యాద్దృష్టమ్ – ఱాయి, ఇనుము మొదలగువాని క్షేత్రమని పోలికవలన చూడబడినది. (5)

బాహవో లోకపాలానాం
ప్రాయశః క్షేమ కర్మణామ్ ।
విక్రమో భూర్భువః స్వశ్చ
క్షేమస్య శరణస్య చ ॥ - 6

**టీ** :- బాహవఇతి. క్షేమకర్మణాం పాలనకర్తౄణాం విక్రమః పాదన్యాసః. భూరాదిలోకానాం ఆస్పదం ఆశ్రయః. భూర్భువస్స్వరితి షష్ఠీబహువచనాంతం. భూరాదిశబ్దానామ వ్యయత్వాత్ షష్ఠ్యాలుక్. క్షేమః లబ్ధరక్షణ. శరణం భయాద్రక్షణం. (6)

సర్వకామ వరస్యాపి
హరేశ్చరణ ఆస్పదమ్ ।
అపాం వీర్యస్య సర్వస్య
పర్జన్యస్య ప్రజాపతేః ॥ - 7

**టీ** :- సర్వేతి. సర్వేషాం కామానాం పరస్య వరణస్యాపి హరేరంఘ్రిరాస్పదం. (7)

పుంసః శిశ్న ఉపస్థస్తు
ప్రజాత్యానంద నిర్వృతేః ।
పాయుర్యమస్య మిత్రస్య
పరిమోక్షస్య నారద! ॥ - 8

**తా.** ప్రాయికముగ లోకమునకు క్షేమమును కలిగించు కర్మలు చేయుచుండెడు లోకపాలురకు ఆ విరాడ్రూపుని బాహువులు, అతని పాదన్యాసము భూర్భువస్స్వర్లోకములకును, స్థానములు, ఆ లోకములకు క్షేమము కలిగించుటకును, శరణు పొందుటకును ఆతడే ఆశ్రయుడు.

**టీ** – క్షేమ కర్మణాం – పాలించు కార్యక్రమములకు, విక్రమః – పాదన్యాసము (అడుగు మోపుట) భూరాదిలోకానామాస్పదం – భూరాదిలోకములకు ఆశ్రయము, భూరాది శబ్దములకు అవ్యయత్వమువలన షష్ఠీ విభక్తి లోపము. క్షేమః – లబ్ధమైన దానిని రక్షించుట – శరణం – భయమునుండి రక్షణ కలిగించుట. (6)

**తా.** సమస్తములైన కోరికలు తీర్చుటకును హరి పాదములే స్థానము. జలమునకు వీర్యమునకు, సృష్టికిని, మేఘమునకును, ప్రజాపతికిని విరాట్పురుషుడే ఆధారము.

**టీ** – సర్వేషాం కామానాం, వరస్య – అందరికోరికల తీర్చుటకును – హరేః – హరి యొక్క – చరణః –పాదము – ఆస్పదమ్ – స్థానము (7)

**తా.** ఓ నారదా ! పురుషుని మేఢ్రము, ఇంద్రియము, సంతానార్థమైన సంభోగము, తాపశాంతికిని, మలవిసర్జన స్థానమునకు, యమునకు, సూర్యునకు, మల విసర్జనకు విరాట్పురుషుడే కారణము.

**టీ** :- అపామితి. వీర్యస్య శుక్లస్య శిశ్నః అధిష్ఠానం. ఉపస్తు ఇంద్రియం. ప్రజాత్యానందః సంతానార్థం సంభోగః. తేన నిర్వృతిః తాపహానిః తస్యాః. (8)

**టీ** - - వీర్యస్య - శుక్రమునకు - శిశ్నము అధిష్ఠానము - ఉపస్థ - ఇంద్రియము - ప్రజాత్యానందః - సంతానార్థమైన సంభోగము - దాని వలన - నిర్వృతిః - తాపశాంతి - తస్యాః - దానికి - (8)

హింసాయా నిర్ృతేర్మృత్యో
ర్నిరయస్య గుదః స్మృతః ।
పరాభూతే రధర్మస్య
తమసశ్చాపి పశ్చిమః ॥ - 9

**తా.** విరాట్పురుషుని విసర్జన స్థానము, హింసకు, అలక్ష్మికిని, మృత్యువునకు, దుర్గతికిని స్థానమని చెప్పబడినది. అట్లే అవమానమునకు, అధర్మమునకు, అజ్ఞానమునకును పృష్ఠ భాగము (వెనుక ప్రక్క) స్థానము.

**టీ**:- పాయురితి. పరిమోక్షస్య మలత్యాగస్య పాయురింద్రియం గుదః స్థానం నిరృతేః అలక్ష్యాః. (9)

**టీ** - పరిమోక్షస్య - మలత్యాగము యొక్క - పాయువు - ఇంద్రియము. గుదః - (విసర్జన) స్థానము, నిరృతేః అలక్ష్యాః - అలక్ష్మికి, .(9)

నాడ్యో నద నదీనాం తు
గోత్రాణామస్థి సంహతిః ।
అవ్యక్త రస సింధూనాం
భూతానాం నిధనస్య చ ॥ - 10

**తా.** అతని నాడులు నదీనదములకు, పర్వతములకు ఎముకల సమూహము, ప్రధానము, అన్నసారము, సముద్రములకు, భూతములకు, లయమునకు (విరాట్పురుషుని ఉదరము స్థానమని తరువాతి శ్లోకముతో అన్వయము)

**టీ** :- పరాభూతేరితి. తమసః అజ్ఞానస్య పశ్చిమం పృష్ఠభాగః గోత్రాణాం గిరీణాం అస్థిసంఘాతః. (10)

**టీ** - తమసః - అజ్ఞానమునకు - పశ్చిమః - వెనుక పార్శ్వము ఉదరం - పదం - స్థానము - విదితం - జ్ఞానులచే తెలియబడినది - గోత్రాణాం - పర్వతములకు - అస్థిసంఘాతః - ఎముకల సమూహము ౹(10)

ఉదరం విదితం పుంసో
హృదయం మనసః పదమ్ ।
ధర్మస్య మమ తుభ్యం చ
కుమారాణాం భవస్య చ ॥ -11

విజ్ఞానస్య చ సత్త్వస్య ।
పరస్యాత్మా పరాయణమ్ ।
అహం భవాన్భవశ్చైవ ।
త ఇమే మునయోఽగ్రజాః ॥ -12

**తా.** విరాట్పురుషుని ఉదరమని (ప్రధానాదుల స్థానము) జ్ఞానులకు తెలిసినదే. అస్మదాది లింగశరీరుల మనస్సు అతని హృదయ కోశము, ధర్మమునకు, నాకును నీకును, సనక సనందనాదులకు, రుద్రుని యొక్కయు, విజ్ఞానముకు, అంతఃకరణము, అన్నియు విరాడ్రూపుని హృదయము నాశ్రయించి యుండును. నేను, నీవు, శివుడు, ఈ దేవతలు, ఋషులు, నీకన్న ముందు పుట్టిన సనకాదులు (విరాట్పురుషుని భాగములే) (11,12)

**టీ** :- అవ్యక్తేతి. అవ్యక్తం ప్రధానం రసః అన్నాదిరసః. సింధవస్సముద్రాః తేషాం నిధనస్య లయస్య ఉదరం పదం స్థానం విదితం జ్ఞానిభిః. మనసః అస్మదాదిలింగశరీరస్య. ధర్మస్యేతి తుభ్యం తవ కుమారాణాం సనకాదీనాం. భవస్య రుద్రస్య. ఆత్మా చిత్తం పరమాయనం. ఏవం తావత్పరమేశ్వరాజ్ఞాతం విశ్వం తతో న భిన్నం. సతు సర్వస్య నియంతా సర్వప్రకాశో నిత్యముక్త ఇత్యర్థాదుక్తం. (11, 12,)

**టీ** – – అవ్యక్తం – ప్రధానము – రసః – అన్నాదుల సారము – సింధవః – సముద్రములు – తేషాం – వానికి – నిధనస్య – లయమునక తుభ్యం – నీ (షష్ఠ్యర్థమున చతుర్థి) కుమారాణాం – సనకాదుల యొక్క – భవస్య – రుద్రుని యొక్క – (పరస్య – విరాట్పురుషుని) ఆత్మా – చిత్తం – పరాయణం – ఉత్కృష్టమైన ఆశ్రయము – ఈ విధముగ ఇంతవఱకు పరమేశ్వరునిచే ఆజ్ఞాపింపబడిన విశ్వము ఆయన కంటె భిన్నమైనది కాదు. అతడు సర్వమును నియమించువాడు. సర్వప్రకాశుడు, అనగా నిత్యముక్తుడని చెప్పబడినది. (11,12)

సురాసుర నరా నాగాః
ఖగా మృగ సరీసృపాః ।
గంధర్వాప్సరసో యక్షా
రక్షోభూత గణోరగాః ॥ - 13

**తా.** దేవతలు, రాక్షసులు, మనుష్యులు, నాగులు, పక్షులు, మృగములు, సర్పములు, గంధర్వులు, అప్సరలు, యక్షులు, రాక్షసులు, భూత గణములు, పాములు (13) పశువులు, పితరులు సిద్ధులు, విద్యాధరులు, చారణులు, వృక్షములు, ఇతరములైన వివిధములైన జీవ

పశవః పితరః సిద్ధా
విద్యాధ్రాశ్చారణా ద్రుమాః ।
అన్యేచ వివిధా జీవా
జలస్థల నభౌకస : ॥ - 14

గ్రహర్క్ష కేతవస్తారా
స్తడితః స్తన యిత్నవః ।
సర్వం పరుష ఏవేదం
భూతం భవ్యం భవచ్చ యత్ ॥-15

**టీ** :- తదేవ పురుషసూక్తార్థ కథనేన దృఢయతి - తత్ర సహస్రశీర్షేత్యర్థర్చస్య. శ్రు. "బ్రాహ్మణో ఽ స్య ముఖమాసీ" దిత్యాదేశ్చ ఋగ్గణస్యార్థః పూర్వాధ్యాయ ఏవ దర్శితః. శ్రు."పురుష ఏవేదగ్ం సర్వ" మిత్యస్యార్థం దర్శయతి - సార్ధైస్త్రిభిఃఅహమితి. తే అగ్రజాఇతి సనకాదయో మరీచ్యాదయశ్చ నాగాః గజాః.(13)

**టీ** :- గంధర్వేతి. భూతగణాః శివపార్షదాః. ఉరగాస్సర్పజాత యస్సర్వే ఽ పి. పశవః చతుష్పాదః పితృప్రభృతయశ్చత్వారో దేవేష్వవాంతరభేదాః. (14) అన్యఇతి. జలం చ స్థలం చ నభశ్చ ఓకాంసి యేషాం తే జలౌకసో మత్స్యాదయః. స్థలౌకసః స్థలవాసినః సర్వే ఽ పి ప్రాణినః. నభౌకసఇతి సంధిరార్షః. (15)

సంతతులు, నీటి యందు, భూమిపైన, ఆకాశమునందు చరించునవి (14) గ్రహములు, నక్షత్రములు, ఛాయా గ్రహములు, మెఱుపులు, ఉరుములు - ఇట్టివి అన్నియును ఈ విరాట్పురుషుడే - గడచినవి, రాబోవునని ఉన్నవి అన్నియు ఈ పురుషుడే. (15)

**టీ** - కుండలమెట్లు బంగారము నుండి వేఱుకాదో అట్లే విశ్వమంతయును ఆ పురుషున కన్న వేఱైనది కాదు. అతడు అన్నింటిని నియమించువాడు. సర్వమును ప్రకాశింపజేయువాడు, అనగా అతడు నిత్యముక్తుడని చెప్పబడినది. ఇది అంతయును పురుషసూక్తము నందలి అర్థముతో వివరింపబడి దృఢీకరింపబడినది. అందలి 'సహస్ర శీర్షా' అను మొదలగు సగము ఋక్కునకు, బ్రాహ్మణోఽ స్య ముఖమాసీత్' అను మంత్రము మొదలుకొనియు మూడు ఋక్కుల అర్థము పూర్వాధ్యాయముననే చూపబడినది. 'పురుష -ఏవేదం సర్వం' మొదలగువాని అర్థమిట చూపబడుచున్నది. 'అహం భవాన్' అను మొదలుగ మూడు శ్లోకములతో ప్రదర్శింపబడుచున్నది. తే - నీ యొక్క - అగ్రజాః - ఈ సనకాదులు మరీచ్యాదులు కూడ జలము, స్థలము, ఆకాశము స్థానముగా గలవి - నభౌకస అనుసంధి ఆర్షము - ((12, 13,14,15)

తేనేదమావృతం విశ్వం
వితస్తిమధితిష్ఠతి ।
స్వాధిష్ణ్యం ప్రతపన్ప్రాణో
బహిశ్చ ప్రతపత్యసౌ ॥ -16

**తా–** ఈ విశ్వము పది అంగుళముల ప్రమాణముగ ఆ విరాట్పురుషుని చే ఆవరింపబడియున్నది. సూర్యమండలమెట్లు తనను తాను ప్రకాశింపజేసికొనుచును బాహిర ప్రపంచమును ప్రకాశింపజేయునో ఈ పరమాత్ముడు కూడ తన విరాట్స్వరూపమును ప్రకాశింపజేసికొనుచును అంతర్బహిస్సుల యందును ప్రకాశించుచున్నాడు.

**టీ** :- సర్వమితి. సర్వం పురుష ఏవ న తతః పృథగిత్యర్థఃజ ప్రపంచేన తస్యాపరిచ్ఛేదం వక్తుం సభూమిమిత్యస్యార్థమాహ – తత్పదం విభక్తివ్యత్యేయేన వ్యాచష్టే – తేనేతి. తేన పురుషేణ విశ్వమితి భూమిపదస్యార్థః. వితస్తిమితి ద్వాదశాంగులపదస్య అధీత్యతిశబ్దస్య ఆవృతమితి వృత్యేత్యస్య సచ వితస్తిమధికం వ్యాప్య తిష్ఠతీత్యాధిక్యమాత్రం వివక్షితం నప్రమాణం. అనుపయోగాదపరిచ్ఛిన్నత్వచ్చ. (16)

**టీ –** ఈ సర్వమును ఈ పురుషుడే – అతని కన్న వేఱైన దేదియు లేదని అర్థము. ప్రపంచముతో అతని అభిన్నత్వమును చెప్పుటకు 'సభూమిం' అను మంత్ర భాగమునకు అర్థము చెప్పుచున్నాడు. – తేన – ఆ పురుషునిచే – విశ్వమని భూమి పదమునకు అర్థము. వితస్తిం అని దశాంగుల పదమున కర్థము. అధియని అతి శబ్దమునకర్థము ఆవృతం అని వృత్య అను శబ్దమునకర్థము – స చ వితస్తిమధికం వ్యాప్య తిష్ఠతి. అతడు పది అంగుళములు అధికముగ వ్యాపించి యుండును అని చెప్పుటలో అతని ఆధిక్యమే వివక్షితమైనది కాని పరిమాణముకాదు. అనుపయోగాత్ – అపరిచ్ఛిన్నత్వము వలన (16)

ఏవం విరాజం ప్రతపం
స్తపత్యంతర్బహిః పుమాన్ ।
సోఽమృతస్యాభయస్యేశో
మర్త్యమన్నం యదత్యగాత్ ॥ -17

**తా.** ఈ విధముగ ఆ పురుషుడు విరాట్స్వరూపమును ప్రకాశింపజేయుచు, అంతర్బహిస్సులను కూడ ప్రకాశింపజేయుచుండును. అతడు అమృతమగు మోక్ష స్థానమునకు ప్రభువు. అతడు మరణధర్మము గల మనుష్యుని యొక్క కర్మఫలభోక్తృత్వమును అతిక్రమించి యున్నవాడు.

**టీ** :- ఏతత్సదృష్టాంతమాహ –స్వధిష్ణ్యమితి. అసౌ ప్రాణః ఆదిత్యః శ్రు. " అసావాదిత్యః ప్రాణః " ఇతి శ్రుతేః. స్వధిష్ణ్యం మండలం ప్రకాశయన్ బహిశ్చ ప్రకాశయతి. ఏవం విరాడ్దేహం

**టీ –** – దీనిని దృష్టాంతముతో చెప్పుచున్నాడు – 'ఈ సూర్యుడు ప్రాణము'. 'ఈ ఆదిత్యుడు ప్రాణము' అను శ్రుతి వాక్యము వలన – స్వాధిష్ణ్యం – మండలము– ప్రకాశయన్ – ప్రకాశింపజేయుచు – యథా బహిశ్చ ప్రకాశయతి – ఎట్లు వెలుపల కూడ ప్రకాశింపజేయునో

ప్రకాశయన్. బ్రహ్మాండమంతర్బహిశ్చ ప్రకాశయతి.(17)

– ఏవం విరాట్ దేహం – అట్లే విరాట్ శరీరమును – ప్రకాశయన్ – ప్రకాశింపజేయుచు బ్రహ్మాండము యొక్క అంతర్బహిస్సుల యందును – ప్రకాశయతి – ప్రకాశింపజేయును.(17)

మహిమైష తతో బ్రహ్మన్ !
పురుషస్య దురత్యయః ।
పాదేషు సర్వభూతాని
పుంసః స్థితి పదో విదుః । **- 18**

**తా.** ఓ నారదా! ఆ పరమపురుషుని మహిమ అపారమైనది. అతని పాదములయందు, సర్వభూతములును ఒక పాదమాత్రము స్థితి కలిగియున్నవని తెలియుదురు.

**టీ** :-నిత్యముక్తత్వం దర్శయితుం ఉతామృతత్వస్యేత్యస్యార్థమాహ – సఇతి. అభయస్యేతి మంత్రగతామృతత్వపదవ్యాఖ్యా. అన్నేనేతి పదం విభక్తివ్యత్యయేన వ్యాచష్టే – మర్త్యం మరణధర్మకం అన్నం కర్మఫలం యస్మాదత్యగాత్ అతిక్రమ్య స్థితః అతోన కేవలం సర్వాత్మకః కింతు అమృతత్వస్య నిజానందస్యాపి ఈశ్వర ఇత్యర్థ. నను ప్రపంచాత్మకస్య కుతో నిత్యముక్తత్వమిత్యాశంక్య తత్పరిహారాయ ‘ ఏతావానస్యే’ త్యస్యార్థమాహ – ప్రపంచాత్మకస్యాప్యమృతత్వేశత్వమిత్యేష మహిమా దురత్యయః అపారః అప్రపంచానభిభూతత్వాదితి భావః. మంత్రేణ చ. శ్రు. “ ఏతావానస్య మహిమావిభూతిః – సతు జ్యాయాన్ మహత్తర” ఇతి వదతా అయమేవార్థ ఉక్తః. (18)

టీ :– అతని నిత్యముక్తత్వమును చూపుటకు ‘ఉతామృతస్య’ అను మంత్రభాగమునకర్థము చెప్పుచున్నాడు. ‘అభయస్య’ అని మంత్రము నందలి ‘అమృత’ పదమునకు వ్యాఖ్య – అన్నేన అనుపదమును విభక్తి వ్యత్యయముతో చెప్పెను. మర్త్యం – మరణ ధర్ముగల – మనుష్యుని – అన్నం – కర్మఫలము – దాని నుండి – అత్యగాత్ – అతిక్రమించిన వాడయ్యెను. అందువలన కేవలము సర్వకర్తమాత్రమే కాక, సర్వాత్మకుడేకాక తన – అమృతత్వస్య – స్వరూపమగు ఆనందమునుకును ప్రభువే అని యర్థము. ప్రపంచాత్మకునకు నిత్యముక్తత్వమెందులకని ఆశంకించి, దాని పరిహారముశ్లోకముతో – ప్రపంచాత్మకునకు కూడ అమృతేశత్వమని యిట్టి మహిమ – దురత్యయా – అపారమైనది. ప్రపంచమునకు కేంద్ర స్థానత్వము వలననని భావము. మంత్రము చేత కూడ ఏతావానస్య మహిమా – విభూతి – అది, జ్యాయాన్ – మహత్తరమైనది– (18)

అమృతం క్షేమమభయం
త్రిమూర్ధ్నో ఉ ధాయి మూర్ధసు।
పాదాస్త్రయో బహిశ్చాసన్న
ప్రజానాం య ఆశ్రమాః।
అంతస్త్రిలోక్యాస్త్వపరో
గృహమేధో ఉ బృహద్వ్రతః॥ - 19

**టీ** :- తదేవమీశ్వరో నిత్యముక్త ఇత్యుక్తం తదాశ్రితానాం భూతానాం బంధమోక్షౌ వ్యవస్థయేతి దర్శయన్ పాదోస్య విశ్వాభూతానీత్యస్యార్థమాహ – పాదేష్వితి. తిష్ఠంత్యత్రేతి స్థితయో భూరాదిలోకాః తే పాదా ఇవపాదా అంశాః యస్య సః స్థితిపాత్తస్య పాదేషు అంశభూతేషు లోకేషు సర్వభూతాని జీవాన్విదుః. మంత్రేతు పాదోస్య విశ్వాభూతానీతి సామానాధికరణ్యం అధిష్ఠానాధిష్ఠేయ యోరభేదేన వివక్షయా పాద ఇత్యేకవచనం సామాన్యాభిప్రాయేణేతి వ్యాఖ్యాతం భవతి తేషు ఫలవైచిత్ర్యం దర్శయన్ త్రిపాదస్యామృతం దివీత్యస్యార్థమాహ – అస్యేశ్వరస్య సంబంధి త్రిపాదమృతం నిత్యసుఖం దివి ఊర్ధ్వలోకేషు న త్రిలోక్యామిత్యర్థః. తదేవ త్రిపాచ్ఛబ్దోక్తం త్రైవిధ్యం దర్శయన్నాహ – త్రయాణాం లోకానాం మూర్ధామహర్లోకః తస్య మూర్ధానః తదుపరితనా లోకాః తేషు యథాక్రమమమృతాదికమధాయి నిహితం తత్ర త్రిలోక్యాం నశ్వరమేవ సుఖం. జనలోకేత్వమృతం అవినాశి సుఖం యావజ్జీవం స్వస్థానాపరిత్యాగాత్. కిం తు మహర్లోకనివాసినాం

**తా.** భూర్భువస్స్వర్లోకముల పైన గల మహర్లోకమునకును పైన గల జనలోక, తపోలోక, సత్యలోకములయందు క్రమముగ, అమృతము, క్షేమము, అభయము (మోక్షము) అనునవి విహితములైయున్నవి. ఇక మూడు పాదముల (ముప్పాతిక) భాగము వెలుపల నున్నవి. అందు ప్రజోత్పత్తి కార్యములతో సంబంధములేని నైష్ఠిక బ్రహ్మచారులు వానప్రస్థులు, యతీశ్వరులు ఉందురు. బ్రహ్మచర్యవ్రత రహితులగు గృహమేధులు (గృహస్థాశ్రములు) ఉండెడునట్టివి అంతర్భాగమున గల మూడులోకములు.

**టీ.** అని చెప్పుచు ఇదే అర్థము చెప్పబడినది. ఆ కారణమున ఈశ్వరుడు నిత్యముక్తుడని చెప్పబడినది. "తదాశ్రితానాం భూతానాం బంధమోక్షౌ వ్యవస్థయా' (అతని నాశ్రయించిన ప్రాణులకు వ్యవస్థచే బంధమోక్షములు కలుగును) అని చూపుచు 'పాదోఉ స్య విశ్వాభూతాని' (విశ్వమునందలి భూతములన్నియు అతనిలో పాద(1/4) భాగము మాత్రమే) అనుదాని అర్థమును 'పాదేషు' అనుచు చెప్పుచున్నాడు. – తిష్ఠంత్యత్రేతి స్థితయః – ఇట నుండునవి కావున స్థితులు – భూరాదిలోకాః తేపాదా ఇవ పాదా అంశాయస్య సః – స్థితిపాత్ తస్య పాదేష్వంశ భూతేషు లోకేషు సర్వాన్ జీవాన్ విదుః – 'భూః' మొదలగు లోకములు – అవి పాదముల వలె – భాగముల వలె కలవాడు స్థితిపాత్ – అతని పాదములందు – భాగముల వంటి వానియందు – లోకములందు అన్ని జీవులను – లేక అందఱి జీవులను గ్రహింతురు – మంత్రేషు – మంత్రమునందైననో 'పాదో ఉ స్యవిశ్వా భూతాని' అని అధిష్ఠాన అధిష్ఠేయములకు సామానాధికరణ్యము చేసి చెప్పుటకు ఇచ్ఛయించుట చేత 'పాదః' అని ఏకవచనము, సామాన్యాభిప్రాయము చేతనని వ్యాఖ్యానింపబడిన దగును. ప్రాణులయందు ఫలవైచిత్ర్యమును చూపుచు 'త్రిపాదస్యామృతందివి' అను దాని అర్థము చెప్పుచున్నాడు. ఈశ్వర సంబంధమైన మూడు భాగముల అమృతం – నిత్యసుఖము – దివి – ఊర్ధ్వలోకములందు



కల్పాంతే త్రైలోక్యదాహోష్మపీడితానాం తదా తత్ర గమనాదక్షేమ దర్శనమస్తి తపోలోకే తస్యాభావాత్ క్షేమమేవ. శ్రుతిహి – శ్లో "త్రిలోక్యాం దహ్యమానాయాం శక్త్యా సంకర్షణాగ్నినా, యాంత్యూష్మణా మహర్లోకాజ్జనం భృగ్వాదయో ౾ ర్దితాః" ఇతి. సత్యలోకేత్వభయం మోక్షః తత్రప్రత్యాసత్తేః.(19)

– కాని మూడు లోకములందు కాదని యర్థము. దానినే త్రిపాచ్ఛందఉక్తమగు త్రైవిధ్యమును చూపుచు చెప్పుచున్నాడు. మూడు లోకములకు పైన మహర్లోకము, దానికిని పైన నుండు లోకములందు (జనలోక తపోలోక సత్యలోకములందు) క్రమముగ అమృతము మొదలగునవి ఉంచబడినవి. అచట త్రైలోక్యము నందలి సుఖము నశ్వరమైనదే. మహర్లోకమునకు క్రమముక్తి స్థానత్వమున్నను, కల్పాంతమునందు ఆ మూడు లోకముల యొక్క స్థానములను విడిచి పెట్టవలసియుండును కావున అచట కూడ శాశ్వత సుఖము లేదు. జనలోకమునందు అవినాశి సుఖము కలదు. యావజ్జీవము స్వస్థాన పరిత్యాగము లేదు కావున – కాని మహర్లోక వాసులకు కల్పాంతమునందు, త్రిలోకతాపాదులచే పీడింపబడిన వారలకు అప్పుడు అచట జనలోకగమనము వలని అక్షేమము కనబడును. తపోలోకమునందు అది లేకపోవుటచే క్షేమమే, చెప్పుచున్నాడు గదా. 'ముల్లోకములందు సంకర్షణాగ్ని శక్తి చేత తపింపజేయబడిన వారలై ఆ ఊష్మము చేత పీడింపబడి మహర్లోకమునుండి భృగ్వాదులు జన లోకమునకుఁబోయెదరు'. సత్యలోకమునందైననో అభయమే – అనగా మోక్షమే. (19)

సృతీ విచక్రమే విష్వఙ్
సాశనానశనే ఉభే ।
యదవిద్యా చ విద్యా చ
పురుషస్తూభయాశ్రయః ॥ - 20

**తా.** ఆ పరమపురుషుడు, భోగాపవర్గ ప్రాప్తి సాధనములగు రెండు మార్గములను నడచుచుండును. కర్మరూపమగు అవిద్యయును, ఉపాసన రూపమగు విద్యయును – ఈ రెండును అతని నాశ్రయించియే యుండును.

**టీ** :- ఏతదేవ వైచిత్ర్యమధికారభేదేన ఉపాదయన్. త్రిపాదూర్ధ్వ మిత్యస్యార్థమాహ – పాదాఇతి. న ప్రజాయంతే పుత్రాది రూపేణేత్యప్రజాః నైష్ఠిక బ్రహ్మచారి వానప్రస్థయతయః తేషామాశ్రమాః. త్రిలోక్యా బహిరాసన్. గృహమేధస్త్వంతః

టీ :- దానికి బదులుగ కలుగు లాభము వలన – ఈ వైచిత్ర్యమునే అధికారి భేదముచే నుపపాదించుచు 'త్రిపాదూర్ధ్వ' అను మొదలగుదాని అర్థము చెప్పుచున్నాడు – పుత్రాదుల జన్మమునకు కారకులు కారు కావున 'అప్రజాః' – నైష్ఠిక బ్రహ్మచారులు, వానప్రస్థులు, యతులు

యస్మాదబృహద్వ్రతః బ్రహ్మచర్యవ్రతరహితః అయం చాధికారిభేదః (20)

యస్మాదండం విరాట్ జజ్ఞే,
భూతేంద్రియ గుణాత్మకః।
తద్ద్రవ్యమత్యగాద్విశ్వం
గోభిః సూర్య ఇవా తపన్ ॥ - 21

**టీ** :- ఏకస్యైవ అవస్థానభేదేన న త్వత్యంతభిన్నవిషయః ఇతి దర్శయన్. "తతో విష్వఙ్ వ్యక్రామ" దిత్యస్యార్థమాహ – సృతీఇతి. వివిధం సుష్ఠు అంచతీతి విష్వఙ్ పురుషః క్షేత్రజ్ఞః సృతీ మార్గౌ దక్షిణోత్తరౌ. విచక్రమే చలతిస్మ. కథంభూతే సృతీ? సాశనానశనే భోగాపవర్గప్రాప్తిసాధనభూతే. తత్ర హేతుత్వేన పునర్విశేషణం. యత్ యతః అవిద్యా కర్మరూపా ఏకా విద్యా చ తత్సాధనోపాసనారూపా అన్యా. (21)

యదా ఽ స్య నాభ్యాన్నలినా
దహమాసం మహాత్మనః।
నా విదం యజ్ఞ సంభారా
న్పురుషావయవాదృతే ॥ - 22

– ఇట్టివీరి నివాసములు, మూడు లోకముల కన్నను అవతల ఉండును. గృహస్థుల నివాసములు లోపలనే ఉండును. అబృహద్వ్రతులగుటచే అట్టివారు బ్రహ్మచర్య వ్రతము లేని వారు.(20)

**తా.** ఏ పరమాత్మనుండి అండము పుట్టినదో, అచటనే భూతములు, ఇంద్రియములు గుణములతో గూడిన విరాట్టు కూడ పుట్టెను. ఆ ఈశ్వరుడు అండమును మరియు విశ్వమును – సూర్యుడు తన కిరణములతో తాను ప్రకాశించుచును సర్వమును ప్రకాశింప జేయుచుండు విధమున – అంతర్బహిస్సులలో వ్యాపించియు – వాని కంటె అతీతుడై కూడ ఉన్నాడు.

**టీ** – ఇది అధికార భేదము, ఒకే గమ్యము యొక్క అవస్థాభేదము చేతనే కాని ఇవి రెండు అత్యంత భిన్నములు కావు అని చూపుచు తతో విష్వఙ్ అను దాని అర్థమును చెప్పుచున్నాడు. – వివిధం సుష్ఠు అంచతీతి, విష్వఙ్, పురుషః – వివిధములగు పదార్థములను చక్కగా పొందును కావున విష్వఙ్ – పురుషుడు – క్షేత్రజ్ఞుడు, – సృతీ – రెండు మార్గములు. దక్షిణ, ఉత్తర మార్గములు – విచక్రమే – స్మ – నడచును – కథంభూతే సృతీ – ఆ మార్గము లెట్టివి? సాశనానశనే (స+అశన, అనశనములు) భోగ, మోక్ష ప్రాప్తిసాధన భూతములు. (భోగ+అపవర్గ ప్రాప్తి సాధన భూతే) ఇచట కారణత్వము చేత మఱల విశేషణములు. ఒకటి కర్మరూపమగుట వలన అవిద్యా – మఱియొకటి మోక్ష సాధన రూపమగు విద్యా – ఉపాసన రూపమైనది.(21

**తా.** ఎప్పుడు మహాత్ముడైన అతని నాభికమలము నుండి నేను వెలువడితినో, అప్పుడు యజ్ఞ సంభారములు – ఆ పురుషుని అవయవములు తప్ప – ఏవియు చూడలేక పోయితిని. (యజ్ఞ సాధనము లెవ్వియు కనబడకుండెను)

**టీ** :- తదేవం విరాడంతర్వర్తినాం ఫలవైచిత్ర్యముక్త్వా తత్కారణస్యేశ్వరస్య తద్వైలక్షణ్యం దర్శయితుం. శ్రు. 'తస్మాద్విరాడజాయతే' తస్యార్థమాహ - యస్మాదితి. యస్మాదండం జజ్ఞే తత్ర భూతేంద్రియ గుణాత్మకో విరాట్ జజ్ఞే స ఈశ్వరః తద్విశ్వం విరాడ్దేహం. ద్రవ్యం అండం చ. అతిక్రాంతాన్. సూర్య ఇవేతి పూర్వోక్తమేవ దృష్టాంతమాహ. (22)

**టీ.** - ఈ విధముగ విరాట్‌దేహాంతర్వర్తి యొక్క ఫల వైచిత్ర్యమును గూర్చి చెప్పి, దానికి కారణరూపుడగు ఈశ్వరుని విలక్షణత్వమును చూపుటకు 'తస్మాద్విరాడజాయత' అనుదాని అర్థమును చెప్పుచున్నాడు - యస్మాదండం జజ్ఞే ఎవని వలన అండము పుట్టినదో - తత్ర చ భూతేంద్రియ గుణాత్మకో విరాట్ - చ జజ్ఞే - అచటనే ప్రాణములు, ఇంద్రియములు, గుణములుమున్నగువానితోకూడిన విరాట్టు కూడ పుట్టెను. (వివిధాని వస్తూని రాజంతేఽత్రేతి విరాట్ - (బ్రహ్మాండదేహుడు) ద్రవ్యం - అండమును కూడ - అత్యగాత్ - అతిక్రమించెను - సూర్య ఇవేతి పూర్వోక్త ఏవ దృష్టాంతః - సూర్యునివలె అని పూర్వము చెప్పిన దృష్టాంతమే. (22)

తేషు యజ్ఞస్య పశవః
సవనస్పతయః కుశాః ।
ఇదం చ దేవ యజనం
కాలశ్చోరుగుణాన్వితః ॥ - 23

**తా.** ఆ పురుషుని అవయములయందే యజ్ఞపశువులు, యూపస్తంభములు, కుశలు, యజ్ఞభూమి, యోగ్యమైన కాలము - వీనినన్నింటిని కల్పించితిని.

**టీ** :- నన్వేవం పురుష ఏవచేత్తత్సర్వం తర్హి యజ్ఞస్య తత్సాధనానాం చ అపృథగ్భావాత్ యజ్ఞైః పురుషారాధనం న సిధ్యేదిత్యాశంక్య తత్పరిహారాయ యత్పురుషేణేతి మంత్రార్థం సంగృహ్య దర్శయతి - యదేతి. అస్యేతి విరాడంతర్యామిణః తస్యైవ ప్రకృతత్వాత్. నాభౌ భవం నాభ్యం తస్మాద్యజ్ఞస్య సంభారాన్ నాపశ్యం. తదా తేషు సంభారేషు సాధ్యేషు సత్సు పురుషావయవై రేవ సంభారాస్సంభృతా ఇతి చతుర్థేనాన్వయః (23)

**టీ** - ఈ విధముగ ఈ పురుషుడే సర్వస్వమనుట నిశ్చయమే అయిన యెడల యజ్ఞములకు యజ్ఞసాధనములకును యజ్ఞములతో భేదము లేనందువలన, పురుషుని ఆరాధనము సిద్ధింపజాలదు కదా అని ఆశంకించి - దాని పరిహారము కొఱకు 'యత్పురుషేణ హవిషా' ఇత్యాది గల మంత్రము యొక్క అర్థమును స్వీకరించి చూపుచున్నాడు. 'యదా' అను ఈ శ్లోకముతో - అస్య - విరాట్ అంతర్యామి యొక్క అతని విషయమే ప్రస్తుతాంశము కావున - నాభౌభవంనాభ్యం తస్మాత్ - నాభి యందు పుట్టినది నాభ్యం - దాని నుండి (నాభ్యాత్) - యజ్ఞస్య సంభారాన్ - యజ్ఞ సంబంధములగు సాధనములను - నావిదం - తెలియకుంటిని. (23)

వస్తూన్యోషధయః స్నేహా
రసలోహ మృదోజలమ్ ।
ఋచో యజూంషి సామాని
చాతుర్హోత్రం చ సత్తమ ! ॥ -24

**తా.** ముని శ్రేష్ఠుడా! యజ్ఞము కొఱకు కావలసిన పాత్రలు, ఓషధులు, నేయి, రసములు, లోహము, మట్టి, నీరు, ఋక్కులు, యజుస్సులు, సామములు, నలుగురు హోతలు - వారి కర్మ

**టీ :-** తానేవ దర్శయతి - తేష్వితి. వనస్పతయో యూపాః దేవయజనం యజ్ఞభూమిః ఇదం చేతి వచనాత్ యజ్ఞార్హే స్థానే ఉపవిష్టః కథయతీతి గమ్యతే. బహుగుణాన్వితః వసంతాదికాలః (24)

**టీ -** తదా తేషు సంభారేషు - అప్పుడా యజ్ఞసాధ్యములవసరపడియుండగా 'పురుషుని అవయవములచేతనే సంభారములు చక్కగా భరింపబడినవి' అవి యజ్ఞము కొఱకు అని అన్వయము - వనస్పతయః - యూపములు - దేవ యజనం - యజ్ఞ భూమి - 'ఇదం' అను మాట వలన యజ్ఞమునకు అర్హమైన స్థానమునందు కూర్చుండి చెప్పుచున్నాడని తెలియుచున్నది. బహుగుణాన్వితః - వసంతాది కాలము. (24)

నామధేయాని మంత్రాశ్చ
దక్షిణాశ్చ వ్రతాని చ ।
దేవతానుక్రమః కల్పః
సంకల్పస్తంత్రమేవ చ ॥ - 25

**తా.** జ్యోతిష్టోమాది నామధేయములు, స్వాహాకారములకు చెప్పవలసిన మంత్రములు దక్షిణలు, వ్రతములు, దేవతల అనుక్రమము, కర్మపద్ధతి గ్రంథము, సంకల్పము, అనుష్ఠింపవలసిన ప్రకారము.

**టీ :-** వస్తూనీతి. వస్తూని పాత్రాదీని. ఓషధయః వ్రీహ్యాదయః స్నేహాః ఘృతాదయః రసాః మధురాదయః సువర్ణాదీని లోహాని. మృదశ్చ. చాతుర్హోత్రం హౌత్రాదికం కర్మ. (25)

**టీ -** వస్తూని - పాత్రలు మొదలగునవి - ఓషధయః - ధాన్యములు మొదలగునవి- స్నేహాః - ఘృతము మొదలగునవి - రసాః - మధురాదిషడ్రసములు, లోహాని - బంగారము మొదలగునవి - మృదః (మట్టి) జలంచ (నీరు కూడ) - చాతుర్హోత్రం - హోత్రాదికమగు కర్మ.(25)

గతయో మతయశ్చైవ
ప్రాయశ్చిత్తం సమర్పణమ్ ।
పురుషావయవైరేతే
సంభారా సంభృతా మయా ॥ - 26

**తా.** విష్ణు క్రమాదులు, దేవతాధ్యానములు, ప్రాయశ్చిత్తములు, చేసిన కర్మను భగవానునకు సమర్పించుట, ఇవి యన్నియు పురుషుని అవయవముల చేతనే నేను సంపాదించితిని.

**టీ** :- నామధేయానీతి. తానుక్రమః ఉద్దేశః కల్పః బోధయనాది కర్మ పద్ధతి గ్రంథః. అనేనాహం యక్ష్య ఇతి సంకల్పఃతంత్ర మనుష్ఠానప్రకారః. (26)

**టీ** – నామధేయాని – జ్యోతిష్టోమము మొదలగు పేర్లు, ఋగాదులు చెప్పబడి యుండుటచేత మంత్రాః అని స్వాహాకారములు మొదలగునవి, – దేవతానామనుక్రమః – ఉద్దేశము, కల్పః – బోధాయనాదుల కర్మపద్ధతిని వివరించు గ్రంథము – సంకల్పః – 'అనేన అహం యక్ష్యే" వంటి సంకల్పము – తంత్రం – అనుష్ఠించు క్రమము.(26)

ఇతి సంభృత సంభారః
పురుషావయవైరహమ్ ।
తమేవ పురుషం యజ్ఞం
తేనైవాయజ మీశ్వరమ్ ॥ - 27

**తా.** ఇట్లు నేను ఆ పురుషుని అవయవముల తోడనే యజ్ఞం సంభారములను సంపాదించి, అతనినే యజ్ఞపురుషునిగ భావించి అతని చేతనే అతనిని – ఆ ప్రభువును పూజించితిని.

**టీ** :- గతయ ఇతి. గతయః విషుక్రమాద్యాః మతయః దేవతాధ్యానాని ప్రాయశ్చిత్తం భూర్భువస్స్వరాదికృతస్య భగవతి సమర్పణం. (27)

**టీ** – గతయః – విష్ణు క్రమాదులు, మతయ :– దేవతాధ్యానములు, చేసిన కర్మను భగవంతునకర్పించుట సమర్పణము! (27)

తతస్తే భ్రాతరఇమే
ప్రజానాంపతయో నవ ।
అయజన్వ్యక్త మవ్యక్తం
పురుషం సుసమాహితాః ॥ - 28

**తా.** అప్పుడు నా సోదరులైన ప్రజాపతులు తొమ్మండుగురు (మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు, దక్షుడు) ఆ, వ్యక్త, అవ్యక్త రూపమున గల పురుషుని ఏకాగ్రచిత్తులై యజించిరి.

**టీ** :- ఇతీతి. సంభృతాః సంపాదితాః సంభారాః యేన సోహం. తేనైవ యజ్ఞేనైవ అనేన. శ్రు. ' యజ్ఞేన యజ్ఞమయజంతదేవవా' ఇతి మంత్రార్థస్సూచితః. (28)

**టీ** – సంభృతాః – సంపాదింపబడినవి – సంభారాః యేనసోఽహం – యజ్ఞసాధనములు ఎవనిచే సంపాదింపబడెనో అట్టి నేను – తేనైవ – యజ్ఞము చేతనే – దీనితో 'యజ్ఞేన యజ్ఞమయజంత' అనెడు మంత్రము యొక్క అర్థము సూచింపబడినది. (28)

తతశ్చ మనవః కాలే
ఈజిరే ఋషయోఽ పరే ।
పితరో విబుధా దైత్యా
మనుష్యాః క్రతుభిర్విభుమ్ ॥ - 29

**తా.** అటుపిమ్మట తమ తమ కాలములయందు మనువులు, ఋషులు, పితరులు, దేవతలు, దైత్యులు, మనుష్యులును ఆ ప్రభువును యజ్ఞములచే పూజించిరి.

**టీ** :- తేన దేవా అయజంతేత్యస్యార్థం సప్రపంచం దర్శయతి ద్వాభ్యాం. తతఇతి. వ్యక్తం ఇంద్రియాదిరూపేణ అవ్యక్తం స్వతః అనేన పురుషంజాతమగ్రత ఇత్యస్యార్థో దర్శితః. (29)

**టీ** – 'తేన దేవా అయజంత' అను దీని అర్థమును, స ప్రపంచముగ చూపుచున్నాడు. 'తతః' అని రెండు శ్లోకములతో – వ్యక్తం – ఇంద్రాది రూపముతో – అవ్యక్తం స్వతః దీనితో 'పురుషం జాతమగ్రతః' అనుదాని అర్థము చెప్పఁబడినది.(29)

నారాయణే భగవతి
తదిదం విశ్వమాహితమ్ ।
గృహీత మాయోరుగణాః
సర్గాదానగుణః స్వతః ॥ - 30

**తా.** భగవానుడగు నారాయణుని యందు ఈ విశ్వమంతయును అధిష్ఠితమై యున్నది. స్వయముగ నతడు నిర్గుణుడయ్యును, సృష్టి ప్రారంభమున మాయ ద్వారా గుణములనన్నింటిని స్వీకరించును.

**టీ** :- తత ఇతి. కాలే స్వేస్వే అవసరే. యదధిష్ఠానమిత్యే తత్ప్రశ్నోత్తరార్థముపసంహరతి – నారాయణఇతి. ఆహితం అధిష్ఠితం భగవత్త్వే హేతుః. యః స్వతః. అగుణః సర్గాదౌ గృహీతా మాయాయాఽురవోగుణాయేన తస్మిన్.(30)

**టీ** – కాలే – తమ తమ కాలములయందు. 'యదధిష్ఠానమ్' ( ఈ విశ్వమునకు అధిష్ఠానమేది? అను నారదుని ప్రశ్నకు ) సమాధానము చెప్పుచు ఉపసంహరించుచున్నాడు 'నారాయణే' అను ఈ శ్లోకముతో – ఆహితం – అధిష్ఠానము – భగవత్త్వమునకు కారణము – యః స్వతోఽ గుణః – ఎవడు స్వయముగ నిర్గుణుడో – సర్గాదౌ గృహీతా మాయయా –






సృజామి తన్నియుక్తో௨ హం
హరో హరతి తద్వశః ।
విశ్వం పురుష రూపేణ
పరిపాతి త్రిశక్తి ధృక్ ॥ - 31

**టీ** :- యత్పరస్త్వమిత్యేతత్ప్రశ్నోత్తరం. మదుక్తం స ఏష భగవాన్ సర్వేషాం మమచేశ్వర ఇతి తదుపసంహరతి - పాలనం తు స్వయమేవ కరోతీత్యాహ - సృజామీతి. పురుషరూపేణ శ్రీవిష్ణురూపేణ త్రిశక్తిః మాయా తాం ధారయతీతి తథా సః. (31)

ఇతి తే௨ భి హితం తాత
యథేదమను పృచ్ఛసి ।
నాన్యద్భగవతః కించి
ద్భావ్యం సదసదాత్మకమ్ ॥ - 32

సృష్ట్యాదియందు మాయచే తీసికొనబడిన - ఉరవో గుణాః యేన సః - విస్తృతమైన గుణములు ఎవని చేతనో ఆతడు - తస్మిన్ - అతని యందు.(30

**తా.** అతని చేత నియమింపబడిన నేను సృష్టి చేయుదును - అతని వశముననే ఉండు శంకరుడు లయము చేయుచుండును. ఇక ఈ విశ్వమును తాను విష్ణురూపముతో మాయా శక్తిని ధరించి ఆ పురుషుడే పాలన చేయుచుండును.

**టీ** - 'యత్పరస్త్వం' (నీకు స్వామి యెవడు?) అని నారదుడడిగిన ప్రశ్నకు బ్రహ్మ దేవుడు చెప్పిన సమాధానము, 'స ఏష భగవాన్సర్వేషాం మమచేశ్వరః' (అతడే అందఱకును భగవానుడు - నాకు కూడ అతడే ప్రభువు) అని చెప్పుచు దానిని ఉపసంహరించుచున్నాడు. 'సృజామి' అని - పాలనము తానే స్వయముగ చేయునని చెప్పుచున్నాడు. 'విశ్వం' అని - పురుషరూపేణ - విష్ణు రూపముతో - త్రిశక్తిః - మాయాతాంధరతీతి తథాసః - దానిని ధరించును కావున అతడట్లు 'త్రిశక్తిధృక్' అని చెప్పబడెను.(31)

**తా.** నీవడిగిన దానికి ఈ విధముగ సమాధానము చెప్పబడినది, నాయనా! ఇంతకంటెను భగవంతుని కార్యకారణరూపమగు విశ్వమునందు భావింపదగినది (కల్పింపదగినది) మఱియేదియును లేదు.





**టీ** :- యచ్చేదం విశ్వం యదాత్మకశ్చ త్వమిత్యేవమాది సర్వప్రశ్నానాం సామాన్యోత్తరం యదుక్తం. "వాసుదేవాత్పరో బ్రహ్మన్నచాన్యో ఽ ర్థో ఽ స్తి తత్త్వతః " ఇతి. శ్రు. "పురుష ఏవేదగ్ం సర్వ" మిత్యాదిశ్రుత్యా చ యద్ద ృఢీకృతం తదుప సంహరతి – ఇతీతి. సదసదాత్మకం కార్యకారణాత్మకం భావ్యం సృజ్యం భగవతస్సకాశాదన్యత్ న భవతీత్యుక్తం. (32)

**టీ** – ఈ విశ్వమేమి? దేనితో ఇది నిబిడమైయున్నది? నీకు స్వామి యెవరు? ఈ మొదలగు ప్రశ్నలకు సామాన్య సమాధానము ఈ విధముగ చెప్పబడినది. 'వాసుదేవునకన్న తత్త్వతః ఇతరుడెవ్వడును ఉత్తముడు లేడు' అని – 'పురుష ఏవేదం సర్వం' (ఈ పురుషుడే సర్వము) అనుశ్రుతి చేత దృఢీకరింపబడిన దానిని ఉపసంహరించుచున్నాడు. 'ఇతి' అను మొదలగు ఈ శ్లోకమున – సదసదాత్మకం – కార్యకారణాత్మకము – భావ్యం – సృజింపదగినది. భగవానుని సాపేక్షముగ మఱియొక వస్తువేదియు లేదని చెప్పబడినది. (32)

న భారతీ మే ఽ ంగ మృషోపలక్ష్యతే
న వై క్వచిన్మే మనసో మృషాగతిః ।
న మే హృషీకాణి పతంత్యసత్పథే
యన్మే హృదౌ త్కంఠ్యవతా ధృతోహరిః ॥ - 33

**తా.** ఓ నారదా! హృదయమునందత్యంతమైన ఆసక్తితో భగవానుని స్మరణలో నుండుటచేత నా వాక్కు ఎప్పుడును అసత్యముగ కన్పట్టదు. నా మనస్సు అసత్య మార్గమున పయనింపదు. నా ఇంద్రియములు అసన్మార్గమునంబడవు.

**టీ** :- యదుక్తం యథా మాం ప్రబ్రవీషి భో అవిజ్ఞాయ పరంమత్త ఏతావత్త్వం యతో ఽ స్తి మే ఇతి. తదుపపాద్యోప సంహరతి – నేతి. యత్ యస్మాత్ మే మయా ఔత్కంఠ్యం భక్త్యుద్రేకః తద్యుక్తేన హృదాహరిః ధృతః ధ్యాతః. అంగ హే నారద. అతః మే వాఙ్మనసేంద్రియాణాం వృత్తయః సత్యార్థాః నతు త్తత్ప్రభావేనేత్యర్థ. (33)

**టీ** – 'ఏతావత్త్వం యతోహిమే' (2–5–10) (నీవింతవఱకు చెప్పినది కొంతసత్యమే' 'తమజ్ఞాయ మామీశ్వరం బ్రవీషి' (అతనిని తెలిసికొనక నన్ను ఈశ్వరుడని చెప్పుచున్నావు) అను విషయము ప్రస్తావించి దానిని ఉపసంహరించుచున్నాడు 'న భారతీ' అను ఈ శ్లోకముతో – ఏకారణము వలన – మయా – నా చేత – ఔత్కంఠ్యం– భక్త్యుద్రేకముతో–హృదా హరిర్ధృతః – మనస్సుతో హరి ధ్యానింపబడును – అంగ ! – ఓ నారదా ! అతో మే వాఙ్మన ఇంద్రియాణాం వృత్తయః – అందువలన నా వాక్కు యొక్క మనస్సు యొక్కయు, ఇంద్రియముల యొక్కయు వృత్తులు – సత్యార్థాః – సత్యమే ప్రయోజనముగా గలవి – న తు మత్ప్రభావేణేత్యర్థః – నా ప్రభావముతో మాత్రము కావు.(33)

సో ఽ హం సమామ్నాయమయస్తపోమయః
ప్రజాపతీనామభివందితః పతిః ।
ఆస్థాయ యోగం నిపుణం సమాహిత
స్తం నాధ్యగచ్ఛం యత ఆత్మ సంభవః ॥ - 34

**తా.** నేను వేదమయుడను, తపోమయుడను, ప్రజాపతులకు వంద్యుడను, వారికి స్వామిని, నేను మిక్కిలి నిష్ఠతో యోగము ననుష్ఠించి కూడా – ఆత్మసంభవుడయినందువలన ఆ పరమాత్ముని తెలసికొనలేక పోయితిని.

**టీ :-** అత్ర స్వానుభవమేవాన్వయ వ్యతిరేకాభ్యాం ప్రమాణయతి – ద్వాభ్యాం. స ఇతి. సో ఽ హంసమామ్నాయాదిభిః సర్వోత్కృష్టో ఽ పి యోగమాశ్రిత్యాపి యతాత్మనోమమ సంభవః జన్మతమేవ నజ్ఞాతావాన్ కుతోన్యస్య వార్తా. ఏతచ్చ తృతీయస్కంధే పద్మోద్భవేవక్ష్యతే. (34)

**టీ –** ఇచట తన అనుభవమును అన్వయ వ్యతిరేకములతో – రెండు శ్లోకముల చేత ప్రమాణీకరించుచున్నాడు ! సో ఽ హం సమామ్నాయాదిభిః – అట్టి నేను వేదములు మొదలగువాని చేత – సర్వోత్కృష్టో ఽ పి – అందఱికన్నను శ్రేష్ఠుడనయ్యును యోగమాశ్రిత్యాపి – యోగము నాశ్రయించి కూడ – యత ఆత్మనః మమ సంభవః – జన్మ – తన నుండియే నా జన్మ కలిగినను – తమేవ నజ్ఞాతవాన్ అతనినే తెలిసికొనలేకపోయితిని – కుతో ఽ న్యస్యవార్తా – ఇతరుల మాట యెందులకు? ఇది తృతీయ స్కంధమునందలి 'పద్మోద్భవే' అను శ్లోకము కూడ చెప్పును.(34)

నతో ఽ స్మ్యహం తచ్చరణం సమీయుషాం
భవచ్ఛిదం స్వస్త్యయనం సుమంగలమ్ ।
యోహ్యాత్మ మాయా విభవం స్మ పర్యగా
ద్యథా నభః స్వాంతమథా హరే కుతః ॥ - 35

**తా.** శరణాగతి పొందిన వారి సంసార బంధమును ఛేదించునది, శ్రేయో మార్గమును కూర్చునది, ఉత్తమోత్తమమైన శుభమును కలిగించునది అయిన ఆతని పాదమునకు నేను నమస్కరింతును. ఆకాశము తన అంతమును తానే ఎఱుంగనట్లు ఆతడు కూడ తన మాయావిభవమును తానే ఎఱుంగడు. ఇక ఇతరుల మాట చెప్పనేల?

**టీ :-** నత ఇతి. తథాసమీయుషాం శరణాగతానాం. సంసారవివర్తకం మంగలావహం సుసేవ్యం చరణం నతో ఽ స్మి. తతో ఽ చింత్య మహత్యేన జ్ఞాతవీనస్మీతి కైముతిక న్యాయేనాహ

**టీ –** సుసేవ్యం చ తస్య చరణం నతో ఽ స్మి – చక్కగా సేవింపదగిన ఆతని పాదమునకు నమస్కరింతును – తతో ఽ చింత్య మహిమత్వేన జ్ఞాతవానస్మీతి కైముత్యన్యాయే నాహ, యోహీతి – అప్పుడు చింతింపరాని మహిమ గలవాడని కైముతిక న్యాయముగా తెలిసికొంటిని.

– యోహీతి. స్వమాయాయా విస్తారం యః స్వయమపి పర్యగాత్పరిశబ్దో నిషేధే. ఏతావానితి న జ్ఞాతవానిత్యర్థః అపరే కుతో జానీయుః? తతో ఒ స్య చరణం నతో ఒ స్మీతి పూర్వేణైవ సంబంధః. నను సర్వజ్ఞః కథం న జానాతి? అంతాభావాదితి దృష్టాంతేనాహ – యథా స్వస్యాంతం నభో న ప్రాప్నోతి, తద్వత్. నహి ఖ పుష్పాదర్శనం సర్వజ్ఞత్వం నిహంతీతిభావః. తథా చ వక్ష్యతి. శ్లో. "ద్యుపతయ ఏవ తే న యయురంతమనంతతయా త్వమపి యదంతరాండనిచయా నను సావరణా" ఇత్యాది. శ్రుతిశ్చ. " యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్, సో ఒ ంగ వేద యదివా న వేద" ఇతి. (35)

– 'యోహి' అను శ్లోక భాగమున అది వివరింపబడినది. స్వమాయా విస్తారం యః స్వయమపి పర్యగాత్ – తన మాయా విస్తృతిని తానుకూడ ఎఱుఁగడు – పరిశబ్దో నిషేధే – 'పరి' అను శబ్దము వ్యతిరేకార్థము కలది – ఏతావానితి న జ్ఞాతవానిత్యర్థః – ఇంతటి వాడని తెలియబడడని యర్థము – అపరే కుతో జానీయః – ఇతరులెట్లు తెలియగలరు? తస్య చరణం నతో ఒ స్మీతి పూర్వేణ సంబంధః – అతని పాదమునకు నమస్కరింతునని పూర్వాంశముతో సంబంధము – నను సర్వజ్ఞః కథం న జానాతి – నిశ్చయముగ సర్వజ్ఞుడైనను అతడు తనను తానెఱుగకపోవుట యెట్లు అంతాభావాదితి, దృష్టాంతేనాహ – అంతము లేనందువలన అని దృష్టాంతముతో చెప్పుచున్నాడు – యథా స్వస్యాంతం నభో నాప్నోతి తద్వత్ – ఆకాశము ఎట్లు తన అంతమును తానే పొందదో (ఎఱుఁగదో) ఆ విధముగ – న హి ఖ పుష్పాదర్శనం సార్వజ్ఞ్యం విహంతీతి భావః – ఆకాశపుష్పము కనబడకుండుట ఆతని సర్వజ్ఞత్వమును కొట్టి వేయదని భావము. అదియును చెప్పును "ద్యుపతయ ఏవ తేన యయురంత మనంత తయా త్వమపి యదంతరాండ నిచయా ననుసావరణాః" ఇత్యాది – హే భగవన్! స్వర్గాదిలోకపతులు, బ్రహ్మాదులు కూడ అంతమును పొందలేక పోయిరి. అనంతత్వము చేత – (ఏలయన అంతవద్వస్తువు ఏదైనను అది నీవు కావు) నీవు కూడ ఆత్మయొక్క అంతమును పొందవు. ఏలయన దానికి అంతము లేనందువలన – లేని దానిని పొందుకుండుట సర్వజ్ఞత్వమునకు భంగము కాదు కదా! నీవు కూడ నీ అంతరమున (మధ్యభాగమున) గల బ్రహ్మాండ సమూహములు కాలచక్రముతో నిరంతరము పరిభ్రమించుచున్నందున – వానికి అంతమే లేనందున – ఆ లేని అంతమును పొందకున్నావు. ఆ బ్రహ్మాండ నిచయములు ఆవరణములతో కూడి అట్లు తిరుగుచుండగా వానికి లేని అంతమును నీవే పొందనిచోనిక ఇతరులు వాని అంతమును చూచుట యెట్లు సంభవించును? – శ్రుతి కూడ – యో అస్యాధ్యక్షః పరమేవ్యోమన్సో అంగ! వేద యది వా నవేద' ఇతి – 'ఎవడు ఈ జీవునకు (సకలమునకు)

నాహం నయూాయం యదృతాంగతిం విదు
ర్న వామదేవః కిముతాపరే సురాః ।
తన్మాయయా మోహిత బుద్ధయస్త్విదం
వినిర్మితం చాత్మసమం విచక్ష్మహే ॥ - 36

**టీ** :- ఏతత్ప్రపంచయతి – ద్వాభ్యాం. నేతి. వామదేవః రుద్రః ఋతాం గతిం పరమార్థస్వరూపం. కింతు, ఇదం ప్రపంచరూపం తస్య మాయయా నిర్మితం విచక్ష్మహే విద్మః తదపి ఆత్మసమం స్వజ్ఞానానురూపమేవ నతు కృత్స్నం. (36)

యస్యావతార కర్మాణి
గాయంతిహ్యస్మదాదయః ।
నయం విదంతి తత్త్వేన
తస్మై భగవతే నమః ॥ - 37

**టీ** :- మోహితబుద్ధయః ఇత్యయం తదజ్ఞానే ప్రపంచజ్ఞానే చ హేతుః. నను సర్వే ఽ పి తం వర్ణయంతో దృశ్యన్తే తత్రాహ – యస్యేతి. (37)

స్వామియై పరమాకాశమున నున్నవాడు ఎఱుఁగునో ఒకవేళ ఎఱుఁగడో?' అని చెప్పినది. (35)

**తా.** ఆతని పరమార్థ స్వరూపమును నేను గాని మీరు గాని రుద్రుడు గాని తెలిసికొనజాలకున్నారనినచో నిక మోహిత బుద్ధులగు నితర దేవతల మాట చెప్పనేల? కాని అతని మాయ చేతనే, ఈ ప్రపంచ రూపమంతయు, ఆయన ఇచ్ఛానురూపముగ నిర్మితమైయున్నదని మాత్రము ఎఱుంగుదుము.

**టీ** – అదే చెప్పుచున్నాడు – 'నాహం' అను శ్లోకముతో కలిపి రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు – వామదేవః – రుద్రుడు – యస్య ఋతాం – గతిం – పరమార్థస్వరూపమును – కింత్విదం ప్రపంచరూపం తస్యమాయయా వినిర్మితం – కాని ఈ ప్రపంచరూపము అతని మాయ చేత నిర్మింపబడినది (అని) – విచక్ష్మహే – తెలసికొనుచున్నాము. తదప్యాత్మసమం – తన జ్ఞానమునకు అనురూపముగ – నతుకృత్స్నం – దాని స్వేచ్ఛతో వ్యాపించుటనట్లు కాదు.(36)

**తా.** ఎవని అవతార కర్మములు మన వంటి వారు కీర్తించుచుందురో – అయినను అతనిని తత్త్వతః తెలసికొన జాలరో అట్టి భగవానునకు నమస్కారము.

**టీ** – మోహిత బుద్ధయః ఇత్యయం తదజ్ఞానే – ప్రపంచ జ్ఞానే చ హేతుః – మోహిత బుద్ధులు అనుమాట అతనిని తెలిసికొనజాలమికిని, ప్రపంచ జ్ఞానమునకును కారణము (గా ప్రయోగింపబడినది) – 'యస్య' అను ఈ శ్లోకమున అందఱును అతనిని వర్ణించుచుందురు. చూచుచుందురు అని చెప్పట కొఱకే (గాని అతనిని తత్త్వతః తెలిసికొన గల్గుటకు కాదు) (37)

స ఏష ఆద్యః పురుషః
కల్పే కల్పే సృజత్యజః ।
ఆత్మాత్మన్యాత్మనాత్మానం
సంయచ్ఛతి చ పాతి చ ॥ - 38

**తా.** అతడే ఆదిపురుషుడు, తాను పుట్టుకలేని వాడయియును, ప్రతికల్పము నందును, తానే, తనతో, తనయందు తననే సృష్టించును - రక్షించునుకూడ -

**టీ** :- అవతార కర్మాణి సంక్షేపతో దర్శయతి - స ఇతి. స ఏషః ఆద్యః భగవాన్ పురుషావతారస్సన్ సృష్ట్యాదికం కరోతి. ఆత్మన్యాత్మానమాత్మనేతి. కర్త్రాద్యధికరణం సాధనం కర్మ చ స్వయమేవేత్యర్థః. పురుషావతారః సృష్ట్యాదికర్మాణీతి సంక్షేపోక్తిః (38)

**టీ** - అవతార కర్మలను సంక్షేపముగ చూపుచున్నాడు. స ఏష ఆద్యో భగవాన్ యః పురుషావతారః సన్ సృష్ట్యాది కరోతి - అతడే మొదటి వాడైన భగవానుడు - పురుషావతారుడగుచు తానే ఈ సృష్టి మొదలుగ (అంతయును) చేయుచున్నాడు, ఆత్మా - ఆత్మని - ఆత్మనా - ఆత్మానం - ఇతి - కర్తా అధికరణం, సాధనం, కర్మ చ, చేయువాడే సాధనము - కర్మకూడ. (కర్మయే, కర్మ, క్రియయును) - స్వయమేవేత్యర్థః - (అంతయు) తానే అని యర్థము - పురుషావతారః - సృష్ట్యాదీని కర్మాణీతి సంక్షేపోక్తిః - సృష్టించుట మొదలుకొని కర్మలన్నియు తానే చేయుచుండుననుటకు, పురుషావతారుడు అనుమాట సంక్షేపముగ చెప్పబడినట్టిది. (38)

విశుద్ధం కేవలం జ్ఞానం
ప్రత్యక్సమ్యగవస్థితమ్ ।
సత్యం పూర్ణమనాద్యంతం
నిర్గుణం నిత్యమద్వయమ్ ॥ -39

**తా.** విషయాకారశూన్యమై, అచ్ఛమైన సత్యమై, సర్వమునందును అంతః స్థితమై సందేహాది రహితముగ స్థిరమై, త్రికాలాబాధ్యమైన సత్యమై, బుద్ధి విపరిణామాది లక్షణ రహితమైన పూర్ణమైనదై, జన్మనాశాది రహితమై, గుణ రహితమై ఎల్లప్పుడు - ద్వైత ప్రతీతి లేనిదై యుండునది భగవత్తత్త్వము.

**టీ** :- నయం విందంతి తత్త్వేనేత్యుక్తం. కిం తత్త్వమిత్య పేక్షాయామాహ - విశుద్ధమితి. జ్ఞానం కేవలం సత్యం. తత్ర ఘటాద్యాకారవృత్తి జ్ఞానవ్యవచ్ఛేదార్థం విశేషణాని విశుద్ధం.

**టీ** - 'అతనిని తత్త్వముతో తెలిసికొనలేరు' అని చెప్పబడినది. ఏమి తత్త్వము అను అపేక్షతో చెప్పుచున్నాడు. జ్ఞానం కేవలం - సత్యము అతని తత్త్వము - ఘటాద్యాకార వత్తి జ్ఞాన వ్యవచ్ఛేదార్థం విశేషణాని - కుండ మొదలగువాని ఆకారములు మనస్సునందు పరిణమించు

విషయాకారశూన్యం యతః ప్రత్యక్ సర్వాంతరం అతఏవ సమ్యక్సందేహాదిరహితం. అవస్థితం స్థిరం యతో నిర్గుణం గుణకార్యం హి గుణవ్యతిరేకాచ్చంచలం భవతి. యద్యపి వృత్తిజ్ఞానమపి స్వరూపజ్ఞానమేవేతి న చాంచల్యాదిదోషయుక్తం. తథాప్యంతఃకరణవృత్తిదోషైస్తథా తథా భాతీతి వ్యవచ్ఛిద్యతే ఏభిరేవ విశేషణైః. తత్సత్యత్వమపి సమర్థితం కించ, యద్వికారవత్ తదసత్యం దృష్టం. న చాస్య జన్మాదయః షడ్వికారాః సంతీత్యాహ – అనాద్యంతం జన్మనాశరహితం. అతఏవ, జన్మాంతరాస్తిత్వ లక్షణో ఽ పి వికారో నాస్తి. వృద్ధిపరిణామాపక్షయాశ్చ న సంతి. యతః పూర్ణం సర్వత్ర హేతుః నిత్యమద్వయం నిత్యం సర్వదా ద్వైతప్రతీతిసమయే ఽ పి పరమార్థతః అద్వయమితి.(39)

జ్ఞానమును విభజించునుద్దేశముతో విశేషణములు – విశుద్ధం – విషయాకారములు మున్నగునవి లేనిది – ప్రత్యక్ – సర్వపదార్థములలోను, వాని అంతరములలోను స్థితి కలిగియుండునది – అత ఏవ సమ్యక్ – అందుకే సందేహములు మున్నగునవి లేని విధముగ – అవస్థితమ్ – స్థిరమై యుండునది – ఆ కారణమున నిర్గుణము – గుణ కార్యంహి గుణవ్యతికరాచ్చంచలం భవతి – గుణకార్యమే గుణసంక్షోభము వలన (సమ్మేళనము వలన) చంచలమగును. అయినను వృత్తి జ్ఞానము కూడ స్వరూపజ్ఞానమే యని కాదు, చాంచల్యాది దోషయుక్తము కాదు. అట్లైనను అంతః కరణ వృత్తి దోషములచేత ఆయా విధములగునని విభాగము చేయబడినది. ఈ విశేషణముల చేతనే సత్యత్వము కూడ సమర్థించబడినది. ఇంకను ఏది వికారము చెందునో అది అసత్యముగ గోచరించుచున్నది. జన్మాది షడ్వికారములతనికి లేవని చెప్పుచున్నారు. – అనాద్యనంతం – జన్మము, నాశము లేనిది – అతఏవ జన్మానంతరాస్తిత్వ లక్షణోఽ పి వికారో నాస్తి – అందువలననే జన్మము తరువాత కూడ ఉండుట అను లక్షణము కూడ వికారము కాదు. వృద్ధి విపరిణామాప క్షయాశ్చ న సంతి – పెరుగుట, మార్పులు చెందుట, క్షీణించుట మొదలగునవి లేవు – అందుచే పూర్ణమైనది – సర్వత్రహేతుః – అంతటనుకారణము – నిత్యమద్వయం – నిత్యం – ఎల్లవేళల యందు – ద్వైత ప్రతీతి సమయే ఽ పి పరమార్థతో ఽ ద్వయమితి – ద్వైతము ప్రతీతమగుచున్నప్పుడు కూడ పరమార్థతః అద్వయమే అని (39)

ఋషే! విదంతి మునయః
ప్రశాంతాత్మేంద్రియాశయాః ।
యదా తదేవా సత్తర్కై
స్తిరో ధీయేత విప్లుతమ్ ॥ - 40

**తా.** ఓ నారద మహర్షీ ! ప్రసన్నములైన దేహములు, ఇంద్రియములు, మనస్సులు గల వారలగుచు మునులు భగవత్తత్వమును తెలిసి కొందురు. కాని అసత్పురుషుల ద్వారా కుతర్కములచే వ్యాప్తి చెందిన ఆత్మేంద్రియాశయాదులు కలవారైనప్పుడు వారే భగవత్సాక్షాత్కారము నుండి మఱుగుపడియుందురు.



**టీ** :- ఋషయఇతి. హే ఋషే ! నారద, ప్రశాంతాత్మేంద్రియాశయాః ప్రసన్నదేహేంద్రియ మనసో యథా భవంతి. అన్యథా తదజ్ఞానే కారణమాహ - యదా తు తదేవ ప్రకాశమానమేవ అసతాం తర్కైర్విప్లుతం స్యాత్తదా తిరోధీయేతేతి.(40)

**టీ** - ఇచట విద్వాంసుల అనుభవమును ప్రమాణీకరించుచున్నాడు. హే ఋషే - ఓ నారదా! - ప్రశాంతాత్మేంద్రియాశయాః - ప్రసన్నములైన దేహేంద్రియ మనస్సులు కలవారు - యదా భవంతి - ఎప్పుడయ్యెదరో - తదా విదంతి - అప్పుడు తెలిసికొందురు. ఆటుల కానప్పుడు వారి అజ్ఞానమునకు కారణము చెప్పుచున్నాడు. యదా తదేవ ప్రకాశమానమేవ - జ్ఞానము ప్రకాశించుచున్నను - అసతాం - అసత్పురుషుల యొక్క - (కు) తర్కైః విప్లుతంస్యాత్ - కుతర్కముల వ్యాప్తి జరుగునో - తదా - అప్పుడు - తిరోధీయేత + ఇతి - (జ్ఞానము) మఱుగున పడిపోవును. (40)

ఆద్యో ఽ వతారః పురుషః పరస్య
కాలః స్వభావః సదసన్మనశ్చ ।
ద్రవ్యం వికారో గుణ ఇంద్రియాణి
విరాట్ స్వరాట్ స్థాస్ను చరిష్ణు భూమ్నః ॥ - 41

**తా.** పరమేశ్వరుని మొదటి అవతారము ప్రకృతి ప్రవర్తకుడగు విరాట్ పురుషునిది. కాలము, స్వభావము, కార్య కారణములు, మనస్సు, పంచభూతములు, అహంకారము, గుణములు, ఇంద్రియములు, బ్రహ్మాండ శరీరము, తదభిమానియగు స్వరాట్టు, స్థావరములు, జంగములు, జీవులు - ఇవి యన్నియు ఆయన రూపములే.

**టీ** :- కల్పకల్పే ఆత్మానం సృజతీత్యుక్తం. కేతే ఽ స్య సృజ్యమానావతారాః? తానవతారాన్విస్తరేణాహ - యావదధ్యాయ సమాప్తి. ఆద్యఇతి. పరస్య భూమ్నః పురుషః ప్రకృతి ప్రవర్తకః. యస్సహస్రశీర్షేత్యుక్తో లీలావిగ్రహః స ఆద్యోవతారః. వక్ష్యతి హ్యేకాదశే. శ్లో. ' భూతైర్యథా పంచభిరాత్మసృష్టైః పురం విరాజం విరచయ్య తస్మిన్, స్వాంశే నివిష్టః పురుషాభిధానమవాప నారాయణ ఆదిదేవః' ఇతి. తత్ర తథా చోక్తం. శ్లో.'విష్ణోస్తు త్రీణి రూపాణి పురుషాఖ్యాన్యదోవిదుః, ప్రథమం మహతస్స్రష్టిః ద్వితీయం త్వండసంస్థితం, తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వా విముచ్యతే' ఇతి. యద్యపి సర్వేషామవిశేషేణావతారత్వముచ్యతే

**టీ**- అవతారములను విస్తరించి చెప్పుచున్నాడు. 'ఆద్యః' మొదలగు శ్లోకము నుండి అధ్యాయసమాప్తి వఱకు - పరస్య - ఆనందస్వరూపుని - పురుషః- ప్రకృతిని ప్రవర్తింపజేయువాడు, 'యస్య సహస్ర శీర్షా ఇత్యుక్తో లీలా విగ్రహః - ఎవనికి 'వేయి శిరస్సులు' అని చెప్పబడినదో అతడు లీలా విగ్రహుడు - అదే అతని మొదటి అవతారము. "భూతైర్యదా పంచభిరాత్మ సృష్టైః పురం విరాజం విరచయ్య తస్మిన్ / స్వాంశేన విష్టః పురుషాభిధాన మవాప నారాయణ ఆదిదేవః (11-4-3) (భగవానుడే పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములను తననుండి తానే సృష్టించుకొనెను) వీనితోనే విరాట్ శరీరమును నిర్మించి, దానిలో అంతర్యామిగ తానే ప్రవేశించును. అప్పుడా ఆది దేవుడు, నారాయణుడు పురుషుడను పేరును పొందెను). అని చెప్పబోవుచున్నాడు కదా ! "విష్ణోస్తు

తథాపి కాతశ్చ స్వభావశ్చ సదసదితి కార్యకారణాత్మికా ప్రకృతిశ్చ ఏతాశ్శక్తయః. మనఆదిని కార్యాణి బ్రహ్మాదయో గుణావతారాః దక్షాదయో విభూతయ ఇతి వక్తవ్యం మనః మహత్తత్త్వం. ద్రవ్యం మహాభూతాని క్రమో ऽ త్ర న వివక్షితః. వికారః అహంకారః గుణః సత్త్వాదిః విరాట్ సమష్టిశరీరం స్వరాట్ వైరాజః స్థాస్ను స్థావరం చరిష్ణు జంగమం వ్యష్టిశరీరం. (41)

అహం భవో యజ్ఞ ఇమే ప్రజేశా
దక్షాదయో యే భవదాదయశ్చ ।
స్వర్లోక పాలాః ఖగలోక పాలా
నృలోక పాలాస్తల లోకపాలాః ॥ - 42

**టీ** :- అథవా కిం బహునా సంక్షేపేణ శృణు. అహమితి. అహం బ్రహ్మా. భవో రుద్రః. యజ్ఞః విష్ణుః. దక్షాదయో ఇమే ప్రజేశాః. తలలోకపాలా పాతాలాద్యధిపతయః. (42)

త్రీణి రూపాణి పురుషాఖ్యాన్యతో విదుః / ప్రథమం మహతః స్రష్టు ద్వితీయం త్వండ సంస్థితమ్ / తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వా విముచ్యతే (3-5-27) శ్లోక వ్యాఖ్యలోని సాత్వత తంత్రము నందలి శ్లోకము. (విష్ణువునకు మూడు రూపములున్నందు వలన ఆ పురుషుడు మూడు విధములుగ చెప్పబడునని తెలియుదురు. మొదటిది మహత్ స్రష్ట - రెండవది అండము నందుండునది, మూడవది సర్వభూతములయందుండునది) వానిని తెలసికొనువాడు మోక్షము నొందును - అని చెప్పబడినట్లు - అన్నింటికిని భేదము లేకుండ అవతారత్వము చెప్పబడుచున్నను - తథాపి - అట్లైనను - కాలశ్చ స్వభావశ్చ - కాలము, స్వభావము - యదసదితి కార్యకారణాత్మికా ప్రకృతిశ్చ - అసత్తని చెప్పబడు కార్యకారణాత్మకమగు ప్రకృతియు - ఏతాః శక్తయః - ఇవి శక్తులు - మన ఆదీని కార్యాణి - మనస్సు మొదలగునవి కార్యములు - బ్రహ్మాదయో గుణావతారాః - బ్రహ్మాదులు గుణావతారములు, దక్షాదయో విభూతయః - దక్షాదులు విభూతులు (తదైశ్వర్యములు) ఇతి వివేక్తవ్యమ్ - అని వింగడించుకొనవలెను - మనో మహత్తత్త్వమ్ - మనస్సు మహత్తత్త్వము - ద్రవ్యం - మహాభూతములు - క్రమోऽత్ర నవివక్షితః - క్రమము ఇచ్చట చెప్పబడలేదు - వికారః - అహంకారము. గుణః - సత్త్వాదులు విరాట్ - సమష్టి శరీరము, - స్వరాట్ - వైరాజు - స్థాస్ను - స్థావరము - చరిష్ణు - జంగమము - ఇది వ్యష్టి శరీరము.(41)

**తా.** నేను, రుద్రుడు, విష్ణువు, దక్షుడు మొదలగు ఈ ప్రజాపతులు, నీవు, నీవంటి భక్తజనులు, స్వర్గలోక రక్షకులు, పక్షిరాజులు, మనుష్యలోక రక్షకులు, పాతాళ లోకాధిపతులు.

**టీ.** అహం - బ్రహ్మా, భవః - రుద్రుడు, యజ్ఞః - విష్ణువు, దక్షాదయో యిమే ప్రజేశాః - దక్షుడు మొదలగు ఈ ప్రజాపతులు, తలలోకపాలాః - పాతాళాధిపతులు, (42)





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

గంధర్వ విద్యాధర చారణేశా
యే రక్ష రక్షోరగ నాగనాథాః ।
యేవా ఋషీణా మృషభాః పితౄణాం
దైత్యేంద్ర సిద్ధేశ్వర దానవేంద్రాః ।
అన్యేచయే ప్రేత పిశాచ భూత ।
కూష్మాండ యాదో మృగ పక్ష్యధీశాః ॥ - 43

**తా.** గంధర్వులు, విద్యాధరులు, చారణ ప్రభువులు, యక్షులు, రాక్షసులు, సర్పములు, నాగరాజులు, దైత్యస్వాములు, సిద్ధేశ్వరులు, దానవరాజులు, ఇంకను ఇతరములైన ప్రేతములు, పిశాచులు, భూతములు, కూష్మాండములు (గుమ్మడి కాయలను బోలియుండు క్షుద్రదేవతా విశేషములు?) జలజంతువులు, మృగములు, పక్షిరాజులు –

**టీ** :- గంధర్వేతి. గంధర్వాదీనామీశాః యక్షాదీనాం నాథాః రక్షోరగేతి సంధిరార్షః౹జ ఋషీణాం పితౄణాం చ శ్రేష్ఠాః. (43)

**టీ** – గంధర్వాదీనామీశాః – గంధర్వులకు ప్రభువులు – యక్షాదీనాంనాథాః – యక్షులు మొదలగువారి అధిపతులు – రక్షోరగ – సంధి ఆర్షము – ఋషీణాం పితౄణాం చ శ్రేష్ఠాః – ఋషులలోను, పితృదేవతలలోను శ్రేష్ఠులు, ప్రేతాదీనామధీశాః – ప్రేతలలో అధిపతులు. (43)

యత్కించలోకే భగవన్మహస్వ
దోజః సహస్వద్బలవత్ క్షమావత్ ।
శ్రీ హ్రీ విభూత్యాత్మవదద్భుతార్ణం
తత్త్వం పరం రూపవదస్వరూపమ్. ॥ - 44

**తా.** ఈ లోకమునందు గల భగవదైశ్వర్యయుక్తములు, తేజోయుక్తములు శక్తిమంతములు– బలవంతములు, సహన వంతములు, శోభావంతములు, లజ్జావంతములు, సంపత్తి, బుద్ధి యుక్తములు, అద్భుతమైన వర్ణములు గలవి, రూపవంతములు, మొదలగునవి అన్నియు ఆ పరమేశ్వరుని విభూతియే స్వరూపములేనివియు అతని తత్త్వమే.

**టీ** :- అన్యఇతి. ప్రేతాధీనామధీశాః. కిం బహూనా యత్కించద్భగవతాది తత్సర్వం పరమేవ తత్త్వమిత్యన్వయః. భగవత్ ఐశ్వర్యయుక్తం. మహస్వత్ తేజోయుక్తం. ఓజస్సహస్వత్. ఓజః ఇంద్రియశక్తిః. సహః మనశ్శక్తిః. తద్యుక్తం. బలం దార్ఢ్యం తద్యుక్తం. అర్ణః వర్ణః అద్భుతార్ణం ఆశ్చర్యవర్ణమిత్యర్థః.

**టీ** – వేయునేల ? యత్కించిద్భగవదాది తత్సర్వం పరమేవ – ఏకొంచమైనను ఐశ్వర్యాది యుక్తమగునది మొదలుకొని అదియంతయును శ్రేష్ఠమైనదే – తత్త్వమిత్యన్వయః– పరమేశ్వరత్వమే అని అన్వయము – భగవత్ – ఐశ్వర్యయుక్తము. సహస్వత్ – తేజోయుక్తము, ఓజః సహసీ – ఇంద్రియములు, మనస్సు, శక్తి, వానితో కూడియుండునది. బలం – దక్షత్వము, శ్రీః – శోభ, హ్రీః – చేయకూడని దానియందు జుగుప్స (అసహ్యము) విభూతిః

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ





రూపవదస్వరూపం రూపవదరూపం చ యత్ తత్సర్వం పరమేవ తత్త్వం తద్విభూతిరిత్యర్థః. శుద్ధసత్త్వావతారాన్వక్తుమాహ – (44)

– సంపత్తి, ఆత్మా – బుద్ధి, దానితో కూడినది, అర్ణః – వర్ణము – అద్భుతార్ణం – ఆశ్చర్యకరమగు వర్ణమని యర్థము. రూపమేవ – స్వరూపమే – అస్వరూపమ్ – రూపము లేనిది–యత్తత్సర్వం పరంతత్త్వం – ఏదికలదో అదియంతయును ఈశ్వరత్త్వమే – అనగా అతని ఐశ్వర్యమని అర్థము.(44)

ప్రాధాన్యతో యా నృష ఆమనంతి
లీలావతారాన్పురుషస్య భూమ్నః ।
ఆపీయతాం కర్ణ కషాయ శోషా
ననుక్రమిష్యేత ఇమాన్సుపేశాన్ ॥ - 45

**తా.** ఓ ఋషీ ! ఆనంద స్వరూపుడగు ఆ పరమ పురుషుని లీలావతారములను ప్రధానముగ వేనిని శాస్త్రములు విశేషముగ మననము చేయునో అట్టి సుందరములు, చెవుల మాలిన్యములను శోషింపజేయునవియునయిన తత్కథామృతమును చెప్పబోవుచున్నాను, గ్రోలుము.

**టీ** :- ఆపీయతామితి. అస్మకథాశ్రవణైః యే కర్ణయోః కషాయాః మలాః తాన్ సుపేశాన్ సుందరాన్. లకారలోపస్త్వార్షః. హే ఋషే నారద తుభ్యమనుక్రమిష్యే. తదనుక్రమణామృతం త్వయా పీయతామిత్యర్థః. ఆపీయతామితి శత్రంతం వా. ఆపిబతాం కర్ణకషాయశోషానిత్యర్థః. (45)

**టీ** – శుద్ధ సత్త్వావతారములను చెప్పుటకు ఉపక్రమించు చున్నాడు. 'ప్రాధాన్యతః' అను ఈ శ్లోకముతో – అసత్కథా శ్రవణైర్యే కర్ణయోః – భగవదితరములైన కథలను వినుట చేత ఏ చెవులకు – కషాయాః – మలములు కలుగునో – తాన్ – వానిని–శోషయంతీతి తథా తాన్–శోషింపజేయునట్టి వానిని – సుపేశాన్ – సుందరములైన వానిని – సకారలోప ఆర్షః – సకారలోపము ఆర్ష ప్రయోగము (లకార లోపమని కొందఱు) – హే ఋషే – ఓ ఋషీ! తే – నీ కొఱకు – అనుక్రమిష్యే – క్రమముగ చెప్పుచున్నాను – తదనుక్రమేణ అమృతం త్వయా పీయతామిత్యర్థః – ఆ అనుక్రమముతో తత్కథామృతము నీచే పానము చేయబడును గాక, అని యర్థము. – యద్వా పీయతామితి శత్రంతమ్ – లేక పీయతాం అని శతృప్రత్యయాంతము (ఆర్షము) ఆపిబతాం కర్ణ కషాయ శోషానిత్యర్థః – చెవుల మాలిన్యములను శోషింపజేయగల ఈ అమృతమును త్రాగుదువు గాక యని అర్థము.(45)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వితీయ స్కంధే షష్ఠోధ్యాయః**

**శ్రీమద్భాగవత మహాపురాణము నందలి రెండ స్కంధమున ఆఱవ అధ్యాయము సమాప్తము.**






ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

**అథ సప్తమో ఉ ధ్యాయః**

**బ్రహ్మోవాచ -**

యత్రోద్యతః క్షితితలోద్ధరణాయ బిభ్ర
త్క్రౌండీం తనుం సకల యజ్ఞ మయీమనంతః।
అంతర్మహార్ణవ ఉపాగతమాది దైత్యం
తం దంష్ట్రయాద్రిమివ వజ్రధరో దదార ॥ - 1

**టీ** :- శ్లో. ఉచ్యంతే సప్తమే లీలావతారా బ్రహ్మణోదితాః, నారదాయ తు తత్కర్మప్రయోజనగుణైస్సహ. యత్రేతి. యత్ర యదా. క్షితలోద్ధరణార్థం వారాహీం తనుం బిభ్రత్సన్ ఉద్యతో ఉ సంతః తదా తం సుప్రసిద్ధం హిరణ్యాక్షం దంష్ట్రయా దదార. (1)

జాతో రుచేరజనయత్సుయమాన్సుయజ్ఞ
ఆకూతి సూనురమరానథ దక్షిణాయామ్।
లోకత్రయస్య మహతీ మహరద్యదార్తిం
స్వాయంభువేన మనునా హరిరిత్యనూక్తః ॥ -2

**సప్తమాధ్యాయము**

**బ్రహ్మదేవుడిట్లనెను.**

**తా.** భూతలము నుద్ధరించుట కొఱకు అనంతుడు సకల యజ్ఞమయమైన వరాహ శరీరమును ధరించి ఏ సముద్రాంతర్భాగమున ఉద్యమించుచుండెనో అచట సముద్రము యొక్క అంతర్భాగముననున్న ఆదిదైత్యుడగు హిరణ్యాక్షుడు సమీపమునకు రాగా అతనిని తన కోఱతో - (ఇంద్రుడు వజ్రాయుధముతో పర్వతముల యొక్క రెక్కలనువలె - చీల్చివేసెను. (1)

**టీ.** ఈ సప్తమాధ్యాయమున భగవానుని లీలావతారములు బ్రహ్మదేవునిచేత చెప్పబడినవి భగవానుడు చేసినకర్మ, దాని ప్రయోజనము, అతని గుణములతో కూడ నారదునకు బ్రహ్మ చెప్పెను. యత్ర-ఎప్పుడు, క్షితితలోద్ధరణార్థం-(భూతలమును పైకెత్తుట కొఱకు) వారాహీం తనుం బిభ్రత్సన్నుద్యతః అనంతః- వరాహశరీరమును ధరించి అనంతుడు ఉద్యమించుచుండెనో -తదా-అప్పుడు-తం - ఆ ప్రసిద్ధుడైన హిరణ్యాక్షుని -దంష్ట్రయా దదార - కోఱతో చీల్చివేసెను. (1)

**తా.** అతడే రుచియను ప్రజాపతికిని ఆకూతియను అతని భార్యకును సుయజ్ఞుడను పేరున కుమారుడుగ అవతరించెను. అతడు తన భార్యయగు దక్షిణ యందు సుయములు(ను) అమరులను కనెను. అతడే ఇంద్రుడై ముల్లోకములగొప్ప ఆర్తిని హరించెను. అటుపిమ్మట స్వాయంభువ మనువు చేత 'హరి' యని పేర్కొన బడెను.




**టీ** :- యజ్ఞావతారమాహ - జాతఇతి. రుచేః ప్రజాపతేస్స కాశాత్ తద్భార్యాయా ఆకూతేస్సూనుః సుయజ్ఞో నామ జాతః. స చ స్వభార్యాయాం దక్షిణాయాం సుయమాన్ దేవానజనయత్ స ఏవ ఇంద్రస్సన్ యదా ఆర్తిమహరత్ తదా పూర్వం సుయజ్ఞ ఇత్యుక్తో ఉ పి. అనుపశ్చాత్. మనునా మాతామహేన హరిరిత్యుక్తః అనేన దేవతోత్పాదనం లోకత్రయార్తిహరణం చ కర్మ దర్శితం ఏవం సర్వత్రావతారః తత్తత్కర్మ చ జ్ఞేయం. (2)

**టీ.** యజ్ఞావతారమును చెప్పుచున్నాడు - రుచేః ప్రజాపతేః సకాశాత్ - రుచి యను ప్రజాపతికి - తద్భార్యాయాః ఆకూతేః - అతని భార్యయగు ఆకూతికి - సూనుః- కుమారుడై - సుయజ్ఞోనామ జాతః - సుయజ్ఞుడను పేరుగల వాడు పుట్టెను. - సచ స్వభార్యాయాం దక్షిణాయాం - అతడు కూడ తన భార్యయగు దక్షిణ యందు - సుయమాన్ దేవానజనయత్ - సుయములను(ను) దేవతలను కనెను - స ఏవేంద్రః సన్ - అతడే ఇంద్రుడై - యదా ఆర్తి మహరత్ - ఎప్పుడైతే దుఃఖమును (బాధను) హరించెనో - తదా - అప్పుడు - పూర్వం సుయజ్ఞ ఇత్యుక్తః - మొదట సుయజ్ఞుడను పేర పిలువబడువాడు - అపి - కూడ - పశ్చాత్ - తరువాత - మనునా - తల్లియొక్క తండ్రియగు స్వాయంభువునిచేత - హరిరిత్యుక్తః - 'హరి' యని చెప్పబడెను. - అనేన దేవోత్పాదనం, లోకత్రయార్తి హరణం చ తస్యకర్మ దర్శితమ్ - దీని చేత దేవతలను బుట్టించుట, ముల్లోకముల బాధను హరించుటయు అను అతని కర్మచూపబడినది. ఏవం సర్వత్రావతారస్తత్కర్మచ జ్ఞేయమ్ - ఈ విధముగ అంతటను (అతని) అవతారమును, అవతార కర్మను తెలసికొనవలయును.(2)

జజ్ఞే చ కర్దమగృహే ద్విజ దేవహూత్యాం
స్త్రీభిః సమం నవభిరాత్మగతిం స్వమాత్రే ।
ఊచే యయాత్మశమలం గుణ సంగపంక
మస్మిన్విధూయ కపిలస్య గతిం ప్రపేదే. ॥ - 3

**తా.** ఓ నారదా ! కర్దమ ప్రజాపతి గృహమునందు, అతని భార్యయగు దేవహూతి యందు, తొమ్మండుగురు సోదరీ మణులతో కూడ కపిలుడుగా తాను జన్మించెను. తన తల్లియగు దేవహూతికి బ్రహ్మ విద్యను బోధించెను. దానితో ఆమె తన మాలిన్యమును గుణ సంగముచే కలిగిన పంకమును ఈ జన్మయందే ప్రక్షాళన చేసికొని, కపిలుని స్థానమగు - మోక్షమును పొందెను.

**టీ** :- కపిలావతారమాహ - జజ్ఞ ఇతి. కర్దమప్రజాపతేర్గృహే తద్భార్యాయాం దేవహూత్యాం జజ్ఞే నవభిః స్త్రీభిస్సహ స చ స్వమాత్రే ఆత్మగతిం బ్రహ్మవిద్యాం ఉక్తవాన్ యయా ఆత్మగత్యా

**టీ.** కపిలుని అవతారమును చెప్పుచున్నాడు - కర్దమస్య ప్రజాపతేర్గృహే - కర్దమ ప్రజాపతి గృహము నందు - తద్భార్యాయాం దేవహూత్యాం - అతని భార్యయగు దేవహూతియందు - జజ్ఞే - పుట్టెను - నవభిః స్త్రీ భిర్భగినీభిః సహ - తొమ్మండుగురు

సా ఆత్మనశ్శమలం మలినీకరణం గుణసంగరూపం పంకం అస్మిన్నేవ జన్మని విధూయ కపిలస్య గతిం ముక్తిం ప్రాప్తవతీ. (3)

తోబుట్టువులగు స్త్రీలతో కూడ – సచ – ఆ కపిలుడు కూడ స్వమాత్రే – తన తల్లికి, ఆత్మగతిం – బ్రహ్మవిద్యను, ఉక్తవాన్ – బోధించెను. యయా ఆత్మగత్యా – ఏ బ్రహ్మ విద్యచేత సా – ఆ దేవహూతి, ఆత్మనః –తన – శమలం – మలినమగుటను, గుణ సంగరూపం పంకం – గుణత్రయ సంగతి చేత కలిగిన బురదను (సంసార పంకమును) అస్మిన్నేవజన్మని – ఈ జన్మయందే. విధూయ – ప్రక్షాళనము చేసికొని – కపిలస్య గతిం – ముక్తిని, ప్రపేదే – పొందెను. (3)

అత్రేరపత్యమభికాంక్షత ఆహ తుష్టో
వత్తో మయాహమితి యద్భగవాన్స దత్తః ।
యత్పాద పంకజ పరాగ పవిత్ర దేహా
యోగర్ధిమాపు రుభయీం యదు హైహయాద్యాః - 4

**తా.** పుత్రుడు కావలెనని కోరిన అత్రి మహర్షికి, సంతుష్టుడైన భగవానుడు, నీకు నా చేత నేను అర్పింపబడుచున్నానని చెప్పెను. అతడే దత్తుడు (ఈయబడినవాడు) అతని చరణ పద్మముల పరాగము చేత, యదు, హైహయులు మొదలగువారు పవిత్రమైన దేహములు గలవారై ఐహిక, ఆముష్మిక ఫలములగు అభ్యుదయ నిఃశ్రేయసములను రెండింటిని పొందిరి.

**టీ** :- దత్తాత్రేయావతారమాహ – అత్రేతి. మయా అహమేవ తుభ్యం దత్త ఇతి యత్. యత ఆహ – తతస్సనామ్నా దత్తో జాతః స్వభక్తేభ్యో యోగైశ్వర్యాద్యానంద చరిత్రం దర్శయతి. యస్య పాదపంకజయోః పరాగః తేన పవిత్రాః దేహాః యేషాం తే ఉభయీమైహికీమాముష్మికీం చ. భుక్తిముక్తిరూపాం వా. (4)

**టీ –** దత్తాత్రేయుని అవతారమును చెప్పుచున్నాడు – మయా అహమేవ తుభ్యం దత్త ఇతి యద్యత ఆహ తతః స నామ్నా దత్తో జాతః – నా చేత నేనే నీకు ఈయబడినానని చెప్పుట చేత, అప్పటి నుండి అతడు దత్తుడు. అను పేరుతో వ్యవహరింపబడెను. – స్వభక్తేభ్యో యోగైశ్వర్య దానం, తచ్చరితం చ దర్శయతి – తన భక్తులకు భుక్తి ముక్తులనిచ్చుట, మరియు అతని చరిత్రను కూడ చూపుచున్నాడు – యస్య పాద పంకజయోః పరాగస్తేన పవిత్రా దేహా యేషాం తే – ఎవని పాదపద్మముల పరాగము చేత పవిత్రమైన దేహము లెవరికి కలిగెనో వారు – ఉభయీం ఐహికీం – ఆముష్మికీం చ – రెండింటిని, ఇహలోకమునకు పరలోకమునకు సంబంధించిన ఫలములను – భుక్తి, ముక్తి రూపాంవా – లేక భుక్తి ముక్తి (భోగ, మోక్ష) రూపమగు ఉభయమును. (ఆపుః–పొందిరి.) (4)

తప్తం తపో వివిధ లోక సిసృక్షయా మే
ఆదౌ సనాత్స్వ తపసః స చతుః సనో ౭ భూత్।
ప్రాక్కల్ప సంప్లవ వినష్టమిహాత్మ తత్త్వం
సమ్యగ్జగాధ మునయో యదచక్షతాత్మన్ ॥ - 5

**టీ** :- కుమారావతారమాహ –తప్తమితి. మే మయా ఆదౌ యత్తపః తప్తం తస్మాత్స్వతపసః మత్తపసో హేతోః. స హరిః చతుస్స నో భూత్. సనత్కుమారః సనకసనందనౌ. సనస్సుజాత ఇతి చత్వారః సనశబ్దౌ నామ్ని యస్య సః కథంభూతాత్స్వ తపసః సనాత్ అఖండితాత్ యద్వా స్వతపఃసనాత్ దానాత్సమర్పణాదిత్యర్థః. షణుదానే స చ పూర్వకల్పస్య సంప్లవే ప్రలయావినష్టం ఉత్సన్నసంప్రదాయమాత్మతత్త్వం ఇహ అస్మిన్ కల్పే సమ్యగ్జగాద ఉక్తవాన్. సమ్యక్త్వం దర్శయతి – యత్ గదితమాత్రమేవ మునయః ఆత్మని మనసి అచక్షత సాక్షాదపశ్యన్ ఆత్మన్నిత్యత్ర సప్తమీలోప ఆర్షః. (5)

**తా.** అనేక లోకములను సృష్టించు కోరికతో నేను తపస్సు చేసితిని, నా తపస్సు కారణముగ హరి, మొట్టమొదట 'తపస్సు' అర్థముగా గల సన శబ్దముతోడి నలుగురుగ అవతరించెను. పూర్వ కల్పమునందలి ప్రళయమున నష్టమైపోయిన బ్రహ్మ విద్యను, మునులు తమ హృదయములలోనే బ్రహ్మమును సాక్షాత్కరించుకొనునట్లు, బోధించెను.

**టీ** – కుమారుల అవతారమును చెప్పుచున్నాడు – మే – మయా – నా చేత. ఆదౌ యత్తపస్తప్తం – మొదట ఏ తపస్సు చేయబడినదో – తస్మాత్స్వతపసః మత్తపసో హేతోః – ఆనా తపస్సు కారణముగా – స హరిః చతుః సనో౭ భూత్ – ఆ హరి నలుగురు సన శబ్దులైన మునులుగ అవతరించెను. (సనులుగ అయ్యెను) – సనత్కుమారః, సనకః, సనందనః – సనత్సుజాత ఇతి చత్వారః సన శబ్దాః నామ్ని యస్య సః – సనత్కుమారుడు, సనకుడు, సనందనుడు, సనత్సుజాతుడు అని నాలుగు సన అను పేర్లతో నుండువాడు – లేక నాలుగైన పేర్లు ఎవనికో వాడు – కథంభూతాత్స్వపసః–ఎటువంటి తపస్సు వలన – (దేవి వలన) పుట్టెను? స్వీయమగు తపస్సు వలన – సనా దఖండితాత్ – సనత్ అను పదమును విడువకుండ (అనగా ఈ నాలుగు పేర్లు సన శబ్ద పూర్వకములు) (సనత్ అనునది ఇచట అవ్యయము ఈ నాల్గు పేర్లు సన శబ్దము స్వతపసం అను దానిని విశేషణము చేసి అన్వయించుకొనవచ్చును) యద్వా – లేక – స్వతపసః సనాత్ దానాత్, సమర్పణా దిత్యర్థః – స్వీయ తపస్సు యొక్క దానము వలన – సమర్పించుట వలన అని యర్థము. షణుదానే – షణు ధాతువునకు దానము అర్థము. స చ పూర్వ కల్పస్య సంప్లవే ప్రలయే – అతడు, పూర్వకల్పము యొక్క ప్రళయమునందు – వినష్టం ఉచ్ఛిన్న సంప్రదాయం – మిక్కిలి ఛిన్నమై పోయిన ఆత్మతత్త్వమును – ఇహం – అస్మిన్కల్పే – ఈ కల్పము నందు – సమ్యాక్ జగాద – చక్కగా చెప్పెను – సమ్యక్త్వం దర్శయతి – లెస్సదనమును చూపుచున్నాడు. యద్గదిత మాత్రమేవ మునయః – ఏది చెప్పినంతమాత్రముననే మునులు – ఆత్మన్ – తమలో (తమ హృదయమందు) మనసి – మనస్సునందు – అచక్షత – సాక్షాత్తుగా చూచిరి.(5)

ధర్మస్య దక్ష దుహితర్యజ నిష్ట మూర్త్యాం
నారాయణో నరఇతి స్వతపః ప్రభావః।
దృష్ట్వాత్మనో భగవతో నియమావలోపం
దేవ్యస్త్వనంగ పృతనా ఘటితుం నశేకుః ॥ - 6

**టీ:-** నారాయణమవతారమాహ - ధర్మస్యేతి. ధర్మస్య పత్న్యాం దక్షస్య దుహితరి మూర్తిసంజ్ఞాయాం నారాయణో నర ఇతి మూర్తిద్వయేన జాతః కథంభూతః? స్వాసాధారణ స్తపః ప్రభావో యస్య తదేవాహ - అనంగస్య పృతనాదేవ్యః అప్సరసః భగవత్సకాశాత్ ఆత్మనః స్వప్రతిరూపాః ఊర్వశ్యాద్యాః స్త్రియో దృష్ట్వా తస్య నియమావలోపం వ్రతభంగం ఘటితుం సాధయితుం న తత్ర శేకురిత్యర్థః. ఏతచ్చాఖ్యానం. ఏకాదశే వక్ష్యతి. (6)

**తా.** ధర్ముని భార్య, దక్షుని కూతురునగు మూర్తి యను నామె యందు భగవానుడగు హరి (నరనారాయణలుగా) గా అవతరించెను. అతడు అసాధారణమైన తపః ప్రభావశాలి. మన్మథుని సేనలగు అప్సరసలు ఆ భగవంతుని తపోనిష్ఠకు లోపమును ఘటింపజేయుటకు సమర్థులు కాలేక పోయిరి. ఏలయన వారు (అతనిని) స్వరూపముగల వారిని గానే చూచిరి.

**టీ -** నరనారాయణావతారమును చెప్పుచున్నాడు - ధర్మస్యపత్న్యాం, దక్షదుహితరి, మూర్తి సంజ్ఞాయాం - ధర్ముని భార్యయు, దక్ష కన్యయునగు మూర్తియను పేరు గల దాని యందు - నారాయణో నర ఇతి మూర్తిద్వయేన జాతః - నారాయణుడు, నరుడు అని రెండు రూపములతో బుట్టెను. కథం భూతః ? ఎట్టి వాడు? స్వోఽ సాధారణస్తపః ప్రభావోయస్య - ఎవనికి అసామాన్యమైన తపః ప్రభావము గలదో అట్టివాడు తదేవాహ - దానినే చెప్పుచున్నాడు. అనంగస్యపృతనాః - మన్మథుని సేనలగు - దేవ్యో ఽ ప్సరసః - అప్సర స్త్రీలు - భగవతః సకాశాదాత్మనః - భగవానుని సన్నిధియందు తమనుతాముగ - స్వప్రతిరూపాః - తమ ప్రతిరూపులుగనే - ఊర్వశ్యాద్యాః స్త్రీ ర్దృష్ట్వ్వ - ఊర్వశి మొదలగు స్త్రీలను చూచి (ఆత్మగానే చూచి) తస్య నియమావలోపం - అతనికి వ్రతభంగమును. ఘటితుం-కల్గించుటకు - నశేకుః - సమర్థులు కాకపోయిరి - యద్వా - లేక - ఆత్మనః - తమ యొక్క - యో నియమస్తపోనాశన రూపః - తపస్సును నాశనము చేయుటయను ఏ నియమము కలదో - తస్య అవలోపం - దానికి భంగమును - తత్రదృష్ట్వా - అచట చూచి భగవతః - భగవానుని యొక్క (స్థితిని చూచి) తం ఘటయితుం - దానిని కలిగించుటకు నశేకురితి - సమర్థులు కాలేకపోయిరి అని దీనిని గూర్చిన కథనము ఏకాదశస్కంధమున రాగలదు.(6)

కామం దహంతి కృతినో నను రోషదృష్ట్యా
రోషం దహంతముత తే న దహంత్యసహ్యమ్ ।
సో ౽ యం యదంతరమలం నివిశన్బిభేతి
కామః కథం ను పునరస్య మనః శ్రయేత. ॥ - 7

**తా.** మహాత్ములు క్రోధ దృష్టితో కామమును (కాముని ) కాల్చివేయుదురు. కాని తమను కాల్చుచున్న క్రోధమును - సహింపరాని క్రోధమును మాత్రము దహించివేయజాలకున్నారు. అట్టి క్రోధము ఎవని నిర్మలమైన మనస్సునందు ప్రవేశించుచునే (ప్రవేశింపకముందే) భయపడిపోవునో వాని మనస్సును ఇక కామమెట్లు ఆశ్రయింపగలదు?

**టీ** :- యత్ర కామవిజయిాక్రోధోపి బిభేతి తత్ర కామోన ప్రభవతీతి కింవక్తవ్యమిత్యాహ - కామమితి. కృతినః రుద్ర ప్రముఖాః రోషయుక్తయా దృష్ట్యా కామం దహంతి రోషం త్వాత్మానం దహంతమపి తేన దహంతి క్రోధేనాభిభూయంత ఇత్యర్థః. నను అహో సోయం రోషః యదంతరం యన్మధ్యం ప్రవిశన్ అలం బిభేతి. యద్వా - యస్య అంతః మనః కథంభూతం? అమలం నిర్మలం ప్రవిశన్నితి. (7)

**టీ** - కామమును జయించిన వాడున్నచోట క్రోధము కూడ భయపడును. అచట కామము కూడ ప్రభవింపదనినచో నికనేమి చెప్పవలయునని వివరించుచున్నాడు - కామం అను ఈ శ్లోకముతో - కృతినః - శ్రీరుద్రుడు మొదలగువారు - రోషయుక్తయాదృష్ట్యా - రోషముతో కూడిన దృష్టితో- కామందహంతి - కామమును (కాముని) కాల్చివేయుదురు. రోషంత్వాత్మానం దహంతమపి - క్రోధము తననే దహించివేయునదైన్పటికి కూడ - తే న దహంతి - వారు కాల్చివేయరు - క్రోధేనాభిభూయంత - ఇత్యర్థః - క్రోధము చేత పరాజయము పొలగుదురని యర్థము - ను - అహో! సో౽ యం రోషః - అట్టి క్రోధము - యదన్తరం - దేని మధ్యన- ప్రవిశన్ అలం బిభేతి - ప్రవేశించుచునే చాలును భయపడిపోవును - యద్వా - లేక - యస్యాంతర్మనః - ఎవని మనస్సులోపల - కథం భూతమ్-ఎట్టిది?-అమలం - నిర్మలమైనది - ప్రవిశన్నితి - ప్రవేశించుచుండగానే అని. (7)

విద్ధః సపత్న్యుదిత పత్రిభిరంతి రాజ్ఞో
బాలో ౽ పి సన్నుపతగస్తపసే వనాని ।
తస్మా అదాదద్ధ్రువ గతిం గృణతే ప్రసన్నో
దివ్యాః స్తువంతి మునయో యదు పర్యధస్తాత్ -8

**తా.** తన తండ్రియగు ఉత్తానపాదుడు అను రాజు నొద్దనున్న వానిని సవతి తల్లి ములుకుల వంటి పలుకులతో నొప్పింపగా వేదన చెంది బాలుడయియును వనములకేగి తపస్సు చేసెను. భగవానుడు ప్రసన్నుడై, స్తుతించుచున్న అతనికి ధ్రువస్థానమునిచ్చెను. అతనిని, అతనికంటె పైన గల దేవతలు, క్రింది భాగమున గల మునులు స్తోత్రము చేయుచుందురు.

**టీ** :- చరిత్రేణైవ కమప్యవతారం సూచయతి – విద్ధఇతి. మాతుస్సపత్న్యాః సురుచేః ఉదితాని ఉక్తాని వాక్యాన్యేవ పత్రిణః బాణాః. తైర్విద్ధోధ్రువః. రాజ్ఞః ఉత్తానపాదస్య. అంతి సమీపే తపసే తపశ్చరితుం ధ్రువగతిం ధ్రువపదం యత్ యాం ఉపరి స్థితాం అధస్తాత్ స్థితాః దివి భవాః దివ్యాస్సప్తర్షయః స్తువంతి. యద్వా – ఉపరి భృగ్వాదయః అధస్తాచ్చ సప్తర్షయ ఇతి. (8)

**టీ** – చరిత్ర చేతనే ఒక అవతారమును సూచించుచున్నాడు. (ధ్రువుని అవతారమని యర్థము) మాతుః సపత్న్యాః – సవతి తల్లి చేత – ఉదితాని – చెప్పబడిన వాక్యాన్యేవ పత్రిణః – వాక్యములే బాణములుగా – తైర్విద్ధః – వానిచే నొచ్చుకొనిన వాడై – ధ్రువః – ధ్రువుడు – రాజ్ఞః – ఉత్తాన పాదుని యొక్క – అంతి – సమీపమున – తపసే – తపస్సు చేసెను – ధ్రువగతిం – ధ్రువ పదమును – యత్ ఉపరి – దేనిపై భాగమున. స్థితాః – అధస్తాత్ స్థితాః – ఉన్న ప్రదేశమునకు క్రిందుగనున్న వారు – దివి భవాః దివ్యాః – స్వర్గమునఁబుట్టిన దేవతలు – సప్తర్షయః – ఏడుగురు ఋషులును – స్తువంతి (స్తోత్రము చేయుచుందురు) యద్వా – లేక – ఉపరి – పైన గల – భృగ్వా దయ ః – భృగువు మొదలగువారు – అధస్తాత్ – క్రిందనున్న – సప్తర్షయః– ఏడుగురు ఋషులు – అని. (8)

యద్వేన ముత్పథ గతం ద్విజ వాక్య వజ్ర
విప్లుష్ట పౌరుష భగం నిరయే పతంతమ్ ।
త్రాత్వార్థితో జగతి పుత్రపదం చ లేభే
దుగ్ధా వసూని వసుధా సకలాని యేన ॥ - 9

**తా.** తప్పుడు మార్గమున నడుచుటచే బ్రాహ్మణుల వజ్రముల వంటి శాప వాక్యముల వలన తన వీర్యమును, ఐశ్వర్యమును, దగ్ధమైపోవగా, కోల్పోయి నరకమునందు పడిపోయిన వేన రాజును, ఋషుల ప్రార్థనతో కాపాడి, ఈ జగత్తునందు, ఆ హరి పృథువుగా పుత్రస్థానమును పొందెను. అంతేకాక ఆ పుత్ర పదము చేత భూమి యంతయును అన్నము మొదలగు ఐశ్వర్యములు పితుకబడినదయ్యెను.

**టీ** :- పృథ్వవతారమాహ – యదితి. యత్ యదా ఋషిభిః అర్థితః. తదా వేనం త్రాత్వా అన్వర్థం తత్పుత్ర ఇతి పదంనామలేభే. " శ్లో. పున్నామ్నో నరకాద్యస్మాత్పితరం త్రాయతే సుతః, తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తః స్వయమేవ స్వయంభు" వేతిహ పుత్రపదవ్యుత్పత్తిః. కథం భూతం ద్విజానాం శాపవాక్యమేవ వజ్రం తేన విప్లుష్టం దగ్ధం పౌరుషం భగః ఐశ్వర్యం చ యస్య తం, చరిత్రాంంతరమాహ

**టీ.** పృథువు అవతారమును చెప్పుచున్నాడు – యత్ – ఎప్పుడైతే – ఋషిభిః అర్థితః – ఋషులచే కోరబడెనో – తదా – అప్పుడు – వేనంత్రాత్వా – వేనుని కాపాడి– అన్వర్థం – సార్థకమైన – తత్ పుత్రఇతి పదంనామ లేభే – అతని పుత్రుడను స్థానమును అది పొందెను – "పుంనామ నరకమునుండి కొడుకు, తన తండ్రిని కాపాడును కావున, ఆ కారణమున అతడు పుత్రుడని స్వయముగ బ్రహ్మదేవుని చేత చెప్పబడెను" అని కదా 'పుత్రుడు" అను పదము యొక్క వ్యుత్పత్తి! – కథంభూతమ్ – ఎట్టివానిని – ద్విజానాం శాపవాక్యమేవ వజ్రం

– యేన వా జగతి జగదవనాయ వసూని అన్నాదిద్రవ్యాణి వసుధా దుగ్ధా. (9)

– బ్రాహ్మణుల శాపవాక్యమే వజ్రాయుధము – తేన విప్లుష్టం – దాని చేత దగ్ధమైపోయిన – పౌరుషం – (పరాక్రమము) – భగం చ – ఐశ్వర్యము కూడ – యస్య తమ్ – ఎవని కో అట్టివానిని – వేఱొక చరిత్రమును చెప్పుచున్నాడు. – యేన చ జగతి – ఎవని చేత ప్రపంచము కొఱకు – వసూని – అన్నము మొదలగు ద్రవ్యములు – దుగ్ధా – పితుక బడినదో – (ఆ వసుధ) (9)

నాభేరసావృషభ ఆస సుదేవి సూను
ర్యోవై చచార సమదృగ్జడ యోగ చర్యామ్ ।
యత్పారమ హంస్యమృషయః పదమామనంతి
స్వస్థః ప్రశాంత కరణః పరిముక్త సంగః ॥ - 10

**తా.** నారాయణుడు, నాభియను రాజునకు అతని పత్నియగు సుదేవికిని, ఋషభుడను పేరుతో (వారికి) పుత్రుడుగా అవతరించెను. ఆ ఋషభుడు సమదృష్టి గలవాడై జడత్వయోగముతో తిరుగుచుండెను. అతని ఈ అవధూత చర్యను, ఋషులు, పరమహంసత్వమని, అతడు ఆత్మస్థుడని, శమించియున్న ఇంద్రియములు గలవాడని ప్రపంచ సంగమును సంపూర్ణముగ వదలి యున్న వాడనియు తలంచుచుండును.

**టీ**:– ఋషభావతారమాహ – నాభేతి. అసౌ శ్రీహరిః నాభేరాగ్నీధ్ర పుత్రాత్సుదేవ్యాస్సూనురాస. నాభేర్భార్యాయాః మేరుదేవ్యా ఏవ సుదేవీత్యపి సంజ్ఞా. జడవద్యోగేన నిత్యసమాధినా చర్యాం. యత్ యాం. తత్ర హేతుస్సమదృక్ తత్రాపి హేతుః స్వస్థః స్వస్య రూపే స్థితః. యతః ప్రశాంతేంద్రియః తత్కుతః పరితో ముక్తసంగః. (10)

**టీ** – ఋషభావతారమును చెప్పుచున్నాడు – అసౌ – ఇతడు (హరి) నాభేః – ఆగ్నీధ్ర పుత్రుడగు నాభి వలన – సుదేవ్యాః సూనుః ఆస – సుదేవి యను నామెకు కుమారుడుగ నుండెను – నాభేర్భార్యాయా మేరుదేవ్యా ఏవ సుదేవీత్యపి సంజ్ఞా – నాభి భార్యయగు మేరుదేవికే సుదేవి అనియు పేరు – జడవద్యోగేన నిత్య సమాధినా – జడత్వ యోగముతో ఎల్లప్పుడుసమాధి స్థితితో – చర్యామ్ – తిరుగుటను – యత్ – ఏ జడయోగ చర్య యందు – తత్ర హేతుః – దానికి కారణము – సమదృక్ (అన్నింటిని సమాన దృష్టితో చూచువాడు – తత్రాపిహేతుః – దానికి కూడ కారణము – స్వస్థః – సమాన దృష్టితో చూచువాడు – తత్రాపి హేతుః – దానికి కూడ కారణము – స్వస్థ ః – ఆత్మయందు ఉండువాడు – యతః – ఎందువలన – ప్రశాంతేంద్రియః – శమించిన ఇంద్రియములు కలవాడు – తత్కుతః – అది యెందువలన? – యతః పరితో ముక్తసంగః – అంతటను ఆసక్తిని విడిచిన వాడగుట వలన–(10)

సత్రే మమాస భగవాన్ హయశిరషా ఽ థో
సాక్షాత్స యజ్ఞపురుష స్తపనీయ వర్ణః ।
ఛందో మయో మఖమయో ఽ ఖిల దేవతాత్మా
వాచో బభూవు రుశతీః శ్వసతో ఽ స్య నస్తః - 11

**తా.** సాక్షాత్తుగ యజ్ఞపురుషుడు, బంగారుమేని ఛాయగలవాడునైన హయగ్రీవుడుగ నేను చేసిన యజ్ఞము నందు భగవానుడవతరించెను. ఆతడు వేదమయుడు, యజ్ఞమయుడు సమస్త దేవతాత్మకుడు, శ్వసించుచున్న అతని ముక్కు నుండి కమనీయమైన వేద వాక్కులు ప్రకటమయ్యెను.

**టీ** :- శ్రీహయగ్రీవావతారమాహ – అథో ఇత్యర్థాంతరే స ఏవ సాక్షాభగవాన్ మమ బ్రహ్మణస్సత్రే యజ్ఞే హయశీర్ష ఆస. తపనీయం సువర్ణం తద్వద్వర్ణో యస్య సః ఛందోమయః వేదమయః తద్విధేయా యే మఖాః తన్మయః. అమృతమయ ఇతి వా పాఠః. మఖైర్యజనీయాః యా అఖిలదేవతాః తదాత్మా చ అస్య శ్వసతః. శ్వాసం ముంచతః నస్తః నా సాపుటాత్ ఉశతీః ఉశత్య అత్రార్షత్వాత్ప్రథమార్థే ద్వితీయా. కమనీయాః వేదలక్షణా వాచో బభూవుః. (11)

**టీ** – హయగ్రీవుని అవతారమును చెప్పుచున్నాడు. 'సత్రే' అను ఈ శ్లోకమున అథో ఇత్యర్థాంతరే – 'అథో' అనునది వేఱొక అర్థమున – సఏవ సాక్షాద్భగవాన్ – సాక్షాత్తుగ ఆ భగవానుడే – మమ – బ్రహ్మదేవుడనగు నాయొక్క – సత్రే – యజ్ఞమునందు – హయశీర్షా ఆస – హయగ్రీవుడవతరించెను – తపనీయం – బంగారము. తద్వద్వర్ణోయస్య – దానివంటి వన్నె ఎవనికి గలదో వాడు – ఛందోమయః – వేదమయుడు – తద్విధేయా యే మఖాస్తన్మయః – ఆ వేదములకు విధేయములైన ఏ యజ్ఞములు గలవో వానితో నిండిన వాడు – 'అమృతమయ' ఇతి వా పాఠః – 'అమృతమయః' అనియు పాఠము – మఖైర్యజనీయాః అఖిలా దేవతాః – యజ్ఞములచే పూజింపబడు వారు సమస్త దేవతలు – తదాత్మాచ – వారితో నిండిన వాడును – అస్యశ్వసతః – శ్వసించుచున్న అతని యొక్క – శ్వాస ముంచతః నస్తః – శ్వాసను విడుచు నాసా పుటమునుండి – ఉశతీః – కమనీయములైన – వేదలక్షణాః – వేదలక్షణములు గల – వాచో బభూవుః – వాక్కులు కలిగెను.(11)

మత్స్యో యుగాంత సమయే మనునోపలబ్ధః
క్షోణీమయో నిఖిలజీవ నికాయ కేతః ।
విస్రంసి తానురుభయే సలిలే ముఖాన్మే
ఆదాయ తత్ర విజహార హ వేద మార్గాన్. ॥ - 12

**తా.** చాక్షుషమన్వంతర సమాప్తి సమయమున కాబోవు మనువగు వైవస్వతుని చేత భగవానుని మత్స్యావతారము చూడబడెను. ఆ అవతారము పృథ్వి ప్రధానమై, సకల జీవ సమూహములకు ఆశ్రయమై, నా ముఖము నుండి వెలువడిన జ్ఞానమార్గములైన వేదములను గ్రహించి ఆ ప్రళయ భయంకరమగు జలములో విహరించుచుండెను.

**టీ**:- మత్స్యావతారమాహ - మత్స్య ఇతి. మత్స్యోభావినా వైవస్వతేన మనునా దృష్టః క్షోణీమయః పృథ్వీప్రధానః. తదాశ్రయ ఇత్యర్థః. అత ఏవ నిఖిలజీవనికాయానాం ఆశ్రయః మే ముఖాత్ విస్రంసితాన్ స్ఖలితాన్ వేదస్య మార్గాన్ భేదాన్ భగవానాదాయ తత్ర యుగాంతసలిలే విజహార. హేతిహర్షే. (12)

**టీ** - మత్స్యావతారమును చెప్పుచున్నాడు - మత్స్యో భావినా వైవస్వతేన దృష్టః - మత్స్యము కాబోవు వైవస్వత మనువుతో చూడబడెను - క్షోణీమయః - పుడమియే ప్రధానముగ గలవాడు - తదాశ్రయ ఇత్యర్థః - దానికి ఆశ్రయమైన వాడని యర్థము - అత ఏవ నిఖిల జీవ నికాయానామాశ్రయః - అందువలననే సకల జీవ సమూహములకు ఆశ్రయమైన వాడు - మే ముఖాద్విస్రంసితాన్ గలితాన్ - నా ముఖము నుండి జారిన - వేదస్య మార్గాన్ - వేదములను - ఆదాయ - తీసుకొని. తత్రయుగాంత సలిలే విజహార - అచటి ప్రళయ కాలమునందలి నీటిలో విహరించెను. - హ - హర్షముతో (సంతోషముతో) (12)

క్షీరోదధావమర దానవ యూథపానా
మున్మథ్నతా మమృత లబ్ధయ ఆదిదేవః।
పృష్ఠేన కచ్ఛప వపుర్విదధార గోత్రం
నిద్రాక్షణో ఽ ద్రి పరివర్త కషాణ కణ్డూః॥ - 13

**తా.** అమృతమును పొందుట కొఱకు దేవదానవుల సమూహములు క్షీర సముద్రమును మథించునప్పుడు, ఆది దేవుడైన హరి, తాఁబేలు రూపమును ధరించి, మంథర పర్వతమును తన వీఁపు పై ధరించెను. పర్వతపు రాపిడి వలన దురదను పోగొట్టు సుఖము నొంది అతడు క్షణ కాలము నిద్రించెను.

**టీ** :- కూర్మావతారమాహ - క్షీరోదధావితి. క్షీరోదధౌ కచ్ఛపవపుషా గోత్రం మథనార్థం మందరగిరిం పృష్ఠేన ధృతవాన్. కదా అమృతలబ్ధయే క్షీరాబ్ధిం మథ్నతాం సతాం నిద్రాయాః క్షణః అవసరః ఉత్సవో వా యస్య సః అద్రేః పరివర్తః పరిభ్రమః కషాణం కర్షణం ఘర్షణంవా యస్యాం సా కండూర్యస్య. (13)

**టీ** - కూర్మావతారమును చెప్పుచున్నాడు - క్షీరోదధౌ- పాలసముద్రమున. కచ్ఛప వపుః సన్ - తాఁబేలు శరీరము గలవాడై - గోత్రం మంథనార్థం - మథించుట కొఱకైన పర్వతమును - మంథరగిరిం పృష్ఠేన ధృతవాన్ - మంథర పర్వతమును వీఁపుతో ధరించెను - కదా - ఎప్పుడు? అమృత లబ్ధయే - అమృతమును పొందుట కొఱకు -క్షీరాబ్ధిమున్మ థ్నతాం సతామ్ - పాలసముద్రమును మథించుచుండగా - నిద్రాయః క్షణోఽ వసర ఉత్సవోవా యస్యసః - నిద్ర యొక్క సమయము లేక - సుఖము ఎవనికో వాడు - నిద్రావసరః కుతస్తత్రాహ- నిద్రా సమయమెందువలననో యిట చెప్పుచున్నాడు - అద్రేః - పర్వతము యొక్క - పరివర్తః - పరిభ్రమ - ఏవ కషాణః - తిరుగుటయే ఘర్షణము - కషణం ఘర్షణ సుఖప్రదో యస్యాం సా కండూః యస్యసః - రాపిడియే సుఖము నిచ్చు దురద ఎవనికోవాడు - యద్వా - లేక అద్రిపరివర్త ఏవ కషః కషణం - కొండ తిరుగుచుండుటయే రాపిడి - తేన అణితి అపయాతీతి కషాణా కండూర్యస్య - దానిచే పోగొట్టుకొనబడిన దురద గల వాడు.(13)

త్రైవిష్టపోరుభయ హాస నృసింహ రూపం
కృత్వా భ్రమద్భ్రుకుటి దంష్ట్ర కరాల వక్త్రమ్ ।
దైత్యేంద్ర మాశు గదయో ఽ భిపతంత మారా
ద్దూరౌ నిపాత్య విదదార నఖైః స్ఫురంతమ్ ॥ - 14

**తా.** భగవానుడు, దేవతలకు కలిగిన గొప్ప భయమును దీర్చుటకు నరసింహ రూపమును ధరించి, తిరుగుచున్న బొమ్మముడితోను, పెద్దకోఱలతోను భయంకరమగు ముఖము గలవాడై, గదాయుధముతో వేగముగ నెదురుపడుచున్న హిరణ్య కశిపుడను దైత్యేంద్రుని చూచి, వానిని దూరమునుండియే తన తొడపై పడవేసి, అతడు అటునిటు కదలుచుండగా తన గోళ్ళతో చీల్చి వేసెను.

టీ :- నృసంహావతారమాహ – త్రైవిష్టపేతి. త్రైవిష్టపాః దేవాః తేషాం ఉరుభయం. హంతీతి. తథా సభగవాన్.అథవా త్రైవిష్టపాః దైత్యాః హిరణ్యకశిపోః రాజ్యకాలే తేషాం ఉరుభయజనకో హాసో యస్మిన్ తత్ త్రైవిష్టపోరుభయహాసం తత్ నృసింహరూపం కృత్వా కథంభూతం రూపం? భ్రమంత్యోర్భ్రుకుట్యో దంష్ట్రాశ్చ యస్మిన్ తత్కరాలం వక్త్రం యస్మిన్ తత్ దైత్యేంద్రం స్ఫురంతం ఆరాత్సమీప ఏవ గదయా ఉపలక్షితం అభిపతంతం నఖైర్విదదార, (14)

టీ – శ్రీ నృసింహావతారమును చెప్పుచున్నాడు – త్రైవిష్టపాః – దేవతలు, తేషామురుభయం – వారి యొక్క గొప్ప భయమును – హంతీతి తథా – నశింపజేయువాడు కావున భయహా అని – సః – భగవానుడు – యద్వా – లేక – త్రైవిష్ణపానాం – దేవతలకు – అపి ఉరుభయం – కూడ గొప్పభయము – యస్మాత్తాదృశః హాసోయస్య – ఎవని వలన కలుగునో – దేని వలన కలుగునో అట్టి నవ్వు గల వాడైన – తన్నృసింహరూపం. అట్టి నరసింహుని రూపమును – అథవా – లేక – హిరణ్య కశిపో రాజ్య కాలే త్రైవిష్ట పానాం దైత్యానామురుభయం యస్మాత్తాదృశో హాసో యస్య తన్నృసింహరూపమ్ – హిరణ్య కశిపునిరాజ్యకాలమందు రాక్షసులకు గొప్ప భయము ఎవని వలన కలుగనో వాని యొక్క నవ్వు గల నరసింహుని రూపము – కథం భూతమ్ – ఎట్టిది? – భ్రమంత్యోర్భ్రుకుట్యో– కదలుచున్న, ముడిపెట్టబడిన కనుబొమలు, దంష్ట్రాశ్చ – పెద్దకోఱలు – యస్మింస్తత్కరాలం వక్త్రం యస్మింస్తత్ – ఎవని యందు ఆ భయంకరమైన ముఖము గలదో – అట్టివాడు – దైత్యేంద్రం – రాక్షస రాజును – స్ఫురంత మారాత్సమీప ఏవ – దగ్గరలోనే కదలుచున్న వానిని (కన్పట్టుచున్న వానిని) – గదయోపలక్షితమభిపతంతం – గదా చిహ్నము కలిగి ఎదురుపడుచున్న వానిని – నఖైర్విదదార – గోళ్ళతో చీల్చివేసెను. (14)

అన్తః సరస్యురు బలేన పదే గృహీతో
గ్రాహేణ యూథపతిరంబుజ హస్త ఆర్తః ।
ఆహేద మాది పురుషాఖిల లోకనాథ
తీర్థశ్రవః శ్రవణ మంగల నామధేయ ॥ - 15

**తా.** సరస్సు లోపలి భాగమునందు మొసలిచేత మిక్కిలి బలముతో పట్టుకొనబడిన రెండు కాళ్ళు గలదైన, తామరను తొండమునందు గల ఏనుగుల నాయకుడు, ఆర్తుడై ఇట్లనెను. "ఓ ఆదిపురుషా! సకల జగత్పతీ! పవిత్రమైన కీర్తి గలవాడా! వినుట మాత్రము చేతనే కల్యాణమును కలిగించు పేరు గలవాడా!".

**టీ** :- హరిసంజ్ఞకావతారమాహ - యుగలేన. అంతరితి. గజయూధస్యపతేః తీర్థరూపం శ్రవో యస్య. తీర్థశ్రవాః శ్రవణేనైవ మంగలనామధేయం యస్య. (15)

**టీ** - 'అన్తః' అను మొదలగు రెండు శ్లోకములతో హరి సంజ్ఞ గల భగవానుని అవతారమును చెప్పుచున్నాడు - గజ యూథస్య పతిః - ఏనుగుల సమూహమునకు రాజు - తీర్థరూపం శ్రవోయశో యస్య స తీర్థశ్రవాః - హే తీర్థశ్రవః - పవిత్రమగు తీర్థరూపముగ కీర్తి గలవాడు 'తీర్థశ్రవాః' - హే తీర్థశ్రవః - అని సంబోధన - శ్రవణేనైవ మంగలం నామధేయం యస్యసః - వినుట చేతనే శుభమునిచ్చు పేరు ఎవరికి కలదో అట్టి వాడు, శ్రవణ మంగళనామధేయుడు. **(15)**

శ్రుత్వా హరిస్తమరణార్థిన మప్రమేయ
శ్చక్రాయుధః పతగరాజ భుజాధిరూఢః ।
చక్రేణ నక్రవదనం, వినిపాత్య తస్మా
ద్ధస్తే ప్రగృహ్య భగవాన్ కృపయోజ్జహార ॥- 16

**తా.** (యథార్థముగ ఎఱుగదగినవాడయియును) ఎఱుకకు రానివాడు, చక్రము ఆయుధముగా కలవాడు, పక్షిరాజగు గరుడుని భుజములపై అధిరోహించి యున్న వాడును అయిన హరి, రణమును కోరని గజేంద్రుని మొరవిని, తన చక్రముతో మొసలి తలనుద్రుంచి, దాని నుండి గజేంద్రుని చేతితో గ్రహించి, భగవానుడు ఆతనిని దయతో ఉద్ధరించెను.

**టీ** :- శ్రుత్వేతి. తస్య తద్వచనం శ్రుత్వా శరణార్థినం తం హస్తే శుండాయాం ప్రగృహ్య కిం కృత్వా? నక్రస్య తస్య గ్రాహస్య వదనం వినిపాట్య విదార్య తస్మాత్ వదనాత్. (16)

**టీ** - తద్వచనం శ్రుత్వా - అతని (గజేంద్రుని) మాటలు విని - శరణార్థినం తం - శరణము కోరియున్న అతనిని - హస్తే - తొండమున (తో) - ప్రగృహ్య- తీసికొని కింకృత్వా - ఏమిచేసి - నక్రస్య - మొసలి యొక్క - వదనం వినిపాత్య - ముఖమును (తలను) పడగొట్టి - తస్మాత్ - దానినోటినుండి. (16)



జ్యాయాన్గుణైరవరజో ఽ ప్యదితేః సుతానాం
లోకాన్విచక్రమ ఇమాన్యద థాధి యజ్ఞః ।
క్ష్మాం వామనేన జగృహే త్రిపదచ్ఛలేన
యాచ్ఞామృతే పథి చరన్ప్రభుభిర్న చాల్యః ॥ - 17

**తా.** అదితి పుత్రులలో చిన్నవాడైనను గుణములచే గొప్పవాడు. ఈ లోకములను పాదన్యాసముల చేత ఆక్రమించినవాడు, యజ్ఞాధిష్ఠాత మూడడుగులమిషచేత వామన రూపమున భూమినంతయును తీసికొనినవాడు, ధర్మ మార్గమున నడచుచున్న వాడు ప్రభువుల చేత కూడ - యాచన మూలమున తప్ప - చలింపజేయబడజాలడు కదా!

**టీ :-** వామనావతారమాహ - జ్యాయానితి. అదితేస్సుతానాం ద్వాదశాదిత్యానాం మధ్యే. అధియజ్ఞః యఃజ్ఞాధిష్ఠాతా శ్రీవిష్ణుః. అవరజః కనీయానపి గుణైర్జ్యాయాన్ శ్రేష్ఠః. గుణానేవాహ - యత్ యతః ఇమాన్ లోకాన్ విచక్రమే పాదాన్యాసైః క్రాంతవాన్. అథ ప్రతిశ్రుతానంతరమేవ. తత్ర హేతుః - బలేః క్ష్మాం వామనేన రూపేణ జగృహే. నన్వీశ్వరః స్వయంకిమితి దుర్బలవత్తథా చక్రే? తత్రాహ - యాచ్ఞాం వినా ధర్మమార్గేణ ప్రవర్తమానః ప్రభుభిర్న చాల్యః ఐశ్వర్యాన్న ప్రభ్రంశనీయ ఇతి. (17)

**టీ -** వామనావతారమును చెప్పుచున్నాడు - అదితేః సుతానాం ద్వాదశాదిత్యానాం మధ్యే - అదితి యొక్క పుత్రులతో (ద్వాదశాదిత్యుల) మధ్య - అధియజ్ఞః - యజ్ఞాధిష్ఠాత విష్ణువు - అవరజః - చిన్నవాడైనను - గుణైర్జ్యాయాన్ - గుణముల చేత జ్యేష్ఠుడు - గుణానేవాహ - గుణములనే చెప్పుచున్నాడు - యద్యతః - ఏకారణముననగా - ఇమాన్ లోకాన్ విచక్రమే - పాదన్యాసములతో ఈ లోకములను ఆక్రమించెను - అథ ప్రతిశ్రుతానంతరమేవ - అంగీకారమైన పిమ్మటనే - తత్రహేతుః - అచట కారణము - బలేః క్ష్మాం వామను రూపేణ జగృహే - బలియొక్క భూమిని వామన రూపముతో తీసికొనెను. - నన్వీశ్వరః స్వయం కిమితి దుర్బల వత్తదాచక్రే - ఈశ్వరుడే స్వయముగ నెందులకని దుర్బలుని వలెనే అటుల చేసెను - తత్రాహ - ఈ విషయమున చెప్పుచున్నాడు - యాచ్నాం వినా ధర్మమార్గే వర్తమానః నచాల్యః - ధర్మమార్గమున వర్తించువాడు యాచనతో తప్ప చలింపజేయబడజాలడు - ఐశ్వర్యాన్నభ్రంశనీయ ఇతి - "ఐశ్వర్యము నుండి చ్యుతి చేయబడజాలదు" అని (17)

నార్థో బలేరయ మురుక్రమ పాదశౌచ
మాపః శిఖాధృతవతో విబుధాధిపత్యమ్ ।
యోవై ప్రతి శ్రుతమృతే నచికీర్షదన్య
దాత్మానమంగ శిరసా హరయే ఽ భిమేనే ॥ -18

**తా.** ఓ నారదా ! త్రివిక్రముని పాదములు కడుగుటచే పవిత్రమైన నీటిని తన శిరస్సుపైన అంతటను ధరించిన బలి చక్రవర్తికి ఇంద్రపదవి కూడ పురుషార్థము కాదు. అతడు తనకు అంగీకారము లేనిదే ఏ ఇతరమైన పనిని చేయుటకు ఇష్టపడదు. హరి పాదములపై శిరస్సునుంచి అతడు తనను తాను సమర్పించుకొనెను.

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

**టీ** :- నను తర్హి యాచ్ఞయాపి చాలనమనుచితమేవేత్యాశంక్య తతో ఽ ధికం స్వసాలోక్యాది దాస్యామిత్యాశయేనా హృతవానిత్యాహ - నేతి. యద్విబుధాధిపత్యం ఇదానీం బలాత్ప్రాప్తం అగ్రే దీయమానం చ అయం బలేః పురుషార్థో న భవతి. కుత ఇత్యతాహ - ఆపః ఆ అప ఇతి పదచ్ఛేదః. ఉరుగాయస్య పాదశౌచ ప్రాప్తక్షాలనరూపా అపః. ఆ సర్వతో ధృతః స్వశిఖాయాం మూర్ధ్నీత్యర్థః. కించ శుక్రేణ వారితశ్శప్తో ఽ పి. అంహేనారద ప్రతిశ్రుతం వినాఅన్యత్. నచికీర్షత్ కర్తుం నైచ్ఛత్ అత్రాడాగమాభావ ఆర్షః యస్తృతీయ పాదపూరణార్థం అరయే ఆత్మానం దేహమభిమేనే అంగీకృతవాన్ ఏవం సదేహం త్రైలోక్యం శ్రద్ధయా దత్తవతో విబుధాధిపత్యమర్థో న భవతీత్యర్థః (18)

తుభ్యం చ నారద భృశం భగవాన్వివృద్ధ
భావేన సాధు పరితుష్ట ఉవాచ యోగమ్ ।
జ్ఞానం చ భాగవతమాత్మ సతత్త్వదీపం
యద్వాసుదేవ శరణా విదురంజసైవ ॥ - 19

**టీ** - అయినచో యాచనతో కూడ స్థానచ్యుతి కలిగించుట అనుచితమే అని శంకించి - దానికన్నను అధికమైన ఆత్మావలోకనమును ఇచ్చెదనను ఆశయముతో 'హరించెను' అను భావమున "నార్థః" అను ఈ శ్లోకమున చెప్పుచున్నాడు. యద్విబుధాధిపత్యమిదానీం బలాత్ప్రాప్తమగ్రే దీయమానం చ - ఏ ఇంద్రపదవి కలదో, బలవంతముగ పొందినది - ముందు ఈయబడబోవునది కూడ - బలేః అయం పురుషార్థం న భవతి - ఇది బలి చక్రవర్తికి పురుషార్థము కాజాలదు. కుతఇత్యాహ - ఎందుకు? చెప్పుచున్నాడు. ఆ + ఆపః ఇతిచ్ఛేదః - (ఆ+ఆపః - ఆపః) అని పదచ్ఛేదము - ఉరుక్రమస్య పాద శౌచం - హరి చరణములు కడుగుటచే పవిత్రమగు నీరు- ఆ - అంతటను - ధృతవతః - ధరించినట్టి - క్వ? ఎచ్చట? శిఖా - శిఖాయాం మూర్ధ్ని ఇత్యర్థః - శిఖయందు, శిరస్సుపైన అని యర్థము - కిం చ శుక్రేణ వారితః-మరియు శుక్రాచార్యునిచే నివారింపబడుచున్నను - శప్తో ఽ పి - శపింపబడిన వాడైనను - అంగ - ఓ నారదా! - యః ప్రతి శ్రుతం వినా అన్యత్ న చికీర్షత్ - ఎవడు తన అంగీకారము లేనిదే ఇతరమైనది చేయుటకు ఇష్టపడడో - యశ్చ తృతీయ పాదపూరణార్థం హరయే ఆత్మానం - దేహమప్యభిమేనే అంగీకృతవాన్ - ఎవడు మూడవ పాదమును నింపుట కొఱకు హరికి తన దేహమును కూడా (ఇచ్చుటకు) అంగీకరించెనో(18)

**తా.** ఓ నారదా ! భగవానుడు నీయెడల కూడ అతిశయించిన ప్రేమ భావముతో మిక్కిలి సంతోషించిన వాడై నీకు భక్తి యోగము, జ్ఞానమును, భగవత్తత్త్వమును, ఆత్మతత్త్వ ప్రకాశమును బోధించెను. వాసుదేవుని శరణు పొందిన వారు ఈ అంశములను వాని యథార్థ స్థితిలో శీఘ్రముగ తెలిసికొందురు.

**టీ** :- హంసావతారమాహ – తుభ్యమితి. భృశం వివృద్ధేన భావేన అత్యుద్రిక్తయా భక్త్యా పరితుష్టస్సన్ సాధు యథాతథా ఉవాచ. జ్ఞానం చేతి జ్ఞానసాధనం. కిం తద్భాగవతం నామ కథంభూతం తత్త్వమేవ సుతత్త్వం తద్దీపం ఆత్మతత్త్వదీపకం వివృద్ధభావేనేతి విశేషణస్య ఫలమాహా – యదితి. యస్మాత్. (19)

**టీ** – హంసావతారమును చెప్పుచున్నాడు. "తుభ్యం" అను ఈ శ్లోకమున – భృశం వివృద్ధేన భావేన – మిక్కిలి ఉద్రేకించిన భక్తితో – పరితుష్టః సన్ – సంతోషించినవాడగుచు – భక్తియోగం సాధు యథా తథా ఉవాచ – భక్తి యోగమెట్లు యోగ్యమగునో అట్లు (నీకు) చెప్పెను. జ్ఞానం చ ఇతి – జ్ఞానం అనియు జ్ఞానసాధనమును – కింతత్ – అదియెట్టిది? భాగవతం నామ – భాగవతమనుపేర – కథం భూతమ్ – ఎట్టిది? తత్త్వమేవ సత్త్వమ్ – తత్త్వమే సత్త్వము – ఆత్మ తత్త్వదీపకమ్ – (ఆత్మ తత్త్వ ప్రకాశకము) వివృద్ధ భావేనేతి విశేషణస్య ఫలమాహా యదితి – 'యత్' అను మాటతో వివృద్ధ భావేన' అను విశేషణమునకు ఫలమును చెప్పినాడు. (19)

చక్రం చ దిక్ష్వ విహతం దశసు స్వతేజో
మన్వంత రేషు మను వంశ ధరో బిభర్తి ।
దుష్టేషు రాజసు దమం వ్యదధాత్స్వకీర్తిం
సత్యేత్రిపృష్ఠ ఉశతీం ప్రథయంశ్చరిత్రైః ॥ - 20

**తా.** ఆ భగవానుడే, ఆయా మన్వంతరములయందు, మను వంశమును ధరించినవాడై (మనువై), పది దిక్కులయందును నిరాటంకముగ తన తేజోరూపమైన ఆజ్ఞా చక్రమును (అధికారమును) భరించెను. దుర్మార్గులైన రాజులయందు దండమును విధించెను. మూడులోకములకు పృష్ఠ భూతముగనున్న సత్యలోకమున తన కీర్తిని, తన చరిత్రలతో, తన కమనీయమైన ప్రఖ్యాతిని ప్రకాశింపజేయుచు దుష్టప్రభువులను నిగ్రహించెను.

**టీ** :- తత్తన్మవంతరావతారమాహ – చక్రమితి. స్వతేజః నిజప్రభావమేవ చక్రం సుదర్శనం బిభర్తి చక్రవదప్రతిహతం ప్రభావం బిభర్తీత్యర్థః. తదేవాహ – మనువంశపాలకస్సన్ త్రయాణాం లోకానాం పృష్ఠే ఉపరిస్థితే సత్యే సత్యలోకే ఽపి. కమనీయాం స్వకీర్తిం విస్తారయన్ రాజసు దండం విధత్తే (20)

**టీ** – ఆయా మన్వంతరావతారమును, 'చక్రం' అను ఈ శ్లోకమున చెప్పుచున్నాడు. స్వతేజః – తన ప్రభావమే – చక్రం – సుదర్శన చక్రముగ – బిభర్తి – ధరించును – చక్రవదప్రతిహతం ప్రభావం బిభర్తీత్యర్థః – చక్రమువలె నిరాటంకమైన ప్రభావమును భరించి యుండునని యర్థము. – తదేవాహ – అదే చెప్పుచున్నాడు. మను వంశ పాలకః సన్ – మనువంశ పాలకుడగుచు – త్రయాణాంలోకానాం – మూడు లోకములకు – పృష్ఠే – పై భాగమున – స్థితే – ఉన్న – సత్యలోకేఽ పి – సత్యలోకమునందు కూడ – కమనీయాం స్వకీర్తిం – మనోహరమైన తన కీర్తిని – విస్తారయన్ – విస్తరింపజేయుచు – రాజసు దండం విధత్తే – (దుష్ట) రాజులయందు దండమును విధించెను. (20)

ధన్వంతరిశ్చ భగవాన్స్వయమేవ కీర్తి
ర్నామ్నానృణాం పురురుజాం రుజ ఆశుహంతి ।
యజ్ఞే చ భాగమ మృతాయు రవావరుంధే
ఆయుశ్చ వేద మనుశాస్త్యవతీర్య లోకే. ॥ - 21

**తా.** భగవానుడు స్వయముగానే ధన్వంతరిగా లోకమునందవతరించి, అతిశయించిన పేరు ప్రఖ్యాతులతో, అనేక విధముల రోగములతో పీడింపబడు మానవుల యొక్క రోగములను శీఘ్రముగ బాపెను. మరణము లేని ఆయువు గలవాడై దైత్యుల చేత అపహరింపబడిన యజ్ఞ భాగములను పొందెను. ఆయుర్వేదమును ప్రవర్తింపజేసెను.

**టీ** :- ధన్వంతర్యవతారమాహ - ధన్వంతరి. లోకే అవతీర్య ధన్వంతరిస్సన్. పురురుజాం మహారోగిణాం స్వనామ్నైవ రుజః రోగాన్ హంతి స్వయమేవ కీర్తరితి కీర్తి ర్యతిశయోక్తిః. అమృతం మరణశూన్యం ఆమేర్యస్మాత్సః అవా అవసన్నం పూర్వం దైత్యైః ప్రతిషిద్ధం యజ్ఞే భాగం చ అవరుంధే అలభత అపావరుద్ధమితి పాఠే అయమేవార్థః. ఆయుర్విషయం వేదం చానుశాస్తి ప్రవర్తయతి. (21)

**టీ** - ధన్వంతరి యవతారమును చెప్పుచున్నాడు - లోకే అవతీర్య - లోకమునందవతరించి - ధన్వంతరిః సన్ - ధన్వంతరి యగుచు - పురురుజాం - మహారోగుల యొక్క - స్వనామ్నైవ - తన పేరుతోనే - రుజః - రోగములను - హంతి (నశింపజేయును) స్వయమేవ కీర్తి రితి - తానే కీర్తియని - కీర్త్యతిశయోక్తిః-అతిశయమైన కీర్తి గలవాడై - అమృతం - మరణములేని - ఆయుః యస్మాత్సః- జీవిత కాలమెవని వలన కలుగునో వాడు అప - ఆగిపోయిన - పూర్వం దైత్యైః ప్రతిబద్ధం యజ్ఞేభాగమవరుంధే- రాక్షసుల చేత నిరోధింపబడిన యజ్ఞ భాగమును పొందినవాడు - అవాపరుద్ధమ్ - పూర్వకాలమున అను పాఠమున కూడ ఇదే యర్థము. - ఆయుర్విషయం వేదం చ ఆయువునకు సంబంధించిన జ్ఞానమును కూడ - అనుశాస్తి - ప్రవర్తింపజేయును. **(21)**

క్షత్రం క్షయాయ విధినోపభృతం మహాత్మా
బ్రహ్మధ్రుగుజ్ఝిత పథం నరకార్తి లిప్సు ।
ఉద్ధంత్యసా వవని కంటకముగ్ర వీర్య
స్త్రిః సప్తకృత్వ ఉరుధారపరశ్వధేన ॥ - 22

**తా.** దైవికముగ పెరిగిపోయిన జగత్తును క్షయింపజేయుటకు మహాత్ముడైన పరశురాముని యవతారమున, బ్రాహ్మణ ద్రోహము చేయుచు, సన్మార్గమును వదలి, నరక బాధలను కోరుచున్న, లోకమునకు కంటక ప్రాయమై యున్న క్షత్రియ వంశమును, భగవానుడే భయంకర పరాక్రమియై ఇరువది యొక్క పర్యాయములు తన వాడియైన గొడ్డలితో సంహరించివేసెను.

**టీ** :- పరశురామావతారమాహ - క్షత్రమితి. జగతః క్షయాయ విధినా దైవేన ఉపభృతం సంవర్ధితం. మృత్యవే సమర్పితమితి వా. బ్రాహ్మణేభ్యో ద్రుహ్యతీతి. తథా అతః ఉజ్జితః పంథాః వేదమార్గో యేన సః అతఏవ నరకార్తిం అప్సతీతి తథా ఏవంభూతం అవనేః కంటకతుల్యం క్షత్రం అసౌమహాత్మా హరిః ఉద్ధంతి ఉట్పాటయతి. దీర్ఘతీక్ష్ణధారేణ పరశునా. (22)

**టీ** - పరశురామావతారమును చెప్పుచున్నాడు - జగతః క్షయాయ- జగత్తు యొక్క తగ్గుదల కొఱకు - విధినా - దైవము చేత - ఉపభృతం - మిక్కిలిగ పెరిగిపోయిన దానిని - మృత్యవే సమర్పిత మితివా - లేక మృత్యువునకు అర్పింపబడెను. - బ్రాహ్మణేభ్యో ద్రుహ్యతీతి తథా - బ్రాహ్మణులకు ద్రోహము చేయుటచే అటుల 'బ్రహ్మధృక్' అని - అత ఉజ్ఝితః పంథా - అందువలన వేదమార్గమును విడిచినది - అత ఏవ నరకార్తిం లిప్సతీవ - అందువలననే నరకబాధలను కోరుచున్న దానివలె - ఏవం భూతమవనేః కంటక తుల్యం - ఇట్లగుటచే భూమికి కంటక (ముల్లు) ప్రాయమైన - క్షత్ర - క్షత్రియ వంశమును - అసౌ మహాత్మా - ఈ మహాత్ముడైన హరి, ఉద్ధంతి - నశింపజేయును, దీర్ఘ తీక్ష్ణ ధారేణ పరశునా - పొడవైనది వాడియైనది యునైన గండ్ర గొడ్డలి (వాదర) అంచుతో.(22)

అస్మత్ప్రసాద సుముఖః కలయా కలేశ
ఇక్ష్వాకు వంశ అవతీర్య గురోర్నిదేశే ।
తిష్ఠన్వనం సదయితానుజ ఆవివేశ
యస్మిన్విరుధ్య దశ కంధర ఆర్తి మార్ఛత్. ॥ -23

**తా.** మా వంటి దేవతలను అనుగ్రహించుటకు సుముఖుడు, మాయాధీశ్వరుడును నైన భగవానుడు శ్రీరాముడుగ సకల విద్యాస్వరూపుడై ఇక్ష్వాకు వంశము నందవతరించి, తండ్రి ఆజ్ఞచే, సీతా లక్ష్మణులతో సహా అరణ్యమున నివసించుచు దండకారణ్యమున ప్రవేశించెను. అతనితో విరోధము వహించిన రావణుడు నాశనము పొందెను.

**టీ** :- రామావతారమాహ - త్రిభిః. అస్మదితి. అస్మాకం బ్రహ్మాదీనాం ప్రసాదేన సుముఖః కలయా భరతాదిరూపయా సహ. కలా మాయా తస్యాః గురోః దశరథస్య ఆజ్ఞాయాం తిష్ఠన్ సీతాలక్ష్మణాభ్యాం సహితో వనమావివేశ యస్మిన్ విరోధం కృత్వా రావణో నాశం ప్రాప్తః. (23)

**టీ** - 'అస్మత్' అను ఈ శ్లోకముతో సహా మూడింటిచే రామావతారమును చెప్పుచున్నాడు. అస్మాకం - (మా) బ్రహ్మాదుల - ప్రసాదే సుముఖః - అనుగ్రహించుట యందు అనుకూలుడు, కలయా - భరతుడు మున్నగువారి అంశలతో సహా - కలా - మాయ - తస్యాః - దానికి - ఈశః - ప్రభువు - గురోర్దశరథస్య ఆజ్ఞాయాం - తండ్రియగు దశరథుని ఆజ్ఞ చేత - తిష్ఠన్ సీతా లక్ష్మణాభ్యాం సహితః - సీతా లక్ష్మణులతో కలిసి - వనంఆవివేశ - వనమును ప్రవేశించెను - యస్మిన్విరోధం కృత్వా - ఎవని యందు ద్వేషము వహించి - రావణోనాశం ప్రాప్తః - రావణుడు నాశమును పొందెనో - (అట్టి రాముడు వనమును ప్రవేశించెను) (23)

యస్మా అదాదుదధిరూఢ భయాంగవేపో
మార్గం సపద్యరిపురం హరవద్దిధక్షోః।
దూరే సుహృన్మథిత రోష సుశోణ దృష్ట్యా
తాతప్యమాన మకరోరగ నక్ర చక్రః ॥ - 24

**తా.** ఎవని వలన, సముద్రము, ప్రాప్తించిన భయముతో శరీర కంపనము కలిగి, వెంటనే, త్రిపురమును దహింపగోరు హరుని వలె, రావణుని లంకను కాల్చుటకుబోవురామునకు మార్గము నిచ్చెను. దూరమునందు గల సీత యొక్క క్షోభ వలన కలిగిన క్రోధముచే మిక్కిలి ఎఱ్ఱనైన దృష్టిచేత తపింపజేయబడుచున్న మొసళ్ళు, సర్పములు, పెద్దచేపలు మొదలగువాని సమూహములు గల సముద్రము అతనికి దారినిచ్చెను.

**టీ** :- యస్మాఇతి. యస్మై శ్రీరామాయ ఉదధిః మార్గమదాత్ దదౌ సపది శీఘ్రం హరో యథా త్రిపురం దిధక్షుస్తద్వత్. అరిపురం లంకాం దిధక్షోః దగ్ధుమిచ్ఛోః. షష్ఠీ చతుర్థ్యర్థే యద్వా – పంచమీ. యద్దిధక్షోః రామాత్ యద్భయం ప్రాప్తం తేనాంగే కంపో యస్యేతి. కథంభూతః ఉదధిః ఊఢం ప్రాప్తం యద్భయం తేన అంగేషు వేపః కంపో యస్య. అత్ర హేతుః – దూరే వర్తమానా సుహృత్సీతా తయా నిమిత్తభూతయా మథితః క్షుభితః రోషః తేన సుశోణా అత్యరుణా దృష్టిస్తయా అత్యంతం తప్యమానం మకరాణాం ఉరగాణాం నక్రాణాం చక్రం యస్మిన్. (24)

**టీ** - యస్మై – రామాయ ఉదధిః మార్గం దదౌ – రాముని కొఱకు సముద్రము మార్గము నిచ్చెను. సపది – శీఘ్రం – హరోయథాత్రిపురం దిధక్షుః – హరుడు ఏవిధముగ త్రిపురమును దహింపగోరెనో – తద్వదరిపురం లంకాందగ్ధుమిచ్ఛోః – ఆవిధముగనే శుత్రుపురమగు లంకను నశింపజేయుగోరు వానికి – షష్ఠీ చతుర్థ్యర్థే – చతుర్థీ విభక్తి బదులు ఆ అర్థమున షష్ఠీ విభక్తి (ప్రయోగింపబడినది) యద్వా – లేక – పంచమీ విభక్తి యైనను – దిధక్షోః – కాల్చనిచ్ఛయించు – రామాద్యద్భయం ప్రాప్తం – రాముని వలన ఏ భయము పొందబడినదో – తేన – దాని చేత – అంగే కంపః యస్యేతి–శరీరమున కంపము గలవాడు – కథం భూత ఉదధిః – సముద్రమెట్టిదైయుండెను? ఊఢం – ప్రాప్తించిన – యద్భయం – ఏభయము కలదో – తేన – దానిచేత – అంగేషు వేపః కంపః యస్య – అంగముల యందు వణుకు గలవాడు – అత్రహేతుః – దీనికి కారణము – దూరే వర్తమానా – దూరమునందు నివసించు – సుహృత్ – సీత– తయానిమిత్త భూతయా – కారణ భూతయైన ఆమె చేత – క్షుభితోరోషః – క్షోభనొందిన క్రోధము – తేన – దానిచేత – సుశోణా – మిక్కిలి ఎఱ్ఱనైన – దృష్టిః – చూపు – తయా అత్యంత తప్యమానం – అతిమాత్రముగ తపించుచున్న – మకరాణాం ఉరగానాం – నక్రాణాంచ చక్రం యస్మిన్ – పెద్దచేపల యొక్క, సర్పముల యొక్క, మొసళ్ళ యొక్క సమూహము దేని యందో (అట్టి సముద్రము) (24)

వక్షః స్థల స్పర్శ రుగ్ణ మహేంద్ర వాహ
దంతైర్విడంబిత కకుబ్జుష ఊఢహాసమ్ ।
సద్యో ఽ సుభిః సహ వినేష్యతి దారహర్తు
ర్విస్ఫూర్జితైర్ధనుష ఉచ్చరతో ఽ ధి సైన్యే ॥ - 25

**టీ :-** కించ. వక్షస్థలేతి. యుద్ధే రావణస్య వక్షస్థలస్పర్శేన. (అత్ర ఛందోభంగ ఆర్షః) రుగ్ణాః భగ్నాః యే మహేంద్రవాహస్య ఐరావతస్య దంతాః తైర్విడంబితాః స్వధవలిమ్నా ధవలీకృతాః. తత్తద్దిక్షు పతితైః ప్రకాశితా ఇత్యర్థః. యాః ఏవంభూతాః కకుభః దిశః తాః జుషతే సేవతే పాలయతీతి వా. తదా తస్య దారహర్తుః రావణస్య. అహో మత్సమః కో ఽ న్యో ఽ స్తీతి మహాగర్వేణ ఊఢం ప్రాప్తం హాసమసుభిః ప్రాణైస్సహ సద్యశ్శీఘ్రం వినేష్యతి అపనేష్యతి కైః? ధనుషో విస్ఫూర్జితైః టంకారఘోషైరేవ కథం భూతస్య అధిసైన్యే స్వపరసైన్యమధ్యే ఉచ్చతరః ఉత్కర్షేణ విచరతః కకుబ్జయరూఢహాసమితి పాఠే దంతైరుజ్జ్వలితానాం కకుభాం జయేన యో రూఢహాసః సంజాతో గర్వః. తమపనేష్యతీత్యర్థః. (25)

**తా.** అతని రొమ్ము స్పృశించిన మాత్రమున భగ్నమై పోయిన ఇంద్రుని వాహనమగు ఐరావతము యొక్క దంతములతో పోలుచు, దిక్కులను తాచుకున్న, గర్వముతో కూడిన నవ్వును, తన భార్యను హరించిన రావణుని ప్రాణములతో సహా శ్రీరాముడు సైన్యము యొక్క అగ్రభాగమున నిలిచి, తన ధనుష్టంకార నాదములతో అప్పటికప్పుడే అపహరించి వేయును.

**టీ –** కించ యుద్ధే రావణస్య వక్షః స్థల స్పర్శేన – మరియు యుద్ధమునందు రావణుని రొమ్ముతాకుట చేత – రుగ్ణాః – భగ్నములైన – యే మహేంద్ర వాహస్యైరావతస్య– ఏ మహేంద్రుని వాహనమైన ఐరావతము యొక్క – దంతాః – దంతములు కలవో– తైః విడంబితాః – వానితో పోలుచు – స్వ ధవలిమ్నా – తమ తెల్ల దనము చేత – ధవలీ కృతాః – తెల్లగా చేయబడెను – తత్తద్దిక్షు పాతితైః – అట నుండి దిక్కులయందు పడవేయబడినవైన వాని చేత. ప్రకాశితా ఇత్యర్థః – ప్రకాశింపబడినవి యని యర్థము. – యా ఏవం భూతాః – ఇట్టివియైనవేవికలవో అవి – కకుభః – దిక్కులను – జుషతే – సేవించుచున్నవి – పాలయతీతివా – లేకపాలించుచున్నవో – తథా తస్య– అనునట్లున్న ఆ – దారహర్తృరావణస్య– భార్యనపహరించిన రావణుని యొక్క – 'అహోమత్సమః కోఽ నిర్యఽ స్తీతి' – 'అహో ! నాకు సమానమైన వాడెవడున్నా' డని – మహాగర్వేణ – గొప్ప అహంకారముతో – ఊఢం పొందిన – హాసం – నవ్వును – అసుభిః – ప్రాణములతో సహా – సద్యః – శీఘ్రమే – వినేష్యతి – అపహరించి వేయును – కైః – వేనిచేత ? ధనుషః – ధనుస్సు యొక్క – విస్ఫూర్జితైః – టంకారధ్వనుల చేతనే – కథంభూతస్య – ఎట్టివాని (టంకారములు) – అధిసైన్యే – స్వపరసైన్యముల మధ్యభాగమున – ఉచ్చరతః – ఉత్కర్షతో తిరుగుచున్న వాని యొక్క 'కకుబ్జయరూఢ హాసమ్' అను పాఠమున – దంతైరుజ్జ్వలితానాం – దంతములతో ప్రకాశించుచున్న – కకుభాం – దిక్కులకు – జయేన – జయము చేత – యోరూఢ హాసః సంజాతః – ఏ నిశ్చయమైన నవ్వు కలదో – గర్వః – దాని వలని గర్వము – తమపనేష్యతీత్యర్థః – దానిని హరించునని యర్థము. (25)

భూమేః సురేతర వరూధ విమర్దితాయాః
క్లేశ వ్యయాయ కలయా సితకృష్ణ కేశ :।
జాతః కరిష్యతి జనానుపలక్ష్య మార్గః
కర్మాణి చాత్మ మహిమోప నిబంధనాని. ॥ - 26

**టీ** :- శ్రీకృష్ణావతారమాహ - దశభిః. భూమేరితి. సురేతరా అసురాంశభూతా రాజానః తేషాం వరూథైః సైన్యైర్విమర్దితాయాః భారేణ పీడితాయాః కలయా రామేణ సహజాతః సితకృష్ణకేశా యస్య భగవతస్స్వతఏవ సాక్షాత్సితకృష్ణ కేశత్వం శోభైవ న తు వయః పరిణామకృతం అవికారిత్వాత్. యత్తూక్తం విష్ణుపురాణే. " ఉజ్జహారాత్మనః కేశా సితకృష్ణౌ మహామునే " ఇతి. భారతే ఽపి 'సచాపి కేశా హరిరుజ్జహార శుక్లం చైకమపరం చాపి కృష్ణం, తౌ చాపి కేశౌ విశతాం యదూనాం కులే స్త్రియౌ రోహిణీం దేవకీం చ. తయోరేకో బలభద్రో బభూవ యో ఽసౌ శ్వేతస్తస్య దేవస్య కేశః కృష్ణో ద్వితీయః కేశవస్సంబభూవ కేశో యో ఽసౌ వర్ణితః కృష్ణవర్ణ' ఇతి. తత్తు నకేశమాత్రావతారాభిప్రాయం కింతు భారావతారరూపం కార్యం కియదేతత్ మత్కేశావపి తత్కర్తుం శక్తావితిద్యోతనార్థం రామకేశవయోర్వర్ణ సూచనార్థం చ కేశోద్ధరణమితి గమ్యతే. అన్యథా తత్రైవ పూర్వాపరవిరోధాపత్తేః కృష్ణస్తు భగవాన్ స్వయమిత్యేతద్విరోధాచ్చ. కథం భూతః పరమేశ్వరః తథా జనైరనుపలక్ష్యో మార్గో యస్య తర్హీశ్వరత్వేకిం ప్రమాణమతిమానుష కర్మాన్యథానుపపత్తిరేవేత్యాహ - ఆత్మనో మహిమా ఉపనిబధ్యతే అభివ్యజ్యతే యేషు తాని. (26)

**తా.** రాక్షసులవంటి రాజుల సైన్యముల చేత పీడింపబడు భూమి యొక్క క్లేశమును తొలగించుట కొఱకు, బలరామునితో కూడ పుట్టిన, తెలుపు నలుపు వన్నెల తలవెంట్రుకలు గల కృష్ణ భగవానుడు, జనుల చేత ఊహింపబడరాని మార్గము కలవాడై, తన మహిమను ప్రకటించు కర్మములను చేయగలడు.

**టీ** - శ్రీకృష్ణావతరామును చెప్పుచున్నాడు - 'భూమేః' అని పది శ్లోకములతో సురేతరాః - రాక్షసాంశతో పుట్టిన - రాజానః - రాజులు - తేషాం వరూధైః - వారి సైన్యముల చేత - విమర్దితాయాః - భారమగునట్లు పీడింపబడు (భూమేః - భూమి యొక్క) కలయా - (బల) రామునితో సహా - జాతః సన్ - పుట్టిన వాడగుచు - కోఽసౌజాతః?పుట్టిన వాడెవడు? - సిత కృష్ణౌ కేశౌ యస్య భగవతః - ఏ భగవానునకు తెలుపు నలుపు వన్నె వెంట్రుకలు గలవో - సఏవ సాక్షాత్ - సాక్షాత్తుగా అతడే - సిత కృష్ణ కేశత్వం శోభైవ - నతు వయః పరిణామకృతమ్ - తెలుపు నలుపు వెంట్రుకలు కలిగి యుండుట సౌందర్యమే - వయస్సు పెరుగుటచే వచ్చినది కాదు - (అతనికి) వికారిత్వము లేనందువలన - యత్తూక్తం విష్ణుపురాణే - విష్ణు పురాణమున ఏది చెప్పబడినదో అది ఓ మహామునీ! తన రెండు వెంట్రుకలను - ఒకటి తెల్లనిది మరొయొకటి నల్లనిది - లాగివేసెను. అని - భారతమున కూడ అతడు - ఆహరి తన రెండు వెంద్రుకలను లాగివేసెను. అందొకటి తెల్లనిది మరియొకటి నల్లనిది. ఆ రెండు వెంద్రుకలు యదు కులమునందలి రోహిణి దేవకి అను ఇద్దఱు స్త్రీలను ప్రవేశించునుగాక, అవి రెండింటిలో ఒకటి బలభద్రుడయ్యెను. ఆ దేవుని తెల్లని వెంద్రుకయే ఇతడు. రెండవ వెంద్రుక కృష్ణుడయ్యెను. కేశవుడైన ఈ కేశము నల్లనిదిగా చెప్పబడినది. అని కలదు. ఇది నిశ్చయముగ కేశమాత్రముల అవతారమను అభిప్రాయము కాదు. కాని భూమి భారమును దించుట యను కార్యరూపముగను, ఇట్టి కార్యమును నిర్వర్తించుటకు

తోకేన జీవహరణం యదులూకికాయా
స్త్రై మాసికస్య చ పదా శకటోఽ పవృత్తః।
యద్రింగతాఽ ంతర గతేన దివి స్పృశోర్వా
ఉన్మూలనం త్వితరథాఽ ర్జున యోర్న భావ్యమ్ - 27

**టీ** :- తదేవ ప్రపంచయతి - తోకేనేతి. తోకేన బాలేన సతాఉలూకికాయాః పూతనాయాః జీవహరణం యత్. రింగతా జానుభ్యాం గచ్ఛతా అంతరంగ తేన మధ్యం ప్రాప్తేన దివిస్పృశోః అత్యుచ్ఛయోః అన్యథా అనీశ్వరత్వే తన్న భవితవ్యం. (27)

ఈనా కేశములు సమర్థములు అను విషయమును ద్యోతకము చేయుట కొఱకును ఏర్పడినవి. రామకృష్ణుల వర్ణములను సూచించుట కొఱకు కూడ ఈ కేశోద్ధరణమని తెలియుచున్నది. కాకున్నచో అచటనే పూర్వాపర విషయములకు విరోధమేర్పడును. "కృష్ణుడు స్వయముగ భగవానుడు" అను మాటకు విరోధమగును – కథం భూతః – ఎట్టివాడు? – పరమేశ్వరతయా – పరమేశ్వరత్వము చేత – జనైరనుపలక్ష్యో మార్గోయస్య– జనుల చేత తెలిసికొనబడజాలని మార్గమెవనికో – అట్టివాడు – తర్హి ఈశ్వరత్వే కింప్రమాణమ్? – అయినచో అతని ఈశ్వరత్వమున ప్రమాణమేమి? – అతి మానుష కర్మాన్యథానుపపత్తిరేవేత్యాహ – మానవాతీతములైన కర్మలు (ఉపపత్తి లేనివి) అకారణములెట్లగునో చెప్పుచున్నాడు. ఆత్మనో మహిమా – తన మహిమ – ఉపనిబధ్యతే – యేషు – వేనియందు అభివ్యక్త మగునో – తాని – అవి. (26)

**తా.** బాలుని చేత పూతన చంపబడుట, మూడు నెలల అర్భకుని పాదము చేత శకటాసురుడు వెనుకకు పరుగెత్తింపబడుట, నేల మీద ప్రాకువాని చేత, ఆకాశమునంటునంతటి యెత్తున గల యమలార్జున వృక్షముల మధ్యకు లంఘింపబడి, అవి కూల్చివేయబడుట ఈశ్వరత్వము లేనిచో సంభవింపవు.

**టీ** – దానినే చెప్పుచున్నాడు 'తోకేన' – మొదలగువానితో – బాలేన పూతనాయా జీవహరణం – బాలునిచే పూతన ప్రాణములు హరింపబడుట, – యద్రింగతా – మోకాళ్ళతో నడుచువాని చేత (ప్రాకుచు పోవువాని చేత) – అంతరం గతేన– మధ్యభాగమును చేరినవాని చేత – దివిస్పృశోః – ఆకాశమునంటుచున్న ఎత్తున గల వాని యొక్క – ఇతరథా – అనీశ్వరత్వమున – తన్నభవితవ్యమ్ – అది సంభవింపజాలదు.(27)

యద్వై వ్రజే వ్రజ పశూన్విషతోయ పీథాన్
పాలాంస్త్వజీవ యదనుగ్రహ దృష్టి వృష్ట్యా ।
తచ్ఛుద్ధయే ఽ తి విష వీర్య విలోల జిహ్వ
ముచ్చాట యిష్య దురగం విహరన్హ్రదిన్యామ్ ॥ - 28

**తా.** విషపు నీరు త్రావిన పశువుల మందలోని పశువులను, గోపాలురను, తన అనుగ్రహ దృష్టియనెడు అమృత వర్షముతో బ్రతికింపగలడు. అతిశయించిన విష బలముతో చలింపజేయుచున్న నాలుక గలవాడై యమునా సరస్సులో విహరించుచుండ కాళియుడను సర్పమును - సరస్సు పరిశుద్ధమగుటకు - పారద్రోలగలడు.

**టీ** :- యదితి. విషతోయపీతాన్ విషమయం తోయం తస్య పీతం పానం యేషాం తాన్ పాలాన్ గోపాంశ్చ కృపాదృష్టిసుధా వృష్ట్యా జీవయిష్యతీతి యమునాయాం విహరన్ ఉరగం కాలీయం ఉచ్చాటయిష్యతి. తచ్ఛుద్ధయే తస్యాః హ్రదిన్యాః నిర్విషత్వాయ అతివిషవీర్యేణ విలోలాశ్చంచలా జిహ్వా యస్య. (28)

**టీ** – విషతోయ పీథాన్ – విషమయ తోయస్య పీథం పానం యేషాం తాన్ – విషమయమైన నీటి పానము గల వారిని – పాలాన్ – గోపాలురను – కృపాదృష్టి సుధావృష్ట్యా (దయతో కూడిన చూపు అనెడు అమృత వర్షముతో) – జీవయిష్యతీతి – బ్రతికింపగలడని – యమునాయాం క్రీడన్నురగం కాలియం – యమునలో విహరించుచున్న కాళియుడను సర్పమును – ఉచ్చాటయిష్యతి – (పారద్రోలగలడు) – తచ్ఛుద్ధయే – ఆ సరస్సు విషరహితమగుటకు– అతివిషవీర్యేణ – మిక్కిలిగ నున్న విష బలము చేత – విలోలా – అతిచంచలమైన – జిహ్వాయస్య – నాలుక ఎవనికి గలదో – (అట్టి కాళియుని పారద్రోలగలడు) (28)

తత్కర్మ దివ్యమివ యన్నిశి నిః శయానం
దావాగ్నినా శుచి వనే పరిదహ్యమానే ।
ఉన్నేషయతి వ్రజతమో ఽ వసితాంతకాలం
నేత్రే పిధాయ్య సబలో ఽ నధి గమ్య వీర్యః ॥- 29

**తా.** ఏ రాత్రి వ్రజవాసులు శయనించి యుండగా, శుష్కమైయున్న ముంజగడ్డిగల వనమున దావాగ్నిచేత మంటలు చెలరేగగా నిక తమకు అంత్యకాలమాసన్నమైనదని భావించుచున్నప్పుడు, వారి కన్నులు మూయించి, బలరామునితో సహా, తెలియరాని బలముగల వాడై వారిని ఉద్ధరింపగలుగుట శ్రీకృష్ణుని అలౌకిక చర్యవలె నుండును గదా !

టీ :- తదితి. దివ్యం అలౌకికమేవేతి లోకోక్తిః. ఉన్నేష్యతి ఉద్ధరిష్యతి శుచిః. గ్రీష్మః తత్సంబంధిని వనే శుష్క ఇత్యర్థః.

**టీ.** దివ్యం – అలౌకికమని – లోకపు మాట – ఉన్నేష్యతి – ఉద్ధరించును – శుచిః – గ్రీష్మము – దానికి సంబంధమైన వనమునందు – ఎండిపోయినది అని యర్థము – అతః –

అతోదవాగ్నేర్నేతోరవసితః నిశ్చితః అంతకాలో యస్య తం సబలః సరామః అనధిగమ్యం దుర్జ్ఞేయం వీర్యం యస్య సః. తత్ర నిశినిశ్శయానమితి కాలీయమదనే రాత్రౌ యమునాతీరే, నేత్రే పిధాయ్య పిహితే కారయిత్వేతి ముంజాటవ్యామితి జ్ఞేయం.(29)

అందువలన - దావాగ్నేర్వత్తో నిశ్చితోఽ ంతకాలే యస్య తమ్ - దావాగ్నిచేత కొట్టబడి అంతకాలము వచ్చినదని నిశ్చయించుకొనుట ఎవనికో అట్టి వ్రజమును - సబలః - రామునితో కూడిన వాడై - అనధిగమ్యం - దుర్జ్ఞేయమైన (తెలసికొనుటకు సాధ్యము కాని) వీర్యం - బలము-యస్య - ఎవరికో - తత్ర - అచట - నిశి - రాత్రి - నిఃశయానమితి - కాలియ మర్దనము తరువాత రాత్రి సమయమున యమునా తీరమున - నేత్రే పిధాయ్య - కన్నులు మూసి కొనునట్లు చేసి - ముంజాటవ్యామితి జ్ఞేయమ్ - ముంజగడ్డిగల అడవి యందని తెలసి కొనదగినది. (29)

గృహ్ణీత యద్యదుపబంధమముష్య మాతా
శుల్బం సుతస్య నతు తత్తదముష్యమాతి ।
యజ్జృంభతో ఽ స్య వదనే భువనాని గోపీ
సంవీక్ష్య శంకితమనాః ప్రతిబోధితాసీత్. ॥ - 30

**తా.** అతని తల్లి (యశోద) అతనిని కట్టివేయుటకు ఏ ఏ త్రాడు తీసికొనెనో, అవి యేదియు అతనికి సరిపోవక తక్కువయగుచుండును. అతని తెఱచిన నోటి యందు భువనములను చూచి ఆమె భయాశ్చర్యములకు లోనై ఆపిదప తనను తాను సంభాళించుకొనును.

**టీ** :- గృహ్ణీతేతి. ఉపబధ్యతే అనేనేత్యుపబంధం తత్సాధనం శుల్బం దామ అముష్య మాతా యశోదా గృహ్ణీత గృహ్ణీతవతీ అకారలోపస్త్వార్షః. అముష్య ఉదరే న మాతి బంధనసంమితం భవతి. న పూర్యతే నాలమిత్యర్థః. గోపీ యశోదా సంచక్ష్య దృష్ట్వా ప్రతిబోధితా నిజైశ్వర్యం జ్ఞాపితా. ఆసీదితి యత్ తత్కర్మ దివ్యమితి. పూర్వేణాన్వయః.(30)

**టీ** - ఉపబంధతే ఽ సేనేత్యుప బంధనం - దీని చేత కట్టబడును కావున ఉపబంధనము - త్రాడు - తత్సాధనం శుల్బం - కట్టుటకు సాధనమైన త్రాడు. అముష్యమాతా - ఇతని తల్లియగు యశోద - ఆగ్రహీత్ - కోపగించెను. ఆముష్యోదరే నమాతి - ఇతని కడుపునకు సరిపడకుండును. బంధన సంమితం నభవతి - కట్టుటకు వలసినంతగ సరిపోవదు - నపూర్యత ఇత్యర్థః - చుట్టు నిండుగ చాలదని యర్థము - గోపీ - యశోద - సంవీక్ష్య - చూచి - ప్రతిబోధితా - తన ఆధిక్యమును జ్ఞాపకమునకు దెచ్చుకొనును. తచ్చ కర్మదివ్యమివేతి సర్వత్ర పూర్వేణాన్వయః - ఈ కర్మకూడ అలౌకికమైనదే అని యిట్లు అంతటను పూర్వము పేర్కొనబడిన 'దివ్యకర్మ' తో అన్వయము.(30)

నందం చ మోక్షయతి భయాద్వరుణస్య పాశా
ద్గోపాన్బిలేషు పిహితాన్మయ సూనునా చ ।
అహ్న్యాపృతం నిశి శయాన మతి శ్రమేణ
లోకే వికుంఠ ఉపనేష్యతి గోకులం స్మ ॥ - 31

**తా.** వరుణుని పాశభయము నుండి నందుని విడిపించును. మయుడు అను దానవుని కుమారుడగు వ్యోమునిచే కొండ గుహలలో బంధింపబడిన గోపాలురను కాపాడును. దినమంతయు శ్రమించి, రాత్రి ఒడలు మరచి నిద్రించు గోకులమునందలి ప్రజలను వైకుంఠమునకు చేర్చును. ఆశ్చర్యము కదా !

**టీ:-** నందమితి. వరుణస్య పాశాద్భయం తస్మాన్మోచయిష్యతి మయసూనునా వ్యోమసూనునా. దివసే ఆవృతం వ్యాపారగ్రస్తం అతఏవాతి శ్రమేణ నిశి శయానమితి వైకుంఠప్రాప్తి సాధనానుష్ఠానాభావో దర్శితః. ఉపనేష్యతి ప్రాపయిష్యతి గోకులం గోకులావాసినం జనం స్మేత్యాశ్చర్యే.(31)

**టీ -** వరుణస్య పాశాద్భయం - వరుణుని పాశము వలని భయము - తస్మాన్మోచ యిష్యతి - దాని నుండి విడిపించును. మయసూనునా - మయుని కుమారుడగు వ్యోముడను పేరు గలవాని చేత - అహ్ని - పగటి యందు - ఆపృతం - వ్యాపారయుక్తమైన - నిశి - రాత్రి - శయానమితి చ - నిదురించుచున్న - అని - వైకుంఠప్రాప్తి - వైకుంఠమును ప్రాప్తింపజేయుట - సాధనానుష్ఠానాభావో దర్శితః - సాధనలు, అనుష్ఠానములు లేకయే (గోకులవాసులకు వైకుంఠప్రాప్తి) యని చూపబడినది - ఉపనేష్యతి - ప్రాప్తింపజేయును-గోకుల వాసినం జనం - (గోకులమునందు నివసించు జనమును - స్మేత్యాశ్చర్యే - 'స్మ' అనునది ఆశ్చర్యద్యోతనము నందు ప్రయుక్తము. (31)

గోపైర్మఖే ప్రతిహతే వ్రజ విప్లవాయ
దేవే ఽ భి వర్షతి పశూన్కృపయా రిరక్షుః ।
ధర్తోచ్ఛిలీంధ్ర మివ సప్తదినాని సప్త
వర్షో మహీధ్రమనఘైక కరే సలీలమ్ ॥ - 32

**తా.** శ్రీకృష్ణుని సూచన ననుసరించి గోపజనులు ఇంద్రుని యజ్ఞమును నిలుపుదల చేయగా వ్రజభూమిని నాశనము చేయుటకు ఇంద్రుడు నలువైపుల నుండి గొప్ప వర్షమును కురిపించుచుండగా, దయగలవాడైన కృష్ణుడు, పశువులను రక్షించుకోరిక గల వాడగుచు ఏడు సంవత్సరముల ప్రాయము గల ఆతడు, ఏడుదినములు గోవర్ధనమను పర్వతమును ఒకే చేత, అశ్రమముగ, అవలీలగ అరటి పువ్వును వలె (లేక పుట్టగొడుగునువలె) పైకి లేపి ధరించును

**టీ:-** గోపైరితి. దేవే దేవేంద్రే పశూన్ రిరక్షుః అనఘే శ్రమరహితే ఏకస్మిన్నేవ కరే సలీలం యథాతథా మహీంధ్రం గోవర్ధనం ధర్మా ధరిష్యతి ఉచ్ఛిలీంధ్రం ఉద్గతం ఛత్రాకమివ సప్తవర్షాణివయో యస్య సః. (32)

**టీ -** దేవే - ఇంద్రుడు - పశూన్ రిరక్షుః - పశువులను రక్షింపకోరిక గలవాడై - రిరక్షిషురిత్యర్థః - రక్షింపగోరిన వాడని యర్థము - అనఘే - శ్రమరహితమైన - ఏకస్మిన్నేవ కరే - ఒకే చేతి యందు - సలీలం యథా తథా - ఎట్లు క్రీడగనో అట్లు మహీంధ్రం - గోవర్ధన గిరిని - ధర్తా - ధరించువాడగును - ఉచ్ఛిలీంధ్రముద్గతం ఛత్రాకమివ - పుట్టగొడుగును పైకెత్తినట్లు - సప్తవర్షాణి వయో యస్య సః - ఏడు సంవత్సరముల ప్రాయము ఎవనికో వాడు (సప్తవర్షః) (32)

క్రీడన్వనే నిశినిశాకర రశ్మిగౌర్యాం
రాసోన్ముఖః కలపదాయత మూర్ఛితేన ।
ఉద్దీపిత స్మర రుజాం వ్రజ భృద్వధూనాం
హర్తుర్హరిష్యతి శిరోధన దాను గస్య ॥ - 33

**తా.** రాసలీలకు ఉద్యుక్తుడై, రాత్రి సమయమున చంద్రుని వెన్నెల కాంతుల తెల్లదనమున, వనమునందు క్రీడించుచు, మనోహరమైన మురళీగానము నందలి దీర్ఘమైన మూర్ఛనల చేత, ఉద్దీపింప జేయబడిన మన్మథ బాధతో వివశులైన వ్రజాంగనల హరించు వాడగు శంఖచూడుని (కుబేరుని సేవకుని) శిరస్సును హరించి వేయగలడు.

**టీ :-** క్రీడన్నితి. నిశి రాత్రౌ నిశాకరరశ్మిభిర్గౌర్యాం ధవలాయాం వనే క్రీడన్ కలాని మంజులాని పదాని యస్మిన్ తచ్చ తదాయితం దీర్ఘం మూర్ఛితం ఆలాపవిశేషయుక్తం గీతం తేన ఉద్దీపితః స్మర ఏవ రుక్ యాసాం తాసాం గోపీనాం హర్తుర్ధనదానుగస్య కుబేరానుచర్యస్య శంఖచూడస్య శిరో హరిష్యతి. (33)

**టీ -** నిశి - రాత్రి యందు - నిశాకర రశ్మిభిః గౌర్యాం - చంద్రుని కాంతుల చేత నైన తెల్లదనమునందు - వనే క్రీడన్ - వనమునందు క్రీడించుచు - కలాని - మంజులమైన- పదాని యస్మింస్తచ్చ - పదములు (పాటలు) దేనియందో అది - తదాయతం - దాని దీర్ఘమైన - మూర్ఛితం - ఆలాప విశేషముతో కూడిన - గీతం - (పాట) - తేన ఉద్దేపితః - దానితో ఉత్తేజమును పొందిన - స్మర ఏవ రుక్ యాసాం - మన్మథుడే ఎవరి యందు వికారమో (జబ్బో) - తాసాం గోపీనాం - అట్టి గోపికల యొక్క - హర్తుః - హర్తయగు. శంఖ చూడుని యొక్క - శిరః - తలను - హరిష్యతి - ఖండించును. (33)

యే చ ప్రలంబ ఖర దర్దుర కేశ్యరిష్ట
మల్లోభ కంస యవనాః కుజ పౌండ్ర కాద్యాః।
అన్యే చ శాల్వ కపి బల్వల దంతవక్త్ర
సప్తోక్ష శంబర విదూరథ రుక్మి ముఖ్యాః॥ - 34

**తా.** ఇంకను ప్రలంబుడు, ఖరుడు, దర్దురుడు, కేశి, అరిష్టుడు, మల్లోభుడు, కంసుడు, యవనులు, కుజుడు, పౌండ్రకుడు మొదలగువారు ఇంకను ఇతరులగు శాల్వుడు, కపి, బల్వలుడు దంత వక్త్రుడు, నగ్నజిత్తు యొక్క ఏడు వృషభములు, శంబరాసురుడు, విదూరథుడు, రుక్మి మొదలగువారును.

**టీ** :- యఇతి. యే చ ప్రలంబాదయః తే సర్వే హరిణా హేతుభూతేన తదీయం దర్శనాయోగ్యనిలయం వైకుంఠం. అలం యాస్యంతీత్యుత్తరేణాన్వయః. ఖరోధేనుకః దర్దురో బకః ఇభః కువలయాపీడః. కపిః ద్వివిదః కుజః నరకః. (34)

**టీ** – ప్రలంబుడు మొదలగు వారందఱును హరికారణముగ అతని నిలయమైన అదర్శనం – చూచుటకు సాధ్యము కాని వైకుంఠమును పొందుదురని తరువాతి శ్లోకముతో అన్వయము. ఖరః – ధేనుకుడు – దర్దురము (కప్ప, మేఘము) వంటి వాడు కావున దర్దురుడు, బకాసురుడు. ఇభః – కువలయాపీడము – కుజః – నరకుడు – కపిః – ద్వివిదుడు (34)

యే వా మృధే సమితి శాలిన ఆత్త చాపాః
కాంబోజ మత్స్య కురుకైకయ సృంజయాద్యాః।
యాస్యంత్యదర్శన మలం బలభీమ పార్థ
వ్యాజాహ్వయేన హరిణా నిలయం తదీయమ్ - 35

**తా.** యుద్ధములయందును, పోట్లాటల యందును యోధులైన వారును, ధనుస్సులు గలవారును, కాంబోజులు, మత్స్యదేశీయులు, కురులు, కైకయులు, సృంజీయులు మొదలగు వారును, ఎవరు యుద్ధమునకు వచ్చెదరో వారందఱును, బలరాముడు, భీముడు, అర్జునుడు మున్నగువారి పేర్లనెపమున హరి చేతనే సంహరింపబడి అతని ధామమునే చేర్పబడుదురు.

**టీ** :- యఇతి. యే చ మృధే ఆత్తచాపాః సమితౌ సంగ్రామే శాలంతే శ్లాఘంత ఇతి సమితిశాలినః. నను ప్రలంబ ఖర కపి పల్వలరుక్మిప్రముఖాః బలభద్రేణ నిహతాః. కాంభోజాదయశ్చ భీమార్జునాదిభిః. శంబరః ప్రద్యుమ్నేన. యవనో ముచుకుందేన. న తు హరిణా తత్రాహ – బలభీమపార్థాదయో వ్యాజాహ్వయాః కపటనామాని యస్య తేన ఖలనిగ్రహార్థం తత్తదభినివిష్టేనేత్యర్థః సప్తోక్షాణస్తు తేన దమితాః కాలాంతరే యాస్యంతీతి భావః ఏతచ్చ సర్వమపి కర్మ దివ్యం తచ్చాన్యథా న భావ్యమితి పూర్వేణాన్వయ (35)

**టీ** – ప్రలంబుడు, ఖరుడు, కపి, వల్వలుడు, రుక్మి మొదలగువారు బలభద్రుని చేత చంపబడిరి, కాంబోజాదులు భీమార్జునాదుల చేత, శంబరుడు ప్రద్యుమ్నుని చేత యవనుడు ముచుకుందుని చేత, చంపబడిరి – హరిచే కాదని అట చెప్పినాడు. బలభద్రుడు, భీముడు, అర్జునుడు మున్నగువారు కపటనామములు గలవాడెవడో వాని చేత (హరి చేత) నిహతులైరి సప్తోక్షములు అతని చేత అణచఁబడినవి. కాలాంతరమున (మరణాంతరమున) అదర్శన స్థితిని పొందుదురని భావము – ఈ కర్మ అంతయును అలౌకికముగ నుండెను. దానికన్న ఇతరముగ భావింపబడజాలదని పూర్వశ్లోకమునందు చెప్పబడిన దానితో సంబంధము గలది. (35)

కాలేన మీలిత ధియామవమృశ్య నృణాం
స్తోకాయుషాం స్వనిగమో బత దూరపారః ।
ఆవిర్హితస్త్వను యుగం సహి సత్య వత్యాం
వేదద్రుమం విటపశో విభజిష్యతి స్మ ॥ - 36

**తా.** కాలము చేత సంకుచితముగ చేయబడిన బుద్ధియు, అల్పముగా చేయబడిన ఆయువును గల మనుష్యులకు, తనచే రచింపబడిన వేదము "అయ్యో! దూరమైన పారము గలది (దుర్ జ్ఞేయము) యగుచున్నదిగదాయని ఆలోచించి, ఆ హరియే, సత్యవతి యందు అవతరించి, యుగమునను సరించి, వేదమనెడు వృక్షమును, శాఖల క్రమమున విభజింపగలడు.

**టీ :-** వ్యాసావతారమాహ - కాలేనేతి. అనుయుగం ప్రతియుగం మీలితా సంకుచితా ధీర్యేషాం సోక్తమల్పమాయుర్యేషాం తేషాం స్వనిగమః స్వకృతః స్వేన సంవర్ధితః వా వేదరాశిః బత అహోసాగరవత్ దూరే పారం యస్య సః దుర్గమ ఇత్యవమృశ్యవిచార్య సత్యవత్యామావిర్భూతస్సన్ ఏవం శ్రీహరిః విటపశః శాఖాభేదేన. (36)

**టీ.** వ్యాసావతారమును చెప్పుచున్నాడు. అనుయుగం - ప్రతియుగమునందు - మీలితాః - సంకుచితము చేయబడిన - ధీర్యేషామ్ - బుద్ధియెవరికో వారికి - స్తోకం - అల్పమైన - ఆయుర్యేషాం తేషాం - ఆయువు ఎవరికో వారికి - స్వనిగమః - స్వ కృతియైన వేదరాశి - బత! - అహో ! - దూరే పారం యస్యేతి - దుర్గమమని - అవమృశ్య (విమర్శించి) సత్యవత్యామావిర్భూతః - సత్యవతి యందు ఆవిర్భవించెను. సహి - ఆ హరియే విటపశః - శాఖాభేదములతో... (36)

దేవద్విషాం నిగమవర్త్మని నిష్ఠితానాం
పూర్భిర్మయేన విహితాభిరదృశ్యతూర్భిః ।
లోకాన్ఘతాం మతివిమోహమతి ప్రలోభం
వేషం విధాయ బహు భాష్యత ఔపధర్మ్యమ్ - 37

**తా.** దేవతలకు శత్రువులును, వైదిక మార్గము ననుష్ఠించుచుండువారును, మయుడు అను రాక్షసునిచే నిర్మింపబడిన అదృశ్య వేగముగల నగరములలో నుండు వారును వాని లోకనాశక కృత్యములు చేయువారును అయిన రాక్షసుల బుద్ధికి లోభమోహములను కలిగించునట్లు వేషమును ధరించి, హరి, బుద్ధుని రూపమున మిక్కిలిగ ఉపధర్మములను బోధించును.

**టీ** :- బుద్ధావతారమాహ - దేవేతి. దేవద్విషాం దైత్యానాం నిగమవర్త్మని వేదమార్గే సత్కర్మానుష్ఠానాదౌ నిష్ఠితానాం నితరాం స్థితానాం తద్బలేన చ పూర్భిః త్రిపురైః అదృశ్యతూర్భిః దేవాదిభిరప్యలక్ష్యవేగాభిః కించ అయోరజతాౘమమయీభిః లోకాన్ ఘ్నతాం మతేర్విమోహో యోగ్యతా త్యాగః యస్మాత్ మతేః ప్రలోభశ్చ అయుక్తస్వీకారో యస్మాత్ తం పాషండవేషం విధాయ ఔపధర్మ్యం ధర్మవద్భాసమానమధర్మం పాషండధర్మం స్వార్థేష్యజ్ బహుభాష్యతే బహుభాష్యతఇత్యర్థః. (37)

యర్హ్యాలయేష్వపి సతాం న హరేః కథాః స్యుః
పాఖండినో ద్విజజనా వృషలా నృదేవాః ।
స్వాహా స్వధా వషడితి స్మ గిరోనయత్ర
శాస్తా భవిష్యతి కలేర్భగవాన్యుగాంతే. ॥ - 38

**టీ** :- కల్క్యవతారమాహ - యర్హీతి. యర్హి యదా సతమప్యాలయేషు హరేః కథాః న స్యుః. ద్విజానాః త్రైవర్ణికాః పాషండినః భగద్విరోధినః అసత్యవాదరతాః అధర్మశీలాశ్చ స్యుః వృషలాః శూద్రాః. నృదేవాః రాజానః స్యుః శూద్రా ఏవ రాజానో న క్షత్రియవంశ్యా ఇతి భావః. యదా స్వాహా స్వధావషడితి గిరో న స్యుః యజ్ఞాద్యనుష్ఠానాభావాత్. తదా కల్కిరూపేణ కలేశ్శాసితా భవిష్యతి. అత్ర బ్రహ్మనారదరసం వాదాత్ప్రాగ్భావినో వరాహా

**టీ** - బుద్ధుని అవతారమును చెప్పుచున్నాడు - దేవద్విషాం - రాక్షసులకు - నిగమ వర్త్మని - వేదమార్గము నందు - నిష్ఠితానాం - నిష్ఠ కలిగియున్న వారికి - తద్బలేనచ - ఆ బలముతో కూడ - పూర్భిః - పురములచేత (త్రిపురాసురునిచే, లోహము, వెండి, రాగితో నిర్మింపబడిన నగరములతో) - అదృశ్య తూర్భిః - చూచుటకు శక్యముకాని వేగములు గలవానిచే - మతేర్విమోహః - దేనివలన యోగ్యత విడువబడునో అట్టి బుద్ధియొక్క - ప్రలోభశ్చ - దేనివలన అయుక్త స్వీకారము కలుగునో అట్టి పాఖండ వేషమును ధరించి - తేనౌపధర్మ్యం - దానితో నాస్తిక ధర్మమును - (స్వార్థేష్యఞ్ - స్వార్థమున ష్యఞ్ ప్రత్యయము) బహు భాషిష్యత ఇత్యర్థః - మిక్కిలిగ బోధింపగలడు అని యర్థము.(37)

**తా.** సత్పురుషుల యిండ్లలో కూడ భగవానుని కథలు ప్రవర్తింపనప్పుడు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు నాస్తికులైనప్పుడు, శూద్రులు రాజులైనప్పుడు "స్వాహా", "స్వధా" "వషట్" అను శబ్దములు వినబడని తావుల యందు, కలియుగ సమాప్తికాలమున కలిభగవానుడు అవతరించి జనులను శాసించును.

**టీ** - 'కల్కి' అవతారమును చెప్పుచున్నాడు. యర్హి - ఎప్పుడు - సతామప్యాల యేషు. - (సత్పురుషుల యిండ్లలో కూడ) హరేః కథాః నస్యుః - (భగవానుని కథలు ఉండవో) త్రైవర్ణికాః - మూడు వర్ణముల వారు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు) పాఖండినః స్యుః - వేద మార్గ విరోధులయ్యెదరో - శూద్రాశ్చరాజానః స్యుః -శూద్రులు రాజులయ్యెదరో - తదా - అప్పుడు - కల్కి రూపేణ - కల్కి రూపముతో - కలేః శాస్తాభవిష్యతి - కలియుగమునకు శాసకుడు కాగలడు - ఇచట బ్రహ్మనారద సంవాదమునకు పూర్వము, కాగలవారు వరాహాదులు, మన్వంతరావతారములు కొన్ని అప్పటికి గడచినవి. మఱికొన్ని భావికాలమున రానున్నవి -

దయః. మన్వంతరావతారాస్తు భూతాభావినశ్చ. ధన్వంతరి పరశురామా తదా వర్తేతే శ్రీరామాదయస్తు భావినః తత్ర చ క్వచిద్భూతాదినిర్దేశశ్ఛందస ఇతి ద్రష్టవ్యం. (38)

ధన్వంతరి పరశురామావతారములు అప్పుడు వర్తించుచుండినవి శ్రీరామాద్యవతారములు భవిష్యత్కాలమున రానున్నవి. అచట కొన్ని అవతారములు గడచినవిగా సూచించుట ఛాందసమని (పూర్వకల్పీయము) చూచుకొనవలయును. (38)

సర్గే తపోహమృషయో నవయే ప్రజేశాః
స్థానే చ ధర్మ మఖ మన్వమరావనీశాః ।
అంతేత్వధర్మ హర మన్యు వశాసురాద్యా
మాయా విభూతయ ఇమాః పురుశక్తి భాజః - 39

**తా.** సృష్టి ప్రారంభమగునప్పుడు, తపస్సు, తొమ్మండుగురు ప్రజాపతులు, ఋషులు, నేను, (నా రూపమున నుండువారు) సృష్టిని రక్షింపవలసిన సమయమున ధర్మము, విష్ణువు, మనువు, దేవతలు, రాజులు: ఇక ప్రళయ సమయమున అధర్మము, రుద్రుడు, క్రోధవశులగు సర్పములు, రాక్షసులును, భగవానుని మాయావిభూతులు ప్రకటమగుచుండును.

**టీ** :- సృష్ట్యాదికార్యభేదేన మాయాగుణావతారవిభూతీరాహ – సర్గఇతి. సర్గే సృష్టౌ సర్గవిషయక తపశ్శాలిత్వాత్తపోహం. స్థానే స్థితౌ మఖః శ్రీవిష్ణుః. శ్రు. ' యజ్ఞోవై విష్ణురితి' శ్రుతేః. ధర్మశ్చ మఖశ్చ మనవశ్చ అమరాశ్చ అవనీశాః పృథ్వాదయశ్చ అంతే సంహారే హరో రుద్రః మన్యువశాః సర్పాః బహుశక్తిధారిణో భగవతః మాయావిభూతయః. (39)

టీ – సృష్టి మొదలుకొని కార్యభేదములచేత మాయాగుణముల అవతార విభూతులను చెప్పుచున్నాడు. 'సర్గః' అను ఈ శ్లోకమునందు – స్థానే – స్థితి యందు – మఖః – విష్ణువు – ధర్మశ్చ మఖశ్చ మనవశ్చ అమరాశ్చ అవనీశాశ్చ – ధర్మము, విష్ణువు, మనువులు, దేవతలు, రాజులును – అంతే – సంహారమునందు – హరః – రుద్రుడు – మన్యువశాః – సర్పములు, – బహుశక్తి ధారిణో భగవతః ఇమాః మాయావిభూతయః – అనేకములైన శక్తులు కలిగిన భగవానుని మాయావిభూతిని. **(39)**

విష్ణోర్ను వీర్య గణనాం కతమో౾ర్హతీహ
యః పార్థివాన్యపి కవిర్విమమే రజాంసి ।
చస్కంభ యః స్వరభసా౾స్ఖలతా త్రిపృష్ఠం
యస్మాత్త్రిసామ్య సదనాదురు కంపయానమ్ -40

తా. ధూళి కణములను లెక్కించిన విద్వాంసుడుకూడ, విష్ణు శక్తులను లెక్కింజాలడనినచో నిక ఆతని శక్తులను, గణించుట అట అర్హుడెవడున్నాడు? భగవానుడు త్రివిక్రమావతారమున, ముల్లోకములను తన అడుగులతో కొలుచుచుండగా, అతని అడుగుల వేగముచే ప్రకృతి రూపమగు అంతిమమైన ఆవరణమునుండి సత్యలోకము వఱకు బ్రహ్మాండమంతయును వణకుచుండెను. అప్పుడతడే తన శక్తిచే దానిని స్థిరమగునట్లు ధరించెను.



**టీ** :- మయా సంక్షేపేణోక్తం విస్తరేణ వక్తుం న కో ऽ పి సమర్థ ఇత్యాహ - విష్ణోరితి. పృథివ్యాః పరమాణూనపి యో విమమేగణితవాన్ తాదృశో ऽ పి కోను విష్ణోర్వీర్యగణనాం కర్తుమర్హసి. కథం భూతస్య యో విష్ణుః త్రిపృష్ఠం సత్యలోకం చస్కంభ ధృదవాన్ యస్మాత్ త్రైవిక్రమే అస్ఖలతా ప్రతి ఘాతశూన్యేన స్వరభసా స్వపాదవేగేన త్రిసామ్యరూపం సదనమధిష్ఠానం. ప్రధానం తస్మాత్త్రిసామ్యసదనాత్ ఉరుఅధికం కంపయానం కంపమానం కంపేన యానం యస్యేతి వా. అతః కారణాచ్చస్కంభ. ఆత్రిపృష్ఠమితి వా ఛేదః. సత్యలోకమభివ్యాప్య యః సర్వం ధృతవానిత్యర్థః. తథా చ శ్రుతిః. 'విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాగ్ం యో అస్కభాయ దుత్తరగ్ం సధస్థం విచక్రమాణస్త్రేధో రుగాయ' ఇత్యస్యార్థః విష్ణోర్నుకం వీర్యాణి కం ప్రవోచం కః ప్రావోచదిత్యర్థః యః పార్థివాన్యపి రజాంసి విమమే సో ऽ పి యో విష్ణుః త్రేధా విచక్రమాణః విక్రమం కుర్వన్ ఉత్తరం లోకం అస్కభాయత్ అవష్టబ్ధవాన్ కథంభూతం సధస్థం సహస్యసధాదేశః. తిష్ఠంతీ తిస్థాః. తత్రత్యైర్దేవైస్సహ వర్తమానమిత్యర్థః. (40)

టీ - నేను దీనిని సంక్షేపముగ చెప్పితిని. విస్తరించి చెప్పుటకు ఎవ్వడును సమర్థుడు కాడని పలుకుచున్నాడు - పృథివ్యా ః - భూమి యొక్క - పరమాణూనపి - సూక్ష్మములైన పరమాణువులను కూడ - యో విమమే - ఎవడు లెక్కించెనో - తాదృశోపి - అట్టివాడు కూడ - కః ను - ఎవడును నిశ్చయముగ - విష్ణోర్వీర్యగణానాం - విష్ణుని శక్తులను లెక్కించుటను - కర్తుమర్హతి? చేయుటకు సమర్థుడా? - కథం భూతస్య - ఎట్టివాని యొక్క? - యో విష్ణు స్త్రి పృష్ఠం - ఏ విష్ణువు సత్యలోకమును - చస్కంభ - ధరించెనో - కిమితి చస్కంభ ? ఏమని ధరించెను? యస్మాత్ త్రైవిక్రమే - త్రివిక్రమత్వమునందు - అస్ఖలతా - ప్రతిఘాతశూన్యముగా - సరంహసా - తన పాదముల వేగముచేత - త్రిసామ్యరూపం - త్రిగుణసామ్యలక్షణముగల - సదసం - అధిష్ఠానము అగు - ప్రధానం - ప్రకృతి గలదో - తస్మాదారభ్య - దాని నుండి మొదలుకొని - ఉరు - అధికమైన కంపయానం -వణుకుతోకూడినదై (యానముగల) - కంపేన యానం యస్యేతివా (వణుకుచున్న నడక గలవాడైన - అతః - ఆకారణమున - చస్కంభ - ధరించెను - ఆ త్రిపృష్ఠ మితివాచ్ఛేదః - (అస్ఖలతా + ఆ త్రిపృష్ఠం అనియు పదచ్ఛేము) - సత్యలోకమభివ్యాప్య - సత్యలోకము వఱకు వ్యాపించి - యః సర్వంధృతవాన్ ఇత్యర్థః - ఎవడు అంతయును ధరించెనో అని యర్థము - తథాచమంత్రః - మంత్రమటులే చెప్పుచున్నది. "విష్ణోర్నుకం" ఇతి - "విష్ణోర్నుకం' అని విష్ణుసూక్తమున గలదు - అస్యార్థః - దీని అర్థము. విష్ణోర్నువీర్యాణి కం ప్రవోచమ్ - విష్ణువు యొక్క శక్తులు ఎవరు చెప్పగలిగిరి. అని యర్థము - యః పార్థివాని - ఎవడు కణములను కూడ -విమమే - గణించెనో - సో ऽ పి - అతడు కూడ - యో విష్ణుః త్రేధా విచక్రమాణః - ఏ విష్ణువు మూడడుగులు వేయవాడగుచు - (తన్ను తాను త్రివిక్రమునిగా చేసికొని) ఉత్తరంలోకం - పైపైనగల లోకమును - అస్కమాయత్ - ఆక్రమించిన వాడయ్యెనో - కథం భూతమ్ - ఎట్టి దానిని ? సఘస్థమ్ - వేగమునందున్న దానిని - సహస్యసఘాదేశః






– 'సహ' శబ్దమునకు 'సఘ' ఆదేశమైనది. (సహ శబ్దమునకు బలిమి, వేగము, ఓర్పు, మార్గశీర్షము, హేమంతము అనునవి అర్థములు) – తిష్ఠంతీతిస్థాః – ఉందురుకావున 'స్థా' – తత్రస్థైర్దేవైః సహ – అచట నున్నదేవతలతో సహా – వర్తమానమిత్యర్థః – ఉంటున్నవాడని యర్థము. **(40)**

నాంతం విదామ్యహమమీ మునయో ఽగ్రజాస్తి
మాయాబలస్య పురుషస్య కుతో ఽపరే యే ।
గాయన్గుణాన్ దశశతానన ఆదిదేవః
శేషో ఽధునాపి సమవస్యతి నాస్యపారమ్ ॥ - **41**

**తా.** భగవానుని మాయాబలము యొక్క అంతమును నేను తెలిసికొనజాలను. నీకంటె ముందుపుట్టిన ఈ సనకాది మునులుకూడ తెలియజాలరు. ఇంక ఇతరుల మాట చెప్పనేల? వేయి ముఖములుగల ఆదిదేవుడైన శేషుడు ఆ పరమపురుషుని గుణగణములను నేటికిని కీర్తించుచున్నను అతని అంతమును గ్రహింపలేకపోవుచున్నాడు.

**టీ** :- ఏతత్ప్రపంచయతి – నేతి. పురుషస్య యన్మాయాబలం. తస్యాంతం న విదామి న వేద్మి. దశశతాన్యాననాని యస్య సశేషో ఽపి యస్య గుణాన్. గాయన్ న సమవస్యతి సమ్యగవస్థానం గచ్ఛతీత్యర్థః. (41)

**టీ** – దీనిని చెప్పుచున్నాడు? 'నాంతం' అని – పురుషస్య యన్మాయాబలం – భగవానుని ఏ మాయాబలము గలదో – తస్యాంతం నవిదామి – దాని అంతమును తెలయలేకున్నాను. దశశతాని + ఆననాని యస్యసః – వేయి ముఖములెవనికి గలవో అట్టి – శేషోఽ ప్యస్యగుణాన్ గాయన్ – శేషుడు కూడ ఇతని గుణములను పాడుచును – పారం న సమవస్యతి – అంతమును పొందలేకపోవుచున్నాడు. (41)

యేషాం సఏవ భగవాన్ దయయేదనంతః
సర్వాత్మనాశ్రిత పదో యది నిర్వ్యలీకమ్ ।
తే దుస్తరామతి తరంతి చ దేవమాయాం
నైషాం మమాహమితి ధీః శ్వశృగాలభక్ష్యే - **42**

**తా.** ఎట్టి కపటమును లేని వారై ఎవరు సర్వాత్మభావముతో భగవానుని పాదములాశ్రయించి యుందురో, ఆ అనంతుడైన భగవానుడే ఎవరి యందు దయగలిగియుండునో వారుమాత్రము తరించుటకు శక్యము కాని, అతని మాయనుదాటగలరు. కాని నక్కలు, కుక్కలు తినెడి ఈ శరీరమునందు 'నాది', 'నేను' అను బుద్ధి గలవారికి మాయను తరించుటకు సాధ్యమేకాదు.









**టీ** :- నను యది కే ఽ పి విందంతి తర్హి నిష్కపటం ఆశ్రితచరణో భవతి. తే దేవస్య విష్ణోః దుస్తరామపి మాయాం తరంతి చకారాన్మాయా వైభవం విందంతి చ. అథేతి వా పాఠః ప్రత్యక్షమేవ తేషాం మాయాతితరణమిత్యాహ - నైషామితి. శ్వసృగాలానాం భక్ష్యే దేహే. (42)

టీ - ఒకవేళ ఎవరును తెలిసికొనజాలరనినచో నిక ఎట్లు ముక్తులయ్యెదరు? అతని కృప చేతనే యని చెప్పుచున్నాడు 'యేషాం' అను ఈ శ్లోకమున - దయయేత్ - దయను చూపునో - తేచ యది నిష్కపట మాశ్రితచరణాః భవంతి - వారును ఒకవేళ కపటములేని (శుద్ధమనస్సుతో) అతని పాదములాశ్రయించిన వారైనచో, తే - వారు - దుస్తరాం - తరించుటకు సాధ్యముకాని - దేవమాయాం - భగవానుని మాయను -

అతితరంతి - దాటిపోగలరు. 'చ' కారాత్ మాయావైభవం విదంతిచ - 'చ' కారస్వారస్యము చేత వారు మాయ యొక్క ప్రభావమును కూడ తెలిసికొనగలరు. 'అథే' తి వాపాఠః - 'అథ' అనియును పాఠాంతరముగలదు - ప్రత్యక్షమేవ తేషాం మాయాతరణమిత్యాహ - చూచుచుండగనే వారికి మాయనుండి దాటుట జరుగునని చెప్పుచున్నాడు. నైషామితి - ఇట్టివారికి కాదని - శ్వశృగాలానాం భక్ష్యే దేహే - కుక్కలు నక్కలచే తినదగిన దేహమునందు (నాది, నేను అనుబుద్ధి గలవారికి) (42)

వేదాహమంగ పరమస్య హి యోగ మాయాం
యూయం భవశ్చ భగవానథదైత్యవర్యః ।
పత్నీమనోః స చ మనుశ్చ తదాత్మజాశ్చ
ప్రాచీన బర్హి ఋభురంగ ! ఉత ధ్రువశ్చ ॥ - 43

తా. నారదా! పరమ పురుషుని యోగమాయను నేనెరుగుదును. మీరు, శంకరుడు, దైత్యశ్రేష్ఠుడగు ప్రహ్లాదుడు మనుపత్నియగు శతరూప, మనువు, మనుపుత్రులగు ప్రియవ్రతుడు మొదలగువారు, ప్రాచీనబర్హి, ఋభుడు, ధ్రువుడు కూడ ఎఱుగుదురు.

**టీ** :- అంతర్జ్ఞానాభావే ఽ పి మాయేయమితి జ్ఞానం తత్కృపయా బహూనామస్తీత్యాహ - త్రిభిః. వేదేతి. యూయమితి సనకాదీనాం అంతర్భావాద్బహువచనం దైత్యవర్యః ప్రహ్లాదః మనుః స్వాయంభువః తస్య పత్నీ శతరూపా చ. తదాత్మజాః కన్యాశ్చ. ప్రాచీనబర్హిః విసర్గలోపశ్ఛాదసః. అంగః వేనపితా. (43)

టీ - అంతర్జ్ఞానము లేకున్నను 'ఇదిమాయ' అనుజ్ఞానము, అతని కృపచేత చాలామందికి కలదని 'వేదాహ'మను శ్లోకముతో బాటు మూడు శ్లోకములచే చెప్పుచున్నాడు. - 'యూయం' అని సనకాదులను మనస్సునందిడుకొని బహువచనమున చెప్పుట జరిగినది - దైత్య వర్యః - ప్రహ్లాదుడు - మనుః - స్వాయంభువుడు- తస్యపత్నీ - అతని భార్యయగు శతరూప, తదాత్మజాః - వారికుమారులు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, కుమార్తెలు, ఆకూతి, దేవహూతి,

ప్రసూతియని ముగ్గురు – ప్రాచీనబర్హి శబ్దమున విసర్గలోపము ఛాందసము. అంగః – వేసుని తండ్రి. (43)

ఇక్ష్వాకురైల ముచుకుంద విదేహ గాధి
రఘ్వంబరీష సగరా గయనాహుషాద్యాః ।
మంధాత్రలర్క శతధన్వను రంతి దేవా
దేవవ్రతో బలిరమూర్త్తరయో దిలీపః ॥ - 44

**తా.** ఇక్ష్వాకుడు, పురూరవుడు, ముచుకుందుడు, జనకుడు, గాధి, రఘు, అంబరీషుడు, సగరుడు, గయుడు, యయాతి మొదలగువారును మరియు మాంధాత, అలర్కుడు, శతధన్వుడు, అను, రంతిదేవుడు,భీష్ముడు, బలి, అమూర్త్తరయుడు, దిలీపుడు, నాభరి, ఉత్తంగుడు.

టీ :- ఇక్ష్వాకురితి. శథధనుః అనుశ్చ సంధిరార్షః. రంతిదేవా ఇతిపాఠస్సుగమః. ఐకపద్యే ఏతైస్సహితో దేవవ్రత ఇత్యర్థః.(44)

**టీ –** శతధనుః, అను,(సంధి ఆర్షము) రంతిదేవాః అనుపాఠము సుగమము. ఏకపద్యే ఏతైః సహితో దేవవ్రత ఇత్యర్థః – ఒకే పర్యాయము వీరితో గూడ దేవవ్రతుడనియర్థము.(44)

సౌభర్యుదంక శిబిదేవల పిప్పలాద
సారస్వతోద్ధవ పరాశర భూరిషేణాః ।
యే ఉ న్యే విభీషణ హనూమదుపేంద్ర దత్త
పార్థార్ష్టి షేణ విదుర శ్రుతదేవ వర్యాః ॥ - 45

**తా.** శిబి, దేవలుడు, పిప్పలాదుడు, సారస్వతుడు, ఉద్ధవుడు, పరాశరుడు, భూరిషేణుడు, ఇంకను విభీషణుడు, హనుమానుడు, శుకదేవుడు, అర్జునుడు, ఆర్ష్టి షేణుడు, విదురుడు, శ్రుతదేవుడు మొదలగు మహాత్ములు కూడ యోగమాయ నెఱింగినవారే.

**టీ** :- సౌభరీతి. ఉపేంద్రదత్తః శుకః విభీషణాదయో రాక్షసాశ్చ హనూమదాదయః కపయశ్చ వర్యాః ముఖ్యాః యేషాం తే. (45)

**టీ –** ఉపేంద్రదత్తః – శుకుడు – విభీషణాదయో వర్యాః – ముఖ్యులు ఎవరికో వారు(45)

తే వై విదంత్యతి తరంతి చ దేవమాయాం
స్త్రీశూద్ర హూణ శబరా అపి పాపజీవాః।
యద్యద్భుత క్రమపరాయణ శీల శిక్షా
స్తిర్యగ్జనా అపి కిము శ్రుతధారణా యే ॥- 46

**తా.** భగవానుని ఆశ్రయించెడి స్వభావమునందు శిక్షితులైన వారెవరైనను – అనగా స్త్రీలు, శూద్రులు, హూణులు, భిల్లులు, పాపజీవులు, పశుపక్ష్యాదులు, కూడా మాయాస్వరూపమును తెలిసి తరించి పోవుదురనగానిక, వైదిక సదాచారములను పాటించుచుండు వారిని గూర్చి చెప్పనేల? వినిన దానిని ధారణ చేయువారిని గూర్చి చెప్పనేల?

**టీ** :- కిం బహూనా సత్సంగేన సర్వే ఽ పి విదంతీత్యాహ – త ఇతి. అద్భుతాః క్రమాః పాదన్యాసాః యస్య హరేః తత్పరాయణాః తద్భక్తాః తేషాం శీలే శిక్షా యేషాంతే తథా యది భవంతి తర్హి సర్వే ఽ పి విదంతి శ్రుతే భగవతో రూపే ధారణా మనోనియమనం యేషాం తే విదంతీతి కిము వక్తవ్యం. (46)

**టీ** – వేయునేల? సత్సంగము చేత సర్వులును తెలియుదురని 'తేవై' అను ఈ శ్లోకమున చెప్పుచున్నాడు. అద్భుతాః క్రమాః పాదన్యాసాః యస్య – ఆశ్చర్యకరములగు నడకలు ఎవనికో వాడు – హరేస్తత్పరాయణాః – హరినాశ్రయించి యుండు భక్తులగువారు – వారికి – శీలే శిక్షా యేషాంతే – సత్ప్రవర్తనమునందు ఎవరికి శిక్ష (నేర్పు) కలదో వారికి – తథాయది భవంతి తర్హితే ఽ పి విదంతీత్యర్థః – వారట్లగుచో వారును తెలియుదురని అర్థము. శ్రుతధారణాః – బ్రాహ్మణులు – వారును దేవమాయను తెలసికొందురు –కిమువక్తవ్యమ్ –ఇకచెప్పవలసినదేమి? శుభేతిపాఠే – శుభే అనుపాఠమున – శుభే – భగవానుని యందు అతని రూపమునందు – ధారణా – మనస్సును నియమించుట – యేషాం తే – ఎవరికి కలదో వారు – విదంతీతి కిమువక్తవ్యమ్ – తెలియుదురనగా నిక చెప్పదగినది యేమికలదు? (46)

శశ్వత్ప్రశాంతమభయం ప్రతిబోధమాత్రం
శుద్ధం సమం సదసతః పరమాత్మ తత్త్వమ్।
శబ్దోన యత్ర పురు కారకవాన్క్రి యార్థో
మాయాపరైత్యభిముఖే చ విలజ్జమానా. ॥ - 47

**తా.** పరమాత్మ తత్త్వము ఎల్లవేళలయందును ప్రశాంతమైనది. భయరహితమైనది. జ్ఞానమాత్రమైనది. నిర్మలమైనది, భేదశూన్యమైనది, కార్యకారణరూపపదార్థములకన్న విలక్షణమైనది. శబ్దము (వేదము) గాని, క్రియాఫలముగాని ఆ ఆత్మసంబంధముగ, గొప్ప ప్రయోజనమును సాధించునవి కావు, ఇక మాయ – భగవదభిముఖమున నిలువజాలక సిగ్గుతో దూరముగ పారిపోవును.

**టీ** :- కిం తద్భగవతః స్వరూపం యస్మిన్ మనోధారణం విధాయ మాయాం తరంతీత్యపేక్షాయామాహ – ద్వాభ్యాం. శశ్వదితి. యద్బ్రహ్మేతి మునయః విదుః తద్వై భగవతః పదం స్వరూపం కిం తద్బ్రహ్మ? తదాహ – అజస్రం నిత్యం చ తత్సుఖం విశోకంచేతి అజస్రసుఖత్వే హేతుః. శశ్వత్సదా ప్రశాంతం అతో నిత్యసుఖస్వరూపం విశోకత్వే హేతుః. అభయం తత్కుత? యతస్సమం భేదశూన్యం శ్రు. " ద్వితీయాద్వై భయం భవతీ" తి శ్రుతేః. తత్కుతః? యతః ప్రతిభోదమాత్రం జ్ఞానైకరసం. నను జ్ఞానస్యాపి నీలపీతాద్యాకారేణ చక్షురాదికరణ భేదేన చ భేదో దృశ్యతే న శుద్ధం నిర్మలం. నను దర్శితో విషయ కరణోపరాగరూపో మల ఇత్యత ఆహ – సదసతః పరం విషయకరణసంగశూన్యం వృత్తేరేవతదుపరాగః న జ్ఞానస్యేతి భావః. నను తథాపి జ్ఞాత్రా సహ భేదస్స్యాత్? న – ఆత్మతత్త్వం ఆత్మనోజ్ఞాతుః స్వరూపమేవ న త్వతో భిన్నం. నను చ. శ్రు. "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛా " మీతిశబ్ద బోధ్యత్వప్రతీతేః కుతో బోధరూపత్వం? తత్రాహ – శబ్దో న యత్రేతి. ఆరోపిత నివృత్తావేవ శబ్దస్య వ్యాపారః న తద్బోధ ఇత్యర్థః. నను భవతునామనారస్త భేదజ్ఞానరూపత్వాద్విశోకత్వం సుఖస్యతు నానాకారకసాధ్య క్రియాఫలత్వాత్కృతమజస్రసుఖత్వం తస్యేత్యత ఆహ – యత్ర బహుకారకసాధ్యక్రియార్థః. ఉత్పత్త్యాది చతుర్విధ క్రియాఫలం చ నాస్తి ఇంద్రియైర్జ్ఞానాంశాభివ్యక్తిరివ

**టీ** భగవత్స్వరూపమునందు మనస్సును నియమించినచో మాయనుదాటగలమా అనునపేక్షతో చెప్పుచున్నాడు. – "శశ్వత్" అని రెండు శ్లోకములచేత – యద్బ్రహ్మేతి విదుర్మునయస్తద్వై భగవతః పదం – స్వరూపమ్ – బ్రహ్మమని దేనిని మునులు తెలిసికొందురో అదియే భగవత్ స్థానము – భగవత్స్వరూపము – కింతద్బ్రహ్మతదాహ – ఆ బ్రహ్మమేమిటి? – చెప్పుచున్నాడు. – అజస్రం – నిత్యమును – తత్సుఖం చ – శోకరాహిత్యమని – అజస్ర సుఖత్వే హేతుః– నిత్యసుఖమునకు కారణము – శశ్వత్ – ఎల్లప్పుడు – ప్రశాంతమ్ – మిక్కిలిశాంతమైనది – అతోనిత్యసుఖరూపమ్ – అందువలన ఎల్లప్పుడు సుఖరూపమైనది – విశోకత్వేహేతుః – శోకరాహిత్యమునకు కారణము – అభయమ్ – భయరహితమైనది – తత్కుతః – అది యెందువలన – యతః సమం – భేదశూన్యమైనందువలన – అతోఽభయమ్ – అందువలననే భయరహితము – "ద్వితీయాద్వైభయం భవతి" ఇతిశ్రుతేః – రెండవదాని వలన భయము కలుగును" అని శ్రుతి చెప్పుట వలన – తత్కుతః – అది యెందులకు? – యతః ప్రతిబోధమాత్రం – జ్ఞానైక రసమగుట వలన – జ్ఞానమునకు కూడ నీలము – పసుపు మొదలగు ఆకారముచేత – కన్నులు మొదలగు ఇంద్రియభేదముచేత, భేదము కన్పట్టునా? లేదు – శుద్ధం – నిర్మలమైనది. నను దర్శితో విషయ కరణోపరాగరూపోమల ఇత్యత ఆహ – చూడబడిన వస్తువు, 1. విషయము (రూపాది గ్రాహ్య విషయము) 2. కరణం (కన్నులు మొదలగు సాధనము), 3. ఉపరాగము (గ్రాహ్యత్వముతో స్వీకరింపదగిన చూపు) అని నిశ్చయముగ మూడురూపముల మలమని చెప్పుచున్నాడు – సదసతః పరమ్ – విషయము, కరణము అనురెండింటి సంగము (కలయిక) లేనిది. వృత్తేరేవ తదుపరాగః – నజ్ఞానస్యేతి భావః – వృత్తిచేత మాత్రమే ఉపరాగము జ్ఞానమునకు సంబంధించి కాదని భావము. (చూపునకు సంబంధించినదే గాని చూచువాని దర్శన జ్ఞానమునకు సంబంధించినది కాదు) నను తథాపి జ్ఞాత్రాసహ భేదః స్యాత్ – అటులైనను జ్ఞాతతో

క్రియాభిరానందాంశాభివ్యక్తిమాత్రం క్రియతేనోత్పత్త్యాదికమితి భావః. నను ఉత్పత్త్యాద్యభావే ఽ పి మాయామలోపకరణేన వికార్యత్వం స్యాదేవ వ్రీహీణామివ తుషోపకరణేనేత్యాశంక్యాహ - మాయాఅభిముఖే స్థాతుం విలజ్జమానేన యస్మాత్పరైతి. దూరతో ఽ పసరతి. (47)

(తెలియువానితో) కూడ భేదముండును. ఉండునా? న, ఆత్మతత్త్వమాత్మనోజ్ఞాతుః స్వరూపమేవ - కాదు - ఆత్మతత్త్వమనునది తన యొక్క - అనగా జ్ఞాత యొక్క స్వీయరూపమే కదా! తన్న - అదికాదు - తతో భిన్నమ్ - అతని కంటె వేరైనది - నను "తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" ఇతి శబ్ద బోధ్యత్వప్రతీతేః - "ఉపనిషత్సంబంధమైన పురుషుని గూర్చి అడుగుచున్నాను" అని శబ్దముతో బోధించుట యను ప్రతీతివలన - కుతోబోధరూపత్వం తత్రాహ - బోధరూపత్వమెందుకో యిట చెప్పుచున్నాడు. - 'శబ్దోన యత్ర' అని - ఆరోపిత నివృత్తావేవ శబ్దస్య వ్యాపారః న తద్బోధ ఇత్యర్థః - ఆరోపింపబడిన దాని నివృత్తి యందే శబ్దవ్యాపారము కాని దాని బోధయందు కాదని యర్థము - ననుచ భవతు నామ నిరస్త భేద జ్ఞానరూపత్వాద్విశోకత్వం - అగుగాక - అట్లనినను భేదజ్ఞానము తొలగుట వలననే కదా శోకరహితస్థితి కలుగుట! - సుఖస్యతు నానాకారక సాధ్యక్రియాఫలత్వాత్ కథ మజస్రసుఖత్వం తస్యేత్యత ఆహ - సుఖమున కైననో, వివిధములైన కారకములతో సాధింపదగిన క్రియల యొక్క ఫలత్వము వలన దానికి నిత్యసుఖమనునది ఎట్లు కలుగును? చెప్పుచున్నాడు. - యత్ర బహుకారక సాధ్యః క్రియార్థః, ఉత్పాద్యాప్యవికార్య సంస్కార్యరూపం చతుర్విధం క్రియాఫలం చనాస్తి -క్రియా ప్రయోజనము వివిధ కారకములవలన సాధ్యమగుచున్నదనినప్పుడు ఇక 1. ఉత్పాద్యము, 2. ఆప్యము, 3. వికార్యము, 4. సంస్కార్యము అను నాలుగు విధముల క్రియాఫలము కూడ లేదు - ఇంద్రియైః జ్ఞానాంశాభివ్యక్తిరివ, క్రియాభి రానందాంశాభివ్యక్తి మాత్రం క్రియతే - నోత్పత్త్యాదికమితి భావః - ఇంద్రియములచే జ్ఞానాంశముల అభివ్యక్తివలె, క్రియల చేత ఆనందాంశము యొక్క అభివ్యక్తిమాత్రము చేయబడును. ఉత్పాద్యాది ఫలములు ఉండవని భావము - నను ఉత్పత్త్యాద్యభావేసి మాయామలాప కరణేన వికార్యత్వమేవస్యాత్ - వ్రీహీణామివ తుషాపాకరణే నేత్యా శంక్యాహ - ఉత్పత్త్యాది ఫలములు లేకున్నను - ధాన్యమునుండి దాని ఊఁక

తద్వై పదం భగవతః పరమస్యపుంసో
బ్రహ్మేతి యద్విదురజస్రసుఖం విశోకమ్ ।
సధ్ర్యఙ్నియమ్య యతయో యమ కర్తహేతిం
జహ్యుః స్వరాడివ నిపాన ఖనిత్రమింద్రః ॥ - 48

**టీ** :- తస్మాదేవంభూతే భగవతి నియమితమనసాం కృతార్థానాం న కిమపి కృత్యమస్తీత్యాహ – తదితి. సహాంచతీతి సధ్ర్యఙ్ సహచరం మనః యత్ర ప్రతినయమ్య యస్మిన్ స్థిరీకృత్య యతయః యత్నశీలాః కర్తః ఛేదః తన్నిరాసః అకర్తః తత్ర హేతిం సాధనం జహ్యుః త్యజేయుః. అనుపయోగాత్తన్నాద్రియంత ఇత్యర్థః ఉపయోగాభావేన సాధనానాదరే దృష్టాంతః – నిపీయతే ఽస్మిన్నితి నిపానం కూపః తస్య ఖనిత్రం ఖననసాధనం యథాస్వరాట్ స్వయమేవ పర్జన్యరూపేణ విరాజమాన ఇంద్రో నాదత్తే తద్వదితి. యద్వా – స్వేనైవ రాజత ఇతి. స్వరాట్ దరిద్రః స యథా ఇంద్రః సమృద్ధస్సన్ కర్మకరణదశాయాం గృహీతం నిపానఖనిత్రం జహాతి తద్వదిత్యర్థః. ఏవం తావదజస్రసుఖం విశోకం బ్రహ్మైవ

తొలగించినట్లుగ మాయామలము తొలగిపోవుటచేత 'వికార్య' ఫలమైనను కలుగవచ్చును గదా అని శంకించి చెప్పుచున్నాడు – మాయాఽభిముఖే స్థాతుం విలజ్జమానా ఇవ యస్మాత్పరైతి, దూరతః అపసరతి – ఎదురుగనుండుటకు సిగ్గుపడిన దానివలె మాయ అనునది అతనినుండి దూరమునకు పరుగెత్తి పోవును. (47)

**తా.** ఏది అనవరత సుఖస్వరూపమో, ఏది శోకరహితమో అది పరమపురుషుడగు భగవంతుని బ్రహ్మపదమని విజ్ఞులు తెలిసికొందురు. యతులు ఎల్లప్పుడును అతనితో సహచారిత్వము కలుగునట్లు మనస్సును నియమించి స్వయముగ మేఘరూపుడైన ఇంద్రుడు, మంచినీటి బావిని త్రవ్వు గడ్డపాఱ (గునపము) ను అక్కఱలేనిదిగ వదలిపెట్టినట్లు – భేదమును దూరము చేయు జ్ఞాన సాధనములను విడిచిపెట్టుచున్నారు.

**టీ** – అందువలన భగవంతుడిట్టివాడగుచుండగా – నియమిత మనుస్సులు గల కృతార్థులకు చేయదగిన కార్యమేదియునుండదని చెప్పుచున్నాడు – సహ అంచతీతి సధ్ర్యఙ్ – వెంట తిరుగును కావున సధ్ర్యఙ్ – సహచరం మనో యంప్రతినియమ్య – వెంట తిరిగెడిమనస్సును ఎవని నుద్దేశించి నియమించి – యస్మిన్ స్థిరీకృత్య – ఎవని యందు స్థిరముగ చేసి, యతయః – యత్నశీలురు – కర్తోర్భేదః తన్నిరాసోఽ కర్తస్తత్రహేతిం సాధనం – ఉపరమ స్థితిని భంగపఱచెడి సాధనమును – జహ్యుః – విడిచిపెట్టుదురు – అనుపయోగాత్ – ఉపయోగములేకపోవుట వలన – తన్నాద్రియంత ఇత్యర్థః – దానిని ఆదరింపరని యర్థము – ఉపయోగాభావేన – ఉపయోగములేమింజేసి – సాధనానాదరే దృష్టాంతః – సాధనములను నిరాకరించుట యందు దృష్టాంతము. నపీయతేఽస్మిన్నితి – నిపానం – దీని యందు నీరు త్రాగుదురు కావున నిపానము – బావి – తస్యఖనిత్రం ఖననసాధనం – దానిని త్రవ్వుటకు పరికరమగు గడ్డపాఱ – యథా స్వరాట్ – ఏ విధముగ స్వయముగనే మేఘరూపమున –

భగవత్స్వరూపం తత్ప్రాప్తానాం ప్రాప్యం కృత్యం వా న కించిదస్తీత్యుక్తం. (48)

విరాజమాన ఇంద్రః - ప్రకాశించుచున్న ఇంద్రుడు -నాదత్తే తద్వదితి - స్వీకరింపడో ఆ విధముగ - యద్వా - లేక - స్వేనైవ -రాజత ఇతి స్వరాట్ - తనచే తానే ప్రకాశించువాడు స్వరాట్టు - దరిద్రుడు - సయథా ఇంద్రః సమృద్ధః సన్ - అతడు ఇంద్రుని వలె ధనవంతుడుకాగా - కర్మకారాదశాయాం గృహీతం నిపాన ఖనిత్రం జహాతి తద్వదిత్యర్థః - పనివాని (కూలి) దశయందు తీసికొని యుండిన బావిని త్రవ్వుటకైన గడ్డపాఱను విడిచిపెట్టునో ఆ విధముగనని యర్థము.(48)

స శ్రేయసామపి విభుర్భగవాన్యతో உ స్య
భావ స్వభావ విహితస్య సతః ప్రసిద్ధః।
దేహే స్వధాతు విగమే உ ను విశీర్యమాణే
వ్యోమేవ తత్ర పురుషో న విశీర్యతే உ జః ॥ - 49

**తా.** అతడే సకల శ్రేయః ఫలములనిచ్చు ప్రభువు. అతడే భగవానుడు, ఏలయనసకల చరాచర పదార్థములను, వాని స్వభావములను మానవులలో పుణ్యకర్మప్రవర్తకత్వమును విధించుటలో ప్రసిద్ధుడు. దేహమునందలి పంచభూతములు ఒకదాని నుండి ఒకటి వేరైనప్పుడు కూడ తాను వానితోబాటు చితికిపోక, పుట్టుకలేని వాడగుటచే, ఆత్మరూపుడగు ఆ పురుషుడు ఆకాశమువలె ఏకీభూతుడై యుండును.

**టీ** :- ఇదానీం తతః ప్రాక్ స ఏవ సర్వకర్మఫల ప్రదాతా సర్వకర్మ ప్రవర్తకశ్చేత్యాహ - సఇతి. స ఏవ శ్రేయసాం ఫలానాం విభుః దాతాపి తత్ర హేతుః - భావానాం బ్రాహ్మణాదీనాం స్వభావైః శమదమాదిభిః విశేషణైః. విహితస్య సతః శుభస్య కర్మణః ప్రవర్తకాత్ప్రసిద్ధిః యద్వా భావానాం మహదాదీనాం స్వభావేన పరిణామేన విహితస్య సతః కార్యస్య ప్రసిద్ధిః. స ఏవ స్వర్గాదీనాం దాతేత్యర్థః. నను మృతస్య కర్మకర్తుః కథం స్వర్గాదికం స్యాత్తత్రాహ - స్వారంభకధాతూనాం విగమే వియోగే సతి. అను పశ్చాత్.

**టీ** - ఈ విధముగ నిత్యసుఖము, శోకరాహిత్యము భగవత్స్వరూపమైన బ్రహ్మమే. ఆ బ్రహ్మము ప్రాప్తించిన వారలకు, పొందదగినది గాని, చేయదగిన కృత్యము కాని ఏదియును కొంచెమైనను ఉండదని చెప్పబడినది. ఇప్పుడు దానికన్నముందే - అతడే సకలఫలముల నిచ్చువాడు, సర్వకర్మప్రవర్తకుడు అనియు చెప్పుచున్నాడు - స ఏవ - అతడే - శ్రేయసాం - ఫలములకు - విభుః - దాత కూడ - తత్రహేతుః - దానికి కారణము. భావానాం - బ్రాహ్మణాదుల యొక్క - స్వభావైః - శమదమాది విశేషణములచేత - విహితస్య అస్య - విధించు ఇతనికి - సతః -శుభకర్మల యొక్క - యతః ప్రవర్తకాత్ప్రసిద్ధిః - ప్రవర్తకుడగుటచేత కీర్తిగలవాడు - యద్వా - లేక - భావానాం - మహదాదుల యొక్క - స్వభావేన -

విశీర్యమాణే దేహే. తత్రస్థం వ్యోమేవ యస్తేన సహ న విశీర్యతే. యతః అజః తేన సహ న జాతః. తస్య పురుషస్య శ్రేయసాం ప్రభురిత్యర్థః. (49)

సోఽయం తేఽభిహితస్తాత
భగవాన్విశ్వభావనః ।
సమాసేన హరేర్నాన్య
దన్యస్మాత్సదసచ్చ యత్ ॥ - 50

**టీ** :- అధ్యాయత్రయస్యార్థముపసంహరతి - సఇతి. సోఽయం సమాసేన సంక్షేపేణ అభిహితః. తమేవాహ - సదసత్కార్యకారణం చ హరేరన్యన్న భవతి. నను హరేస్తదవ్యతిరేకే తద్గతవికార ప్రసంగః స్యాత్? న అన్యస్మాత్తత్కారణభూతో హరిః కారద్వ్యతిరిక్త ఇత్యర్థః. (50)

పరిణామముచేత - విహితస్య సతః కార్యస్యప్రసిద్ధిః - సత్కర్మలు విధించుటచే ప్రసిద్ధి - సఏవ - అతడే- స్వర్గాదీనాం దాతేత్యర్థ ః - స్వర్గము మొదలగు లోకములనిచ్చువాడని యర్థము. నను కర్మకర్తుర్మృతస్య కథం స్వర్గాదిఫలం స్యాత్తత్రాహ - కర్మచేయువాడు మృతుడైనచో వానికి స్వర్గాది ఫలములెట్లు చేకూరును? అది చెప్పుచున్నాడు - స్వారంభక ధాతూనాం - పంచభూతముల యొక్క - విగమే - వియోగమగుచుండగా - అన్వను - వెనువెంట - విశీర్యమాణఽపి దేహే - శిథిలమైపోవు దేహము నందు - తత్రస్థం - అందున్నవాడగు పరమాత్మ - వ్యోమేవ-ఆకాశమువలె - యస్తేన సహ న విశీర్యతే - శరీరముతో కూడ శిథిలముకాదు, యతోఽజః - పుట్టులేని వాడైనందున - తేన సహ న జాతః - శరీరముతో కూడ పుట్టినవాడు కాదు - తస్య పురుషస్య - అట్టి పురుషునకు - శ్రేయసాంప్రభురిత్యర్థః - ఫలములకు ప్రభువని యర్థము. (49)

**తా.** నాయనా ! షడైశ్వర్య సంపన్నుడు, విశ్వరచయితయైన హరిని గుఱించి నీకు సంగ్రహముగను సాకల్యముగను జెప్పితిని. కార్యకారణ రూపమైనదంతయును అతనివలననే తప్ప నితరుడింకెవరునులేరు.

**టీ** - మూడధ్యాయములలోని అర్థమంతయును సమాప్తి చేయుచున్నాడు, సోఽయం-అట్టి అతడు - తే - నీకు - సమాసేన- సంక్షేపేణ - సంగ్రహముగ - అభిహితః - చెప్పబడినాడు - తమేవాహ - అతని గూర్చియే చెప్పుచున్నాడు - యదత్కార్యం కారణం చ - ఏ ప్రపంచ కార్యము కారణము కూడ కలవో - హరేరన్యన్నభవతి - హరి కంటె ఇతరమైనవి కాదు, నను హరేస్తద్వ్యతిరేకే తద్గత వికార ప్రసంగః స్యాత్, న - హరికన్నను, అతనికి భిన్నముగను







తత్సంబంధ వికార ప్రసంగము అసంబద్ధము, అన్యస్మాత్కారణభూతో హరిః కార్యాద్వ్యతిరిక్త ఇత్యర్థః – కార్యము కంటె ఇతరమైన కారణభూతుడు హరియే అని యర్థము.(50)

ఇతి భాగవతం నామ
యన్మే భగవతోదితమ్ ।
సంగ్రహో ఽ యం విభూతీనాం
త్వమేతద్విపులీకురు ॥ - 51

**తా.** ఈ భాగవతమనగా భగవానుడు నాకుఁజెప్పిన విభూతుల సంగ్రహరూపము దీనిని నీవు విపులీకరింపుము.

**టీ :-** ఇదమితి. అయం చ విభూతీనాం సంగ్రహ ఉక్తః. (51)

**టీ –** అయంచ విభూతీనాం సంగ్రహ ఉదితః – ఇది విభూతుల సంక్షేపము చెప్పబడినది.(51)

యథా హరౌ భగవతి
నృణాం భక్తిర్భవిష్యతి ।
సర్వాత్మన్యఖిలాధారే
ఇతి సంకల్ప్య వర్ణయ ॥ - 52

**తా.** సర్వాత్ముడును, సర్వమునకు ఆధార భూతుడునగు ఆ హరియందు మానవులకు భక్తి కలుగునట్లు సంకల్పించి వర్ణింపుము.

**టీ :-** యథేతి. యథా వర్ణితేన నృణాం భక్తిర్భవిష్యతీత్యేవం సంకల్ప్య సంచింత్య తథా హరిలీలాప్రాధాన్యేన శ్రీభాగవతం వర్ణయ. న తు భక్తివిఘాతేన కేవలం తత్త్వమిత్యర్థః. (52)

**టీ –** యథావర్ణితేన – ఎట్లు వర్ణించుట చేత – నృణాం – మనుష్యులకు – భక్తిర్భవిష్యతీతి – భక్తి కలుగునో అని – ఏవం సంకల్ప్య – ఈ విధముగ సంకల్పించి – సంచింత్య – బాగుగ ఆలోచించి – తథా – ఆ విధముగ – హరిలీలా ప్రాధాన్యేన – విష్ణు భగవానుని లీలా విలాసములే ప్రధానమగునట్లుగ – శ్రీమద్భాగవతం వర్ణయ – శ్రీమద్భాగవతమును వర్ణింపుము. నతు భక్తిరస విఘాతేన కేవలం తత్త్వమిత్యర్థః – భక్తిరసమునకు భంగము కలుగునట్లుగ కేవలము తత్త్వము కాకుండునట్లుని తాత్పర్యము.(52)












మాయాం వర్ణయతో ఽ ముష్య
ఈశ్వరస్యానుమోదతః ।
శృణ్వతః శ్రద్ధయానిత్యం
మాయయాత్మా నముహ్యతి ॥ - 53

**తా.** ఇట్టి ఈశ్వరుని మాయను వర్ణించువాని యొక్క, ఆమోదించువాని యొక్కయు, నిత్యమును శ్రద్ధగా వినువాని యొక్కయు ఆత్మ మాయచేత మోహమును పొందదు.

**టీ :-** నను శ్రీహరిలీలా మాయా. కిం తద్వర్ణనేనేత్యత ఆహ - లీలామితి. (53)

**టీ -** నను లీలా మాయాశ్రయా కిం తద్వర్ణనేత్యత ఆహ - మాయామితి, 'మాయాం' అనునీశ్లోకమున, మాయనాశ్రయించియున్న భగవానుని లీలను వర్ణించుటచేనేమగును? ఎట్టి అజ్ఞానము కూడ కలుగనేరదని చెప్పుచున్నాడు. (53)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వితీయస్కంధే బ్రహ్మనారదసంవాదే సప్తమో ఽ ధ్యాయః !!**

**శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ద్వితీయ స్కంధమునందలి బ్రహ్మనారదసంవాదమున ఏడవ అధ్యాయము సమాప్తము,**











ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

## అథ అష్టమోఽ ధ్యాయః

**రాజోవాచ -**

బహ్మణా చోదితో బ్రహ్మన్ !
గుణాఖ్యానే గుణస్యచ।
యస్మై యస్మై యథాప్రాహ
నారదో దేవదర్శనః ॥ - 1

**టీ** :- అష్టమే దేహసంబధమాక్షీపన్నీశజీవయోః. బహూన్ పరీక్షిదాపృచ్ఛత్పురాణార్థాన్ బుభుత్సితాన్. త్వమేతద్విపులీ కుర్విత్యుక్తం. తదేవ విపులీకరణం పృచ్ఛతి – త్రిభిః – బ్రహ్మణేతి. అగుణస్య గుణాతీతస్యాపి. దేవవద్దర్శనం యస్య. (1)

ఏతద్వేదితుమిచ్ఛామి
తత్త్వం వేద విదాంవర!
హరేరద్భుత వీర్యస్య
కథా లోక సుమంగలాః - 2

## ఎనిమిదవ అధ్యాయము

**పరీక్షిన్మహారాజు ఇట్లనెను**

**తా.** బ్రహ్మస్వరూపుడవైన ఓ శుకమహర్షీ ! భగవానుని ప్రత్యక్షముగ దర్శించి యున్న నారద మహర్షి, బ్రహ్మదేవుని చేత ప్రేరేపింపఁబడి, నిర్గుణుడైన పరమాత్ముని గుణ విశేష విపులీకరణమున, ఎవరెవరికి ఎట్లు చెప్పెను?

**టీ** – ఈ అష్టమ అధ్యాయమున జీవేశ్వరుల దేహ సంబంధముగ, ఆస్వాదింపనిచ్ఛ కలిగించు పురాణార్థములనెన్నింటినో పరీక్షిత్తు, కలుగజేసికొని అడిగెను. "నీవు దీనిని విపులీకరింపుము" అని చెప్పబడిన ఈ విపులీకరణమును గూర్చి 'బ్రహ్మణా' అని మొదలగు ఈ శ్లోకముతో కలిపి మూడు శ్లోకములతో ప్రశ్నించుచున్నాడు – అగుణస్య – గుణరహితుని యొక్కయు – దేవుని దర్శనము ఎవనికి గలదో అట్టివాడు దేవదర్శనుడు.(1)

**తా.** ఓ వేదవేత్తలలో శ్రేష్ఠుడా ! హరి యొక్క తత్త్వమును తెలసికొనగోరుచున్నాను. అద్భుత శక్తులు గలవాడునైన ఆతని లోక శుభంకరములగు కథలను కూడ వినగోరుచున్నాను.(2)











కథయస్వ మహాభాగ !
యథాహమఖిలాత్మని ।
కృష్ణే నివేశ్య నిః సంగమ్ ।
మనస్త్యక్ష్యే కలేబరమ్ - 3

**తా.** మహాభాగా! అఖిలాత్ముడైన కృష్ణుని యందు నా అన్యాసక్తముకానిమనస్సును లగ్నము చేసి శరీరమును ఎట్లు విడువగలనో? ఆ విషయమును చెప్పుము.

**టీ** :- కథయస్వేతి. నిస్సంగం విషయసంగరహితం మనః కృష్ణే నివేశ్యేతి స్వప్రయత్నో దర్శితః. (2,3)

**టీ** – అన్యాసక్తముకాని మనస్సును శ్రీకృష్ణుని యందు లగ్నము చేయుటకు స్వీయ ప్రయత్నము చూపబడినది. (2,3)

ఖవిఉఔఅ-ష్ణఖగ్గ్మూ ఇ-వ్లౌ ×
ౖఖిఉఁవ్బుష్టొచెహొకాఆస్వ్ఠీ×
నెౌచు ధ్బఅ।దిఉః ×
హ్లుఇ్ఖఖూ ఇహోవిని ×× గి 4

**తా.** నిత్యమును శ్రద్ధగా భగవానుని లీలలను వినువానికిని, అతని చేష్టితములను కథనము చేయువానికిని శీఘ్రకాలముననే భగవానుడాతని హృదయమున ప్రవేశించును.

**టీ** :- సో౽ పి శ్రద్ధయా శృణ్వతో నావశ్యకఇత్యాహ – శృణ్వత ఇతి. స్వచేష్టితం స్వీయదివ్యచేష్టితం శృణ్వతః గృతశ్చ కథయశ్చ స్వప్రయత్నంవినా భగవాన్ స్వయమేవ హృది విశతి. (4)

**టీ.** అతడును శ్రద్ధగా వినువాడు కానక్కఅలేదు అని 'శృణ్వతః' అను శ్లోకమున చెప్పుచున్నాడు. స్వప్రయత్నం వినాపి – తన ప్రయత్నము లేకున్నను కూడ – భగవాన్స్వయమేవ హృది (విశతే) – భగవానుడు స్వయముగనే హృదయమున ప్రవేశించును. (4)

ప్రవిష్టః కర్ణరంధ్రేణ ।
స్వానాంభావ సరోరుహమ్ ।
ధునోతి శమలం కృష్ణః
సలిలస్య యథా శరత్ ॥ - 5

**తా.** తన భక్తుల యొక్క భావ పద్మమును (హృదయమును) చెవి రంధ్రముద్వారా ప్రవేశించి, కృష్ణభగవానుడు, శరదృతువు నీటి మాలిన్యమును తొలగించునట్లు, హృదయ గత మాలిన్యమంతయును క్షాళనము చేయును.




ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

**టీ** :- ప్రవిష్టఇతి. స్వానాం స్వీయభక్తానాం. భావసరోరుహం హృదయకమలం. కర్ణరంధ్ర ద్వారేణ ప్రవిష్టః తద్గతం శమలం పాపం సర్వం ధునోతి. క్షాలతి. సలిలస్యేతి. ద్రవ్యాంతరవ్యామిశ్రణాదినా కుంభస్థే జలే శోధితే తదేవ కేవలం శుద్ధ్యతి న తు నదీతటాకాదితం. స చ మలః కుంభస్యాంతస్తిష్ఠత్యేవ న తు సర్వధాపి లీయతే. అత ఏవ కించిచ్చలనే పునః క్షుభ్యతిచ. ఏవం తపోదానాది ప్రాయశ్చిత్తం న సర్వధా సర్వేషాం పాపం విధునోతి. కిం తు సావశేషం తదపి కస్యచిదేవ కించిదేవ హృది ప్రవిష్టమాత్రస్తు శ్రీకృష్ణస్సర్వేషాం సర్వం పాపం నిశ్శేషం హరతీత్యనేన దృష్టాంతేనోక్తం - సలిలస్య యథా శరదితి. (5)

ధౌతాత్మా పురుషః కృష్ణ
పాదమూలం న ముంచతి ।
ముక్త సర్వ పరిక్లేశః
పాంథః స్వశరణం యథా ॥ - 6

**టీ** - భావసరోరుహం - హృదయ కమలమును - ప్రవిష్టశ్చ - ప్రవేశించినవాడై- తద్గతం సర్వంమలం ధునోతి - అందలి మలమునంతయును కడిగివేయును - సలిలస్యేతి ద్రవ్యాంతర వ్యామిశ్రణాదినా - వేఱ్వేఱు వస్తువుల మిశ్రమములు మొదలగువాని చేత - కుంభస్థేజలేశోధితే - కుండలోని నీరు శుభ్రము చేయబడగా ... - తదేవ కేవలం శుద్ధ్యతి - కేవలం అదే నీరు శుభ్రముగ అగును.

- నతు నదీ తటాకాది గతమ్ - నదులలోని, చెరువులలోని నీరు కాదు - సచ మలః కుంభస్యాంతస్తిష్ఠత్యేవ - ఆ మాలిన్యము కుండ లోపలనే ఉండును - నతు సర్వదా విలీయతే - అన్ని విధముల కరిగిపోవదు. అత ఏవ కించిచ్చలనేన పునః క్షుభ్యతిచ - అందువలన చిన్న కదలికలతో మఱల కలసిపోవును కూడ, ఏవం తపోదానాది ప్రాయశ్చిత్తం - ఈ విధముగ తపస్సు, దానము మొదలగు ప్రాయశ్చిత్తమున - సర్వధా సర్వేషాం సర్వంపాపం ధునోతి - అన్ని విధములు, అందఱి పాపముల నన్నింటిని, పోగొట్టదు. - కింతు సావశేషమ్ - కాని కొంత మిగిల్చి మాత్రమే - తచ్చ, కస్యచిదేవ, కించిదేవ - అదియును ఎవరో ఒకరిది - ఎంతో కొంత మాత్రమే - హృది ప్రవిష్టమాత్రస్తు శ్రీకృష్ణః - శ్రీకృష్ణుడు హృదయమున ప్రవేశించిన మాత్రముననే - సర్వేషాం సర్వం పాపం నిః శేషం హరతి - అందరి యొక్క పాపమును, అంతయుపాపమును హరించి వేయును - ఇత్యనేన దృష్టాంతేనోక్తం - అని ఈ దృష్టాంతముతో చెప్పబడినది. సలిలస్యమలం - నీటి మాలిన్యమును- యథా శరదితి - ఏ విధంగా శరదృతువుపోగొట్టునో అని (5)

**తా.** అన్ని కష్టముల నుండి విడివడి, బాటసారి తన స్వగృహమునకు వచ్చి, ఎట్లు సుఖించునో అట్లే పాపరహితుడైన పురుషుడు కృష్ణభగవానుని చరణ మూలములను ఎప్పుడును వదలక ఆనందముననుండును.

**టీ** :- తతశ్చ కృతార్థో భవతీత్యాహ – ధౌతాత్మేతి. ధౌతాత్మా నిష్పాపః ముక్తాస్సర్వే రాగద్వేశాదయః పరిక్లేశాయేన సః. పాంథః ప్రవాసాదాగతః స్వశరణం స్వగృహం యథా న ముంచతి తద్వత్. (6)

యదధాతుమతో బ్రహ్మన్ !
దేహారంభో உ స్య ధాతుభిః ।
యదృచ్ఛయా హేతునా వా
భవంతో జానతే యథా ॥ - 7

**టీ** :- తదేవ శ్రవణౌత్సుక్యమావిష్కృత్య సందిగ్ధాన్ అర్థాన్ పృచ్ఛతి । యదితి. అథాతుమతః ధాతవో మహాభూతాని తత్సంబంధశూన్యస్యాప్య భౌతికస్యాలౌకికస్యాత్మనో ధాతుభిః దేహారంభ ఇతి యత్. తత్కిం యదృచ్ఛయా నిర్నిమిత్తేన వా? హేతునా కర్మాదినా వా భవంతః యథావత్ జానతే అతః కథయంత్వితి శేషః. (7)

ఆసీద్యదుదరాత్పద్మం లోక సంస్థాన లక్షణమ్ ।
యావానయంవై పురుష ఇయత్తావయవైః పృథక్
తావానసావితి ప్రోక్తః సంస్థావయవ వానివ. - 8

**టీ.** ఇక అప్పుడు కృతార్థుడగునని చెప్పుచున్నాడు. ధౌతాత్మా – పాప రహితుడు – ముక్తసర్వపరిక్లేశః – రాగద్వేషాదులవలని క్లేశములు మున్నగువానిని వదలనివాడై – పాంథః – ప్రవాసమునుండి తిరిగివచ్చిన వాడు – స్వస్యశరణం – స్వగృహము – యథా నముంచతి తద్వత్ – ఏ విధముగ వదలకుండునో ఆ విధముగ – (6)

**తా.** బ్రహ్మస్వరూపుడవైన మహర్షీ ! మహదాది భూతములతో సంబంధము లేని జీవునకు దేహారంభము ఆ ధాతువులతో నేయగుచున్నది. ఇది యాదృచ్ఛికముగ జరుగున్నదా? లేక ఏదైన కారణ వశమున జరుగుచున్నదా? మీకు తెలియును.

**టీ** – పరీక్షిత్తు ఈ విధముగ తన శ్రవణ కుతూహలమును ఆవిష్కరించి కొన్ని సందిగ్ధార్థముల నడుగుచున్నాడు – అధాతుమతః – ధాతువులనగా మహదాదిభూతములు. తత్సంబంధశూన్యస్య అస్య లౌకికాత్మనః – అట్టి భూతములతో సంబంధము లేని జీవునకు – ధాతుభిర్దేహారంభ ఇతి యత్ – ఆ భూతములతోనే దేహారంభమగుననునది ఏదికలదో – ఏతత్కిమ్?– అదియేమి? యదృచ్ఛయా – నిమిత్తము లేకయే (సంభవించుచున్నదా) – హేతునా వా – కర్మాదుల కారణము చేతనా? భవంతః యథావజ్జానతే – మీరు యథా తథముగ ఎఱుంగుదురు– అతః కథయంతు ఇతిశేషః – చెప్పెదరు గాక అని మిగిలిన వాక్య సమాప్తి.(7)

**తా.** భగవానుని గర్భము (నాభి) నుండి లోకరచనయే లక్షణముగా గల పద్మము ఉద్భవించెను. ఈ పురుషుడు తన సీమితమైన అవయవములతో పరిచ్ఛిన్నుడుగ నుండెనో,

అట్లే భగవానుడు కూడ అన్నియే అవయవములతో, లోకమునందలి జీవునివలె నుండెనని చెప్పబడినది. (ఇందు భగవానుని విశేషమేమి కలదు?)

**టీ** :– యశ్చాసావీశ్వరస్సో ౬ ప్యేతత్తుల్యదేహః ప్రోక్తః అతస్తస్య కో విశేషః? ఇత్యాశయేన పృచ్ఛతి – సార్ధేన. ఆసీదితి. లోకానాం సంస్థానం రచనా తదేవ లక్షణం రూపం యస్య. తత్ త్రైలోక్యాత్మకం పద్మం యస్యోదరాసీత్ అసావీశ్వరః. ఇయత్తాయుక్తైః స్వపరిమితావయవైః అయం లౌకికః పురుషో యావాన్ యత్సంఖ్యావయవయుక్తః తావాన్ ప్రోక్తస్సంస్థావాన్ అవయవవానితి ప్రోక్తః. సంస్థా ఆకారః అవయవాశ్చ విద్యంతే యస్యేతి. సంస్థావయవవానివ. న పరమార్థత ఇతిశేషః. (8)

**టీ** – ఏ ఈశ్వరుడు కలడో అతడు కూడ సృష్టికర్తతో సమానముగ దేహము గల వాడని చెప్పబడినది – అప్పుడతని విశేషమేమి? అను ఆశయముతో అడుగుచున్నాడు. 'ఆసీత్' అను మూడుపాదముల శ్లోకముతో – లోకానాం – (లోకముల యొక్క) – సంస్థానం – రచన – తదేవ లక్షణం – అదియే స్వరూపము దేనికో – తత్త్రైలోక్యాత్మకం పద్మం – అట్టి ముల్లోకములకు సంబంధించిన కమలము – యస్యోదరాదాసీత్ – ఎవని పొట్టనుండి కలిగెనో–అసౌ – ఈశ్వరుడు – ఇయత్తాయుక్తైః స్వపరిమిత్తై రవయవైః – ఇన్ని తనకు పరిమితమైన అవయవములతో – లౌకికః పురుషో యావాన్ – లౌకిక పురుషుడు ఎన్ని అవయవములు కలిగియుండెనో – యత్సంఖ్యాకావయవ యుక్తస్తావాన్ – ఎంత సంఖ్యలోని అవయవములు కలిగి యుండెనో అన్ని, ఆ సంఖ్యలోనే – ప్రోక్తః – చెప్పబడినాడు. సంస్థావానవయవవానివ చ ప్రోక్తః – అవయములు కలవాడనియు చెప్పబడినాడు. – అతః – అందువలన – కోవిశేషస్తస్యేతి – అతని విశేషమేమి? అని – (8)

> అజః సృజతి భూతాని
> భూతాత్మాయదనుగ్రహాత్ ।
> దదృశే యేన తద్రూపం
> నాభిపద్మ సముద్భవః - 9

**తా.** భూతాత్మకుడైన అజుడు అనగా బ్రహ్మ, పరమేశ్వరుని నాభికమలమునుండి అవతరించినవాడై అతని అనుగ్రహముననే ప్రాణులను సృష్టించును. అతని అనుగ్రహము చేతనే అతని రూపమును చూచెను.

**టీ** :- అతః కో విశేషస్తస్యేతి. అవశ్యం చ విశేషో వాచ్య ఇత్యాహ – అజఇతి. అజః బ్రహ్మ భూతానాం సృష్ట్యుపాధీనాం ఆత్మా

**టీ** – అవశ్యముగ విశేషముచెప్పదగినదనుచున్నాడు. – అజః – బ్రహ్మ – భూతానాం – వ్యష్టిఉపాధులకునియంత – సమష్ట్యుపాధిత్వాత్ – సమష్టి ఉపాధిత్వమువలన–యేన

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

నియంతా. సమష్ట్యుపాధిత్వాత్. యేన చ అనుగృహ్ణాతా, తస్య రూపం దదృశే దృష్టవాన్ ఏదచ్చ. శ్లో. 'తచ్చాపి ద్రష్టురీశస్య కూటస్థస్యాఖిలాత్మనః సృజ్యం సృజామి సృష్టో ఒ హమీక్షయైవాభిచోదితః' ఇత్యాదినోక్తమనూద్యతే. అగ్రే తు స్పష్టం భవిష్యతి. (9)

చానుగృహ్ణాతా – ఎవని అనుగ్రహము చేత – తస్యరూపం దదృశే – అతని రూపమును చూచెను. ఏతచ్చ – ఇదియును – "ద్రష్ట, ఈశ్వరుడు, నిర్వికారుడు, సర్వస్వరూపుడునైన పరమేశ్వరుడే నేనవతరించుటకు కారణము, అతని ప్రేరణ చేతనే నేను ఈ సృష్టి చేయుచున్నాను" ఆతడు తనమాయను విడిచిపెట్టి ఎచట పరుండును? (9)

సచాపి యత్ర పురుషో
విశ్వస్థిత్యుద్భవాప్యయః ।
ముక్త్వాత్మమాయాం మాయేశః
శేతే సర్వగుహాశయ ॥ -10

**తా.** ఆ పురుషుడు విశ్వము యొక్క స్థితికిని, ఉత్పత్తికిని, ప్రళయమునకును కారణమైన వాడు. మాయకు అధీశ్వరుడు, అంతర్యామి స్వరూపుడైన ఆతడు తనమాయను విడిచిపెట్టి ఎచట పరుండును?

**టీ** :- ప్రశ్నాంతరమాహ. – స ఇతి. యత్ర శేతే యేన రూపేణావతిష్ఠతే విశ్వస్య స్థిత్యాదయో యస్మాత్ ఏవమాది ప్రశ్నానాం తత్త్వతో ఒ ర్హస్యుదాహర్తుమితి సర్వేషామంతే క్రియాసంబధః. (10)

**టీ.** 'సచాపి' అను ఈ శ్లోకమున మఱియొక ప్రశ్నను అడుగుచున్నాడు – యత్ర శేతే – ఏ రూపమున నుండును?– విశ్వస్య – విశ్వము యొక్క – స్థిత్యాదయో యస్మాత్ – ఎవని వలన స్థితి మొదలగునవి కలుగునో – ఏవమాది ప్రశ్నానాం – ఈ మొదలగు ప్రశ్నలకు – "తత్త్వతోఒ ర్హస్యుదాహర్తుమ్" – "తాత్త్వికముగ నుదహరించుటకు తగియున్నావు" అని అన్ని ప్రశ్నల సమాప్తియందు గల క్రియతో సంబంధము. (సర్వాంతే క్రియయా సంబంధ) (10)

పురుషావయవైర్లోకాః
సపాలాః పూర్వకల్పితాః ।
లోక రముష్యావయవాః
సపాలైరితి శుశ్రుమ. ॥ -11

**తా.** విరాట్ పురుషుని అంగములతోనే లోకపాలకులు కల్పింపబడిరనియు, మరియు లోకములు, లోకపాలకుల రూపము చేతనే ఈ పురుషుని కల్పన జరిగినదనియు వింటిమి. ఈ రెండు విధములైన మాటల ఆంతర్యమేమి?



**టీ** :- ప్రశ్నాంతరమాహ – పురుషేతి. పురుషస్యావయవైః పూర్వం కల్పితాః యస్యేహావయవైర్లోకాన్ కల్పంతీత్యాదౌ లోకైశ్చాముష్యావయవా ఇతి పాతాలమేతస్య హి పాదమూల మిత్యాదౌచ త్వన్ముఖాచ్ఛ్రుతవంతో వయం ఏతత్సందేహ విపర్యయాభ్యాం పృష్టం. (11)

**టీ** – మఱియొక ప్రశ్నను చెప్పుచున్నాడు. పురుషస్యావయవైః–పురుషుని అవయవములచేత – పూర్వంకల్పితాః – మొదట కల్పింపబడినవి. "యస్యేహావయవైర్లోకాన్ కల్పయంతో" ఇత్యాదౌ – 'ఎవని అవయవములచే లోకములు కల్పింతురో' అని మొదట – "లోకైశ్చాముష్యావయవాః " ఇతి – "లోకములచేత ఇతని అంగములు" అని, "పాతాలమేతస్యహిపాదమూలమ్" పాతాళలోకము ఇతని పాదమూలము" అని మొదట మీనోట మేము వినియుంటిమి. (11)

యావాన్కల్పో వికల్పోవా
యథాకాలో ఽ ను మీయతే ।
భూతభవ్య భవచ్ఛబ్ద
ఆయుర్మానం చ యత్సతః ॥ - 12

**తా.** కల్పములు, అవాంతర కల్పములు ఎన్ని గలవు? భూతభవిష్యద్వర్తమాన రూపమగు కాలము ఎట్లు ఊహింపబడుచున్నది? జీవుల ఆయుః ప్రమాణము కూడ నిర్ణీతమై యున్నదా?

**టీ** :- ఇదానీమవిజ్ఞాతాన్ బహూనర్థాన్ పృచ్ఛతి. – యావానితి. కల్పః మహాన్ వికల్పః అవాంతరః. భూతాదిశబ్దో యస్మాత్ యస్య వాచక ఇతి వా. సతః స్థూలదేహాద్యభిమానో మనుష్య పితృదేవాదేః ఆయుషః ప్రమాణం అనుమానప్రకారః పృష్టః. (12)

**టీ** – ఈ విధముగ సందేహ విపర్యయములను దీర్చుటకు ప్రశ్నింపబడినది – ఇదానీమజ్ఞాతాన్బహూనర్థాన్పృచ్ఛతి – ఇప్పుడు తెలియని వానిని, అనేకార్థములు అడుగుచున్నాడు – 'యావాన్' అని మొదలగువానితో – కల్పః – గొప్పది (మహాకల్పము) – వికల్పః – అవాంతర కల్పము – భూతాదిః శబ్దో యస్మాత్ – భూతము మొదలగు కాల వాచి శబ్దము దేని వలన – లేక దేనిని గుఱించి బోధించునది అని – (యస్య వాచక ఇతివా) సతః – స్థూల దేహాభిమానుల యొక్క, మనుష్యులు, పితరులు, దేవతలు మొదలగు వారి యొక్క – ఆయుషః ప్రమాణమ్ – ఆయువు యొక్క ప్రమాణము. (12)



కాలస్యాను గతిర్యాతు
లక్ష్యతే ౽ ణ్వీ బృహత్యపి।
యావత్యః కర్మగతయో
యాదృశీర్ద్విజ సత్తమ !॥ - 13

**తా.** కాలము యొక్క ప్రవృత్తి యెట్టిది? అది చూడబడునా? అది అణువువలె సూక్ష్మమైనదా? లేక బృహత్తరమా? ఓ బ్రాహ్మణవర్యా! కర్మగతులు - కర్మప్రాప్యములైన స్థానములెన్ని? అవి యెట్టివి?

**టీ :-** విశేషం పృచ్ఛతి - కాలస్యేతి. అనుగతిః ప్రవృత్తిః కర్మగతయః కర్మప్రాప్యాని స్థానాని యాదృశీః యాదృశ్యః అత్రార్షత్వాత్ప్రథమార్థే ద్వితీయా. యాదృశ్య ఇతి పాఠే న కాపి క్షతిః.(13)

**టీ -** అనుమాన ప్రకారము అడుగబడినది. విశేషమునడుగుచున్నాడు. అనుగతిః - ప్రవృత్తి - కర్మగతయః- కర్మగతులు - యాదృశీః - ఏవిధముగ కన్పట్టినది? ఎట్టిది. (13)

యస్మిన్కర్మ సమావాయో
యథా యేనోపగృహ్యతే।
గుణానాం గుణినాంచైవ
పరిణామమభీప్సతామ్.॥ - 14

**తా.** సత్త్వాది గుణములలోను, ఆ గుణములు గల జీవులలోను, పరిణామమునభిలషించువారిలో, కర్మసముదాయము, ఏ సమయమున, ఎట్లు, ఎవని చేత స్వీకరింపబడును?

**టీ :-** యస్మిన్నితి. గుణానాం సత్వాదీనాం పరిణామం దేవాదిరూపమిచ్ఛతాం గుణానాం జీవానాం మధ్యే యస్మిన్ పరిణామే కర్మణాం పుణ్యపాపానాం సమవాయస్సముదాయః. కేన కర్మసముదాయేన కథంకృతేన. కో ౽ ధికారీ దేవాదిభావం ప్రాప్నోతీత్యర్థః. (14)

**టీ.** గుణానాం - సత్త్వాదులలో - పరిణామం - (వికాసము) - దేవాదిరూపమిచ్ఛతాం గుణినాం - దేవతలు మున్నగువారి రూపములు కోరెడు జీవులలో - మధ్యే - జీవుల మధ్య - యస్మిన్ - పరిణామే ?- ఏ పరిణామమునందు - కర్మణాం - పుణ్యాపాపకర్మల యొక్క - సమావాయః - సముదాయము - కేన కర్మసముదాయేన - ఏ కర్మ సముదాయముచేత - కథం కృతేన - ఎట్లు చేయబడినదానిచేత ? - కో౽ ధికారీ - ఎవరు అధికారి? - దేవాదిభావం ప్రాప్నోతీత్యర్థః? (ఎవడు) దేవాదిభావమును పొందును? అని యర్థము. (14)

భూపాతాల కకుబ్వ్యోమ
గ్రహనక్షత్ర భూభృతామ్ ।
సరిత్సముద్ర ద్వీపానాం
సంభవశ్చైతదోకసామ్. ॥ -15

**టీ** :- భూపాతాలేతి. భూపాతాలాదీనాం సంభవః ఏతాని ఓకాంసి యేషాం తేషాం ప్రాణినాం చ సంభవః. యథేతి సర్వత్రానుషంగః. (15)

**తా.** భూమి, పాతాళము, దిక్కులు, ఆకాశము, గ్రహములు, నక్షత్రములు, పర్వతములు, నదులు, సముద్రములు, ద్వీపములు మరియు వీనిని స్థావరములు (నివాసములు) గా కలిగిన ప్రాణులు ఎట్లు పుట్టినవి?

**టీ** – భూపాతాలాదీనాం సంభవః – (భూమి, పాతాళము మొదలగువాని పుట్టుక) ఏతాన్యోకాంసి యేషాం ప్రాణినాం తేషాంచ సంభవః (ఇవి ఏ ప్రాణులకు నివాస స్థానములో వాని యొక్క పుట్టుక) యథేతి సర్వత్రానుషంగః – ఎట్లు జరిగినది అని అంతటను సంబంధము. (15)

ప్రమాణమండకోశస్య
బాహ్యాభ్యంతర భేదతః ।
మహతాంచాను చరితం
వర్ణాశ్రమ వినిశ్చయః ॥ -16

**టీ** :- ప్రమాణమితి. వర్ణానాం ఆశ్రమాణాం చ వినిశ్చయః తత్తత్స్వభావైర్నిర్ధారః. (16)

**తా.** బ్రహ్మాండ కోశము యొక్క వెలుపలి లోపలి భేదము చేత కొలత ఎంత? మహాపురుషుల చరిత్ర యెట్టిది? బ్రాహ్మణాది వర్ణముల, బ్రహ్మచర్యాదిగ గల ఆశ్రమముల నిర్ణయమెట్టిది?

**టీ.** వర్ణానామాశ్రమాణాం చ వినిశ్చయః – వర్ణముల యొక్కయు, ఆశ్రమముల యొక్కయు – వాని వాని స్వభావములచే నిర్ధరించి చెప్పుట (కోరుచున్నాను) (16)

అవతారానుచరితం
యదాశ్చర్యతమం హరేః ।
యుగాని యుగమానంచ
ధర్మోయశ్చయుగే యుగే ॥ -17

**తా.** భగవానుని మిక్కిలి ఆశ్చర్యకరములైన అవతారములను గూర్చిన చరిత్రలు, యుగములు, వాని ప్రమాణములు, ప్రతియుగము నందలి ధర్మము (వినగోరుచున్నాను)

**టీ :-** అవతారేతి. యుగే యుగే ప్రతియుగం. నృణాం యో ధర్మః. యచ్చ హరేరవతారానుచరితం. (17)

**టీ.** యుగే యుగే – ప్రతియుగమున – యోధర్మః – ఏ ధర్మము కలదో –యచ్చ హరేరవతారాను చరితం – భగవానుని ఏ అవతారచరిత్రము గలదో – (17)

నృణాం సాధారణో ధర్మః
సవిశేషశ్చ యాదృశః ।
శ్రేణీనాం రాజర్షీణాంచ
ధర్మః కృచ్ఛ్రేషుజీవతామ్. ॥ - 18

**తా.** మనుష్యుల సాధారణ ధర్మము లెట్టివి? విశేషధర్మములు (వర్ణాశ్రమాది ధర్మములు) ఎట్టివి? ఆయావృత్తులనవలంబించి జీవించు జన సమూహముల యొక్కయు రాజర్షుల యొక్కయు, ఆపదలలో జీవించువారి యొక్కయు ధర్మములెట్టివి?

**టీ :–** నృణామితి. స విశేషః వర్ణాశ్రమనిబంధనః. శ్రేణీనాం తత్తద్వ్యవసాయోపజీవినాం. వ్యవహారనియమలక్షణో ధర్మః. రాజర్షీణాం చ ప్రజాపాలనాధికారిణాం కృచ్ఛ్రేషు ఆపత్సు జీవతాం సర్వేషాం. (18)

**టీ –** సవిశేషః – వర్ణాశ్రమ నిబంధనలు – శ్రేణీనాం – ఆయావ్యవసాయముల నాశ్రయించి జీవించువారల యొక్క – వ్యవహార నియమలక్షణోధర్మః – వ్యవహరించుటలోని నియమముల లక్షణము – అదే ధర్మము. రాజర్షీణాం – ప్రజలను పాలించుటకు అధికారము గలవారి యొక్క– కృచ్ఛ్రేషు – ఆపదల యందు – జీవతాం సర్వేషాం జీవించు వారలందఱి యొక్క (18)

తత్త్వానాం పరిసంఖ్యానం
లక్షణం హేతులక్షణమ్ ।
పురుషారాధన విధిర్యో
గస్యాధ్యాత్మికస్య చ ॥ - 19

**తా.** ప్రకృత్యాది తత్త్వముల సంఖ్య, వాని లక్షణము, వాని కార్యహేతుత్వస్వరూపము, వివిధ దేవతల పూజా విధానము, అష్టాంగయోగవిధి, ఆధ్యాత్మిక సాధన ప్రకారము (తెలిసికొనగోరుచున్నాను)

**టీ :-** తత్త్వానామితి. తత్త్వానాం ప్రకృత్యాదీనాం పరిసంఖ్యానం సంఖ్యా. స్వరూపం. హేతులక్షణం తత్తత్కార్యహేతుత్వేన చ

**టీ.** సర్వేషాం తత్త్వానాం ప్రకృత్యాదీనాం పరిసంఖ్యానం – ప్రకృతి మొదలగు అన్ని తత్త్వముల సంఖ్య – లక్షణం – స్వరూపము –హేతుతో లక్షణమ్ – తత్తత్కార్యహేతుత్వేనచ

లక్షణమిత్యర్థః. పురుషారాధనస్య విధిః దేవపూజాప్రకారః. అష్టాంగయోగస్య చ విధిః. (19)

లక్షణమిత్యర్థః – ఆయాతత్త్వముల కార్యములకు గల కారణము నందలి లక్షణమని యర్థము – పురుషారాధానస్య – పురుషారాధనము యొక్క – విధిః – ప్రకారము మరియు – విధిః – దేవపూజాప్రకారము – అష్టాంగ యోగస్యచ విధిః – (యమ నియమ ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ మనన సమాధులు అను ఎనిమిది అంగముల విధానము) (19)

యోగేశ్వరైశ్వర్యగతి
ర్లింగ భంగస్తు యోగినామ్ ।
వేదోపవేద ధర్మాణా
మితిహాస పురాణయోః - 20

**తా.** యోగేశ్వరుల ఐశ్వర్యము (అణిమాది సిద్ధులచే అర్చిరాది గమనము) యోగుల యొక్క లింగశరీర ప్రలయము, వేదముల యొక్కయు, ఆయుర్వేదాది ఉపవేదముల యొక్కయు, ధర్మ శాస్త్రముల యొక్కయు, ఇతిహాసముల యొక్కయు, పురాణముల యొక్కయు లక్షణములను తెలసికొనగోరుచున్నాను.

**టీ:–** యోగేశ్వరేతి. యోగేశ్వరాణాం యోగాభ్యాస శాలినామైశ్వర్యేణ అణిమాదినా గతిః అర్చిరాదిగతిః లింగశరీరస్య భంగః ప్రవిలయః. వేదా ఋగ్వేదాదయః. ఉపవేదాః ఆయుర్వేదా దయః. ధర్మాః ధర్మశాస్త్రాణి. తేషాం ఇతిహాసపురాణయోశ్చ ఇతిహాసః పురావృత్తః సకలార్థ ప్రతిపాదకః పురాణం దశపంచలక్షణవిశిష్టం. గతిః తయోస్స్వరూపం. (20)

**టీ –** యోగేశ్వరాణాం – యోగేశ్వరుల యొక్క – ఐశ్వర్యం – అణిమాదుల చేత అర్చిరాది మార్గములందు పయనించుట – లింగశరీరస్యభంగః – లింగశరీరమును లయమొనర్చుట – వేదాః – ఋగ్వేదాదులు – ఉపవేదాః – ఆయుర్వేదాదులు–ధర్మాః – ధర్మశాస్త్రములు – తేషామ్ – వాని యొక్క – ఇతిహాసపురాణ యోశ్చగతిః – ఇతిహాసముల యొక్కయు పురాణముల యొక్కయు స్వరూపము. (20)

సంప్లవః సర్వభూతానాం
విక్రమః ప్రతిసంక్రమః ।
ఇష్టాపూర్తస్య కామ్యానాం
త్రివర్గస్యచ యో విధిః ॥ - 21

**తా.** సకల ప్రాణుల అవాంతరప్రళయము, (లేక ఉద్భవము) స్థితి, మహాప్రళయము, వైదిక స్మార్త కర్మలు, కామ్య కర్మలగు అగ్నిహోత్రాదులవిధి, ధర్మ, అర్థ, కామముల విధానము (తెలుపగోరుచున్నాను)

**టీ** :- సంప్లవఇతి. సంప్లవః అవాంతరప్రలయః యద్వా సమ్యక్ ప్లవనముద్భవః విక్రమస్థితిః. ప్రతిసంక్రమః మహాప్రలయః. ఇష్టం యాగాదిరూపం వైదికం కర్మ. పూర్తం తటాకవాప్యాలయాది నిర్మాణరూపం స్మార్తం కర్మ. శ్లో."వాపీకూపతటాకాది దేవతాయతనాని చ, అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయత" ఇతి. తత్ర కామ్యానామగ్నిహోత్రాదీనాం త్రివర్గస్య ధర్మకామార్థ రూపస్య విధిః అనుష్ఠానప్రకారః. (21)

**టీ.** సంప్లవః - అవాంతరప్రళయము - యద్వా - లేక - సమ్యక్ప్లవనం - ఉద్భవము - విక్రమః - స్థితి - ప్రతిసంక్రమః - మహా ప్రళయము - ఇష్టం - వైదిక కర్మ - పూర్తం - స్మార్త కర్మ - "వాపీకూపతటాకములు మొదలగునవి, దేవాలయములు - అన్నదానములు, తోటలు మొదలగున7వి ఏర్పాటు చేయుట" 'పూర్తం' అని పేర్కొనబడును - తత్రచ - ఇక కామ్యానాం - అగ్నిహోత్రాదుల యొక్క - విధిః - విధానము - త్రివర్గస్య - ధర్మార్థ కామముల - విధిః - విధానము - అవిరోధ ప్రకారః - దోషము లేకుండునట్లు ఆచరించుట. (21)

యశ్చానుశాయినాం సర్గః
పాఖండస్య చ సంభవః ।
ఆత్మనో బంధమోక్షౌచ
వ్యవస్థానం స్వరూపతః ॥ - 22

**తా.** ప్రళయ కాలమున ప్రకృతిలో లీనమైన ఉపాధులు గల జీవుల యొక్క ఉత్పత్తి, నాస్తికులపుట్టుక, జీవుని బంధమోక్షములు, బంధమోక్షాతిరిక్తమైన స్వరూపమున వారి ఉనికి - (వీని అన్నిటిని గూర్చిన వాస్తవములు తెలియగోరుచున్నాను.)

**టీ** :- య ఇతి. అనుశాయినాం మలినోపాధీనాం జీవానాం. ఆత్మనః జీవస్య వ్యవస్థానం బంధమోక్షాతిరిక్త స్వరూపేణావస్థానం (22)

**టీ** - అనుశాయినాం - లీనోపాధులగు జీవుల యొక్క - ఆత్మనః - జీవుని యొక్క - వ్యవస్థానం - బంధమోక్షాతిరిక్త స్వరూపమున వారి ఉనికి -(22)

యథాత్మతంత్రో భగవాన్
విక్రీడత్యాత్మమాయయా ।
విసృజ్య వా యథా మాయా
ము ఉ దాస్తే సాక్షివద్విభుః ॥ - 23

**తా.** స్వతంత్రుడైన భగవానుడు తనమాయతో ఎట్లు క్రీడించును? లేక ప్రళయమునందు మాయను విడిచి సాక్షిమాత్రుడుగ ఎటులుండును?

**టీ** :- యథేతి. ఉదాస్తే ప్రలయే. (23)

**టీ.** ఉదాస్తే - ప్రళయమునందు ఉదాసీనుడుగ ఎట్లుండునో. (23)

సర్వమేతచ్చ భగవాన్ !
పృచ్ఛతే మే ఉ ను పూర్వశః ।
తత్త్వతో ఉ ర్హస్యుదా హర్తుం
ప్రపన్నాయ మహామునే ॥ - 24

**తా.** భగవన్ ! ఓ శుకమహామునీ ! ఇది యంతయును శరణాగతుడనై అడుగుచున్న నాకు క్రమముగను, తాత్త్వికముగను వివరించి చెప్పుటకు తగియున్నావు.

**టీ** :- సర్వమితి. చశబ్దాదపృష్టమపి.(24)

**టీ** - 'చ' శబ్దాదపృష్టమపి - 'చ' అను సముచ్చయ బోధక శబ్దము ప్రయుక్తమగుటచే 'ప్రశ్నింపని అంశములను కూడ చెప్పుము' అని (24)

అత్ర ప్రమాణం హి భవాన్
పరమేష్ఠీ యథాత్మభూః ।
పరే చేహాను తిష్ఠంతి
పూర్వేషాం పూర్వజైః కృతమ్ ॥ - 25

**తా.** ఈ విషయమున తామే స్వయంభువుడైన బ్రహ్మవలె ప్రమాణము. ఇతరులు తమ పూర్వుల పరంపరగా వినుచు వచ్చుచున్న విషయములనే అనుసరింతురు.

**టీ** :- అత్రేతి. ప్రమాణం సమ్యక్ జ్ఞాతాయతస్తవ బ్రహ్మనారద వ్యాసక్రమేణ సంప్రదాయో ఉ స్తీతి సామాన్యన్యాయేనాహ - అపరేచేతి. యద్వా - త్వదనే ప్రాయశో గతానుగతికా ఏవ న తద్విద ఇత్యాహ - అపరే చేతి. (25)

**టీ** - ప్రమాణం - యథాస్థితిగ తెలిసిన వారు - యతస్తవ బ్రహ్మనారద వ్యాసక్రమేణ సంప్రదాయో ఉ స్తీతి - మీకు బ్రహ్మ, అతనినుండి నారదుడు అతని నుండి వ్యాసుడు అనుక్రమ సంప్రదాయమున్నందు వలన - సామాన్య న్యాయేనాహ - సామాన్య న్యాయమున చెప్పుచున్నాడు - 'పరే' చేతి - 'ఇతురులైననో' అని - యద్వా - లేక - త్వదన్యే ప్రయశో గతాను గతికా ఏవ - నీకన్న నితరులు ప్రాయికముగ పరంపరగ విన్నవారు మాత్రమే. కావున - న తత్త్వవిద ఇత్యాహ - పరే చేతి - తాత్త్వికముగ తెలసినవారు కారు అని 'పరే' అనుచు ప్రారంభించిన భాగము చెప్పుచున్నాడు. (25)

న మేఽ సవః పరాయంతి
బ్రహ్మన్ననశనాదమీ ।
పిబతో ఽ చ్యుత పీయూష
మన్యత్ర కుపితాద్విజాత్ ॥ - 26

**తా.** బ్రహ్మన్ ! భోజనము చేయకుండుటవలనను, లేక ఆ కోపించిన బ్రాహ్మణుని శాపము వలనగాని నా ప్రాణములు పోవు, ఏలయన మీరిచ్చు మాధవుని కథామృతమును గ్రోలుచున్నాను కదా !

**టీ** :- నేతి. నను తవ అనశనద్విజకోపాభ్యాం వ్యాకులస్య కుతః శ్రవణం? తత్రాహ - నపరాయంతి నావగచ్ఛంతి వ్యాకులీభవంతీత్యర్థః. అచ్యుతకీర్తి పీయూషం పిబతః. (26)

**టీ** - 'ఉపవసించి యుండుట, బ్రాహ్మణుని శాపము అను రెండింటి వలన వ్యాకుల స్థితిలో నున్న నీకు భాగవతము వినుట యెందులకు?' అనుదానికి సమాధానము చెప్పుచున్నాడు. 'న' అను ఈ శ్లోకముతో - నపరాయంతి - అపగమనము చెందవు - వ్యాకులము చెందవని యర్థము - అచ్యుతకీర్తి పీయూషమ్ - విష్ణుదేవుని కీర్తించుటయే అమృతము. (దానిని త్రాగుచున్నాను) (26)

**సూత ఉవాచ -**

స ఉపామంత్రితో రాజ్ఞా
కథా యామితి సత్పతేః ।
బ్రహ్మరాతో భృశం ప్రీతో
విష్ణురాతేన సంసది ॥ - 27

**సూత భగవానుడిట్లనెను**

**తా.** పరీక్షిత్తు, సత్పురుషుల సభలో భగవత్కథలు వినిపించుటకీ విధముగా ప్రార్థింపగనే శ్రీ శుకమహర్షి మిక్కిలి ప్రీతుడయ్యెను.

**టీ** :- స ఇతి. ఉపామంత్రితః పృష్టః సంశ్చాసౌ పతిశ్చ తస్య. (27)

**టీ.** ఉపామంత్రితః - అడగబడినవాడై - సంశ్చాసౌపతిశ్చ తస్య - బ్రహ్మ విద్రక్షకుని - భగవానుని యొక్క - (సత్పతేః) (27)

ప్రాహ భాగవతం నామ
పురాణం బ్రహ్మ సంమితమ్ ।
బ్రహ్మణే భగవత్ప్రోక్తం (బ్రహ్మణాప్రోక్తం)
బ్రహ్మకల్ప ఉపాగతే ॥ -28

**తా.** వేదతుల్యమైన భాగవతపురాణమును, బ్రహ్మకల్పారంభమున స్వయముగ భగవానుడు బ్రహ్మకు వినిపించిన దానిని శ్రీశుకుడు వినిపించెను.

**టీ** :- ఆహేతి. బ్రహ్మకల్పే సృష్ట్యుపక్రమే. భాగవతాఖ్యానేనైవ ప్రశ్నానాముత్తరం దాతుం ప్రక్రాంతవానిత్యర్థః. (28)

**టీ** – బ్రహ్మ కల్పే – సృష్టికి ఉపక్రమించిన కల్పమునందు – భాగవతాఖ్యానేనైవ ప్రశ్నానాముత్తరం దాతుముపక్రాంతవానిత్యర్థః – భగవానుడు చెప్పుట తోడనే ప్రశ్నలకు సమాధానము చెప్పుటకు ఉపక్రమించెనని యర్థము.(28)

యద్వత్పరీక్షిదృషభః
పాండూనామనుపృచ్ఛతి ।
ఆనుపూర్వ్యేణ తత్సర్వమా
ఖ్యాతుముపచక్రమే. ॥ - 29

**తా.** పాండవ శ్రేష్ఠుడగు పరీక్షిత్తు ఏయే ప్రశ్నలడుగుచుండెనో వాని క్రమముననుసరించి అన్నింటికిని సమాధానము చెప్పుటకు శ్రీశుకుడు ఉపక్రమించెను.

**టీ** :- యదితి. పాండూనామృషభః శ్రేష్ఠః అనుపూర్వ్యేణేతి ప్రస్తావక్రమో ఽ త్ర వివక్షితః న ప్రశ్నక్రమః. (29)

**టీ.** పాండూనామృషభః – పాండవేయులలో శ్రేష్ఠుడు – ఆనుపూర్వ్యేణేతి – ఆనుపూర్వితో అని – ప్రస్తావక్రమోఽ త్ర వివక్షితః న ప్రశ్నక్రమః – అవసరమైన క్రమముననుసరించియే చెప్పనిచ్చగించెను కాని ప్రశ్నలక్రమమును బట్టి కాదు.(29)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వితీయస్కంధే ప్రశ్నవిధిర్నామాష్టమోఽ ధ్యాయః – టీకాయాం**

**శ్రీమద్భాగవత పురాణమున రెండవ స్కంధమునందలి ప్రశ్నవిధి యనెడు ఎనిమిదవ అధ్యాయము సమాప్తము – టీక యందు ఎనిమిదవ అధ్యాయము**






## అథ నవమోధ్యాఽ యః

### శ్రీ శుక ఉవాచ

ఆత్మమాయామృతే రాజన్ !
పరస్యానుభవాత్మనః ।
నఘటేతార్థ సంబంధః
స్వప్నద్రష్టురివాంజసా ॥ - 1

**టీ**:- రాజప్రశ్నోత్తరం వక్తుం బ్రహ్మణే హరిణోదికమ్, కథయామాస నవమే శుకో భాగవతం పునః తత్ర యత్తావదుక్తం యదధాతుమత ఇత్యనేన జీవస్య కథం దేహసంబంధ ఇతి తత్రోత్తరమాహ - ఆత్మమాయామితి. ఆత్మనః హరేః మాయామంతరేణ అనుభవరూపస్యాత్మనో ఽ ర్థే న దృశ్యేన దేహాదినా సంబంధః అంజసాతత్వతః నఘటేత తత్ర హేతుః - పరస్యేతి. స్వప్నద్రష్టుః యథా స్వప్నదేహ సంబంధో న ఘటతే తద్వత్ తస్మాత్సంసారో ఽ పి మాయైవేత్యర్థః. (1)

## తొమ్మిదవ అధ్యాయము

### శుక మహర్షి యిట్లనెను

**తా.** రాజా! స్వప్నమును చూచువానికి స్వప్నగత పదార్థములతో తత్త్వతః సంబంధములేనట్లు, దేహగతమైన ప్రత్యగాత్మకును ప్రపంచ దృశ్యసంబంధము, వస్తుతః ఘటింపదు, ఏలయన ఈ దృశ్య వ్యవస్థ మాయా మాత్రమే. ఈ మాయ తప్ప దేహియైన ఆత్మకు దృశ్య సంబంధము నిజమునకు లేనేలేదు.

**టీ.** పరిక్షిత్తు ప్రశ్నలకు సమాధానము - భగవానుడు బ్రహ్మకు చెప్పినదానిని శుకుడు తొమ్మిదవ అధ్యాయమున మఱల భాగవతముఖమున చెప్పెను - ఇటనింతవఱకు చెప్పబడినది 'యదధాతుమతః' (2-8-6) అను శ్లోకముతో జీవునకు దేహముతో గల సంబంధమును గూర్చి పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు సమాధానము - ఆత్మనః - భగవానుని యొక్క - మాయామంతరేణ - మాయను తప్ప - అనుభవరూపస్య ఆత్మనః - అనుప్రవేశ రూపమున కలిగిన ప్రత్యగాత్మకు, అర్థేన - దృశ్యముతో - దేహాదినాసంబంధః - దేహముమొదలగు వస్తువులతో సంబంధము - అంజసా - తత్త్వతః - నఘటేత - ఘటింపదు. (సంభవింపదు) - అత్రహేతుః - ఇటదానికి కారణము - స్వప్నద్రష్టుః - స్వప్నమును చూచువానికి - యథా - ఏ విధముగ - స్వప్న దేహసంబంధః - స్వప్నము నందలి దేహాదుల తోడి సంబంధము - నఘటేత - ఘటింపదో - తద్వత్ - ఆ విధముగనే (సంసార దృశ్యసంబంధము ప్రత్యగాత్మకును ఉండదు) (1)




బహురూప ఇవాభాతి
మాయయా బహురూపయా ।
రమమాణో గుణేష్వస్యా
మమాహమితి మన్యతే ॥ - 2

**తా.** అనేక రూపములు గల మాయచేత, వివిధ రూపములవలె కన్పట్టుచుండును. దేహాదిభావములందు తాదాత్మ్యము కలిగియుండుటచే, 'నాది', 'నేను' అని తలంచుచుండును.

**టీ** :- అత ఏవానేకరూపత్వం భజతీత్యాహ – బహురూప ఇతి. బహురూపః బాలయువాదిరూపః దేవనరాది రూపశ్చాభాతి. గుణేషు దేహాదిషు. (2)

**టీ** – సంసారోపి మాయయైవేత్యాహ – ప్రపంచము కూడ మాయచేతనే అని చెప్పుచున్నాడు – బహురూపః – అనేక రూపములు కలదిగ, బాలయువాదిరూపః – బాలుడు, యువకుడు మొదలగు రూపములు కలదిగ – దేవనారదాది రూపశ్చ, – దేవతలు, నారదుడు మొదలగు రూపములు కలదిగను – ఆభాతి – కన్పట్టును – గుణేషు – దేహదులయందు.(2)

యర్హివావ మహిమ్నిస్వే
పరస్మిన్కాలమాయయోః ।
రమేత గతసంమోహ
స్త్యక్త్వోదాస్తే తదోభయమ్ ॥ - 3

**తా.** కాలము, మాయ అనువాని కంటెను పరమశ్రేష్ఠము, మహిమాన్వితమునైన స్వీయ దేహాంతర్గతమగు ప్రత్యగాత్మయందు తాదాత్మ్యభావన కలిగియుండినప్పుడు, అజ్ఞానము తొలగి 'నాది', 'నేను' (మమకారాహంకారముల) అను రెండింటిని విడిచి, ఉదాసీనుడైయుండును.

**టీ** :- అత ఏవ భక్తియోగేన తన్నిరాసే సతి మోక్షో ఽ పి ఘటత ఇత్యాహ – యర్హీతి. వావ శబ్దః. ఏవార్థే స్వ ఏవ మహిమ్ని యదా రమేత తమేవాహ – కాలమాయోః పురుష ప్రకృత్యోః పరస్మిన్ తదా ఉభయం అహం మమేతి చ త్యక్త్వా ఉదాస్తే పూర్ణస్వరూపేణావతిష్ఠతే. తదుక్తం. శ్లో. ' యయా సమ్మోహితో జీవ ఆత్మానం త్రిగుణాత్మకం, పరో ఽ పి మనుతే ఽ నర్థం

**టీ.** అతఏవ భక్తి యోగేన తన్నిరాసేసతి మోక్షోఽ పి ఘటత ఇత్యాహ – యర్హీతి. అందువలననే భక్తియోగముచేత అది తిరస్కరింపబడగా మోక్షము కూడ ఘటించునని, 'యర్హి' అను ఈ శ్లోకమున చెప్పుచున్నాడు – 'వావ' శబ్దము ఏవార్థము నందు, స్వఏవ మహిమ్ని యదారమతే – తనదేయైన మహిమ గల ఆత్మయందు ఎప్పుడు రమించునో – తదేవాహ – అదియే చెప్పుచున్నాడు – కాలమాయయోః – కాలము, మాయ అను పురుష, ప్రకృతుల కంటెను– పరస్మిన్ – శ్రేష్ఠమైన దాని యందు – తదోభయం అహం మమేతిచ అప్పుడు అహంకారమమకారములనునవి – త్యక్త్వా – విడిచి – ఉదాస్తే –

తత్కృతం చాభిపద్యతే. అనర్థో ఉ పశమం సాక్షాద్భక్తి యోగమధోక్షజే, లోకస్యాజానతో వ్యాసశ్చక్రే సాత్వతసంహితా" మితి. (3)

ఉదాసీనముగనుండును లేక పూర్ణరూపమున నుండును.- తదుక్తమ్ - అది చెప్పబడినది. "ఈమాయచే వెూహితుడై, ఈ జీవుడు త్రిగుణాతీతుడయియును తనను తాను త్రిగుణాత్మకునిగనే భావించుచుండును. ఈ భావన కారణముగ రాగల అనర్థములను భోగించును". "ఈ అనర్థములను శాంతింపజేయుటకు ప్రత్యక్ష సాధనము కలదు - అది భగవానుని యందలిభక్తి యోగము. కాని సాం సారిక జనులకీ విషయము తెలియదు. ఆ కారణముననే వ్యాస భగవానుడు శ్రీమద్భాగవత రచన చేసెను". (1-7- (5, 6)) అని. (3)

ఆత్మతత్త్వ విశుద్ధ్యర్థం
యదాహభగవానృతమ్ ।
బ్రహ్మణే దర్శయ న్రూప
మవ్యలీక వ్రతాదృతః ॥ - 4

**తా.** బ్రహ్మదేవుడు చేసిన నిష్కపట తపస్సునకు ప్రసన్నుడై భగవానుడతనికి తన రూపమును దర్శింపజేయుచు జీవతత్త్వ శుద్ధి కొఱకు పరమ సత్యమగు ఏ పరమార్థమును బోధించెనో (దానినే నీకు చెప్పుచున్నాను)

**టీ** :- యచ్చోక్తం పరమేశ్వరస్యాపి దేహసంబధావిశేషాత్ కథం తద్భక్త్యా మోక్షస్స్యాదితి ఆసీద్యదుదరాత్పద్మమిత్యాదినా. తత్రాహ - ఆత్మేతి. ఆత్మనః జీవస్య తత్త్వవిశుద్ధ్యర్థం తత్త్వజ్ఞానార్థం తద్భవత్యేవ కిం తత్ యత్తప ఇత్యాదినా స్వభజనం భగవాన్ బ్రహ్మణ ఆహ - కింకుర్వన్ ఋతం సత్యం చిద్ఘనరూపం దర్శయన్ దర్శనహేతుః -

**టీ** - దేహసంబంధమైన భేదము లేనిదే భగవద్భక్తిచే మోక్షమెట్లు కలుగును? అనెడు విషయమును 'ఆసీద్యదురాత్పద్మం' (2-8-7) మొదలగు శ్లోకముల ద్వారా అచట చెప్పినాడు. ఆత్మనః - జీవుని యొక్క - తత్త్వ విశుద్ధ్యర్థం - తత్త్వము యొక్క విశుద్ధి కొఱకు - తత్త్వజ్ఞానార్థం - తత్త్వజ్ఞానము కొఱకు - తద్భవత్యేవ - అది జరుగును కూడ - కింతత్? అదియేమి?- యత్తప ఆదినా భజనం - తపస్సు మున్నగువానితో సేవించుట యేది కలదో-భగవాన్బ్రహ్మణే ఆహ - దానిని భగవానుడు బ్రహ్మకుఁజెప్పెను - కింకుర్వన్ - ఏమి చేయుచు-ఋతం - సత్యమైన - చిద్ఘనం - జ్ఞాన ఘనమైన -రూపం -స్వరూపమును- దర్శయన్- సాక్షాత్కరింపజేయుచు - దర్శనే హేతుః - సాక్షాత్కారము చేయుటకు కారణము అవ్యలీకేన వ్రతేన - తపస్సుచేత - ఆదృతః - సేవింపబడిన వాడగుచు, అయంభావః -

అవ్యలీకేన వ్రతేన తపసా ఆదృతః సేవితస్సన్ భగవాన్ ఉత్పత్తివినాశాదిషడ్గుణైశ్వరశాలీ యదాహ – తద్వక్ష్యామీతి శేషః . అయం భావః. జీవస్యావిద్యయా మిథ్యారూపదేహసంబంధః ఈశ్వరస్య తు యోగమాయయాచిద్ఘన లీలావిగ్రహావిర్భావ ఇతి మహాన్విశేషః. ఆత్మస్తద్భజనాన్మోక్షోపపత్తిరితి. (4)

దీని భావము – జీవస్యావిద్యయా – జీవుని అజ్ఞానము చేత – మిథ్యా రూపదేహసంబంధః – అయథార్థమైన దేహ సంబంధము – ఈశ్వరస్యతు యోగ మాయయా – ఈశ్వరుని దైనన్నో యోగమాయచేత – చిద్ఘనలీలావిగ్రహావిర్భావ ఇతి మహాన్విశేషః – జ్ఞానఘనమైన లీలాస్వరూపము యొక్క ఆవిర్భావము అనునది గొప్పవిశేషము– అతస్తద్భజనాన్మోక్షోపపత్తిరితి – అందువలన అతనిని సేవించుట వలన మోక్షమునకు అర్హతఅని.(4)

స ఆది దేవో జగతాం పరో గురుః
స్వధిష్ణ్యమాస్థాయ సిసృక్షయైక్షత ।
తాంనాధ్యగచ్ఛద్ద్ృశమత్ర సంమతాం
ప్రపంచ నిర్మాణ విధిర్యయాభవేత్ - 5

**తా.** ఆదిదేవుడును, జగత్తులకు భక్తి రహస్యమును ఉపదేశించిన గురువును, అగు బ్రహ్మ దేవుడు, తన పద్మముపై అధిష్ఠించి, సృష్టిని ప్రారంభించు నిచ్ఛతో ఆలోచింపసాగెను. కాని ప్రపంచ నిర్మాణ విధానము దేనిచేకలుగునో, దానికి తగిన యోచన అతడు పొందలేకపోయెను.

**టీ** :- భగవద్భజనాదేవ తత్త్వజ్ఞానమిత్యేతత్ప్రపంచయిష్యన్ బ్రహ్మణో ఽ పి తత్ప్రసాదాదేవేతి దర్శయితుం ఇతిహాసమాహ – స ఇతి. పరో గురుః భక్తేరహస్యోపదేష్టా స్వధిష్ణ్యం పద్మమాస్థాయ అధిష్ఠానాన్వేషణాయ పూర్వం జలే నిమగ్నః పశ్చాత్ పరాత్పరావృత్య స్వధిష్ణ్యే స్థిత్వేత్యర్థః. ఐక్షత ఏతత్కథం స్రష్టవ్యమిత్యాలోచితవాన్ తాం దృశం ప్రజ్ఞాం అత్ర సృష్టి విషయే సమ్మతాం అవ్యభిచారిణీం యయా దృశా విధిః ప్రకారః.(5)

**టీ** – భగవద్భజనాదేవ తత్త్వజ్ఞాన మిత్యేతత్ప్రపంచయిష్యన్ – భగవానుని సేవించుట వలననే తత్త్వజ్ఞానము కలుగునను విషయమును వివరించుచు – బ్రహ్మణోఽ పి తత్త్వజ్ఞానం తత్ప్రసాదా దేవేతి దర్శయితుం ఇతిహాసం, 'సఇత్యాదినా' ఆహ – బ్రహ్మదేవునకు కూడ భగవానుని అనుగ్రహముననే తత్త్వజ్ఞానము కలిగినదను నంశమును చూపుచు, 'సఃఅను ఈ శ్లోకముతో ఒక ఇతిహాసమును చెప్పుచున్నాడు – పరోగురుః – భక్తి రహస్యమునుపదేశించిన వాడు – స్వాధిష్ణ్యం – పద్మమును – ఆస్థాయ – అధిష్ఠించి, ఇత్యర్థః – అని యర్థము. ఐక్షత – చూచెను. తత్కథం – అదియెట్లు? స్రష్టవ్యమిత్యాలోచితవాన్ – సృష్టింపదగినదోయని ఆలోచించెను. తాదృశం – ప్రజ్ఞామాత్ర సృష్టి విషయమున – సంమతాం – అవ్యభిచారిణియైన దానిని (సమానమైన దానిని) – విధిః – ప్రకారము (5)

స చింతయన్ ద్వ్యక్షర మేకదాంభ
స్యుపాశృణోద్విర్గదితం వచో విభుః ।
స్పర్శేషు యత్షోడశమేకవింశం
నిష్కించనానాం నృప యద్ధనం విదుః ॥ - 6

**తా.** వాగ్విభుడైన బ్రహ్మదేవుడు, సృష్టిరచన గూర్చి ఆలోచించుచుండగా ఒక తడవ నీటి యందు సమీపముననే రెండుసార్లు ఉచ్చరింపబడిన ఒకమాట అతడు వినెను – ఆమాట యేదనగా 'స్పర్శల'లో పదునాఱవ అక్షరము మరియు ఇరువదియొకటవ అక్షరము ఒకచోట కలిపి ఉచ్చరింపబడినట్టిది. "కాదయో మావసానాః స్పర్శాః" అని వైయాకరణసిద్ధాంతము అనగా 'క' నుండి 'మ' వఱకు గల అక్షరములు స్పర్శములు. ఇందు పదునాఱవది 'త'. ఇరువది యొకటవది 'ప', కలిసి 'తప', 'తప' అని రెండు సార్లు వినబడగా – అది దరిద్రులకు దొరికిన ధనము వలె, రాజా! అట్టి సూచనను విజ్ఞులు తెలియుదురు.

**టీ :-** స ఇతి. సృష్టిం చింతయన్ కదాచిత్ ద్వ్యక్షరం అంభసి ఉపాశృణోత్ ఉప సమీపే శ్రుతవాన్ తే అక్షరే దర్శయతి – కాదయో మావసానాః స్పర్శాః. తేషు యత్ షోడశం తకారః యచ్చైకవింశం పకారః వచసో నిర్దేశార్థం తదర్థమాహ – హే నృప నిష్కించనానాం త్యక్తధనానాం ధనం యద్విదుః. యేన తపోధనా ఇతి ప్రసిద్ధాః తచ్చ వీప్సా. ఆదరేణ సాధనవిధిరూపామశృణోదిత్యర్థః. (6)

**టీ.** సృష్టిం చింతయన్ కదాచిత్ – సృష్టిని గూర్చి చింతించుచు ఒకప్పుడు – ద్వక్షరం వచః – రెండక్షరములమాట – అంభసి – సముద్రమున – ఉపాశ్రుణోత్ – సమీపమున వినెను. – తే అక్షరే దర్శయతి – ఆ అక్షరములను చూపుచున్నాడు. – 'కాదయో మావసానాః స్పర్శాః' – 'క' నుండి 'మ' వఱకు గల అక్షరములు స్పర్శములు – తేషు – వానియందు – యత్షోడశం తకారః – పదునాఱవది తకారము – యచ్చైకవింశం పకారః ఇరువదియొకటవది 'ప' కారము – వచసో నిర్దేశార్థం తదర్థమాహ – ఆమాటయొక్క రూపమును సూచించుటకు దాని యర్థమును చెప్పుచున్నాడు – హేనృప ! – ఓ రాజా ! నిష్కించనానాం – ధనములేని వారికి – ధనం యద్విదుః – ఏది ధనమని తెలియుదురో– యేన తపోధనా ఇతి ప్రసిద్ధాః – దేనిచేత తపోధనులను ప్రసిద్ధికలదో – తచ్చ – అదియును – ద్విర్గదితం తపతపేతి – 'తప', 'తప' అని రెండు సార్లు చెప్పబడినది. లోణ్మధ్యమ పురుషైక వచనమ్ – 'తప' ధాతువు యొక్క లోట్ – మధ్యమపురుష – ఏక వచన రూపము. – తస్యవీప్సాం – దాని రెండుసార్లు ఉచ్చరించుటను – సాదర విధిరూపాం – ఆదరముతో కూడిన విధిరూపమైన దానినిగ – అశృణోదిత్యర్థః – వినెనని యర్థము.(6)

నిశమ్య తద్వక్తృ దిదృక్షయా దిశో
విలోక్య తత్రాన్యదపశ్యమానః ।
స్వధిష్ణ్య మాస్థాయ విమృశ్య తద్ధితం
తపస్యుపాదిష్ట ఇవాదధే మనః ॥ - 7

**తా.** ఇది విని బ్రహ్మదేవుడు దానిని చెప్పిన వక్తయెవరో చూడగోరి నలువైపు తిలకించి, అచట ఇతురునెవ్వనిని కానక, తన పద్మాసనమునఁగూర్చుండి, ఎవరి చేతనో తపస్సునుపదేశింపబడిన వాని వలె, అదియే తనకు మేలు చేయునదని విమర్శించుకొని మనస్సును తపస్సునందు లగ్నము చేసెను.

**టీ :-** నిశమ్యేతి. ఏవం నిశమ్య తస్య వచసో వక్తుః దిదృక్షయా తతః ప్రచలితస్సన్ దిశో విలోక్య. పునః స్వధిష్ణ్యమాస్థాయ కేనచిత్ప్రత్యక్షం నియుక్త ఇవ తచ్చాత్మనో హితం విహితం విమృశ్య తపసి మనోధృతవానిత్యర్థః. (7)

**టీ -** ఏవం నిశమ్య - ఇట్లువిని - తస్యవచసో వక్తుర్దిదృక్షయా - ఆమాటలు చెప్పినదెవరో చూడవలెననెడి కోరికతో - తతః ప్రచలతః సన్ -అప్పుడు కదలికగలవాడై - దిశోవిలోక్య - దెసలు పరికించి - పునః - మఱల - స్వధిష్ణ్యమాస్థాయ - తనపద్మాసనమునఁగూర్చుండి - కేనచిత్ప్రత్యక్షం నియుక్త ఇవ - ప్రత్యక్షముగ ఎవరిచేతనో నియోగింపబడిన వానివలె - తచ్చాత్మనః హితం విమృశ్య - ఆమాటవలన తనహితమునే విమర్శించుకొని - తపసి - తపస్సునందు - మనోధృతవానిత్యర్థః - తన మనస్సునుధారణ చేసెనని యర్థము. (7)

దివ్యం సహస్రాబ్ద మమోఘ దర్శనో
జితానిలాత్మా విజితోభయేంద్రియః ।
అతప్యత స్మాఖిల లోక తాపనం
తపస్తపీయాం స్తపతాం సమాహితః ॥ - 8

**తా.** వ్యర్థముకాని జ్ఞానము కలవాడైన బ్రహ్మ, వేయి దివ్య సంవత్సరములు, అఖిల లోకములను ప్రకాశింపజేయుటకు, ప్రాణమును, మనస్సును, జ్ఞాన కరేంద్రియములను వశీకరించుకొని, ఏకాగ్రచిత్తుడై తపస్సు చేసెను. అతడు తపస్సు చేయువారిలో అతిశయించిన తపస్వి.

**టీ :-** దివ్యమితి. తతశ్చ సః బ్రహ్మ అఖిలనాం లోకానాం తాపనం ప్రకాశకం. తపః అతప్యతస్మ కృతవాన్. తపతపేత్యస్య వచసో అర్థే అమోఘం దర్శనం యస్య. జితః అనిలః ఆత్మా మనశ్చ యేన విజితాని ఉభయేంద్రియాణి జ్ఞానకర్మాణి యేన

**టీ -** తతశ్చ సబ్రహ్మ - అప్పుడాబ్రహ్మ - అఖిలానాం లోకానాం - అన్ని లోకముల - తాపనం - ప్రకాశింపజేయు - తపో౨ తప్యతస్మ - తపస్సు చేసెను. తప తప ఇత్యేతస్య వచసః అర్థే-'తపింపుము తపింపుము' అనెడి ఆ మాటల అర్థమున- అమోఘం దర్శనం యస్య - వ్యర్థము కాని జ్ఞానమెవనికో (అట్టి బ్రహ్మ) - జితో౨ నిల ఆత్మామనశ్చయేన -



తపతాం తపశ్చరతాం మధ్యే తపయాన్ అతిశయేన తపస్వీ. (8)

ఎవనిచేత - ఆత్మ, మనస్సు జయింపబడినవో - విజితాన్యుభయేంద్రియాణి - జ్ఞాన, కర్మేంద్రియములెవనిచే జయింపబడినవో - తపతాం - తపస్సుచేయువారిలో - మధ్యే తపీయాన్ అతిశయేన తపస్వీ - వారి మధ్య అతిశయించిన తపస్సు గలవాడు.(8)

తస్మైస్వలోకం భగవాన్ సభాజితః
సందర్శయామాస పరం న యత్పరమ్ ।
వ్యపేత సంక్లేశ విమోహ సాధ్వసం
స్వదృష్టవద్భిర్విబుధైరభిష్టుతమ్ ॥ - 9

**తా.** భగవానుడు బ్రహ్మదేవుననుగ్రహించి, మిక్కిలి శ్రేష్ఠమైనదియు, అంతకన్న శ్రేష్ఠమైనది మఱియొకటి లేనిదియు, శోక మోహ భయాదులు లేనిదియును, తన వలెనే కన్పట్టు దేవతలచేత, లేక సత్పురుషులచేత కోరబడునదియునైన తన లోకమగు వైకుంఠమును అతనికి చూపెను.

**టీ** :- తస్మా ఇతి. తస్మై బ్రహ్మణే స్వలోకం వైకుంఠాఖ్యం పరం శ్రేష్ఠం న యత్పరం శ్రేష్ఠం న యత్పరం. యతః పరమముత్కృష్టం అన్యన్నాస్తి. తమేవ లోకమనువర్ణయతి - పంచభిః వ్యపేతాః. సంక్లేశాదయో యస్మాత్ స్వదృష్టవద్భిః సత్పుణ్యవద్భిః యద్వా స్వస్య దృష్టం దర్శనం అస్తియేషాం ఆత్మవద్భిరిత్యర్థః.(9)

**టీ** - తస్మై బ్రహ్మణే - ఆ బ్రహ్మకు- స్వలోకం - తనలోకమగు వైకుంఠమను పేరుగలదానిని - పరం - శ్రేష్ఠమైనది, న యత్పరం యతః పరముత్కృష్ట మన్యన్నాస్తి - దేనికంటెను ఉత్కృష్టమైనది మఱి యేదియును లేదో అట్టిది - తమేవలోకమనువర్ణయతి పంచభిః - ఐదు శ్లోకములచేత అదే లోకమును వర్ణించుచున్నాడు, వ్యపేతాః సంక్లేశాదయో యస్మాత్ - దేనినుండి శోకాదులు తొలగియుండునో - స్వదృష్టవద్భిః - పుణ్యపురుషులచేత - యద్వా - లేక - స్వస్యదృష్టం - ఎవరికి తనదర్శనము గలదో అట్టి వారికి - ఆత్మ వేత్తలకని యర్థము. (9)

ప్రవర్తతే యత్ర రజస్తమస్తయోః
సత్త్వంచ మిశ్రం న చ కాల విక్రమః ।
నయత్ర మాయా కిముతాపరే హరే
రనువ్రతా యత్ర సురాసురార్చితాః ॥ - 10

**తా.** ఎచట రజోగుణ తమోగుణములు గాని, లేదా వాని సత్త్వగుణమిశ్రమము గాని ప్రవర్తింపవో, ఎచట కాలగమనము ఉండదో, ఎచట మాయగాని, తత్సంబంధమగు ఇతరములు గాని ఉండవో, ఎచట దేవతలచేతను, రాక్షసుల చేతను పూజింపబడు భగవానుని పార్షదులు మాత్రము నివసించుచుందురో.

**టీ** :- ప్రవర్తత ఇతి. తయోరితి తాభ్యాం మిశ్రం సత్త్వం చ న ప్రవర్తతే కింతు శుద్ధమేవ సత్త్వం. కాలవిక్రమః నాశః. అపరే రాగలోభాదయో న సంతీతి కిముక్తవ్యం. అనువ్రతాః పార్షదాః. (10)

శ్యామా వదాతాః శతపత్ర లోచనాః
పిశంగవస్త్రాః సురుచః సుపేశసః ।
సర్వే చతుర్బాహవ ఉన్మిషన్మణి
ప్రవేక నిష్కాభరణాః సువర్చసః ॥ -11

ప్రవాల వైడూర్య మృణాల వర్చసః ।
పరిస్ఫురత్కుండల మౌళి మాలినః ॥
(అర్థ శ్లోకము కనుక సంఖ్య ఈయబడలేదు)

**టీ** :- శ్యావేతి. శ్యామాశ్చ తే అవదాతాః. ఉజ్జ్వలాశ్చ పద్మనేత్రాశ్చ పీతాంబరాస్సురుచః అతికమనీయాః సుపేశసః అతిసుకుమారాః. ఉన్మిషంత ఇవ ప్రభావంతో మణిప్రవేకా మణ్యుత్తమాః యేషు తాని. నిష్కాని పద్మాని పతాకాని ఆభరణాని యేషాం తే సువర్చసః అతితేజస్వినః. (11)

**టీ.** తయోః తాభ్యాం మిశ్రం సత్త్వంచ నప్రవర్తతే – వానితో కలసిన సత్త్వగుణము కూడ ఎచట ప్రవర్తింపదో – కింతుశుద్ధమేవ సత్త్వం – కాని అచ్చమైన సత్త్వగుణము మాత్రమే ఉండును. – కాల విక్రమము – నాశము – అపరే – రాగము, లోభము మొదలగునవి – నసంతీతి కిమువక్తవ్యమ్ – ఉండవనినచోనిక చెప్పదగినదేమి? అనువ్రతాః – పార్షదులు.(10)

**తా.** అచట నున్నవారు శ్యామల వర్ణమున ఉజ్జ్వలముగ ప్రకాశించుచుండువారు, పద్మపత్రముల వంటి నేత్రములు గలవారు, పీతాంబరములు ధరించువారు, మిక్కిలి కమనీయ మైన రూపము గలవారు, అతికోమలమైన వారు, అందఱును నాలుగేసి భుజములు గలవారు, ప్రకాశించుచున్న ఉత్తమమైన మణులతో గూడిన, దీనారములతో కూర్పబడిన ఆభరణములను ధరించువారు – మిక్కిలి తేజస్సుగలవారును

**తా.** పగడములవలె, వైడూర్యములవలె, తామరలవలె వర్చస్సులు గలవారు, అంతటను మెఱయుచున్న కుండలములును, శిరోభాగములయందు మాలలు గలవారును

**టీ.** శ్యామాశ్చతే అవదా ఉజ్జ్వలాశ్చ – శ్యామల వర్ణమున ప్రకాశించునవినైన శరీరములు గలవారు – పద్మనేత్రాః – తామర పూరెక్కలవంటి కన్నులు గలవారు – పీతాంబరాః – పచ్చని వస్త్రములు ధరించినవారు – సురుచః – మిక్కిలి కమనీయమైన వారు – సుపేశసః – అతి సుకుమారులు – ఉన్మిషంతఇవ – మెఱయుచున్నవి – మణి ప్రవేకాః – ఉత్తమమైన మణులు – యేషు – వేనియందు గలవో – తాని నిష్కాణి – అట్టి బంగారు దీనారములు– పదకానిచ – ఆభరణములును, యేషాంతే – ఎవరికి గలవో వారు – సువర్చసః – అతితేజస్సులు – ప్రవాలాదివద్వర్చః – పగడములవంటి కాంతి – యేషాంతే – ఎవరికి

భ్రాజిష్ణుభిర్యః పరితో విరాజతే
లసద్విమానా వలిభిర్మహాత్మనామ్ ।
విద్యోత మానః ప్రమదోత్తమాద్యుభిః
సవిద్యుదభ్రావలిభిర్యథా నభః ॥ -12

**టీ :-** ప్రవాలేతి. ప్రవాలాదివద్వర్చః వర్ణో యేషాం పరిస్ఫురంతి కుండలాని మాలయో మాలాశ్చ సంతి యేషాం పార్షదాననువర్ణ్య పునరపి లోకమనువర్ణయతి – భ్రాజిష్ణుభిః దేదీప్యమానాభిః. (12)

శ్రీర్యత్ర రూపిణ్యురు గాయపాదయోః
కరోతి మానం బహుధా విభూతిభిః ।
ప్రేంఖం శ్రితా యా కుసుమాకరానుగై
ర్విగీయమానా ప్రియకర్మ గాయతీ ॥ - 13

కలదో వారు – పరితః – చుట్టును – స్ఫురంతి – తళుకులీనెడు – కుండలాని – చెవులకు ధరించు ఆభరణములు – మౌలయః – కిరీటములు – మాలాశ్చ – వివిధములైన హారములు– సంతియేషాంతే – ఎవరికి గలవో వారు (11)

**తా.** మెఱుపులతో కూడిన మేఘముల సమూహములతో ఆకాశమెట్లు ప్రకాశించుచుండునో, అచటి ఉత్తమ స్త్రీల కాంతులతో వైకుంఠమట్లు దేదీప్యమానముగ వెలుగుచుండును. మహాత్ముల ఎత్తైన సౌధములతో కూడ అంతటను కాంతులు విరజిమ్ముచుండును.

**టీ.** – పార్షదా ననువర్ణ్య పునరపి లోకమనువర్ణయతి – పార్షదులనువర్ణించి మఱల వైకుంఠమును వర్ణించుచున్నాడు– భ్రాజిష్ణుభిః – దేదీప్యముగ ప్రకాశించుచున్న (మహాత్ముల సౌధ సమూహములు) ప్రమదోత్తమానాం – ఉత్తమస్త్రీల యొక్క – దివః కాంత్యః తాభిర్విద్యోతమానః – ఆకాశమునందలి కాంతులచే ప్రకాశించుచున్నది – సహ విద్యుద్భిర్వర్తమానాః – మెఱుపులతోకూడియున్నవి – సవిద్యుతః తాభిరభ్రావలిభిః – విద్యుత్తులతో కూడిన మేఘములతోడి (ఆకాశము) తత్ర – అచట – విద్యుతఇవస్త్రియః – మెఱుపులవలె స్త్రీలు – అభ్రపంక్తయ ఇవ విమానాని – మేఘసమూహములవలె సౌధములు – నభఇవలోకః – ఆకాశమువలె ఆ వైకుంఠలోకము. (12)

**తా.** సంపద, అచట మూర్తిమతియై (లక్ష్మీరూపమున) అసాధారణుడైన విష్ణుభగవానుని పాదములకు అనేక విధములైన విభవములచేత పూజించుచుండును. వసంతర్తువునాశ్రయించి యుండు భ్రమరములతో కూడ తన ప్రియుడగు విష్ణుని లీలలను, అటునిటు తిరుగుటనాశ్రయించి పాడుచుండును. అనునట్లుండును.



టీ :- విద్యోతమాన ఇతి. ప్రమదోత్తమానాం దివః కాంతయః తాభిః విద్యోతమానః సహవిద్యుద్భిః వర్తమానాస్సవిద్యుతః తాభిః అభ్రావలిభిః తత్ర విద్యుత ఇవ స్త్రియః అభ్రపఙ్క్తయ ఇవ విమానాని నభ ఇవ లోకః శ్రీశ్చ సంపత్ యత్ర రూపిణీ మూర్తిమతీ మానం పూజాం విభూతిభిః నానావిభవైః. ప్రేంఖేతి. ప్రేంఖం ఆందోలనం శ్రితా కుసుమాకరో వసంతః తస్యానుగాః భ్రమరాః తైర్విగీయమానా స్వయం హరేః ప్రియస్య కర్మ గాయంతీ భవతి. (13)

**టీ –** శ్రీః – సంపద – రూపిణీ – మూర్తిమతి (యై) – మానం – పూజను – విభూతిభిః – అనేకములైన విభవములతో – ప్రేంఖం – ఆందోలం – అటునిటుకదలుటను – ఆశ్రితా – ఆశ్రయించినదై – కుసుమాకరః – వసంతము – తస్యానుగాః – దానినాశ్రయించి తిరుగుతుమ్మెదలు – తైః వివిధం గీయమానా – వానిచే వివిధములు పాడబడగా – స్వయంతు–తాను – ప్రియస్య – హరి యొక్క – కర్మ – లీలను – గాయతీవ – పాడుచున్నది అనునట్లు – భవతి – అగును. (13)

దదర్శ తత్రాఖిల సాత్త్వతాం పతిం
శ్రియః పతిం యజ్ఞపతిం జగత్పతిమ్ ।
సునందనంద ప్రబలార్హణాదిభిః
స్వపార్షదముఖ్యైః పరిసేవితం విభుమ్ ॥ - 14

**తా.** బ్రహ్మదేవుడచ్చట,– సమస్తభక్తుల రక్షకుడు, లక్ష్మీదేవికి భర్త, యజ్ఞములకు అధిపతి, జగత్తులకీశ్వరుడునైన విష్ణుభగవానుని దర్శించెను. సునందుడు, నందుడు, ప్రబలుడు, అర్హణుడు మొదలగు పార్షదముఖ్యులు అతనిని సేవించుచుండిరి. వారితో సేవింపబడుచున్న భగవానుని బ్రహ్మ దర్శించెను.

**టీ** :- సునందేతి. య ఏవం భూతో లోకః తత్ర తస్మిన్ పరిసేవితం ఆదరేణ పూజ్యమానం. (14)

**టీ.** య ఏవంభూతో లోకస్తత్ర – ఈవిధమైన ఆలోకమునందు – (విష్ణుని బ్రహ్మ చూచెను) (14)

భృత్యప్రసాదాభిముఖం దృగాసవం
ప్రసన్నహాసారుణ లోచనాననమ్ ।
కిరీటినం కుండలినం చతుర్భుజం
పీతాంబరం వక్షసి లక్షితం శ్రియా ॥ - 15

**తా.** సేవలకులను అనుగ్రహించుటకు అభిముఖుడును, చూపులకు పూఁదేనెయు, వికసించిన నవ్వుగల ఎఱ్ఱని కన్నుల మోమువాడును, కిరీటము, కుండలములు ధరించి యున్నవాడును, నాలుగు భుజలములు గలవాడును, పచ్చని పట్టువస్త్రము ధరించినవాడును, వక్షఃస్థలము నందున్న లక్ష్మీదేవితో చూడబడువాడును (అయిన విష్ణుని చూచెను).

**టీ :-** భృత్యానాం ప్రసాదేన అభిముఖం. దృగేవ ఆసవ ఇతి ద్రష్టౄణాం హర్షకరీ యస్య తం ప్రసన్నహాసం అరుణలోచనం చ ఆసనం యస్య. కిరీటినమితి. వక్షసి స్థితయా శ్రియా లక్షితం చ అలంకృతమిత్యర్థః. (15)

**టీ.** భృత్యానాం ప్రసాదేऽభిముఖమ్ – సేవకులననుగ్రహించుటయందు ఎదురుగ ముఖముగలవానిని – దృగేవ ఆసవఇవ – చూపే ఆసవమువలె – హర్షకారీయస్య తమ్ – సంతోషము కలిగించురీతిగ ఎవనికి కలదో అట్టి వానిని – ప్రసన్నహాసమరుణలోచనం యస్య – నిర్మలమైన నవ్వు ఎఱ్ఱని చూపు ఎవనికి గలవో (అట్టి వానిని) – వక్షసి స్థితయా శ్రియా లక్షితమ్ – వక్షఃస్థలమునగల లక్ష్మీదేవితో చూడబడువానిని – అలంకృతమిత్యర్థః – అలంకరింపబడియున్న వానిని అనియర్థము. (15)

అర్హ్యర్హణీయాసన మాస్థితం పరం<br>
వృతం చతుః షోడశ పంచశక్తిభిః ।<br>
యుక్తం భగైః స్వైరితరత్ర చాధ్రువైః<br>
స్వఏవ ధామన్ రమమాణ మీశ్వరమ్ ॥ **- 16**

**తా.** పూజ్యము, పరమశ్రేష్ఠమునైన సింహాసనమునందు ఆసీనుడైయున్న వానిని, నాలుగు, (ప్రకృతి, పురుష, మహత్ అహంకారములు) పదునారు, (ఏకాదశేంద్రియములు, పంచభూతములు), ఐదు, (పంచతన్మాత్రలు) కలిసి ఇరువదియైదు శక్తులతో ఆవరింపబడియున్నవానిని, అతని వద్ద తప్ప ఇతరత్ర నిత్యముగనుండని ఐశ్వర్యము, ధర్మము, కీర్తి, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అను ఆఱు సంపత్తులతో కూడియున్నవానిని, తన ధామముననే ఆనందించుచుండు ప్రభువును – (చూచెను)

**టీ :-** అర్హ్యర్హణీయం వరిష్ఠం సింహాసనం చతస్రః ప్రకృతి పురుషమహదహంకారరూపాః షోడశ ఏకాదశేంద్రియ మహాభూతాఖ్యాః. పంచతన్మాత్రరూపాః యాశ్శక్తయః తాభిర్వృతం యుక్తమితి. స్వైర్భగైస్స్వాభావికైరైశ్వర్యాదిభిరితరత్రాయోగిభిః ఆగంతుకైరసాధారణైరిత్యర్థః. ఏవం సత్యపి స్వఏవ ధామన్ స్వస్వరూపఏవ రమమాణం అత ఏవేశ్వరం. (16)

**టీ.** అర్హ్యర్హణీయం – వరిష్ఠమైనది యగు సింహాసనము – చతస్రః – ప్రకృతి పురుష మహదహంకార రూపములు – షోడశ – ఏకాదశేంద్రియములు, పంచమహాభూతములు, అను పేరు గలవి – పంచ – ఐదు తన్మాత్ర రూపములు, – యాః శక్తయః తాభిర్వృతం – ఏ శక్తులు గలవో వానితో కూడియున్నవానిని – స్వైర్భగైః – స్వాభివికములైన ఐశ్వర్యాదులతో – ఇతరత్ర – యోగులయందు – అధ్రువైః – నశ్వరములగువానితో – సాధారణైరిత్యర్థః – సాధారణములైన వానితో అనియర్థము – ఏవంసత్యపి –ఇటులుండగకూడ – స్వఏవధామన్ – స్వస్థానము (ననే) – స్వస్వరూపఏవ – తనస్వరూపముతోడనే – రమమాణమ్ – ఆనందించుచున్నవానిని – అత ఏవేశ్వరమ్ – అందువలననే ప్రభువైన వానిని (చూచెను)16

తద్దర్శనాహ్లాద పరిప్లుతాంతరే ।
హృష్యత్తనుః ప్రేమభరాశ్రులోచనః ।
ననామ పాదాంబుజమస్య విశ్వసృ ।
గ్యత్పారమహంస్యేన పథాధిగమ్యతే ॥ - 17

**తా.** భగవానుని దర్శించిన ఆనందముతో ఉబ్బితబ్బిబ్బైన మనస్సుగలవాడై, శరీరమున పులకరింపుగలవాడై, ప్రేమతో నిండిపోయిన ఆనందాశ్రువులతోడి కన్నులు గలవాడైన ఆ విశ్వసృష్టికర్తయగు బ్రహ్మదేవుడు, అతని పాద పద్మములకు నమస్కరించెను. దానితో అతడు జ్ఞానమార్గమును పొందును.

**టీ.** తస్య దర్శనేన – య ఆహ్లాదస్తేన – పరిప్లుతం – వ్యాప్తమంతరమంతః కరణం యస్య– హృష్యంతీ – రోమాంచిత తనుర్యస్య – ప్రేమ భరేణాశ్రూణి లోచనేషు యస్య – విశ్వసృక్ బ్రహ్మ పారమహంస్యేన పథా జ్ఞానమార్గేణా. (17)

**టీ.** తస్య దర్శనేన – అతని (విష్ణుని) చూచుటచేత – య ఆహ్లాదస్తేన – ఏ ఆనందము కలిగెనో దాని చేత – పరిప్లుతం – వ్యాప్తమైన – ఆంతరం – అంతః కరణము – యస్య–ఎవనికో – హృష్యంతీ – రోమాంచితమైన – తనుర్యస్య – శరీరమెవనికో – ప్రేమ భరేణ అశ్రూణి లోచనేషు యస్య – ప్రేమతోనిండిన కన్నీటి కన్నులు ఎవనికో – విశ్వసృక్ – బ్రహ్మ పారమహంస్యేన పథా – జ్ఞానమార్గము చేత – (17)

తం ప్రీయమాణం సముపస్థితం తదా
ప్రజావిసర్గే నిజశాసనార్హణమ్ ।
బభాష ఈషత్స్మిత శోచిషా గిరా
ప్రియః ప్రియం ప్రీతమనాః కరేస్పృశన్ ॥ - 18

**తా.** ప్రజాసృష్టియందు తన ఆజ్ఞానుసారము ప్రవర్తించువాడగు బ్రహ్మదేవుడు తన దర్శనమున మిక్కిలి ప్రీతిఁజెంది సుఖాసీనుడు కాగా, భగవానుడు, చిన్ననవ్వుతో దీప్తిమంతముగ, తన మనస్సంతుష్టి వలన వెల్వడు వాక్కుతో, తనకు ప్రీతిపాత్రుడైన అతనితో, (బ్రహ్మతో) ప్రేమతో అతని చేతియందు స్పృశించుచు, మాట్లాడెను.

**టీ**:- తమితి. తం బ్రహ్మాణం ప్రియః భగవాన్ బభాషే ప్రజావిసర్గే కార్యే నిజశాసనార్హణం స్వనియోగార్హం ప్రజావిసర్గే సముపస్థితమిత్యన్వయః. ఈషత్ స్మితేన శోచిః దీప్తిః శోభాయస్యాస్తయా గిరా. (18)

**టీ.** తం – బ్రహ్మనుగూర్చి – భగవాన్ బభాషే – విష్ణుదేవుడు మాట్లాడెను – ప్రజావిసర్గే – ప్రజాసృష్టియందు – కార్యే – చేయదగిన దానియందు – నిజశాసనార్హణం – తనచే నియోగింపబడుటకు అర్హుడగువానిని – ప్రజావిసర్గే సముపస్థిత మితివా అన్వయః – ప్రజాసృష్టియందు సిద్ధపడియున్నవానిని, అనియైనను అన్వయము చేయవచ్చును. ఈషత్ స్మితేన – చిన్న నవ్వుతో – శోచిః – దీప్తి – శోభ – యస్యాస్తయా గిరా – దేనికో అట్టి వాక్కుతో(18)

**శ్రీభగవానువాచ**

త్వయాహం తోషితః సమ్య
గ్వేదగర్భ సిసృక్షయా ।
చిరంభూతేన తపసా
దుస్తోషః కూటయోగినామ్. - 19

**టీ :–** త్వయేతి. హే వేదగర్భేతి సంబోధయన్ వేదాన్ సంచారయతి – సిసృక్షయా చిరం ధృతేన తపసా. అహం సద్ర్యక్సమ్యక్ తోషితః దుష్తోషః తోషయితుమశక్యః.(19)

**శ్రీభగవానుడు పలికెను.**

**తా.** వేదము గర్భమునందు గల ఓ బ్రహ్మదేవా! సృష్టిచేయుసంకల్పముతో చిరకాలము తపస్సు చేసిన నీ పట్టుదలచే మిక్కిలి సంతోషించితిని, కపటయోగుల తపస్సుచే ఈ సంతోషము సాధ్యపడదు గదా !

**టీ.** సిసృక్షయా హేతునా – సృష్టిచేయవలయుననెడి కోరిక కారణముగా – చిరం– చిరకాలము (సంభృతముగ) – తపసాఽ హం – నీవు చేసిన తపస్సుతో నేను – సమ్యక్ తోషితః – మిక్కిలి సంతోషింపజేయబడితిని – దుస్తోషః–సంతోషించుటకు శక్యము కాని వాడు(19)

వరం వరయ భద్రంతే
వరేశం మా ఽ భి వాంఛితమ్ ।
బ్రహ్మఞ్ఛ్రేయః పరిశ్రామః
పుంసో మద్దర్శనావధిః - 20

**టీ :–** వరమితి. మామాం శ్రేయసాం ఫలానాం పరిశ్రామః సాధనప్రయాసః మద్దర్శనమేవావధిర్యస్య తథా అతో ఽ ధికం శ్రమఫలం నాస్తీత్యర్థః. పరిశ్రామ ఇత్యత్ర దీర్ఘత్వం ఛాందసం. (20)

**తా.** బ్రహ్మదేవా ! నీకు శుభమగుగాక, పురుషులకు నా దర్శనమే అవధిగా గల శ్రేయః ఫలదాయకమగు పరిశ్రమ చేసిన వాడవైతివి. వరములకు ప్రభువునగు నన్ను, నీకు కావలసిన వరమును కోరుకొనుము.

**టీ.** మా ఇతిమామ్ – 'మా' అనునది అస్మచ్ఛబ్ద ద్వితీయైక వచనము. 'నన్ను' – శ్రేయసాంఫలానాం – శ్రేయస్సులు కలిగించు ఫలముల యొక్క – పరిశ్రామః – సాధన ప్రయాస కలవాడవు – మమ దర్శనావధిర్యస్య స తథా – నాదర్శనమే పర్యాప్తిగాగల వాడెవడో వాడట్లు చెప్పబడెను. – అతోఽ ధికం తు పునః ఫలం నాస్తీత్యర్థః – దానికంటె అధికమైన ఫలము మఱి లేదని యర్థము. **(20)**

మనీషితాను భావో ऽ యం
మమ లోకావలోకనమ్ ।
యదుపశ్రుత్య రహసి
చకర్థ పరమం తపః ॥ - 21

**తా.** ఇచ్ఛానుసారముగనే ఈ నాలోకమును దర్శించు భాగ్యము నీకు కలిగినది. ఏలయన ఏకాంతమునందు మాత్రమే "తప, తప" అను నా ఆదేశమును విని గొప్ప తపస్సు చేసితివి.

**టీ** :- ఏతచ్చ మత్కృపయా త్వయా ప్రాప్తమిత్యాహ – మనీషితేతి మనీషితం ఇచ్ఛా తుభ్యమిదం దాతవ్యమితి యా మమేచ్ఛా తస్యానుభావో ऽ యం కో ऽ సౌ? తమాహ మమ లోకస్యావలోకనం యత్తత్. న చేదం మయైవ తపోబలేన ప్రాప్తమితి స్వాతంత్ర్యం మన్యస్వ త్వత్ప్రవృత్తేరపి మత్కృవృత్తేరపి మత్కృతత్వాదిత్యాహ – రహసి తపతపేతి యద్వచ ఉపశ్రుత్య పరమం తపః చకర్థ కృతవానసి.(21)

**టీ.** ఏతచ్చ మత్కృపయైవ త్వయా ప్రాప్తమిత్యాహ – ఇదియును నాకృపచేతనే నీకు ప్రాప్తించినదని చెప్పుచున్నాడు – మనీషితం – ఇచ్ఛ– తుభ్యమిదం దాతవ్యమితి యామమేచ్ఛా తస్యానుభావోऽ యం – ఇది నీకీయవలయుననెడి నా ఇచ్ఛననుసరించినదే – కోऽ సౌ తమాహ – అది యేదో చెప్పుచున్నాడు – మమలోకస్యావలోకనం యత్ – నాలోకమును చూచుట ఏది కలదో – నచేదం మయైవ తపోబలేన ప్రాప్తమితి స్వాతంత్ర్యంమన్యస్వ – "నా తపోబలము చేతనే ఇది ప్రాప్తించినదని, నీ స్వాతంత్ర్యమును భావింపకుము. – తత్ ప్రవృత్తేరపి మత్కృత త్వాదిత్యాహ – తపస్సు యొక్క ప్రవృత్తి అది యైనను, నేను సఫలము చేయుట చేతనే ఏతల్లోకాలోకనము సంభవమైనదని చెప్పుచున్నాడు – రహసి – ఏకాంత మందు – "తప తపేతి" – "తపింపుము తపింపుము" అని – యద్వచః ఉపశ్రుత్య – ఏమాటవిని – పరమం తపశ్చకర్థ – గొప్ప తపస్సు చేసితివో– (21)

ప్రత్యాదిష్టం మయా తత్ర
త్వయి కర్మవిమోహితే ।
తపోయే హృదయం సాక్షా
దాత్మాऽ హం తపసోऽ నఘ ॥ - 22

**తా.** నీవు సృష్టినారంభించుటకు ఏమిచేయవలయునో తెలియక కర్మ విమోహితుడవైయున్న సమయమున నేనే నిన్ను తపస్సు చేయుమని ఆదేశించితిని – తపస్సు నా హృదయమే. తపస్సుకు ఆత్మను నేను.

**టీ :-** ప్రత్యాదిష్టమితి. తద్వచః త్వాం ప్రతి మయైవ ఆదిష్టముపదిష్టం కదా? తత్ర తథా సృష్ట్యారంభే త్వయి కర్మణి కార్యే విమోహితే సతి కించ తపోనామ మయైవ శక్తిరిత్యాహ - తపో మే హృదయం అంతరంగశక్తిః ఆత్మా స్వరూపం. శ్రు. 'యస్య జ్ఞానమయం తప' ఇతి శ్రుతేః. (22)

**టీ.** తదపి త్వాంప్రతి మయైవాదిష్టముపదిష్టమ్ - అదియును నిన్నుగూర్చి నాచేతనే ఉపదేశింపబడినది - కదా? - ఎప్పుడు? - తత్ర తదా సృష్ట్యారంభే త్వయి కర్మణి కార్యేఽర్థే విమోహితేసతి - అప్పుడచట సృష్ట్యారంభ కాలమున నీవు ఏమిచేయవలెనో తోచని స్థితిలో నున్నప్పుడు - (రహసి - ఏకాంతమందు) కించ - మరియు - తపోనామ మమైవ శక్తిరిత్యాహ - తపస్సనగా నా శక్తియేయని చెప్పుచున్నాడు - తపో మే హృదయం - తపస్సు నా అంతరంగ శక్తి - ఆత్మా - స్వరూపము. 'యస్య జ్ఞానమయం తపః' ఇతి శ్రుతేః - 'తపస్సు ఎవని జ్ఞాన స్వరూపమో' అని శ్రుతి వాక్యము. (22)

సృజామి తపసైవేదం
గ్రసామి తపసా పునః ।
బిభర్మి తపసా విశ్వం
వీర్యం మే దుశ్చరం తపః ॥ - 23

**తా.** తపస్సు చేతనే ఈ ప్రపంచము నంతయును సృష్టించుచున్నాను. తపస్సు చేతనే దీనినంతయును నాలో లీనము చేసికొనుచున్నాను. తపస్సు చేతనే ఈ విశ్వమునంతటిని పోషణ చేయుచున్నాను. తపస్సే నా దుర్లంఘ్యమైన శక్తి -

**టీ :-** సృజామీతి. గ్రసామి సంహరామి. బిభర్మి పాలయామి వీర్యం శక్తిః. (23)

**టీ.** గ్రసామి - సంహరించెదను - బిభర్మి - పాలించెదను - వీర్యం - శక్తి - (23)

## బ్రహ్మోవాచ

భగవన్సర్వభూతానా
మధ్యక్షో ఽవస్థితో గుహామ్ ।
వేదహ్యప్రతిరుద్ధేన
ప్రజ్ఞానేన చికీర్షితమ్ ॥ - 24

## బ్రహ్మ యిట్లనెను

**తా.** భగవన్ ! సర్వప్రాణులకును అధిష్ఠాతవై వారి బుద్ధి గుహలో నివసింతువు. అప్రతిహతమైన జ్ఞానముచే నేనేమి చేయగోరుచున్నానో తెలిసి కొందువు.

**టీ** :- అధ్యక్షః అధిష్ఠాతా గుహాం గుహాయాం బుద్ధౌ అవస్థితః యద్యపి వేద తథాపీత్యుత్తరేణాన్వయః.(24)

**టీ.** అధ్యక్షః - అధిష్ఠాత - గుహాం - గుహయందు - బుద్ధియందు ఉందువు.(24)

తథాపి నాథమానస్య
నాథనాథయ నాథితమ్ ।
పరావరే యథారూపే
జానీయాం తే త్వరూపిణః ॥ - 25

**తా.** ప్రభూ ! యాచించున్న నాకు నా కోరికనొకదానిని అనుగ్రహింపుము. నీ యొక్క అరూపత్వమునకు సంబంధించిన సూక్ష్మస్థూలరూపములను నాకు తెలియునట్లు చేయుము. (అరూపుడవైన నీ సూక్ష్మ (నిర్గుణ), స్థూల (సగుణ)) రూపములను నాకెఱింగింపుము.

**టీ** :- తథేతి. నాథమానస్య యాచమానస్య ఉపతప్యమానస్యేతి వా. హే నాథ నాథయ ఆశంసయ ప్రయచ్ఛ. నాథితం యాచితం "నాధృనాధృయాచ్ఞోపతాపైశ్వర్యాశీర్షు" నాథితమేవాహ - పరం సూక్ష్మం అపరం స్థూలం చ తే రూపం యథా జానీయాం.(25)

**టీ.** నాథమానస్య - అడుగుచున్న - లేక ఉపతప్యమానుడనగుచున్న - హేనాథ - (ప్రభూ) నాథయ - అనుగ్రహింపుము - ఇమ్ము - నాథితం - యాచితమైన దానిని - "నాధృ, నాధృ యాఇక్నోపతాపైశ్చర్యాశీః ఘ" (నిఘంటువు) - నాథిత మేవాహ - యాచించిన దేమియను దానినిఁజెప్పుచున్నాడు. - పరం - సూక్ష్మరూపం - అపరం స్థూలమైన నీ రూపము - యథాజానీయాం - ఎట్లు తెలసికొందునో (నాథయ) (25)

యథాత్మమాయా యోగేన
నానాశక్త్యుపబృంహితమ్ ।
విలుంపన్విసృజన్ గృహ్ణ
న్బిభ్రదాత్మానమాత్మనా ॥ - 26

**తా.** నీ మాయను కలుపుకొని, నీచేత నిన్నే వివిధ శక్తులతో విస్తరించియున్న ఈ విశ్వముగ మలచి, దీనిని సంహరించుచు, పుట్టించుచు, పాలించుచు, బ్రహ్మాదిరూపముల స్వీకరించుచు ఎట్లు క్రీడించుచున్నావు?

**టీ** :- యథేతి. యథా చ త్వం క్రీడసి తథా తద్విషయాం మనీషాం మయి ధేహీత్యుత్తరేణాన్వయః. నానాశక్త్యుపబృంహితం

**టీ.** యథాచత్వం క్రీడసి తథా తద్విషయాం మనీషాం మయిధేహీత్యుత్తరేణాన్వయః - "నీవెట్లు క్రీడించుచున్నావో దానిని తెలిసికొను బుద్ధిని నాయందు నిలుపుము" అని రాబోవు



విశ్వం విలుంపన్ సంహరన్ విసృజన్ వివిధం సృజన్ బిభ్రత్ పాలయన్ ఆత్మనా స్వయమేవాత్మానం బ్రహ్మాదిరూపం గృహ్ణన్.(26)

శ్లోకము (ల) తో అన్వయము – నానాశక్త్యుపబృంహితం – విశ్వము – విలుంపన్ – సంహరింపుచు, వివిధం (నానా ప్రకారములైన వానిని) – సృజన్ – పుట్టించుచు – బిభ్రత్ – పాలించుచు – ఆత్మనా – నీచేతనే – ఆత్మానం – నిన్ను – బ్రహ్మాదిరూపం గృహ్ణన్ – బ్రహ్మాదిరూపములను స్వీకరించుచు – (క్రీడింతువు). (26)

క్రీడస్యమోఘ సంకల్ప
ఊర్ణ నాభిర్యథోర్ణుతే ।
తథా తద్విషయాం ధేహి
మనీషాంమయి మాధవ ॥ -27

**తా.** ఓ మాధవా! వ్యర్థముకాని సంకల్పము గలవాడవై, సాలెపురుగు ఏ విధముగ తన అల్లిక సాగించునో ఆ విధముగ సృష్టిరచన చేయుచు నీ విశ్వమునందెట్లు క్రీడింతువో దానిని తెలసికొనగల బుద్ధిని నాయందునిలుపుము.

**టీ** :- క్రీడసీతి. ఊర్ణుతే తంతుభిరాత్మానం ఆచ్ఛాదయతి.(27)

**టీ.** ఊర్ణుతే – తంతువుల చేత తనను తాను ఆచ్ఛాదించుకొనును. (27)

భగవచ్ఛిక్షితమహం
కరవాణి హ్యతంద్రితః ।
నేహ మానః ప్రజాసర్గం
బధ్యేయం యదనుగ్రహాత్ ॥ -28

**తా.** భగవానుడవగు నీ శిక్షణ పొందిన వాడనై అలసత్వము లేకుండగ, ప్రజా సృష్టిని చేయుదును. కాని సృష్టి చేయు ప్రయత్నమునందుండగ, మీ అనుగ్రహమున, నేను అహంకారాది బద్ధుడను కాకుండ నుండవలెను.

**టీ** :- తత్కిం సృష్టేరుద్విగ్న ఏవ తత్త్వజ్ఞానం ప్రార్థయసే? నేత్యాహ – భగవదితి. భగవతా త్వయా శిక్షితమనుశిష్టం అతంద్రితః అనలసస్సన్ కరిష్యామి తర్హి కిమనేన తత్త్వజ్ఞానేన? తత్రాహ – యస్మాదేవం భూతాత్తవానుగ్రహాత్ప్రజాసర్గమీహమానః కుర్వన్నపి అహంకారాభిర్బద్ధో న భవేయమితి. (28)

**టీ.** తత్కిం సృష్టేరుద్విగ్న ఏవ తత్త్వజ్ఞానం ప్రార్థయసే – నేత్యాహ, "ఇది యేమి?" సృష్టి కార్యమునందు ఉద్విగ్నుడవైయున్న నీవు తత్త్వజ్ఞానము కొఱకు ప్రార్థించుచున్నావు? కాదని చెప్పుచున్నాడు – భగవతా – నీచేత – శిక్షితం – శాసనమును – అతంద్రితః సన్ – అలసత్వము లేనివాడనై – కరవాణి – చేసెదను – తర్హి – అయినచో – కిమనేన తత్త్వజ్ఞానేన – ఈ తత్త్వజ్ఞానమెందులకు – తత్రాహ – కారణముచెప్పుచున్నాడు – తస్మాదేవం భూతాత్

యావత్సఖా సఖ్యురివేశ తే కృతః
ప్రజావిసర్గే విభజామి భో జనమ్ ।
అవిక్లవస్తే పరికర్మణి స్థితే
మామే సమున్నద్ధమదో ౽ జమానినః ॥ - 29

**టీ** :- అవశ్యం చ మదో భవితా స చ కించిత్కాలం మాభూదితి ప్రార్థయతే – యావదితి. భో ఈశ. తే త్వయా లౌకికస్య సఖ్యుస్సఖే నాహంకృతః. కరస్పర్శాదినా సమన్వితేన సమ్మానితస్సన్ ప్రజాసర్గరూపే తవ పరికర్మణి సేవాయాం స్థితః అవిక్లబః అవ్యాకుల ఏవ యావజ్జనం విభజామి ఉత్తమ మధ్యమాధమ భేదేన సృజామి తావత్త్వత్సంమాననాదహమప్యజః స్వతంత్ర్య ఇతి మానినో మే సమున్నద్ధః ఉత్కటో మదో మాభూత్. యద్వా – మదోమాసమున్నద్ధ. మాసమున్నహ్యతాం. ఉద్రిక్తో న భవేదిత్యర్థః (29)

తమ అనుగ్రహాత్ – ఈ విధమైన నీ అనుగ్రహమువలన – ప్రజాసర్గమీహమానః – ప్రజాసృష్టిని కోరుచు తత్ప్రయత్నమున నున్నవాడనై – కుర్వన్నపి – చేయుచును – అహంకారాదిభిః – అహంకారము మున్నగువానిచే – బద్ధః నభవేయమితి – బద్ధుడను కాకుండనుండవలెనని – (28)

**తా.** ఓ ఈశ్వరా! చెలికాడవగు నీకు నేను చెలికానిగ చేయబడితిని. ప్రజాసృష్టి యందు ఉత్తమ మధ్యమాధములుగా, అవ్యాకులుడనై, విభజించు సేవలో నేను ఉన్నంత వఱకు – నేను కూడ అజుడనే అనుభావమున నున్న నాకు ఉత్కటమగు గర్వము కలుగకుండును గాక.

**టీ.** అవశ్యంచ మదో భవితాసతు కించిత్కాలం మాభూదితి ప్రార్థయతే – తప్పక గర్వము కలుగుట జరుగునేని కొంతకాలము వఱకు కలుగకుండుగాక యని ప్రార్థించుచున్నాడు – 'యావత్' అను ఈ శ్లోకమున – భోఈశ – ఓ ఈశ్వరా ! తే – త్వయా – నీచేత – లౌకికస్యసఖ్యుః – లోకమునకు సఖుడవగునీచేత – సఖేవాహం కృతః – స్నేహితునిగ చేయబడినాను. కరస్పర్శనాదినా – చేతితో తడుముట మున్నగువాని చేత – మమత్వేన సంభావితః సన్ – వీడునావాడను భావనచే ఆదరింపబడినాను. అగుచుండగా – ప్రజాసర్గరూపే – ప్రాణులను సృష్టించుటయను – తవపరికర్మణి – నీసేవయందు – స్థితః అవిక్లబో ఏవ – వ్యాకులములేని వాడనై యుండగనే – యావజ్జనం విభజామ్యుత్తమ మధ్యమాది భేదేన సృజామి – ఎంతవఱకు జనులను ఉత్తమ మధ్యమాది భేదములతో సృజింతునో – తావత్ – అంత వఱకు – త్వత్సంమానాత్ – నీ ఆదరము వలన – అహమప్యజః – నేనుకూడ పుట్టుకలేని వాడనే – స్వతంత్ర ఇతి – స్వతంత్రుడనని – మానినః – గర్వముగలవాడనైన – మే – నాకు – సమున్నద్ధ – ఉత్కటమైన – మదోమాభూత్ – గర్వము కలుగకుండుగాక – యద్వా – లేక








– మదః – గర్వము – మా సమున్నద్ధః – పెరుగకుండుగాక – ఉద్రిక్తో న భవేదిత్యర్థః – ఉద్రిక్తము కాకుండుగాక యని యర్థము. (29)

<u>***శ్రీ భగవానువాచ***</u>

జ్ఞానం పరమ గుహ్యం మే
యద్విజ్ఞాన సమన్వితమ్ ।
స రహస్యం తదంగం చ
గృహాణ గదితం మయా ॥ -30

<u>***శ్రీ భగవానుడిట్లనెను.***</u>

**తా.** శాస్త్రమునుండి పుట్టిన దైనను, నాకు సంబంధించిన జ్ఞానము,అనుభవముతోకూడినది, మిక్కిలి గుప్తమైనది, అటులే భక్తి, దానితో కూడిన దాని సాధనమును చెప్పుచున్నాను. గ్రహింపుము.

**టీ** :- జ్ఞానమితి. జ్ఞానం శాస్త్రోత్థం విజ్ఞానం అనుభవః రహస్యం భక్తిః. సుగోప్యమపి వక్ష్యామీత్యాదినిర్దేశాత్తస్యాంగం సాధనం.(30)

**టీ.** జ్ఞానం – శాస్త్రప్రోక్తమ్ – విజ్ఞానం – అనుభవము – రహస్యం – భక్తి – సుగోప్యమపి వక్ష్యామీత్యాది నిర్దేశాత్ తస్యాంగం – సాధనమ్ – పరమ గోప్యమైనను చెప్పెదనని సూచించుటవలన – తస్య అంగం – దాని సాధనము, (నా జ్ఞానము మిక్కిలి గుహ్యమైనది. శాస్త్రాదులతో నెఱుఁగదగినది. ఏకాంతమందు బుట్టుటయను లక్షణముతో కూడినది. ఈశ్వరునిలో సంగమింపజేయునట్టిది. అది నీకు చెప్పుచున్నాను గ్రహింపుము అని కూడ తాత్పర్యము చెప్పవచ్చును.) (30)

యావానహం యథాభావో
యద్రూప గుణకర్మకః ।
తథైవ తత్త్వ విజ్ఞాన
మస్తు తే మదనుగ్రహాత్ ॥ - 31

**తా.** నేనెంతవఱకు విస్తరించియున్నానో, ఎట్టిసత్తాగలవానినో, నా రూపము, గుణము, కర్మ (లీల) యెట్టిదో, నా అనుగ్రహము వలన అట్టిదే అయిన తత్త్వ విజ్ఞానము నీకు కలుగును గాక.









**టీ :-** నను త్వద్దర్శనే ఽ ప్యసమర్థో ఽ హం కథం జ్ఞానాధికారీ స్యాం? తత్రాహ – యావానితి. యావాన్ స్వరూపతః యథాప్రకారేణ భవామీతి యథాభావః. యాని రూపాణి గుణాః కర్మాణి చ యస్య. (31)

**చతుశ్శ్లోకీ:**

అహమేవాసమే కోగ్రే
నాన్యద్యత్సదసత్పరమ్ ।
పశ్చాదహం యదేతచ్చ
యో ఽ వశిష్యేత సో ఽ స్మ్యహమ్ ॥ -32

**టీ :-** తదేవ సమ్యగుపదిశన్ యావానిత్యస్యార్థం స్ఫుటయతి – అహమితి. అహమేక ఏవాగ్రే సృష్టేః పూర్వం ఆసం స్థితః నాన్యత్కించిత్ యత్. సత్ స్థూలం అసత్సూక్ష్మం పరం తయోః కారణం ప్రధానం తస్యాప్యంతర్ముఖతయా తదా మయ్యేవ లీనత్వాత్ అహం చ తదా ఆసమేవ కేవలం. న చాన్యదకరవం పశ్చాత్స ృష్టేః అనంతరమపి. అహమేవాస్మి యదేతద్విశ్వం తదప్యహమస్మి. ప్రలయే యో ఽ వశిష్యేత సో ఽ ప్యహమేవ. అనేనానాద్యంతత్వాదద్వితీయాచ్చ పరిపూర్ణో ఽ హమిత్యుక్తం భవతి. (32)

**టీ.** నీదర్శనము నందు కూడ నేను అసమర్థుడనైనచో – కథం జ్ఞానాధికారీ స్యాం? తత్రాహ–ఇక నేను జ్ఞానమునకెటుల అధికారినయ్యెదను – అనుశంకాసందర్భమున చెప్పుచున్నాడు – యావానితి – 'యావాన్' అను ఈ శ్లోకమున – యావాన్ – స్వరూప విషయమున నేనెంతటి వాడనో – యథాభావః – ఎట్టి సత్తాగలవానినో – యాని రూపాణి, గుణాః, కర్మాణిచ యస్య – ఏరూపములు, ఏ గుణములు, ఏ కర్మలు గల వానినో (నీకు తెలియును గాక) (31)

**తా.** "సృష్టికి పూర్వము నేనే ఉంటిని, అప్పుడు స్థూలముగాని, సూక్ష్మముగాని, వానికి కారణమైన ప్రధానముగాని, ఏ యితరమైనదియు లేదు. సృష్టికి అనంతరము కూడ నేనే ఉందును. ఏ ఈ విశ్వము గలదో అదియును నేనే అయియున్నాను. ప్రళయానంతరము ఏదిమిగులునో ఆదియును నేనే అయియుందును".

**టీ.** ఏతదేవ సమ్యగుపదిశన్ – దీనినే చక్కగా నుపదేశించుచు – యావానిత్యస్యార్థం స్ఫుటయతి – 'నేనెంత విస్తరించియున్నానో' అనుదాని యర్థమును స్పష్టము చేయుచున్నాడు, 'అహం' అను ఈ శ్లోకమున – అహమేవ – నేనే – సృష్టేః పూర్వం – సృష్టికి పూర్వమున – ఆసం – ఉంటిని – నాన్యత్కించిత్ – ఇతరమైనది ఏకొంచమైనను లేదు. యత్ సత్ – ఏ స్థూల పదార్థముగలదో – అసత్ – సూక్ష్మపదార్థము గలదో – పరం – వానికి కారణమైన ప్రధానము కూడ (లేదు) – తస్యాప్యంతర్ముఖ తయా తదా మయ్యేవ లీనత్వాత్ – అంతర్ముఖత్వముతో అదియును అప్పుడు నాలోనే లీనమై యుండుటవలన – అహంచ తదా ఆసమేవ – అప్పుడు కూడ నేనే ఉంటిని – కేవలః – ఒక్కనిని మాత్రమే – నచాన్యదకరవమ్ – వేఱేమియు చేసి యుండలేదు. – పశ్చాత్ – సృష్టికి అనంతరము – అపి – కూడ –

అహమేవాస్మి - నేనేఉన్నాను - యత్ - ఈవిశ్వము - తదప్యహమస్మి - అదియును నేనే అయియున్నాను. ప్రలయే యో ౽ వశిష్యేత - ప్రళయ కాలమున ఏది మిగులునో - సో౽ ప్యహమేవ - అదియును నేనే - అనేనచ-దీనితో - అనాద్యనంతత్వాదద్వితీయత్వాచ్చ - ఆది, అంతములేకుండుట వలన, ద్వితీయమైన దేదియును లేకుండుట వలనను - పరిపూర్ణో౽ హమిత్యుక్తంభవతి - నేను పరిపూర్ణుడనని చెప్పినట్లుగుచున్నది. (32)

ఋతే ౽ ర్థం యత్ప్రతీయేత
న ప్రతీయేత చాత్మని ।
తద్విద్యాదాత్మనో మాయాం
యథాభాసో యథాతమ ః ॥ - 33

**తా.** అధిష్ఠానమగు నాత్మయందు, వాస్తవమైన అస్తిత్వములేని వస్తువు, మిథ్యామాత్రముగ గోచరించుటయు, సత్తామాత్రమగునది చీకటివలె గోచరింపక పోవుటయును, ఆత్మయొక్క మాయయని తెలియవలెను.

**టీ** :- యథాత్మమాయాయోగేనేత్యనేన మాయాయాఅపి పృష్టత్వాద్వక్ష్యమాణోపయోగిత్వాచ్చ మాయాం నిరూపయతి - ఋతఇతి. ఋతే ౽ ర్థం వినాపి వాస్తవమర్థం యత్ యతః కిమస్య నిరుక్తం ఆత్మని అధిష్ఠానే ప్రతీయేత తత్. ఆత్మనో మను మాయాం విద్యాత్ యథా భాసో ద్విచంద్రాదిరితి అర్థం వినాప్రతీతౌ దృష్టాంతః. యథా తమ ఇతి సతో ప్రతీతౌ తమః రాహుః యథాగ్రహమండలే స్థితో ౽ పి న దృశ్యతే. (33)

**టీ.** యథాత్మమాయా యోగేనేత్యనేన మాయాయా ఆపి పృష్టత్వాత్ - ఆత్మమాయా యోగముచే ఎట్లని బ్రహ్మచే అడుగబడుట వలనను - వక్ష్యమాణోపయోగిత్వాచ్చ - చెప్పబోవునంశముల నర్థము చేసికొనుటకు ఉపయోగపడనున్న కారణము వలనను - మాయాం నిరూపయతి - మాయను నిరూపించుచున్నాడు - ఋతే అర్థం - వాస్తవమైన వస్తువేదియులేకున్నను - యద్యతః కిమపి అనిరుక్తం ఆత్మని అధిష్ఠానే ప్రతీయేత - ఏదియో అనిర్వచనీయమైనది, ఆధారభూతమైన ఆత్మయందు ప్రతీయమానమగునో - సదపి నప్రతీయేత - సత్పదార్థమైనను ప్రతీయమానము కాదో (ప్రకటముకాదో) తత్ - అది (ఆ విద్దూరము) ఆత్మనః - నాయొక్క - మాయాం విద్యాత్ - మాయనుగా తెలియవలెను. యథా ఆభాసో ద్విచంద్రాదిరిత్యర్థం వినా ప్రతీతౌ దృష్టాంతః - ఇద్దఱు చంద్రులు లేకున్నను అటుల కనబడుట








'ఆభాస'కు దృష్టాంతమెట్లో – యథా తమ ఇతి తతోऽ ప్రతీతౌ– కనబడకపోవుట తమస్సనెడి దృష్టాంతమెట్లో – తమో రాహుర్యథా గ్రహమండలే స్థితోऽపి నదృశ్యతే తథా – రాహువు (తమః)గ్రహమండలమున నుండియును గోచరింపడో అట్లు – (33)

యథామహాంతి భూతాని
భూతేషూచ్చావచేష్వను ।
ప్రవిష్టా న్యప్రవిష్టాని
తథాతేషు నతేష్వహమ్ ॥ - 34

**తా.** మహాభూతములు ఏవిధముగ ఉన్నతములు, అధమములునైన వివిధ ప్రపంచ వస్తువులలో, ప్రాణులలోను, వాని ఉద్భవ సమయముననే, వానిననుసరించియే వానిలో ప్రవేశించుచున్నవో, (తరువాత) ప్రవేశించుట లేదో – అట్లే నేను కూడ వానిలో అనుప్రవేశించుచున్నాను. ప్రవేశించుట లేదు కూడ.

**టీ**:– యథాభాస ఇత్యేతత్ సృష్టయతి – యథేతి. యథా మహాభూతాని భౌతికేషు అనుసృష్టేరనంతరం ప్రవిష్టానీవ తేషూపలభ్యమానత్వాత్. అప్రవిష్టాని ప్రాగేవ కారణతయా తేషు విద్యమానత్వాత్తథా తేషు భూతభౌతికేష్వహం ఏవం భూతా మమ సత్తేత్యర్థః. (34)

**టీ.** యథాభావ ఇత్యేత్స్పష్టయతి – వస్తుస్థితిని ఉన్నదియున్నట్లు స్పష్టము చేయుచున్నాడు. యథా మహాభూతాని – ఏ విధముగ మహాభూతములు, భౌతికేష్వను – సృష్టిననుసరించి – ప్రవిష్టాని – వానిలో ప్రవేశించినవో – తేషూపలభ్యమానత్వాత్ – వానియందవి లభించుట వలన – అప్రవిష్టానిచ – ప్రవేశించి యుండలేదు కూడ. ప్రాగేవ కారణతయా తేషు విద్యమానత్వాత్ – పూర్వమే, కారణరూపమున వానియందు విద్యమానమైయుండుట వలన (మఱల ప్రవేశింప నక్కఱ లేకుండుట వలన) తథా – ఆవిధముగ – తేషు – వాని యందు – భూత భౌతికేషు – అనగా లోగడనే ఏర్పడి యుండిన పాంచభౌతిక వస్తువులయందు – అహం – నేను – (వాని యందు నేను ప్రవేశించితిని) నచ తేష్వహమ్ – వాని యందు (తరువాత) ప్రవేవింపలేదు. (34)




ఏతావదేవ జిజ్ఞాస్యం
తత్త్వజిజ్ఞాసు నాత్మనః ।
అన్వయ వ్యతిరేకాభ్యాం
యత్స్యాత్సర్వత్ర సర్వదా ॥ - 35

**టీ :-** సాధనమాహ – ఏతావదితి. ఆత్మనః తత్త్వజిజ్ఞాసునా ఏతావదేవ జిజ్ఞాస్యం విచార్యం తదేవాహ – అన్వయః కార్యేషు కారణత్వేనానువృత్తిః కారణావస్థాయాం చ తేభ్యో వ్యతిరేకః తథా జాగ్రదాద్యవస్థాసు తత్సాక్షితయా అన్వయః. వ్యతిరేకశ్చ సమాధ్యాదౌ ఏవమన్వయవ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదాచ తదేవాత్మనః స్వరూపం అన్వయవ్యతిరేకసాధనేనాత్మా జిజ్ఞాస్య ఇత్యర్థః. (35)

**తా.** ఆత్మయొక్క తత్త్వమును తెలిసికొనగోరువానిచే ఇంతమాత్రమే తెలసికొనదగినది. ఈ తెలిసికొనుట యనునది, అంతటను, ఎల్లవేళలను వర్తించు అన్వయ వ్యతిరేకములచే జరుపవలెను.

**టీ.** సాధనమాహ – సాధనమును చెప్పుచున్నాడు – ఆత్మనస్తత్వజిజ్ఞాసునా – ఆత్మయొక్క తత్త్వమును తెలిసికొనగోరువాని చేత – ఏతావదేవ – ఇంతవఱకే – జిజ్ఞాస్యం – విచారింపదగినది – తదేవాహ – దానినే చెప్పుచున్నాడు – అన్వయః – కార్యముల యందు కారణత్వముచే అనువృత్తి – కారణావస్థాయాం తేభ్యోవ్యతిరేకః – కారణావస్థయందు వానికంటె వ్యతిరేకము. తథా జాగ్రదాద్యవస్థాసు తత్సాక్షితయాన్వయః – అట్లే జాగ్రదాది అవస్థలయందు, ఆ అవస్థలకు, ఆత్మ, సాక్షిమాత్రముగనుండుట అన్వయము. వ్యతిరేకశ్చ సమాధ్యాదౌ – సమాధి మున్నగు వాని యందు వ్యతిరేకము. ఏవం అన్వయవ్యతిరేకాభ్యాం – ఈ విధముగ అన్వయ వ్యతిరేకముల చేత – యత్స్యాత్సర్వత్ర సర్వదాచ – ఏది అంతటను అన్నివేళలలోను ఉండునో – తదేవాత్మేతి – అదియే ఆత్మయని (35)

ఏతన్మతం సమాతిష్ఠ
పరమేణ సమాధినా ।
భవాన్కల్ప వికల్పేషు
న విముహ్యతి కర్హిచిత్ ॥ - 36

**టీ :-** యత్ప్రార్థితం నేహమానః చిత్తైకాగ్ర్యేణ కల్పేషు యే వికల్పాః వివిధాః సృష్టయః తేషు విమోహం కర్తృత్వాభినివేశం న యాస్యతీతి. (36)

**తా.** పరమమైన ఏకాగ్రచిత్తముతో ఈ విశ్వాసమునే అనుసరించియుండుము. ఇకనీవు కల్పములందును వికల్పములందును, ఎప్పుడును మోహము చెందవు.

**టీ.** 'ప్రజాసృష్టిని కోరుచున్నవాడనని ఏది ప్రార్థింపబడినదో అది అనుగ్రహించుచున్నాడు. – ఏతన్మతం సమ్యగనుతిష్ఠ – ఈ అభిప్రాయమును లెస్సగా అనుసరించియుండుము – సమాధినా – ఏకాగ్రచిత్తముతో – కల్పేషు యేవికల్పాః వివిధాః సృష్టయః తేషు –





కల్పోపకల్పములందు చేయబడి వివిధములైన సృష్టులయందు - విమోహం - పట్టుకోల్పోవుటను - నయాస్యతీతి - పొందనేరవు అని - (36)

**శ్రీ శుక ఉవాచ**

సంప్రదిశ్యైవమజనో
జనానాం పరమేష్ఠినమ్ ।
పశ్యతస్తస్య తద్రూప
మాత్మనో న్యరుణద్ధరిః ॥ - 37

**శ్రీ శుక మహర్షి యిట్లనెను.**

**తా.** భగవానుడు, పట్టుగలవారల కెల్లరకును ఆధిపత్యముననున్న బ్రహ్మదేవునకు ఈ విధముగ ఉపదేశించి, అతడు చూచుచుండగనే అంతర్హితుడయ్యెను.

**టీ** :- సంప్రదిశ్యేతి. ఏవం సంప్రదిశ్య జానానాం పరమేష్ఠినం పరమే ఆధిపత్యే స్థితం బ్రహ్మాణం ఆత్మనః తద్రూపం న్యరుణత్ అంతర్హితవాన్. (37)

**టీ.** ఏవం సంప్రదిశ్య - ఈ విధముగ ఉపదేశించి - జనానాం - జనములకు - పరమేష్ఠినం - ఆధిపత్యమున నున్న బ్రహ్మదేవుని - ఆత్మనః - తనరూపమును - న్యరుణత్ - అంతర్హితము చేసెను. (37)

అంతర్హితేంద్రియార్థాయ
హరయే విహితాంజలిః ।
సర్వభూతమయోవిశ్వం
ససర్జేదం సపూర్వవత్ ॥ - 38

**తా.** తన ప్రత్యక్ష రూపమును అంతర్హితము చేసికొనిన భగవానునకు, బ్రహ్మ అంజలి ఘటించిన వాడై, సర్వభూతముల తోడి ఈ విశ్వమును, పూర్వముననుండిన యట్లే తిరిగి సృజించెను.

**టీ** :- అంతర్హితేతి. అంతర్హితః ఇంద్రియార్థః ప్రత్యక్షరూపం యేన తస్మై. బద్ధాంజలిస్సన్. (38)

**టీ.** అంతర్హిత ఇంద్రియార్థః - అదృశ్యమైన ప్రత్యక్షరూపమెవనిచే అటుల చేయబడెనో అతనికి - బద్ధాంజలిః సన్ - అంజలి ఘటించిన వాడై (38)





ప్రజాపతిర్ధర్మపతి
రేకదా నియమాన్యమాన్ ।
భద్రం ప్రజానామన్విచ్ఛ
న్నాతిష్ఠత్స్వార్థ కామ్యయా ॥ - 39

**తా.** ప్రజలకును ధర్మమునకును అధిపతియైన బ్రహ్మదేవుడు ఒకసారి, ప్రజల సంక్షేమమనెడి స్వార్థ ప్రయోజనము నాశించి యమ, నియమములను ధారణచేసి యుండెను.

**టీ :-** తదనంతరం పూర్వోక్తో బ్రహ్మనారద సంవాదః ప్రవృత్త ఇత్యాహ - పంచభిః ప్రజాపతిరితి. ప్రజానాం భద్రమన్విచ్ఛన్ విమృశన్నేవ స్వార్థకామ్యా స్వప్రయోజనేచ్ఛా తయా యమనియమాసన్వతిష్ఠత్. (39)

**టీ.** తదనంతరం పూర్వోక్తో బ్రహ్మనారద సంవాదః ప్రవృత్త ఇత్యాహ - ప్రజాపతిరితి పంచభిః - ఆ తరువాత 'ప్రజాపతిః' అను మొదలుగ ఐదు శ్లోకములతో పూర్వోక్తమగు బ్రహ్మనారద సంవాదము జరిగినదని చెప్పుచున్నాడు. - ప్రజానాంభద్రమన్విచ్ఛన్ - ప్రజల యొక్క కల్యాణమును గూర్చి విమర్శ చేయుచు - సఏవ - అతడే (బ్రహ్మయే) - స్వార్థే కామ్యా - స్వప్రయోజనమే ఇచ్ఛగా గల - తయా - దానితో (కోరికతో) - యమనియమా నన్వతిష్ఠత్ - యమ నియమములను ఆచరించుచుండెను. (39)

తం నారదః ప్రియతమో
రిక్థాదానామనువ్రతః ।
శుశ్రూషమాణః శీలేన
ప్రశ్రయేణ దమేన చ ॥ - 40

**తా.** పుత్రులలో ప్రియతముడు, తండ్రిననుసరించి నియముతో నుండువాడును అయిన నారదుడు, బ్రహ్మదేవుని, సుస్వభావముతో, వినయముతో, క్లేశమునోర్చుచు సేవించుచు. (సంతోషింపఁజేసెనని తరువాతి శ్లోకముతో అన్వయము).

**టీ :-** తమితి. రిక్థాదానాం పుత్రాణాం మధ్యే ప్రియతమః తం పితరం సేవమానః శీలాదినా పరితోషయామాసేత్యుత్తరేణాన్వయః (40).

**టీ.** రిక్థాదానం - పుత్రులలో - మధ్యే ప్రియతమః - వారిలో మిక్కిలి ప్రేమపాత్రుడై - పితరం సేవమానః - తండ్రిని సేవించుచున్నవాడై - శీలాదినా - స్వభావము మొదలగువాని చేత - పరితోషయామాసేత్యుత్తరేణాన్వయః - సంతోషింపజేసెనని తరువాతి శ్లోకముతో అన్వయము(40).

మాయాం వివిదిషన్విష్ణో
ర్మాయేశస్య మహామునిః ।
మహాభాగవతో రాజ
న్పితరం పర్యతోషయత్ ॥ - 41

**తా.** మాయకు ప్రభువైన భగవానుని మాయాతత్త్వము నెఱుంగఁగోరుచు మహామునియైన నారదుడు, పరమభాగవతుడై, తండ్రియగు బ్రహ్మను మిక్కిలి సంతోషింపజేసెను.

టీ :- మాయామితి. కిమిచ్ఛన్ మాయాం వేదితుమిచ్ఛన్. (41)

**టీ.** కిమిచ్ఛన్ – ఏమికోరుచు? విష్ణోర్మాయాం వివిదిషన్ – విష్ణుని మాయను గూర్చి తెలిసికొనగోరుచు (41)

తుష్టం నిశామ్య పితరం
లోకానాం ప్రపితామహమ్ ।
దేవర్షిః పరిపప్రచ్ఛ
భవాన్యన్మా ఉ ను పృచ్ఛతి ॥ - 42

**తా.** పరీక్షిన్మహారాజా ! లోకములకు ప్రపితామహుడైన తన తండ్రి బ్రహ్మదేవుడు సంతుష్టుడైనట్లు గమనించి, దేవర్షియైన నారదుడు – ఇప్పుడు నన్నడిగిన ప్రశ్ననే – బ్రహ్మదేవునడిగెను.

టీ :- తుష్టమితి. లోకానాం ప్రపితామహం పితృపితామహ ప్రభృతీనామపి కారణత్వాత్. నిశామ్య దృష్ట్వా జ్ఞాత్వేత్యర్థః. మా – మాం. (42)

**టీ.** నిశామ్య – చూచి, తెలసికొని అని యర్థము – మా – మాం – నన్ను – (42)

తస్మాఇదం భాగవతం
పురాణం దశలక్షణమ్ ।
ప్రోక్తం భగవతా ప్రాహ
ప్రీతః పుత్రాయ భూతకృత్ ॥ - 43

**తా.** బ్రహ్మ మిక్కిలి సంతోషించి, పదిలక్షణములు గల ఈ భాగవత మహాపురాణమును తన పుత్రుడైన నారదునకు వినిపించెను. అది భగవానుడు తనకు చెప్పినదే.







**టీ** :- తస్మాఇతి. భగవతా చతుశ్లో్శక్యా సంక్షేపేణ ప్రోక్తం విస్తరేణ ప్రాహ – దశ లక్షణాని లక్షణీయా అర్థా విద్యంతే యస్మిన్ తత్. (43)

**టీ.** భగవతా – భగవానునిచే – చతుః శ్లోక్యా – నాలుగు శ్లోకములు గలదానిచే – సంక్షేపేణ ప్రోక్తం – సంగ్రహముగ చెప్పబడిన దానిని – విస్తరేణ ప్రాహ – తాను వివరించి చెప్పెను – దశలక్షణాని – పది, తెలిసికొనదగిన అర్థములు దేని యందు గలవో అట్టిది 'దశలక్షణమ్'. (43)

నారదః ప్రాహ మునయే
సరస్వత్యాస్తటే నృప !।
ధ్యాయతే బ్రహ్మపరమం
వ్యాసాయామిత తేజసే ॥ - 44

**తా.** రాజా ! సరస్వతీ నదీ తీరమున, పరబ్రహ్మమును గూర్చి ధ్యానించుచున్న అమిత తేజస్వియగు వ్యాస మునీంద్రునకు నారదుడు భాగవతమును వినిపించెను.

**టీ** :- సత్సంప్రదాయతో భాగవతం జ్ఞాతవ్యమిత్యాశయేనాహ – నారద ఇతి. (44)

**టీ.** 'నారద' ఇతి – 'నారదః' అను నీ శ్లోకముతో – తత్సంప్రదాయతో భాగవతం మయా జ్ఞాతమిత్యాశయేన ఆహ – ఆ సంప్రదాయము నుండి భాగవతమును నేను తెలిసికొంటినను నంశమును తెలుపుటకు చెప్పుచున్నాడు.(44)

యదుతాహం త్వయా పృష్టో
వైరాజాత్పురుషాదిదమ్ ।
యథాసీత్తదుపాఖ్యాస్యే
ప్రశ్నానన్యాంశ్చ కృత్స్నశః ॥ - 45

**తా.** 'విరాట్పురుషుని నుండి ఈ జగత్తు ఎట్లు ఉత్పన్నమైనది?' అని నీవడిగిన ప్రశ్నకును, ఇంకను అనేక ప్రశ్నలకును అదే భాగవత రూపమున సమాధానములను వివరించెదను.

**టీ** :– భాగవతవ్యాఖ్యానేనైవ తవ ప్రశ్నానాం ఉత్తరం దాస్యామీత్యాహ – యదితి. శ్లో. ' పురుషావయవైర్లోకాస్సపాలాః

**టీ.** భాగవత వ్యాఖ్యానేనైవ త్వత్ప్రశ్నానాముత్తరం దాస్యామీత్యాహ – భాగవతము వ్యాఖ్యానించుట ద్వారానే నీ ప్రశ్నలకు సమాధానమిచ్చెదనని చెప్పుచున్నాడు – యదుతేతి +









పూర్వకల్పితాః ' ఇత్యాదినా వైరాజాత్పురుషాదిదం విశ్వం కథమాసీదితి యదహం త్వయా పృష్టో వైతద్యథావదుపాఖ్యాస్యామి శృణ్వితి. (45)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వితీయ స్కంధే**

**నవమోధ్యాయః**

'యత్ + ఉత' అని మొదలగు ఈ శ్లోకమున పురుషావయవైర్లోకాః సపాలాః పూర్వకల్పితాః (2-8-10) అను మొదలగు శ్లోకాదులచేత – వైరాజాత్పురుషాదిదం కథమాసీదితి – విరాట్పురుషుని నుండి ఈ విశ్వమెటులావిర్భవించెనని – యదహం త్వయాపృష్టః – ఏది నన్ను నీవడిగితివో – తద్యావదుపాఖ్యాస్యామి శృణ్వతి, – దానికి ఉన్నదున్నట్లుగ నీవు వినుచుండగ వివరించి చెప్పెదను.(45)

**భాగవత మహాపురాణమునందలి రెండవ స్కంధమున తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

**టీక యందు తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**










## అథ దశమోఽ ధ్యాయః

### శ్రీ శుక ఉవాచ

అత్ర సర్గో విసర్గశ్చ
స్థానం పోషణమూతయః ।
మన్వంతరేశాను కథా
నిరోధోముక్తి రాశ్రయః ॥ - 1

**టీ :–** తతో భాగవతవ్యాఖ్యాద్వారైవ దశమే స్ఫుటమ్. రాజప్రశ్నోత్తరం వక్తుమారేభే బాదరాయణిః. అతీతానంతరాధ్యాయే దశలక్షణం పురాణం ప్రాహేత్యుక్తం. తాని దశలక్షణాని దర్శయతి. అత్రేతి. మన్వంతరాణి ఈశానుకథాశ్చేతి ద్వంద్వః సర్గాదయోఽ త్ర దశపదార్థాః లక్ష్యంతే. (1)

దశమస్య విశుద్ధ్యర్థం
నవానామిహ లక్షణమ్ ।
వర్ణయంతి మహాత్మానః
శ్రుతేనార్థేన చాంజసా - 2

## పదియవ అధ్యాయము

### శ్రీ శుక మహర్షి యిట్లనెను

**తా.** ఈ భాగవతమునందు సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతులు (వాసనలు), మన్వంతరములు, ఈశానుకథలు, నిరోధము, ముక్తి, ఆశ్రయము అను పది విషయములు గలవు.

**టీ .** తతో భాగవతవ్యాఖ్యాద్వారైవ దశమే స్ఫుటమ్ – ఇటుపైన భాగవత వ్యాఖ్యానము ద్వారానే పదవ అధ్యాయమున స్పష్టీకరింపబడినది – రాజప్రశ్నోత్తరం వక్తుమారేభే బాదరాయణిః – పరీక్షిత్తు అడిగిన ప్రశ్నలకు శుక మహర్షి సమాధానము చెప్పుటకారంభించినాడు – దశలక్షణం పురాణం ప్రాహేత్యుక్తం – పురాణము పది లక్షణములు గలదియని చెప్పబడినది గదా !– తాని దశ లక్షణాని దర్శయతి అత్రేతి – 'అత్ర' అను ఈ శ్లోకమున ఆ పది లక్షణములను చూపుచున్నాడు – మన్వంతరాణి ఈశాను కథాశ్చేతి ద్వంద్వః – మన్వంతరములు, ఈశానుకథలు అనునది ద్వంద్వసమాసము – సర్గాదయోఽ త్ర దశార్థా లక్ష్యంతే – 'సర్గము' మొదలగునవి పది అర్థములను చూపుచున్నవి. (1)

**తా.** ఇందు పదియవ తత్త్వమగు ఆశ్రయమును గూర్చిన జ్ఞానము కొఱకు, మహాత్ములు, శ్రుతిచేతను, తాత్పర్యము చేతను తొమ్మిదింటి లక్షణములను సాక్షాత్తుగ వర్ణింతురు.








**టీ:-** నన్వేవమర్థభేదాచ్ఛాస్త్రభేదస్స్యాత్తత్రాహ - దశమస్యేతి. దశమస్య ఆశ్రయస్య విశుద్ధ్యర్థం తత్త్వజ్ఞానార్థం. నవానాం లక్షణం స్వరూపకథనం ఏకస్యైవ ప్రాధాన్యాన్నాయం దోష ఇత్యర్థః. నన్వత్ర నైవం ప్రతీయతే తత్రాహ - శ్రుతేన శ్రుత్యైవ శ్రుతిప్రతిపాద్యరూపేణ సృష్ట్యాది స్థానేషు. అంజసా సాక్షాద్వర్ణయంతి. అర్థేన తాత్పర్యవృత్త్యా చ తత్తదాఖ్యానేషు. (2)

టీ - నన్వేవమర్థభేదాచ్ఛాస్త్ర భేదః స్యాత్తత్రాహ - తత్త్వజ్ఞానార్థభేదములగు సర్గాదుల కన్న ఆశ్రయమగు తత్త్వము భిన్నమైనదని యిటఁజెప్పుచున్నాడు - దశమస్యాశ్రయస్య విశుద్ధ్యర్థం తత్త్వజ్ఞానార్థం నవానాం లక్షణం స్వరూపమ్ - పదవదియగు ఆశ్రయమును శోధించి తెలిసికొనుటకు (తత్త్వమును తెలిసికొనుట కొఱకు) తొమ్మిదింటి స్వరూపము - ఏకస్యైవ ప్రాధాన్యాన్నాయం దోషఇత్యర్థః - దశమమగు 'ఆశ్రయ' ప్రాధాన్యము వలన ఇది దోషము కాదని యర్థము. - నన్వత్రనైవం ప్రతీయతేఽ త ఆహ - అయినను ఇట అది అటుల ప్రకటము కానందున చెప్పుచున్నాడు - శ్రుతేన - శాస్త్రముచేత - స్తుత్యాదిస్థానేషు - స్తుతించుట మున్నగుస్థానములందు - అంజసా - వెంటనే - సాక్షాద్వర్ణయంతి - సాక్షాత్తుగ వర్ణింతురు - అర్థేన - అర్థము చేత - తాత్పర్యవృత్త్యాచ - శబ్దముల మూలమున నేర్పడు అభిప్రాయముచేతను - తత్తదాఖ్యానేషు - ఆయా కథనములందును. **(2)**

భూతమాత్రేంద్రియ ధియాం
జన్మసర్గ ఉదాహృతః ।
బ్రహ్మణో గుణవైషమ్యా
ద్విసర్గః పౌరుషః స్మృతః ॥ - 3

**తా.** పంచమహాభూతములు, పంచతన్మాత్రలు, ఇంద్రియములు, మహదహంకారములు - వీని ఉత్పత్తి 'సర్గము' అనబడును. (ఇది పరమేశ్వరుని వలన ఏర్పడు కారణ సృష్టి) గుణ పరిణామముల వలన సృజింపబడు బ్రహ్మసృష్టి 'విసర్గ' మనబడును, అదే పౌరుష సృష్టియని కూడ చెప్పబడును.

**టీ** :- సర్గాదీనాం ప్రత్యేకం లక్షణమాహ - భూతమాత్రేతి. భూతాని ఆకాశాదీని. మాత్రాణి శబ్దాదీని. ఇంద్రియాణి చ. ధీశబ్దేన మహదహంకారౌ. గుణానాం వైషమ్యాత్పరిణామాత్. బ్రహ్మణః పరమేశ్వరాత్కర్తుః. భూతాదీనాం యద్విరాడ్రూపేణ స్వరూపతశ్చ జన్మ సర్గః. విసర్గమాహ - పురుషః వైరాజః తత్కృతః పౌరుషః చరాచరసర్గో విసర్గ ఇత్యర్థః. (3)

**టీ.** సర్గాదీనాం ప్రత్యేకం లక్షణమాహ - 'సర్గము' మొదలగువాని ప్రత్యేక లక్షణములను చెప్పుచున్నాడు - భూతాని- ఆకాశము మొదలగునవి - మాత్రాణిచ - శబ్దాది తన్మాత్రలు - ఇంద్రియాణి చ - చక్షురాది ఇంద్రియములు - ధీశబ్దేన మహదహం కారౌ - ధీ శబ్దము చేత మహత్తు, అహంకారము - గుణానాం వైషమ్యాత్ - గుణముల యొక్క పరిణామము వలన - బ్రహ్మణః - కర్తయైన పరమేశ్వరుని వలన - భూతాదీనాం - పంచభూతములు మున్నగు వాని యొక్క - యద్విరాట్పురుషేణ స్వరూపతశ్చ జన్మ - విరాట్పురుషుని చేత

స్థితిర్వైకుంఠ విజయః
పోషణం తదనుగ్రహః ।
మన్వంతరాణి సద్ధర్మ
ఊతయః కర్మవాసనాః ॥ - 4

**టీ** :- స్థితిరితి. వైకుంఠస్య భగవతో విజయః. సృష్టానాం తత్తన్మర్యాదాపాలనేనోత్కర్షః భగవతారైర్జగత్పాలనమిత్యర్థః. స్థితిః స్థానం. స్వభక్తేషు తస్యానుగ్రహః. పోషణం తదనుగ్రహీతానాం సతాం మన్వంతరాధిపతీనాం ధర్మః. సద్ధర్మః. ఊతయః క్రర్మణాం వాసనాః. వేఞ్ తంతుసంతానే. ఊయంతే కర్మభిః సంతన్యంత ఇత్యూతయః వృద్ధ్యర్థాత్సంశ్లేషార్థాద్వావయతేర్థాతోరిదం రూపం. ఊయంతే కర్మభిర్వర్ధంతే సంశ్లిష్యంత ఇతి వా ఊతయ ఇత్యర్థః (4)

స్వరూపముతో కూడ ఏ ఉత్పత్తి కలదో - స సర్గః - అది సర్గము - విసర్గమాహ - విసర్గమును చెప్పుచున్నాడు - పురుషః - వైరాజు - తత్ కృతః - అతనిచే చేయబడినది (కావున) పౌరుషము - చరాచర సర్గో విసర్గ ఇత్యర్థః - చరాచరసృష్టి విసర్గయని యర్థము. (3)

**తా.** భగవానుడగు విష్ణుని విజయమే స్థితి, (స్థానము) ఆతని అనుగ్రహమే పోషణము, మన్వంతరాధిపతుల సద్ధర్మములు ప్రధానముగ వర్తించు కాలములు మన్వంతరములు, ఆయా కర్మలకు సంబంధించిన వాసనలే ఊతులు.

**టీ.** వైకుంఠస్య - భగవానుని - విజయః - గెలుపు - సృష్టానాం తత్తన్మర్యాదా పాలనేనోత్కర్షః -సృష్టింపఁబడినవారి ఆయా మర్యాదలను పాటించుట యందు శ్రేష్ఠత్వము - స్థితిః - స్థానము - స్వభక్తేషు తస్యానుగ్రహః పోషణమ్ - తన భక్తులయందు అతని అనుగ్రహము పోషణము - తదను గృహీతానాం సతాం మన్వంతరాధిపతీనాం ధర్మః సద్ధర్మః - ఆయనచే అనుగ్రహింపబడిన పుణ్యపురుషులగు మన్వంతరాధి పతుల యొక్క ధర్మము సద్ధర్మము. కర్మణాం - కర్మల యొక్క - వాసనాః - స్మృతులను కలిగించు అనుభవ(కర్మ) జన్యభావనలు - వేఞ్ - తంతుసంతానే - వేఞ్ ధాతువునకు నేయుట, అల్లుట, విస్తరించుట అర్థములు - ఊయంతే కర్మభిః సంతన్యంత ఇత్యూతయః - కర్మలచే విస్తరింపబడును కావున 'ఊతయ' అని - యద్వా - లేక - వృద్ధ్యర్థాత్ సంశ్లేషార్థాద్వా అవతేర్థాతోరిదం రూపమ్ - వృద్ధి అల్లిక అను నర్థములు గల అవ ధాతువు నుండియు ఈ రూపము - ఊయంతే కర్మభిర్బృంహ్యంతే సంశ్లిష్యంత ఇతివా ఊతయ ఇత్యర్థః - కర్మలచేత విస్తరించునవి లేక అల్లుకొనియుండునవి 'ఊతులు' అని యర్థము. (4)

అవతారానుచరితం
హరేశ్చాస్యాను వర్తినామ్ ।
పుంసామీశకథాః ప్రోక్తా
నానాఖ్యానోపబృంహితాః ॥ - 5

**తా.** భగవానుని వివిధ అవతారముల యొక్కయు, ఆయనననుసరించి యుండు భక్తుల యొక్కయు కథన విస్తార విశేషములు ఈశానుకథలని చెప్పబడును.

**టీ** :- ఈశానుకథమాహ – అవతారేతి. హరేరవతారానుచరితం అస్యానువర్తినాం చ సత్కథాః ఈశానుకథాః ప్రోక్తా ఇత్యర్థః. (5)

**టీ.** హరేరవతారానుచరితం –విష్ణుభగవానుని అవతారముల చరిత్రములు, అస్యానువర్తినాం చ సత్కథాః – అతనిననుసరించి యుండువారి పుణ్య కథలును – ఈశానుకథాః ప్రోక్తాః ఇత్యర్థః – ఈశాను కథలని చెప్పబడునని యర్థము. (5)

నిరోధో ౭ స్యానుశయన
మాత్మనః సహశక్తిభిః ।
ముక్తిర్హిత్వాన్యథా రూపం
స్వరూపేణ వ్యవస్థితిః ॥- 6

**తా.** విష్ణుని యోగనిద్రతో ఆత్మయు తన శక్తులన్నింటితో కూడ అతనితో లయమగుట నిరోధమనబడును. అన్యరూపమును (అవిద్యాకల్పితమైన కర్తృత్వభోక్తృత్వాది దేహమును) వదలి స్వస్వరూపమున అనగా బ్రహ్మత్వముననుండుట ముక్తియనబడును.

**టీ** :- నిరోధమాహ – నిరోధఇతి. అస్యాత్మనః జీవస్య హరేర్యోగనిద్రాం అను పశ్చాచ్ఛక్తిభిః స్వోపాధిభిస్సహ శయనం లయః నిరోధః అన్యథారూపం అవిద్యయా అధ్యస్తం. కర్తృత్వాదిహిత్వా స్వస్వరూపేణ బ్రహ్మతయా వ్యవస్థితిరుక్తః. (6)

**టీ.** నిరోధమాహ – నిరోధమును చెప్పుచున్నాడు – అస్యాత్మనః – ఈ జీవునియొక్క – హరేర్యోగనిద్రామను – విష్ణుభగవానుని యోగనిద్రననుసరించి – పశ్చాచ్ఛక్తిభిశ్చ – ఉపాధులతో సహా – శయనం – లయమందుట – నిరోధః – నిరోధము. అన్యధారూపం – అవిద్య వలన అధ్యస్తమైన కర్తృత్యాదులతో కూడిన రూపమును – హిత్వా – వదలిపెట్టి – స్వరూపేణ – బ్రహ్మత్వముతో – వ్యవస్థితిః – ఉండుట – ముక్తిః – ముక్తియనబడును. (6)







ఆభాసశ్చ నిరోధశ్చ
యతశ్చాధ్యవసీయతే ।
స ఆశ్రయః పరం బ్రహ్మ
పరమాత్మేతి శబ్ద్యతే ॥ **-7**

**తా.** సృష్టియు, లయమును ఎవని వలన ప్రకాశించునో అతడు పరబ్రహ్మయని పరమాత్మయనియు - అతడే ఆశ్రయమనియు చెప్పబడును.

**టీ :-** ఆభాసఇతి. ఆభాసః సృష్టినిరోధో లయశ్చ యతో భవతి. అధ్యవసీయతే ప్రకాశ్యతే చ. ' స బ్రహ్మేతి పరమాత్మేతి ప్రసిద్ధః ఆశ్రయః కథ్యతే. (7)

**టీ.** ఆభాసః - సృష్టి - నిరోధః - లయము, యతః - ఎవనివలన - భవతి - అగునో - అధ్యవసీయతేచ - ప్రకాశించునో కూడ - స పరంబ్రహ్మేతి - అతడు పరంబ్రహ్మయని - ప్రసిద్ధః - ప్రసిద్ధి గలవాడు - పరమాత్మేతి - పరమాత్మయనియు - ఆశ్రయః - ఆశ్రయుడని - కథ్యతే - చెప్పబడును. (7)

యోఽ ధ్యాత్మికోఽ యం పురుషః
సోఽ సావేవాధిదైవికః ।
యస్తత్రోభయ విచ్ఛేదః
పురుషోహ్యాధి భౌతికః ॥ - **8**

**తా.** ఎవ్వాడు ఆధ్యాత్మిక పురుషుడనువాడు కలడో, అతడే ఆధి దైవిక పురుషుడు, వీరిద్దటి నుండి వేఱైన వాడు ఆదిభౌతిక పురుషుడు.

**టీ :-** ఆశ్రయస్వరూపమపరోక్షానుభవేన స్పష్టం దర్శయితుం అధ్యాత్మాదివిభాగమాహ - యఇతి. యో ఽ యమాధ్యాత్మికః పురుషః చక్షురాదికరణాభిమానీ ద్రష్టా జీవః స ఏవాధిదైవికః. చక్షురాద్యధిష్ఠాతా సూర్యాదిః. తత్రైకస్మిన్నేవ ఉభయోర్ద్విరూపో విచ్ఛేదో యస్మాత్స ఆధిభౌతికః. చక్షుర్గోలకాద్యుపలక్షితో దృశ్యో దేహః పురుష ఇతి పురుషస్య జీవస్యోపాధిః. ' స వా ఏష పురుషో ఽ న్నరసమయ' ఇతి. శ్రుతేః.. (8)

**టీ -** ఆశ్రయ స్వరూపమపరోక్షానుభవేన స్పష్టం దర్శయితుమధ్యాత్మాది విభాగమాహ - ఆశ్రయ స్వరూపుడగు పరబ్రహ్మను అపరోక్షానుభవముతో స్పష్టముగ చూపుటకు అధ్యాత్మాది విభాగములను చెప్పుచున్నాడు. యోఽ యమాధ్యాత్మికః పురుషశ్చక్షురాది కరణాభిమానీ ద్రష్టా జీవః - కన్నులు మొదలగు ఇంద్రియముల అభిమానియగు ఏ ఆధ్యాత్మిక పురుషుడుగలడో అతడే ద్రష్ట జీవుడు - స ఏవాధి దైవికశ్చక్షురాద్యధిష్ఠాతా - అతడే ఆధిదైవికపురుషుడు ఇంద్రియములకు అధిష్ఠానమైన వాడు.








ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య

ఖుఃజాళీసజి -వడ్మీా
యదా నోపలభామహే ।
త్రితయం తత్ర యోవేద స
ఆత్మా స్వాశ్రయాశ్రయః ॥ - 9

**టీ** :- ఏకమితి. ఏకమేకతరాభావ ఇత్యే తేషాం అన్యోన్యసాపేక్ష సిద్ధత్వేన అనాత్మత్వం దర్శయతి. తథాహి. దృశ్యం వినా తత్ప్రతీత్యమేయం కరణం న సిద్ధ్యతి నాపి ద్రష్టా న చ ద్రష్టారం వినా కరణ ప్రవృత్త్యనుమేయః తదధిష్ఠాతా సూర్యాదిః న చ తం వినాకరణం ప్రవర్తతే న చ తద్వినా దృశ్యమిత్యేవం ఏకతరస్యాభావే ఏకం నోపలభామహే. తత్ర తదా తత్త్రితయం ఆలోచనాత్మకేన ప్రత్యయేన యో వేద సాక్షితయా పశ్యతి సః పరమాత్మా ఆశ్రయః తేషామపి పరస్పరాశ్రయత్వమస్త్యేవేతి తద్వ్యవచ్ఛేదార్థం విశేషణం స్వాశ్రయః. అనన్యాశ్రయః సచాసావన్యేషామాశ్రయశ్చేతి. తథా

సూర్యాదిః – సూర్యుడు మొదలగు రూపములనున్నవాడు – తత్ర ఏకస్మిన్నేవ ఉభయః ద్విరూపః విచ్ఛేదో యస్మాత్ స ఆధిభౌతికః, చక్షుర్గోలకాద్యుపలక్షితః, దృశ్యః, దేహః పురుష ఇతి పురుషస్య జీవస్యోపాధిః – అచట ఒకని యందే రెండు రూపములుండ అతని నుండి వేఱైన వాడు ఆధిభౌతికుడు కనుగ్రుడ్లు మొదలగు కేవల శరీరక భాగములచే గుర్తింపబడువాడు. దృశ్యమాత్రుడు దేహము జీవుని యొక్క ఉపాధి. (ఈ పురుషుడు అన్న సారముతో నేర్పడి యున్నవాడు) అను మొదలగు శ్రుతి వలన – (8)

**తా.** ఈ ముగ్గురిలో ఒక్కరి అభావమైనను తక్కిన యిద్దఱి ఉపలబ్ధికూడమనకు కలుగదు. ఈ ముగ్గురిని తెలియువాడు అనన్యాశ్రయుడైన పరమాత్మయే.

**టీ.** "ఏకమేకతరాభావ" ఇత్యేషామన్యోన్యసాపేక్ష సిద్ధిత్వేనానాత్మత్వం దర్శయతి – "ఏకమేకతరాభావే" యని ఈ ముగ్గురి పరస్పర సాపేక్ష సిద్ధిత్వముతో (ముగ్గురును పరస్పరము ఒకరి అపేక్షతో ఒకరు కలిసి యున్నప్పుడే సదేహుడైన జీవుడు సిద్ధించును) అనెడి మాటతో అనాత్మత్వమును చూపుచున్నాడు – తథాహి – అది యుక్తమే కదా – దృశ్యం వినాతత్ ప్రతీత్యనుమేయం కరణం న సిద్ధ్యతి – దృశ్యము లేకున్నచో దాని అనుమేయమును ఊహించుటకు సాధనము లేదు కదా !– నాపిద్రష్టా – చూచువాడును సిద్ధింపడు – నచ తద్వినా కరణ ప్రవృత్త్యనుమేయస్తదధిష్ఠాతా సూర్యాదిః – కన్నులేనిచో చూచువాడు లేడు – అతడు లేనిచో కన్ను, చూచుట, ఊహించుట లేకున్నచో సూర్యాది అధిష్ఠాతయు లేడు – న చ తం వినా కారణం ప్రవర్తతే – అతడు లేనిఛో కారణము (హేతువు) ప్రవర్తింపదు – నచతద్వినా దృశ్యమిత్యేవం – అదిలేనిచో దృశ్యము లేదు – అని యీ విధముగ – ఏకతరస్య

ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య





ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

చ భగవాన్ వక్ష్యతి - శ్లో. దృగ్రూపమార్గం వపురత్ర రంధ్రే పరస్పరం సిద్ధ్యతి యస్స్వతః ఖే, ఆత్మా యదేషామపరో య ఆద్యః స్వయానుభూత్యాఖిలసిద్ధి సిద్ధిరితి. ఏతేనైవ వ్యభిచారిత్వాత్తేషాం మాయామయత్వమిత్యుక్తం. అతఏవ పురుషావయవైర్లోకాస్సపాలాః పూర్వకల్పితాః. లోకైరముష్యావవైస్స పాలైరిత్యనేనోక్తో విరోధో ఽపి పరిహృతః (9)

అభావే ఏకం నోపలభామహే - ఒకటి లేనిచో మరియొకదానిని తెలియజాలము - తత్ర తదా తత్రితయమాలోచనాత్మకేన ప్రత్యయేన యోవేద - అందుచే ఆ మూడింటిని కలిపి ఆలోచనాత్మకమైన జ్ఞానముతో ఎవడు తెలిసికొనునో- సాక్షితయా పశ్యతి - సాక్షిత్వముచే చూచునో - స పరమాత్మా ఆశ్రయః-అతడు ఆశ్రయమని చెప్పబడు పరమాత్మ -తేషామపి పరస్పర మాశ్రయత్వమస్త్యేవేతి తద్వ్యవచ్ఛేదార్థం విశేషణమ్ - ఈ మూడింటిలోనను ఒకదానికొకటి ఆశ్రయించి యుండుట అను లక్షణము ఉండనే యున్నదని, దానిని విభాగము చేయుటకై విశేషణము చెప్పబడినది - స్వాశ్రయః - అనన్యాశ్రయుడు - సచ అసౌ అన్యేషాం ఆశ్రయశ్చేతి - అతడే ఇతరులకు (ఇతరములకును) ఆశ్రయుడనియును - తథాచ భగవాన్ వక్ష్యతి - అదే విషయమును భగవానుడు చెప్పగలడు. "దృగ్రూప మార్కం వపురత్ర రంధ్రే పరస్పరం సిద్ధ్యతి యః స్వతః ఖే !! ఆత్మాయదేషామపరో య ఆద్యః స్వయానుభూత్యాఖిల సిద్ధ సిద్ధిః!!" ఇతి (11-22-31) - నేత్రేంద్రియము అధ్యాత్మము. దాని విషయరూపము అధి భూతము. నేత్ర గోళమందున్న సూర్యుడు అధిదైవతము - ఈమూడు పరస్పరాశ్రయములు, కాని ఆకాశమందలి సూర్యుడు స్వతంత్రుడు, స్వాశ్రయుడు నిరపేక్షుడు, అట్లే పై మూడింటి మూలకారణము 'ఆత్మ' మూడింటికిని సాక్షి - వానికన్న భిన్నుడు ముక్తుడు సమస్త సిద్ధ పదార్థముల మూలసిద్ధి - ఏతేనైవ వ్యభిచారిత్వాత్తేషాం మాయామయత్వమప్యుక్తమ్ - ఇతని తోడనే వ్యభిచారిత్వము వలన ఆ మూడింటికి మాయామయత్వము కూడ చెప్పబడినది. అత ఏవ - అందుకే - పురుషావయవైర్లోకాః సపాలాః పూర్వకల్పితాః లోకైరముష్యావయవాః సపాలైః" ఇత్యనేనోక్తో విరోధోఽ పి పరిహృతః - విరాట్పురుషుని అవయవముల చేత పూర్వము లోకములు కల్పింపబడినవి. లోకముల చేత అతని అవయవములు కల్పింపబడినవి" అని చెప్పబడిన దానిలోని విరోధము కూడ తొలగిపోయినది. (9)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ






పురుషో ౾ ండం వినిర్భిద్య
యదాసౌ స వినిర్గతః ।
ఆత్మనో ౾ యనమన్విచ్ఛ
న్నపో ౾ స్రాక్షీచ్ఛుచిః శుచిః ॥ -10

**తా.** విరాట్పురుషుడు అండమును భేదించి, బయటకువెడలెను. అప్పుడు తన స్థానము కొఱకు వెదకుచు, పరిశుద్ధుడైన ఆతడు పరిశుద్ధమైన జలమును సృజించెను.

**టీ** :- ఉక్తమేవాధ్యాత్మాదివిభాగం ప్రపంచయన్ శ్లో. 'యదుతాహం త్వయా పృష్టో వైరాజాత్పురుషాదిదమ్, యదాసీత్తదుపాఖ్యాస్య' ఇతి ప్రతిజ్ఞాతం తదుత్పత్తిప్రకారమాహ – పురుష ఇతి. పురుషః వైరాజః. అండం వినిర్భిద్య పృథక్కృత్య. వినిర్గతః పృథక్ స్థిత ఇత్యర్థః. అయనం స్థానం అన్విచ్ఛన్ విమృశన్ యతశ్శుచిః స్వయం అత ఏవ శుచీః శుద్ధాః అపః గర్భోదకసంజ్ఞాః అస్రాక్షీత్ససర్జ. (10)

**టీ.** అధ్యాత్మాది విభాగము చెప్పబడినది – (ఉక్తమేవాధ్యాత్మాదివిభాగం) ప్రపంచయన్ – చెప్పుచు – 'యదుతాహం' త్వయా పృష్టో వైరాజాత్పురుషాదిదం యథాసీత్తదుపాఖ్యాస్యే' ఇతి యత్ప్రతిజ్ఞాతం తదుత్పత్తి ప్రకారమాహ – "మరియు విరాట్పురుషుని నుండి ఈ విశ్వమెట్లు కలిగినదని నీవడిగిన ప్రశ్నకు, ఎట్లు కలిగినదో చెప్పుచున్నాను" అని తాను ప్రతిజ్ఞచేసిన విధముగ దాని ఉత్పత్తి ప్రకారమును చెప్పుచున్నాడు – పురుష ఇత్యాదినా – పురుషః అని మొదలగు ఈ శ్లోకముతో – పురుషః – విరాట్టు (వైరాజు). అండం వినిర్భిద్య – అండమును వేరుచేసి, వినిర్గతః –విడి వడి యుండెనని యర్థము. అయనం – స్థానము – అన్విచ్ఛన్ – విమర్శించుచు, – యతః శుచిః స్వయమ్ – తాను స్వయముగ శుచియైయున్న వాడు కావున – అతః శుద్ధా అపో, గర్భోదక సంజ్ఞా – అందువలన శుద్ధమైన నీటిని గర్భోదకమను పేరున – అస్రాక్షీత్ – సృజించెను.(10)

తాస్వవాత్సీత్స్వసృష్టాసు
సహస్రపరివత్సరాన్ ।
తేన నారాయణో నామ
యదాపః పురుషోద్భవాః ॥ - 11

**తా.** తాను సృష్టించిన నీటి యందు తాను వేయి సంవత్సరములు నివసించెను. అందుచేత అతనికి నారాయణుడను పేరు కలిగెను. నరుని వలన ఉద్భవించిన కారణముగ జలములకు నారములనియు, నారములే అయనము (స్థానము) గ కలిగియుండుటచే అతనికి నారాయణుడనియు పేరు కలిగెను.




**టీ :-** తాస్వితి. అప్సు వాసం నారాయణనామనిరుక్త్యా స్పష్టయతి - తేన అప్సువాసేన యత్ యస్మాత్పురుషః నరః తస్మాదుద్భవో యాసాం నారాః ఆపః అయనమస్యేతి నారాయణ ఇత్యర్థః తదుక్తం - శ్లో. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నర సూనవః, అయనం తస్య తాః పూర్వం తేన నారాయణస్మృతః. (11)

**టీ.** అప్సువాసం నారాయణనామనిరుక్త్యా స్పష్టయతి - నారాయణుడని చెప్పుటచేత అతని నీటియందు నివాసమును స్పష్టము చేయుచున్నాడు. తేన - నీటి యందు నివాసము చేత - యద్యస్మాత్పురుషో నరస్తస్మాదుద్భవో యాసాంతా నారాః - పురుషుడనగా నరుడు నరుని నుండి ఉద్భవించినవి కావున నారాః అని జలములకు పేరు. ఆపోయనమస్యేతి నారాయణ ఇత్యర్థః - నీటిని స్థానముగా గలవాడు కావున అతనికి నారాయణుడని పేరని యర్థము. తదుక్తమ్- అదిచెప్పబడినది - "ఆపోఽ నారా ఇతి ప్రోక్తా ఆపోవై నరసూనవః! అయనం తస్య తాః పూర్వం తేన నారాయణ స్మృతః" ఇతి - "నీరు నారములని చెప్పబడును. నరుని నుండి ఉద్భవించినవే నారములు నారములు (జలములు) పూర్వము అయనముగ (స్థానముగ) గలవాడు కావున అతడు నారాయణుడని చెప్పబడెను." అని. (11)

ద్రవ్యం కర్మచ కాలశ్చ
స్వభావో జీవ ఏవ చ ।
యదనుగ్రహతః సంతి
న సంతి యదుపేక్షయా ॥ - 12

**తా.** ఉపాదాన కారణమగు ద్రవ్యము, కర్మ, కాలము, స్వభావము, జీవుడు, ఎవని అనుగ్రహము వలన ఉందురో, ఎవని ఉపేక్ష వలన ఉండరో - అతడే నారాయణుడు -

**టీ :-** తస్య ప్రభావమాహ - ద్రవ్యమితి. ద్రవ్యం ఉపాదానం కర్మాదీని నిమిత్తాని జీవః భోక్తా. యస్యానుగ్రహాత్సంతి కార్యక్షమా భవంతీత్యర్థః. (12)

**టీ.** తస్య ప్రభావమాహ - అతని ప్రభావమును (మహిమను) చెప్పుచున్నాడు. - ద్రవ్యం - ఉపాదానము - కర్మాదీని నిమిత్తాని - కర్మ మొదలగునవి గుణుతులు. జీవః - భోక్త - యస్యానుగ్రహాత్సంతి - ఎవని అనుగ్రహముచే కార్యసమర్థములగునో అని యర్థము. (12)






ఏకో నానాత్వమన్విచ్ఛ
న్యోగ తల్పాత్సముత్థితః ।
వీర్యం హిరణ్మయం దేవో
మాయయా వ్యసృజత్త్రిధా ॥ -13

**తా.** ఒక్కడే యగు భగవానుడు యోగనిద్రనుండి మేలుకొని వివిధత్వమును సృజింపగోరి, తన మాయతో, తన సువర్ణమయమగు వీర్యమును మూడు విధములుగ విభజించెను.

**టీ :-** ఏక ఇతి. యోగ ఏవ తల్పం శయ్యా. తస్మాత్ వీర్యం గర్భరూపం దేహం హిరణ్మయమితి ప్రకాశబహులం. (13)

**టీ.** యోగఏవతల్పంశయ్యా తస్మాత్ – యోగమేశయ్య (పడక) దాని నుండి (లేచి) – వీర్యం – గర్భరూపమైన దేహమును – (చతుర్దశ భువనాత్మకమగు సమష్టిదేహము) హిరణ్యమయమివ ప్రకాశ బహులమ్ – బంగారముతో నిండిన దాని వలె మిక్కిలిగ ప్రకాశించు.(13)

అధి దైవమథాధ్యాత్మ
మధి భూత మితి ప్రభుః ।
అథైకం పౌరుషం వీర్యం
త్రిధా௨ భిద్యత తచ్ఛృణు ॥ - 14

**తా.** ప్రభువైన భగవానుడు తన ఒకే ఒక విరాట్పురుష శక్తిని అధిదేవ, అధ్యాత్మ, అధిభూతములు అని మూడు విధములుగ విభజించుటను గూర్చి వినుము.

**టీ :-** అస్యైవ ప్రపంచః అధీతి. ఏవమధిదైవాదిరూపేణ త్రిధా భిన్నస్యాపి కార్యస్య ఏకం పౌరుషం పురుష సంబంధి క్రియాశక్తిరూపం త్రిధా௨ భిద్యతేతి యత్ తచ్ఛృణు. (14)

**టీ.** 'అధీ' ఇత్యాదినా – అధి మొదలగు శ్లోక భాగముతో – తస్యైవ ప్రపంచః – దాని యొక్క విస్తరమే (14)

అంతః శరీర ఆకాశా
త్పురుషస్య విచేష్టతః ।
ఓజః సహో బలం జజ్ఞే
తతః ప్రాణో మహానసుః ॥ - 15

**తా.** విరాట్పురుషుని కదలిక వలన అతని శరీరాకాశము నుండి, ఇంద్రియ బలము, మనోబలము, శరీర బలము ఉత్పన్నములైనవి, వాని నుండి ముఖ్యమైన ప్రాణము ఆవిర్భవించినది.




**టీ :-** అంతరితి. అంతశ్శరీరే యః ఆకాశః తస్మాత్ర్కియాశక్త్యా వివిధం చేష్టమానస్య సతః ఓజః ఇంద్రియశక్తిః సహః మనశ్శక్తిః బలం దేహశక్తిః తతః క్రియాశక్త్యాత్మనస్సూక్ష్మాద్రూపాత్ ప్రాణః సూత్రాఖ్యః మహాన్ ముఖ్యః స ఏవాసుః అస్యాత్మకః ప్రాణస్సర్వేషాం.(15)

**టీ.** అంతః శరీరే య ఆకాశస్తస్మాత్ర్కియా శక్త్యా తత్ర వివిధ చేష్టమానస్య సతః – శరీరము నందలి లోపలి భాగమున గల ఆకాశమునుండి క్రియాశక్తి చేత అచట కదలిక నొందుచున్న సద్రూపుడగు పరమాత్మయొక్క – ఓజః – ఇంద్రియ శక్తి – సహః – మనశ్శక్తి– బలం – దేహశక్తి – తతః శక్త్యాత్మకాత్సూక్ష్మాద్రూపాత్ప్రాణః సూత్రాఖ్యః – అట నుండి ఆశక్త్యాత్మకుని సూక్ష్మరూపము నుండి సూత్ర సంజ్ఞగల ప్రాణము– మహాన్ – ముఖ్యమైనది – అసుః ప్రాణః సర్వేషామ్ – అన్ని ప్రాణుల ప్రాణము. (15)

అనుప్రాణంతి యం ప్రాణాః
పాణం తం సర్వజంతుషు ।
అపానం తమపానంతి
నరదేవమివానుగాః ॥ - 16

**తా.** సర్వ ప్రాణులయందును ప్రాణములు ఆ విధముగ ఉత్పన్నము చేయబడగా, అవి ఇంద్రియములను చైతన్యవంతము చేయును. (ఇంద్రియములు ప్రాణమును అనుసరించి క్రియాన్వితములగును. చేష్టలుడిగిన ప్రాణముననుసరించుచు ఇంద్రియములు కూడ చేష్టలుడుగును. రాజును సేవకులనుసరించునట్లు ఇంద్రియములు ప్రాణముననుసరించును)

**టీ :-** మహత్త్వం దర్శయతి – అన్వితి. ప్రాణాః ఇంద్రియాణి యం ప్రాణంతం చేష్టాం కుర్వంతం అనుపశ్చాత్ప్రాణంతిచేష్టాం కుర్వంతి. అపానంతం చేష్టాం త్యజంతి. రాజానమను భృత్యా ఇవ. (16)

**టీ.** మహత్తత్వం దర్శయతి – మహత్తుయొక్క లక్షణమును చూపుచున్నాడు – ప్రాణాః – ఇంద్రియములు – యంప్రాణం తం చేష్టాం కుర్వంతం – చేష్ట చేయుచున్న ప్రాణమును – అను–వెంటనే – ప్రాణంతి – చేష్టచేయును – అపానం తం – చేష్టకోల్పోయిన ప్రాణమును–అను అపానంతి – అనుసరించి త్యజించును – రాజానమనుభృత్యా ఇవ – రాజును అనుసరించు సేవకుల వలె. (16)

ప్రాణేన క్షిపతక్షుత్తృ
డంతరా జాయతే ప్రభోః ।
పిపాసతో జక్షతశ్చ
ప్రాఙ్ముఖం నిరభిద్యత ॥ - 17

**తా.** ప్రభువైన విరాట్పురుషునకు ప్రాణముతో ఆకలి దప్పుల వ్యవస్థ జనించెను. నీరు త్రాగగోరువాడును, ఆహారమును తినగోరువాడునైన ఆతనికి మొట్టమొదట ముఖము(నోరు) ఏర్పడెను.

**టీ** :- ప్రాణేనేతి. క్షిపతా చానయతా నిమిత్తేన, క్షుత్తృడాదికం విరాడ్జీవాభేదేనోపాసనార్థముక్తం. జాయతే స్మ క్రియాత్మకః. తతో జక్షతః భక్షయితుమిచ్ఛత ఇత్యర్థః. ప్రాక్ప్రథమం నిరభిద్యత విభక్త మభూత్. (17)

**టీ.** క్షిపతా - చాలయితా - కదలించు - నిమిత్తేన క్షుత్తృడాదికమ్ - ఆ కదలిక కారణముచేత ఆకలి దప్పులు మొదలగునవి - ప్రభోరితి విరాట్ జీవాభేదేనోపాసనార్థముక్తమ్ - 'ప్రభోః' అను మాట (ను) విరాట్ పురుషునకు జీవునకును అభేదమును భావించు ఉపాసన కొఱకు ప్రయోగించుట జరిగినది - ఆజాయతేస్మ - పుట్టెను- తతోజక్షతః అప్పుడు తినుటకిచ్ఛగల వానికి అని యర్థము - ప్రాక్ - మొదట - నిరభిద్యత - వేఱుగ నేర్పడెను.(17)

ముఖతస్తాలు నిర్భిన్నం
జిహ్వా తత్రోపజాయతే ।
తతోనానారసో జజ్ఞే
జిహ్వయా యో ఉ ధిగమ్యతే ॥ -18

**తా.** ముఖము నుండి తాలువు (దౌడ), తాలువునుండి నాలుక ప్రకటమైనవి. అటుపైన నాలుకచే గ్రహింపబడదగిన వివిధములైన రసములు ఉత్పన్నములైనవి.

**టీ** :- ముఖత ఇతి. తాలుః అధిష్ఠానం జిహ్వా ఇంద్రియం. నానారసో విషయః. వరుణశ్చ దేవతా జ్ఞాతవ్యా. ఏవం సర్వత్ర అధిష్ఠానమింద్రయం దేవతా విషయశ్చేత్యేతచ్చతుష్టయమనుక్త మప్యూహ్యం. (18)

**టీ.** తాల్వధిష్ఠానమ్ - దవడ ఆశ్రయ స్థానము - జిహ్వా - నాలుక (రసనేంద్రియము) నానారసోవిషయః - రసవైవిధ్యము విషయము - వరుణశ్చ దేవతా జ్ఞాతవ్యా - వరుణుడు దేవతగా తెలియదగినది - ఏవం సర్వత్రాధిష్ఠానమింద్రియం దేవతా విషయ ఇత్యేతచ్చతుష్టయ మనుక్తమప్యూహ్యమ్ - ఇట్లు అంతటను అధిష్ఠానము, ఇంద్రియము, దేవత, విషయము అను నాలుగును చెప్పబడకున్నను గ్రహింపదగినవి.(18)

వివక్షోర్ముఖతో భూమ్నో
వహ్నిర్వాగ్వ్యాహృతం తయోః ।
జలేవై తస్య సుచిరం
నిరోధః సమజాయత ॥ - 19

**తా.** అతనికి మాట్లాడుటకు ఇచ్ఛ కలుగగా వాగింద్రియము, దాని అధిష్ఠానదేవతయగు అగ్ని, మరియు దానికి విషయమగు వాక్కు- ఈ మూడును ప్రకటమైనవి. అటుపిమ్మట చాలా కాలము వఱకు అతడా జలమునందే ఆగియుండెను.

**టీ** :- వివక్షోరితి. వివక్షోః వక్తుమిచ్ఛోః ముఖత ఏవ వహ్నిః దేవతా. వాక్ ఇంద్రియం వ్యాహృతం భాషణం. తయోరితి ఇంద్రియదేవతాధీనత్వం కర్మణో దర్శయతి. (19)

**టీ.** వివక్షోః - మాట్లాడనిచ్ఛగలదాని యొక్క ముఖము యొక్క - వహ్నిః - అగ్నిదేవత - వాక్ - ఇంద్రియము - వ్యాహృతం - భాషణము - తయోరితీంద్రియ దేవతాధీనత్వం కర్మణో దర్శయతి - తయోః (వాని యొక్క - ఆరెండింటి యొక్క) అని వాగింద్రియము యొక్క, తదధిష్ఠాన దేవత యొక్కయు వశమున నున్న వాక్కును చెప్పుచున్నాడు. (చూపుచున్నాడు) (19)

నాసికే నిరభిద్యేతాం
దోధూయతి నభస్వతి ।
తత్రవాయుర్గంధ వహో
ఘ్రాణోనసి జిఘృక్షతః ॥ - 20

**తా.** ప్రాణ వాయువు చివరి వఱకు చలింపగా నాసికా రంధ్రములు ప్రకటమయ్యెను. ఆ నాసిక యందు, గంధము గ్రహింప నిచ్ఛగల అతని నాసిక యందు శ్వాస, మరియు గంధవహుడైన వాయువు తదధిష్ఠాన దేవతగా ప్రకటమయ్యెను.

**టీ** :- నాసిక ఇతి. నభస్వతి ప్రాణవాయౌ దోధూయమానే అత్యంతం ప్రచలతి. తత్ర నసి నాసికాయాం వాయుర్దేవతా. గంధం వహతీతి తథా. అనేన గంధో విషయో దర్శితః. ఘ్రాణ ఇంద్రియం. జఘృక్షతః గంధం గృహీతుమిచ్ఛతః. (20)

**టీ.** నభస్వతి - ప్రాణవాయువు - దోధూయతి - అంతము వఱకును చలించుచురాగా - తత్ర - నాసిక యందు - వాయుః - వాయుదేవత - గంధం వహతీతి తథా - గంధమును మోయును కావున గంధవహుడు - అనేన గంధో విషయోదర్శితః - దీనిచే గంధము అనగా ఘ్రాణ విషయము చూపబడినది - ఘ్రాణః - శ్వాసేంద్రియము - జిఘృక్షతః - గంధమును గ్రహింప నిచ్ఛ గలవాని యొక్క . (20)

యదాత్మని నిరాలోక
మాత్మానం చ దిదృక్షతః ।
నిర్భిన్నేహ్యక్షిణీ తస్య
జ్యోతిశ్చక్షుర్గుణ గ్రహః ॥ - 21

**తా.** తన దేహమును, ఇతర వస్తువులను చూడఁగోరిన ఆవిరాట్పురుషుని దేహమునందు అంతయు చీకటిగనుండ, అప్పుడతని కన్నులు ప్రకటములయ్యెను. ఆ కన్నులు ఆదిత్య దేవతాకములై, నేత్రేంద్రియాత్మకములై, రూప గుణగ్రాహకములై యుండెను.

**టీ** :- యదేతి. నిరాలోకం ప్రకాశశూన్యం. ఆసీదితి శేషః నిర్మక్షికమితివదవ్యయీభావః, తదాత్మానం దేహం చ కాలాదన్యచ్చ వస్తు దిదృక్షతః. అక్షిణీ స్థానం జ్యోతిః ఆదిత్యో దేవతా. చక్షుః ఇంద్రియం. తతో గుణస్య రూపస్య గ్రహః గ్రహణం. అనేన రూపం విషయో దర్శితః. (21)

**టీ.** నిరాలోకం ప్రకాశశూన్యమాసీదితి శేషః – చీకటిగ నుండెనని గ్రాహ్యార్థము. 'నిర్మాక్షికం' అనుదానివలె అవ్యయీభావము – తదా – అప్పుడు – ఆత్మానం – దేహమును – చకారాదన్యచ్చ వస్తు–'చ' కారము వలన ఇతరమైన వస్తువు (లను) కూడ – దిదృక్షతః – చూచుటకు ఇచ్ఛగలవాని యొక్క – అక్షిణీ – (నేత్ర) స్థానము – జ్యోతిః – ఆదిత్యుడు, దేవత చక్షుః– ఇంద్రియము – తతో గుణస్య రూపస్య గ్రహః – దాని వలన గుణము యొక్క రూపము యొక్క గ్రహణము – అనేన రూపం విషయో దర్శయతి – దీనిచే రూప సంబంధవిషయమును చూపుచున్నాడు. (21)

బోధ్యమానస్య ఋషిభి
రాత్మనస్తజ్జిఘృక్షతః ।
కర్ణౌ చ నిరభిద్యేతాం
దిశః శ్రోత్రం గుణగ్రహః ॥ - 22

**తా.** వేద (స్తోత్ర) ములచేత మేలు కొలుపబడుచున్నప్పుడు ఆ ప్రబోధమును వినఁగోరు విరాట్పురుషునకు చెవులు ప్రకటమయ్యెను. తోడ్తో వాని అధిష్ఠానదేవతలగు దిక్కులు, శ్రోత్రేంద్రియము, శబ్దమును గ్రహించుటయును ఏర్పడెను.

**టీ** :- బోధ్యమానస్యేతి. ఋషిభిః దేవైః బోధ్యమానస్య సతః ఆత్మనః ప్రబోధనం గృహీతుమిచ్ఛతః కర్ణౌ అధిష్ఠానం దిశః దేవతాః శ్రోత్రమింద్రియం తతో గుణగ్రహః శబ్దగ్రహణం.(22)

**టీ.** ఋషిభిః – వేదముల చేత – బోధ్యమానస్య – (మేలుకొలుపబడువాని యొక్క)– తదాత్మనః – అట్టివాని – జిఘృక్షతః – ప్రబోధనమును గ్రహించుట కిచ్ఛగలవాని యొక్క – తతో గుణ గ్రహః – వాని నుండి శబ్ద గ్రహణము. (22)

వస్తునో మృదు కాఠిన్య లఘు గుర్వోష్ణ శీతతామ్
జిఘృక్షతస్త్వఙ్గిర్భిన్నా తస్యాం లోమమహీరుహాః
తత్రచాంతర్బహిర్వాతస్త్వచా లబ్ధగుణోవృతః - 23

**తా.** వస్తువు యొక్క మెత్తదనము, గట్టిదనము, చిన్నతనము, పెద్దతనము, వేడి, చల్లదనము మున్నగువానిని తెలిసికొనగోరునట్టి ఆ పురుషునకు చర్మము ప్రకటమైనది. భూమిపై చెట్లు మొలకెత్తునట్లు ఆ చర్మముపై రోమములు పుట్టినవి. దానిలోపలి భాగము నందు వెలుపలి భాగమునందును వాయువు ప్రకటమైనది. స్పర్శను గ్రహింపగల చర్మము (ఇంద్రియము) అంతటను ఆవరించినది. అప్పుడతనికి స్పర్శగుణము లభించినది.

టీ :- వస్తున ఇతి. మృదుత్వం చ కాఠిన్యం చ లఘుత్వం చ గురుత్వం చ ఉష్ణత్వం శీతతాం చేత్యర్థః. యద్యపి ఉష్ణత్వమపి ఇంద్రియ విషయ ఏవ తథాపి తస్య జిఘృక్షాభావాత్. ఔష్ణ్యమిత్యుక్తం. గురుష్ణమితి పాఠే యణాదేశశ్చాందసః. వస్తునః ఏతాన్ గుణాన్ జిఘృక్షతః త్వఙ్నిర్భిన్నా త్వగింద్రియాధిష్ఠానం చర్మ జాతమిత్యర్థః. తస్యాం లోమాని ఇంద్రియం, మహీరుహాశ్చ దేవతా జాతాః వస్తుని హస్తేనాతోలితే లఘుత్వ గురుత్వయోర్జ్ఞానాత్ తయోరపి త్వగింద్రియ విషయత్వమితి పౌరాణికాః. (23)

**టీ.** మృదుత్వము, కాఠిన్యము, లఘుత్వము, గురుత్వము, మిక్కిలివేడి, కొంచెము వేడి, చల్లదనము, అని యర్థము – యద్యప్యత్యుష్ణత్వమపీంద్రియ విషయ ఏవ – మిక్కిలి వేడిమి కూడ స్పర్శేంద్రియమునకు విషయమేయగుచున్నది – తథాపి తస్యజిఘృక్షతః జిఘృక్షాభావాదోష్ణత్వమిత్యుక్తమ్ – అయినను ఆ మిక్కిలి వేడిమిని తెలిసికొనవలయుననెడి ఇచ్ఛ అతనికి లేకున్నను మిక్కిలి వేడిమి అనియే చెప్పబడినది – గుర్వుష్ణేతిపాఠే యణాదేశశ్చాందసః – 'గుర్వుష్ణ' పాఠమునందు యణాదేశము ఛాందసము – వస్తున ఏతాన్ ధర్మాన్ జిఘృక్షతస్త్వక్ నిర్భిన్నా – వస్తువు యొక్క ఈ ధర్మములను తెలిసికొననిచ్ఛగలవానికి చర్మము వేరై ప్రకటమయ్యెను – త్వగింద్రియాధిష్ఠానం చర్మ జాతమిత్యర్థః – త్వగింద్రియమునకు అధిష్ఠానమగు చర్మము పుట్టెనని యర్థము. తస్యాం రోమాణీంద్రియం–దాని యందు రోమములు, ఇంద్రియము (త్వక్) ఉన్నవి పుట్టినవి – మహీరుహాశ్చ దేవతా జాతాః – చెట్లును, దేవతలును పుట్టిరి – వస్తుని హస్తేనా తోలితే లఘుత్వ గురుత్వ యోర్జ్ఞానాత్తయోరపి త్వగింద్రియ విషయత్వమితి పౌరాణికాః – రెండు వస్తువులను చేతితో లెస్సగా తూఁచునప్పుడు ఆ వస్తువులలో ఏది తేలికైనదో, ఏది బరువైనదో తెలియుట వలన, అట్టివాని జ్ఞానమునకు కూడ త్వగింద్రియమే ప్రమాణమని పౌరాణికులందరు – తత్ర త్వచ్యంతర్బహిశ్చ వాతో వృత ఆవృత్య స్థితః – అచట త్వగింద్రియము యొక్క లోపల, వెలుపల, గాలి ఆవరించియున్నది. కర్తరినిష్ఠా – ఇక్కడి నిష్ఠా (వృత అను శబ్దములోని తప్రత్యయము) కర్త్రర్థకమేకాని కర్మార్థకము కాదు – కథం భూతః – అతడెట్టివాడు?– త్వచాలబ్ధోగుణః స్పర్శోయేన – త్వగింద్రియముచేత పొందబడిన గుణము (స్పర్శ) ఎవనిచేత గ్రహింపబడునో – అయమర్థః – దీని అర్థము – త్వగింద్రియమేవ బహిః కండూతి సహితం స్పర్శం గృహ్ణల్లోమ శబ్దేనోచ్యతే – త్వగింద్రియమే వెలుపల 'కండూతి' (స్పర్శ) తో కూడ స్పర్శను గ్రహించుచు 'లోమ' శబ్దముతో చెప్పబడును– తత్ర మహీరుహాణాం దేవత్వమ్ –

అచట చెట్లకు దేవత్వము– అంతర్బహిశ్చ స్పర్శం గృహ్ణాత్ తదేవ త్వక్ఛబ్దేనోచ్యతే – లోపల వెలుపల స్పర్శను గ్రహించునదియే త్వక్ శబ్దముతో చెప్పబడును – తత్రవాతో దేవతా – ఇచట వాయువు దేవత – తథాచ తృతీయే వక్ష్యతి, "త్వచమస్య వినిర్భిన్నాం వివిశుర్ధిష్ణ్య మోషధీః! అంశేన లోమభిః కండూం యైరసౌ ప్రతిపద్యతే!! నిర్భిన్నాన్యస్య చర్మాణి లోకపాలో౽ నిలో౽ విశత్ ! ప్రాణేనాంశేన సంస్పర్శం యేనాసౌ ప్రతిపద్యతే" ఇతి – అట్లే మూడవ స్కంధమున (6 అధ్యా. శ్లో. 18–16) – "విరాట్ శరీరమున చర్మము ఉత్పన్నమైనది. దాని యందు రోమముల సహితముగ ఓషధులును ఉన్నవి. వాని మూలమున జీవుడు దురద మొదలగు అనుభవములను పొందును". 'విరాట్ విగ్రహమున త్వక్కు ఉత్పన్నమైనది. దానిలో తన అంశమగు త్వగింద్రియముతోఁబాటుగ వాయువు స్థితి కలిగి యుండినది. ఆ త్వగింద్రియముతో జీవుడు 'స్పర్శను' అనుభవించును". అని చెప్పబడినది – తత్ర చర్మాణీతి చర్మోపలక్షితా త్వగిత్యర్థః – అచట చర్మాణి అని చర్మోపలక్షితమైన 'త్వక్కు' అని యర్థము – ప్రాణేనాంశేనేతి ప్రాణవాయువ్యాప్తేన త్వగింద్రియేణేత్యర్థః – 'ప్రాణము యొక్క అంశతో" అని ప్రాణ వాయువు యొక్క వ్యాప్తి గల త్వగింద్రియముతో నని యర్థము. బహ్వృచశ్రుతౌ త్వేకఏవాంశో నిర్దిష్టః – బహ్వృచ శ్రుతి యందు (ఐతరేయోపనిషత్తునందు) ఒకే అంశము సూచింపబడినది. "త్వఙ్నిరభిద్యత త్వచోలోమాని లోమభ్య ఓషధి వనస్పతయ" ఇతి, త్వక్కు వేరయ్యెను. త్వక్కు నుండి రోమములు, వాని నుండి ఓషధులు, చెట్లును" అని –(23)

హస్తౌరురుహతుస్తస్య
నానాకర్మ చికీర్షయా ।
తయోస్తు బలమింద్రశ్చ
ఆదానముభయాశ్రయమ్ ॥ -24

**తా.** అతనికి, వివిధములైన కర్మలను చేయుటకు కోరిక కలుగుట చేత రెండు చేతులు పెరిగెను. వానికి బలము ఇంద్రుడు. ఆ రెండు చేతులకును గ్రహణ శక్తి ఆశ్రయించి యున్నది. హస్తేంద్రియము, అధిదేవత ఇంద్రుడు ప్రకటమయ్యెను.

టీ. రురుహాతుః – విభిన్నౌ – వేరయ్యెను ప్రకటమయ్యెను. మొలిచెను – బలం –

**టీ :-** రురుహతుః నిర్భిన్నౌ బలమింద్రియం ఇంద్రో దేవతా తదుభయాశ్రయమాదానం కర్మ (24)

ఇంద్రియము – ఇంద్రోదేవతా – ఇంద్రుడు దేవత – తదుభయాశ్రయమాదానం కర్మ – ఆ రెండింటిని ఆశ్రయించినది గ్రహణ కర్మ. (24)

**తా.** అభీష్టస్థానమునకు పయనింపగోరునాతనికి రెండు పాదములు కలిగెను. పాదములతో బాటుగ తదింద్రియాధిష్ఠాన దేవతగా స్వయముగ విష్ణుభగవానుడే ప్రకటమయ్యెను. పాదములతో గమన రూప కర్మయు ప్రకటమైనది. మనుష్యులీ పాదములతో నడచియే యజ్ఞసామగ్రిని సమకూర్చుకొందురు.

గతిం జగీషతః పాదౌ
రురుహాతే ఽ భికామికామ్ ।
పద్భ్యాం యజ్ఞః స్వయం హవ్యం
కర్మభిః క్రియతే నృభిః ॥ - 25

**టీ.** అభికామికామ్ పద్భ్యాంసహ యజ్ఞో విష్ణురేవ స్వయం తదధిష్ఠాతృ రూపేణ స్థితః కర్మభిరితి గత్యాఖ్యా కర్మ శక్తిరింద్రియముక్తమ్ హవ్యం క్రియత ఇతి గతిప్రాప్యం యజ్ఞార్థం ద్రవ్యం విషయ ఇత్యుక్తమ్ నృభిరితి వ్యష్టి జీవేష్వపీయమేవ రీతిరితి దర్శయన్నరాధికారిత్వ యజ్ఞాదీనాం దర్శయతి. నృభిః (25)

**టీ.** అభికామికామ్ – అభీష్టమైన హితమైనయని యర్థము (గతిక విశేషణము) – పద్భ్యాంసహ యజ్ఞో విష్ణురేవ స్వయం తదధిష్ఠాతృ రూపేణ స్థితః – పాదములతో కూడ స్వయముగ విష్ణువే వాని అధిష్ఠాన రూపముతో ప్రకటమయ్యెను – కర్మభిరితి గత్యాఖ్యా కర్మ శక్తిరింద్రియముక్తమ్ – 'కర్మభిః' అని గతియను పేరుగల కర్మశక్తి యను ఇంద్రియము చెప్పబడినది – హవ్యం క్రియత ఇతి గతిప్రాప్యం యజ్ఞార్థం ద్రవ్యం విషయ ఇత్యుక్తమ్ – యజ్ఞము కొఱకైన ద్రవ్యము నడకచే పొందదగినది కావున అది విషయముగా చెప్పబడినది – నృభిరితి వ్యష్టి జీవేష్వపీయమేవ రీతిరితి దర్శయన్నరాధికారిత్వ యజ్ఞాదీనాం దర్శయతి. నృభిః – మనుష్యులచేత అని వ్యష్టి జీవుల యందు కూడ ఇదియే పద్ధతి యని చూపుచు యజ్ఞాదుల అధికారిత్వమును గూర్చియు చెప్పుచున్నాడు. (25)

నిరభిద్యత శిశ్నో వై
ప్రజానందామృతార్థినః ।
ఉపస్థ ఆసీత్కామానాం
ప్రియం తదుభయాశ్రయమ్ ॥ - 26

**తా.** సంతానము, రతి, స్వర్గభోగ సంబంధమగు నిచ్ఛ కలిగినప్పుడు విరాట్పురుషునకు శిశ్నము (లింగము) ప్రకటమైనది. దాని యందు ఉపస్థేంద్రియము, ప్రజాపతి దేవత ఈ రెండింటిని ఆశ్రయించిన కామసుఖము ఆవిర్భవించినది.

**టీ** :- ప్రజా అపత్యం ఆనందః రతిః. అమృతం స్వర్గాది తదర్థినః . శిశ్న అధిష్ఠానం ఉపస్థఇతి. ఉపస్థ ఇంద్రియం ప్రజాపతిశ్చాసీదితి జ్ఞేయం. తదుభయాశ్రయమింద్రియదేవతా శ్రయం. కామానాం స్త్రీసంభోగానాం సంబంధి ప్రియం సుఖం. (26)

ఉత్సిసృక్షోర్ధాతుమలం
నిరభిద్యత వై గుదమ్ ।
తతః పాయుస్తతో మిత్ర
ఉత్సర్గ ఉభయాశ్రయః ॥ - 27

**టీ** :- ధాతుమలం. భుక్తానామన్నాదీనామసారాంశం త్యక్తుమిచ్ఛోః. గుదపాయుమిత్రోత్సర్గా అధిష్ఠానేంద్రియ దేవతా విషయాః.

ఆసిసృప్సోః పురః పుర్యా
నాభిద్వారమపానతః ।
తత్రాపానస్తతో మృత్యుః
పృథక్త్వముభయాశ్రయమ్ ॥ -28

టీ :- పుర్యాః దేహాంతరాణి ఆసిసృప్సోః సర్వతో గంతుమిచ్ఛోః నాభిద్వారం నిరభిద్య తేత్యనుషంగః. అపానతః అపగచ్ఛతః తత్రేతి.

**టీ.** ప్రజా - సంతానము- ఆంనదః - రతి - అమృతం - స్వర్గ భోగము- తదర్థినః - అది కోరువానికి - శిశ్నము అధిష్ఠానము - ఉపస్థ ఇంద్రియము, ప్రజాపతిశ్చాసీదితి జ్ఞేయమ్ - ప్రజాపతి (దేవతయు) కలిగెనని తెలియవలెను. తదుభయాశ్రయం కామానాం సంబంధి ప్రియం సుఖం - ఆ రెండింటిని ఆశ్రయించియున్న కాముక సంబంధమైన సుఖము (ఆవిర్భవించెను) (26)

**తా.** ధాతుమలమును విసర్జించు నిచ్ఛగలవాడైన అతనికి గుదస్థానము ప్రకటమయ్యెను. అటుపిమ్మట పాయువు (ఇంద్రియము) మిత్రదేవత ఉత్పన్నమయ్యెను. ఈ రెండింటినాశ్రయించియే విసర్జన క్రియ ఉండును.

**టీ** - ధాతుమలం - తినిన అన్నము మొదలగువాని సారములేని భాగము - త్యక్తుం ఇచ్ఛోః - విసర్జించు నిచ్ఛగల వాడైన విరాట్పురుషునకు - గుదపాయుమిత్రోత్సర్గా అధిష్ఠానేంద్రియ దేవతా విషయాః - అధిష్ఠాన, ఇంద్రియ, దేవత, విషయములు. (27)

**తా.** అపాన మార్గము ద్వారా దేహాంతరములకు పోవనిచ్ఛగలవాడైన విరాట్పురుషునకు నాభి ద్వారము ప్రకటమయ్యెను. దాని నుండి అపానము, మృత్యుదేవతయును ప్రకటములైనవి. ఈ రెండింటి ఆశ్రయముననే ప్రాణాపాన విచ్ఛేదము - అనగా మృత్యువు కలుగును.

**టీ.** పుర్యా - దేహము నుండి- పురః - దేహము (దేహాంతరములు) - ఆసిసృప్సోః - అంతటను పోవునిచ్ఛగల ఆతనికి - నాభి ద్వారం నిరభిద్యతేత్యనుషంగః - నాభి (బొడ్డు)

పృథక్త్వం మరణం నాభ్యాదీని అధిష్ఠానాదీని నాభ్యాం హి ప్రాణాపానయోర్బంధవిశ్లేషణం మృత్యురితి ప్రసిద్ధం. (28)

ఆదిత్సోరన్నపానానా
మా సన్కుక్ష్యంత్రనాదయః।
నద్యః సముద్రాశ్చ తయో
స్తుష్టిః పుష్టిస్తదాశ్రయే.॥ - 29

**టీ** :- అన్నపానానామాదిత్సోః సంగ్రహీతుమిచ్ఛోః కుక్షిశ్చాంత్రాణి నాడ్యశ్చాసన్. తత్రకుక్షిరధిష్ఠానం ఆంత్రాణి అన్నసంగ్రహేకరణం ఇంద్రియస్థానీయం నాడ్యస్తు పానసంగ్రహే. నద్య ఇతి తయోః నాడ్యాంత్రవర్గయోః క్రమేణ నద్యస్సముద్రాశ్చ దేవతే. తుష్టిః ఉదరభరణం. పుష్టిస్తు రసపరిణామతః స్థౌల్యం. తదాశ్రయే తదుభయనిమిత్తే. తత్రాన్న సంగ్రహేచ్ఛోః కుక్షంత్ర సముద్ర చతుష్టయ ఇతి చతుష్టయం. పేయ సంగ్రహేచ్ఛోః కుక్షినాడీ నదీ పుష్టయశ్చతుష్టయమితి వివేకః (29)

ద్వారము (రంధ్రము) ఏర్పడెనని చేర్పు (చేరిక) - అపానతః - వెలవడు మార్గమున - పృథక్త్వం - మరణము - నాభ్యాదీన్యధిష్ఠానాదీని - నాభి మొదలగునవి అధిష్ఠానము మొదలైనట్టివి - నాభ్యాంహి ప్రాణాపానయోర్బంధ విశ్లేషే మృత్యురితి ప్రసిద్ధమ్ - నాభి నుండియే ప్రాణాపానములు వేర్పాటుతో మరణము కలుగునని ప్రసిద్ధము. (28)

**తా.** అన్నము, నీరు గ్రహింపఁగోరిన విరాట్పురుషునకు, కడుపు, ప్రేవులు, నాడులు ఏర్పడినవి. వానివెంట, కుక్షి దేవత సముద్రము(లు) నాడీ దేవతలగు నదులు, ఇంకను తుష్టి, పుష్టి అనునట్టి ఆ రెండింటిని ఆశ్రయించి యుండు 'విషయము' ఆవిర్భవించినవి.

**టీ.** అన్నపానానాం ఆదిత్సోః - అన్నపానములను సంగ్రహించు నిచ్ఛగల ఆపురుషునకు- కుక్షిశ్చాంత్రాణి చ నాడ్యశ్చాసన్ - కడుపు, ప్రేవులు, నాడులు ఏర్పడెను- తత్రకుక్షిరధిష్ఠానమ్ - వీనికి కడుపు అధిష్ఠానము - ఆపురుషునకు- కుక్షిశ్చాంత్రాణి చ నాడ్యశ్చాసన్ - కడుపు, ప్రేవులు, నాడులు ఏర్పడెను- తత్రకుక్షిరధిష్ఠానమ్ - వీనికి కడుపు అధిష్ఠానము - అంత్రాణ్యన్న సంగ్రహే కరణమింద్రియస్థానీయమ్ - ప్రేగులు అన్నము గ్రహించుటయందు ఇంద్రియ స్థానముననుండునవి - నాడ్యస్తుపానం గ్రహే - నాడులు, నీరు మున్నగువానిని త్రాగుటయందు ఇంద్రియ స్థానీయములు - తయోర్నాడ్యాంత్రవర్గయోః క్రమేణ నద్యః సముద్రాశ్చ దేవతే - ఆ నాడులు ప్రేవుల వర్గములకు క్రమముగ నదులు, సముద్రములు దేవతలు- తుష్టిరుదరభరణం, పుష్టిస్తు రసపరిణామతః స్థౌల్యమ్ - తుష్టియన కడుపు నింపుట, పుష్టియనగా అన్నాదిసారము యొక్క పరిణామము వలన నేర్పడు స్థూలత్వము - తదాశ్రయే - ఆ రెండింటి ఆశ్రయము - తత్రాన్నసంగ్రహేచ్ఛోః - ఆ అన్నసంగ్రహణేచ్ఛగల పురుషునకు








– కుక్ష్యంత్ర సముద్ర తుష్టయ ఇతి చతుష్టయమ్ – కడుపు, ప్రేవులు, సముద్రములు, తుష్టి అని నాలుగు – పేయసంగ్రహేచ్ఛోః – పానీయాదులు త్రాగుటకిచ్ఛగల, ఆ పురుషునకు – కుక్షినాడీ నదీ పుష్టయ ఇతి వివేకః – కడుపు, నాడులు, నదులు, పుష్టి అని విశ్లేషణ. (29)

నిదిధ్యాసోరాత్మ మాయాం
హృదయం నిరభిద్యత ।
తతోమనస్తతశ్చంద్రః
సంకల్పః కామ ఏవ చ ॥ - 30

తా. తన మాయను గూర్చి ఆలోచింపఁగోరు విరాట్పురుషునకు హృదయము ప్రకటమయ్యెను. దానితో మనస్సనెడు ఇంద్రియము, తదధిష్ఠాన దేవతచంద్రుడు, దాని విషయములగు కామ సంకల్పములును ఉత్పన్నములయ్యెను.

టీ :- నిధిధ్యాసోః నితరాం చింతయితుమిచ్ఛోః కామోభిలాషః హృదయ మనశ్చంద్ర సంకల్పాః అధిష్ఠానాదయః. (30)

టీ . నిదిధ్యాసోనితరాం చింతయితుమిచ్ఛోః – నిదిధ్యాసోః – మిక్కిలిగ చింతించు నిచ్ఛగలవానికి – కామః – అభిలాష – హృదయమనశ్చంద్ర సంకల్పా అధిష్ఠానాదయః – హృదయము, మనస్సు, చంద్రుడు, సంకల్పము – ఇవి అధిష్ఠానము మొదలగునవి.(30)

త్వక్చర్మమాంస రుధిర
మేదో మజ్జాస్థి ధాతవః ।
భూమ్యప్తేజోమయాః సప్త
ప్రాణో వ్యోమాంబు వాయుభిః ॥ - 31

తా. విరాట్పురుషుని శరీరమునందు పృథివి, జలము, తేజస్సుతో బాటుగ ఏడు ధాతువులు ప్రకటమైనవి. త్వక్కు, చర్మము, మాంసము, రక్తము, మేద, మజ్జ, ఎముకలు ఆటులే ఆకాశము, జలము, వాయువుతో ప్రాణము ఉత్పన్నమైనది.

టీ :- తదేవమధిదైవాది భేదం విభజ్యోక్త్వా తదంశ భూతానాం ధాత్వాదీనాం స్వరూపమాహ – ద్వాభ్యాం త్వగితి. త్వక్ స్థూల చర్మ తదుపరిస్థితం సూక్ష్మం త్వగాదయో ౨ స్థ్యంతాః.

టీ. తదేవమధిదైవాది భేదం విభజ్యోక్త్వా తదంశభూతానాం ధాత్వాదీనాం స్వరూపమాహ – అధిదేవతలు మొదలగు భేదములను విభజించి చెప్పి, వారి అంశభూతములగు ధాతువులుమొదలగు వాని స్వరూపములను చెప్పుచున్నాడు – త్వగితి ద్వాభ్యామ్ – 'త్వక్'









ద్వంద్వైకవద్భావేన నిర్దిష్టాః. సప్తయేధాతవః తే భూమ్యప్తేజో మయాః తేషాం పాంచభౌతికత్వే ఉ పి వాయ్వాకాశయోరాహారరూపేణ సంవర్ధకత్వాభావాదేవముక్తం (31)

గుణాత్మకానీంద్రియాణి
భూతాది ప్రభవాగుణాః।
మనః సర్వ వికారాత్మా
బుద్ధిర్విజ్ఞాన రూపిణీ ॥ - 32

**టీ** :- గుణాత్మకానీతి. గుణాత్మకాని గుణేషు శబ్దాదిషు ఆత్మా యేషాం విషయాభిముఖస్వభావానీత్యర్థః. భూతాదిః అహంకారః తతః ప్రకర్షేణ భవంతీతి తథా గుణాః శబ్దాదయః అహంకారాంశ కల్పిత శోభనస్వభావాః న తు వస్తుతస్తథేత్యర్థః. తత్ర హేతుః - యతో మన ఏవ. సర్వవికారాణామాత్మా స్వరూపం. బుద్ధిస్తు తథా భూతార్థ విజ్ఞానరూపిణీ న తు పరమార్థ గ్రాహిణీతి వైరాగ్యార్థముక్తం. (32)

మొదలుగాగల ఈ శ్లోకముతో కలిపి రెండు శ్లోకములచే - త్వక్ - స్థూల చర్మము చర్మ - దానిపై నుండెడు సూక్ష్మ చర్మము - త్వగాదయో ఉ స్థ్వంతా ద్వంద్వైకవద్భావేన నిర్దిష్టాః సప్తయే ధాతవస్తే భూమ్యప్తే జోమయాః - త్వక్కు మొదలుకొని అస్థుల వఱకు ఏకవద్భావ ద్వంద్వముగా సూచింపబడిన ఏడు ధాతువులేవి కలవో అవి భూమి, జలము, తేజస్సులతో కూడినవి - తేషాంచ పాంచభౌతికత్వేఉ పివాయ్వాకాశయోరాహారాది రూపేణ సంవదర్ధకత్వాభావాదేవముక్తం - వానిలో పంచభూతములుండవలసి యున్నను, వాయువు, ఆకాశము అనునవి ఆహారాది రూపమున శరీర వృద్ధికి వినియోగమై యుండిన కారణమున అవి కన్పట్టకపోవుటచే అటుల మూటిని మాత్రము చెప్పుట జరిగినది. (31)

**తా.** ఇంద్రియములు, శబ్దాది విషయములను గ్రహించునవి. విషయములు అహంకారమునుండి పుట్టినవి. మనస్సు అన్ని వికారములకు జన్మస్థానము. ఇక బుద్ధి సమస్త పదార్థములను గూర్చి తెలిసికొనునట్టిది.

**టీ.** గుణాత్మకాని - గుణేషు శబ్దాదిష్వాత్మా యేషామ్ - శబ్దాదులయందు వేనికి ఆత్మకలదో అవి గుణాత్మకములు - విషయాభిముఖ స్వభావానీత్యర్థః - విషయముల యెడ ఆసక్తితో నుండు స్వభావము కలవి అని యర్థము- గుణాః - శబ్దము మొదలగునవి- భూతాదిరహంకారస్తతః ప్రకర్షేణ భవంతీతి తథా - భూతాదియనహంకారము, దాని నుండి ప్రముఖముగాకలుగునవి అటుల (ప్రభవాః) చెప్పబడును- అహంకార కల్పిత శోభన స్వభావాః , నతు వస్తుతస్తథేత్యర్థః - అహంకారముచే కల్పింపబడిన సుందరములైన స్వభావములు కలవని యేకాని వస్తుతః అట్టివి కావు - అత్రహేతుః - దానికి కారణము - యతో మన ఏవ సర్వ వికారాణామాత్మా స్వరూపమ్- మనస్సు అన్ని వికారములకు స్వరూపమైనందు వలన

– తమసేష్వేవ విషయేషు సంకల్ప వికల్పమాత్రం కరోతి నతు హేయోపాదేయ వివేకమ్ – తమోగుణప్రధానములైన విషయములందే సంకల్పమునో వికల్పమునో చేయును కాని ఏది విడువదగినదో, ఏది స్వీకరింపదగినదో అను వివేకమును కాదు – బుద్ధిస్తు తథాభూతార్థ విజ్ఞాన రూపిణీ, నతు పరమార్థ గ్రాహిణీతి – బుద్ధి అట్టివేయైన అర్థములను గ్రహించు రూపమున నుండునది, కాని పరమార్థమును గ్రహించునది కాదు– అనేనైవ బుద్ధిమనసోః స్వరూపం చోక్తమ్ – దీని తోడనే బుద్ధి మనస్సుల స్వరూపము చెప్పబడినది.(32)

ఏతద్భగవతో రూపం
స్థూలం తే వ్యాహృతం మయా ।
మహ్యాదిభిశ్చావరణై
రష్టభిర్బహిరావృతమ్ ॥ - 33

**తా.** భగవంతుని ఈ స్థూలరూపమును నేను నీకు చెప్పితిని. ఇది పృథివ్యప్తేజో వాయ్వాకాశములు, అహంకార మహత్తత్త్వములు ప్రకృతి అను ఈ ఎనిమిది ఆవరణములచే ఆవరింపబడియున్నది.

**టీ :-** ఉపసంహరతి – ఏతదితి. ప్రకృత్యా సహాష్టభిః. (33)

**టీ.** ఏతదితి ఉపసంహరతి – 'ఏతత్' అను ఈ శ్లోకముతో విరాట్పురుషుని స్థూల రూపవర్ణమును సమాప్తి చేయుచున్నాడు – ప్రకృత్యాసహ అష్టభిః – ప్రకృతితో కూడ ఎనిమిదింటిచేత(33)

అతః పరం సూక్ష్మతమ
మవ్యక్తం నిర్విశేషణమ్ ।
అనాదిమధ్య నిధనం
నిత్యం వాఙ్మనసః పరమ్ ॥ - 34

**తా.** ఇంతకంటెను సూక్ష్మమైనది భగవంతుని శ్రేష్ఠమైన స్వరూపము దానికి ఏ విశేషణములు లేవు. ఉత్పత్తి, స్థితి, లయములు లేవు. అది నిత్యమైనది. వాక్కునకు, మనస్సునకు అతీతమైనది.

**టీ** :- స్థూలముక్త్వా సూక్ష్మం సమిష్టిలింగమాహ - అతః పరమితి. అతః పరం అస్య కారణభూతం సూక్ష్మం అతీంద్రియం యతః అవ్యక్తం. తత్కుతః? యతో నిర్విశేషం. తత్కుతః? అనాదిమధ్యనిధనం ఉత్పత్తి స్థితి లయశూన్యం. నిత్యం సదైకరూపం. అపక్షయాది శూన్యమిత్యర్థః. అతఏవ వాఙ్మనసశ్చేతి ద్వంద్వైక్యం. తస్మాత్పరం. (34)

**టీ.** స్థూలముక్త్వా సూక్ష్మం సమష్టిలింగ శరీర మాహ - స్థూల రూపమును గూర్చి చెప్పి, సూక్ష్మము, సమష్టియునైన లింగమాత్ర శరీరమును గూర్చి చెప్పుచున్నాడు - అతః పరమస్య కారణభూతం సూక్ష్మమతీంద్రియమ్ - అతః పరం - స్థూల శరీరమునకు కారణ భూతమైనదియు, ఏ ఇంద్రియమునకును అందరాని అవ్యక్త రూపుని అస్తిత్వమాత్రమును గూర్చి చెప్పుచున్నాడు - యతోఽ వ్యయమ్ - అవ్యక్తమ్, వ్యక్తము కానిదియు నిత్యమైనదియు నగుటవలన - తత్కుతః - అదియెందువలన? - యతో నిర్విశేషణమ్ - ఏ విశేషణము లేనందువలన - అనాది మధ్య నిధనం - ఉత్పత్తి, స్థితి, లయములు లేనిది-నిత్యం - ఎల్లవేళల యందును ఏకరూపమైయుండునది, అపక్షయాది శూన్యమిత్యర్థః - తఱిగి పోవుట వంటి పరిణామములు, వికారములు లేనిది యని యర్థము. - అతఏవ - వాఙ్మసశ్చేతి ద్వంద్వైక్యమ్ - అందువలననే వాక్కు, మనస్సు అను రెండును ఏకపదముగ చెప్పబడినవి - తస్మాత్పరమ్ - దానికంటె (వాఙ్మనస్సులకంటె) అతీతమైనది.(34)

అమునీ భగవద్రూపే
మయా తే అనువర్ణితే ।
ఉభే అపి నగృహ్ణంతి
మాయాసృష్టే విపశ్చితః ॥ - 35

**తా.** స్థూలము, సూక్ష్మము అను భగవానుని ఈ రెండు రూపములును నీకు వివరించితిని. మాయ చేత సృష్టింపబడినవి యగుటచే ఈ రెండింటిని కూడ విద్వాంసులు స్వీకరింపరు.

**టీ** :- ఉపాసనార్థం భగవత్యారోపితతయా తద్ద్వయమపవదతి - అమునీ ఇతి. న గృహ్ణంతి వస్తుతో నాంగీకుర్వంతి. మాయాసృష్టే. (35)

**టీ.** ఉపాసనార్థం భగవత్యారోపితం రూపద్వయమపవదతి - 'అమునీ' ఇతి - అమునీ అను ఈ శ్లోకమునందు, భగవంతుని యందారోపింపబడిన ఈ రెండు రూపములను ఉపాసన కొఱకు ఆరోపించబడినవి - నగృహ్ణంతి - వస్తుతః అంగీకరింపరు- యతో మాయా సృష్టే - మాయచే సృజింపబడినవి యగుట వలన, (35)

స వాచ్య వాచకతయా
భగవాన్ బ్రహ్మరూపధృక్ ।
నామరూప క్రియా ధత్తే
సకర్మా ఽ కర్మకః పరః ॥ - 36

తా. భగవానుడైన ఆతడు, పేరు చేతను, ఆ పేరుతో పిలువబడు రూపము చేతను, బ్రహ్మ రూపమును ధరించెను. నామ రూపములు, క్రియలు స్వీకరించెను. కర్మలు చేయువాడైనను అతడు వాస్తవముగ నిష్క్రియుడే.

**టీ.** 'యద్రూపంగుణకర్మకః' ఇతి యదుక్తం భగవతా బ్రహ్మాణం ప్రతి తత్ ప్రపంచయితుం బ్రహ్మాదిరూపాణి తత్కర్మాణి చాహ – స ఇత్యాదినా. ఇత్థం భూతేనేత్యతః ప్రాక్తేన గ్రంథేన. స భగవాన్ బ్రహ్మరూపధృత్సన్. వాచ్యకతయా వాచ్యతయా నామాని. క్రియాశ్చ ధత్తే సృజతీత్యర్థః. మాయయా సకర్మా సవ్యాపారస్సన్ వస్తుతస్త్వకర్మకః. (36)

టీ. 'యద్రూపంగుణకర్మకః' ఇతి యదుక్తం భగవతా బ్రహ్మాణం ప్రతి తత్ ప్రపంచయితుం బ్రహ్మాదిరూపాణి తత్కర్మాణి చాహ – 'నా విస్తారము', నా లక్షణము, నా రూపములు, గుణములు, లీలలు మున్నగువాని తత్త్వములు నా అనుగ్రహముతో నీవు తెలిసికొందువు గాక (2-9-31) అని భగవానుడు బ్రహ్మకు చెప్పినదానిని వివరించుటకు బ్రహ్మ మొదలగు దేవతల రూపములు, వారి కర్మలు చెప్పుచున్నాడు. స ఇత్యాదినా – 'సః' అని మొదలగు ఈ శ్లోకముతో – ఇత్థం భావేనేత్యతః ప్రాక్తనేన గ్రంథేన– ఇట్టి భావముతో అని గడచిన గ్రంథమున చెప్పియుండుట వలన – స భగవాన్ బ్రహ్మరూపధృక్ సన్ – ఆభగవానుడు బ్రహ్మరూపమును ధరించిన వాడగుచు – వాచ్యవాచకతయా – రూపములచే నామములచే – క్రియాశ్చ ధత్తే – క్రియలు (సృష్ట్యాదులు) స్వీకరించెనని యర్థము. మాయయా స కర్మా – మాయ చేత సవ్యాపారుడగుచును – వస్తుతస్త్వకర్మకః – నిజమునకు నిష్క్రియుడే.(36)

ప్రజాపతీన్మనూన్దేవా
నృషీన్పితృగణాన్పృథక్ ।
సిద్ధ చారణ గంధర్వా
న్విద్యాధ్రాసుర గుహ్యకాన్ ॥ - 37

**తా.** రాజా ! ప్రజాపతులను, మనువులను, దేవతలను,ఋషులను, వేర్వేఱుగ పితృగణములను, సిద్ధులను, చారణులను, గంధర్వులను, విద్యాధరులను, అసురులను, గుహ్యకులను (37) కిన్నరులను, అప్సరలను, నాగులను, కింపురుషులను, సర్పములను, ఉరగములను, మాతృకలను, రక్షస్సులను, పిశాచులను, ప్రేతములను,భూతములను, వినాయకులను (38) కూష్మాండులను, ఉన్మాదులను, వేతాలములను, యాతుధానులను,

కిన్నరాప్సరసో నాగా ।
న్సర్పాన్కింపురుషోరగాన్ ।
మాతృా రక్షః పిశాచాంశ్చ ।
ప్రేత భూత వినాయకాన్ ॥ -38

కూష్మాండోన్మాద వేతాలా ।
న్యాతుధానాన్ గ్రహానపి ।
ఖగాన్మృగాన్పశూన్వృక్షాన్ ।
గిరీన్నృప సరీసృపాన్ ॥ - 39

**టీ** :- ఏతత్ప్రపంచయతి. సార్ధైస్త్రిభిః. ప్రజాపతీనితి. ద్వితీయాంతానాం ధత్త ఇత్యనేనాన్వయః. తత్ర ప్రజాపత్యాదీని నామాని తద్వాచ్యాని రూపాణి తత్కర్మాణి జ్ఞేయాని పృథక్ తత్తదవాంతర భేదేన. కూశ్మాండేతి. గిరీనిత్యస్యానంతరం నృపేతి సంబోధనం. (37,38,39)

ద్వివిధాశ్చతుర్విధా యే
ఉ న్యే జలస్థల నభౌకసః ।
కుశలాకుశలా మిశ్రాః
కర్మణాం గతయస్త్విమాః ॥ - 40

గ్రహములను, పక్షులను, మృగములను, పశువులను, వృక్షములను, పర్వతములను, సరీసృపములను (39)

**టీ.** ఏతత్ప్రపంచయతి – దీనిని విస్తరించి చెప్పుచున్నాడు – ప్రజాపతీనితిసార్ధైస్త్రిభిః – 'ప్రజాపతీన్' మొదలుగ మూడున్నర శ్లోకములతో – ద్వితీయాంతానాం ధత్తఇత్యనేనావ్యయః – ద్వితీయా విభక్తి అంతమునందుగల పదములన్నింటికిని 'ధత్తే' (ధరించెను) అను క్రియా పదముతో అన్వయము – తత్ర ప్రజాపత్యాదీని నామాని తత్తద్వాచ్యాని రూపాణి తత్తత్కర్మాణి చ జ్ఞేయాని పృథక్ తత్తదవాంతరభేదేన – ఇట ప్రజాపతి మొదలగు వారి నామములు, ఆ నామములతో చెప్పబడు రూపములు, వారి వారి క్రియలు, వారి అవాంతర భేదములతో వేర్వేఱుగ తెలియదగినవి.(37, 38) గిరీనిత్యస్యానంతరం నృపేతి సంబోధనమ్ – 'గిరీన్' అనుమాట తరువాత 'నృప' అని సంబోధనము (39)

**తా.** స్థావర జంగమములు అను రెండు విధములగునవి, జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జములు అను నాలుగు విధములగు జాతులును, ఇంకను ఇతరములగు జలచరములు, స్థలచరములు, ఖేచరములు, ఉత్తమ, మధ్య నీచ జాతులు ఈ జన్మములన్నియు పుణ్యాపాప (మిశ్ర) ఫలములు.

**టీ** :- ద్వివిధా ఇతి. ద్వివిధాః స్థావరజంగమాది రూపేణ చతుర్విధాః జరాయుజాండజ స్వేదజోద్భిజ్జరూపేణ జలస్థల నభాంసి ఓకాంసి యేషాం తానపి ధత్త ఇతి పూర్వేణాన్వయః. యచ్చ రాజ్ఞా పృష్టం. శ్లో. " యావత్యః కర్మగతయో యాదృశీర్ద్విజసత్తమే" తి తస్యాపి ప్రసంగాదనేనైవోత్తరమాహ – కుశలాః ఉత్తమాః అకుశలాః నీచాః. మిశ్రాః పదాంతరమిశ్రాః మధ్యమాః కర్మణాం పుణ్యాపుణ్యవిమిశ్రాణాం గతయః ఫలాని. (40)

**టీ.** ద్వివిధాః – స్థావరములు, జంగమములు అనునట్టి రూపమున– చతుర్విధాః – జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు, అనెడి రూపమున – జల, స్థల, నభాంస్యోకాంసి యేషాం తానపి ధత్తఇతి పూర్వేణాన్వయః – జలములు, స్థలములు, ఆకాశదేశములు నివాస స్థానములుగ ఎవరికి కలవో అట్టి ప్రాణులను కూడ ధరించియుండునని ముందు చెప్పబడిన దానితో అన్వయము– యచ్చ రాజ్ఞా పృష్టం 'యావత్యః కర్మగతయో యాదృశీర్ద్విజసత్తమ' ఇతి తస్యాపి ప్రసంగాదనేనైవోత్తర మాహ–'రాజుచే అడుగబడిన వివిధ కర్మలచే జీవులకు ఎన్ని మరియు ఎట్టి గతులేర్పడును?' అను ప్రశ్నకు, ఆ ప్రసంగమునకును దీని తోడనే సమాధానము చెప్పుచున్నాడు. కుశలాః – ఉత్తమమైనవి – అకుశలాః – నీచమైనవి– మిశ్రాఇతి పదాంతరమ్ – 'మిశ్రాః' అని వేఱొక పదము– మిశ్రాః – మధ్యమములు – కర్మణాం పుణ్యాపాప మిశ్రాణాం గతయః ఫలాని – కర్మణాం – పుణ్యాపాపములు కలిసియున్న కర్మలకు లభించు గతులు లేక ఫలములు. (40)

సత్త్వం రజస్తమ ఇతి తిస్రః సురనృనారకాః
తత్రాప్యేకైకశో రాజన్భిద్యంతే గతయ స్త్రిధా ।
యదైకైక తరో ఽ న్యాభ్యాం స్వభావ ఉపహన్యతే । - 41

**తా.** సత్త్వము, రజస్సు, తమస్సు అను గుణముల ప్రాధాన్యమున వరుసగా, దేవ, మనుష్య, నారకీయ ఫలములు కలుగును. వీనిలోనను ఒక్కొక్క గుణ ప్రాధాన్యమున అన్యగుణ మిశ్రమములతో మూడేసి విధముల భేదములేర్పడును. లేక ఒక్కొక్క గుణమే తక్కిన రెండు గుణములచే అభిభూతమగునప్పుడు ఏకైక గుణ ప్రధానమగు గతి కలుగును.

**టీ.** సత్త్వాది భేదేన కర్మగతివైచిత్ర్యం ప్రపంచయతి – సార్ధేన. సత్త్వమితి. సత్త్వాదయః తిస్రో గతయః తా ఏవ శృంగగ్రాహికయా దర్శయతి – సురనృనారకా ఇతి. సురాది శబ్దాః స్వర్గాదీనాముపలక్షణార్థాః. అన్యాభ్యాం గుణాభ్యాం స్వభావః

**టీ.** సత్త్వాది భేదేన కర్మగతివైచిత్ర్యం ప్రపంచయతి – సత్త్వము మొదలగు గుణ భేదముల చేత కర్మగతి వైచిత్రి యెట్లేర్పడునో చెప్పుచున్నాడు – సత్త్వమితి సార్ధేన – 'సత్త్వం' అను అర్ధశ్లోకముతో కూడిన శ్లోకముతో – సత్త్వాదయస్తిస్రోగతయః – సత్త్వము మొదలగు గుణములు మూడు గతులు గలవి – సురాది శబ్దా ఋష్యాదీనా ముపలక్షణార్థాః – సురాది శబ్దములు

గుణః ఉపహన్యతేఽ ను విధ్యతే. తత్రాపి సత్త్వాదిగతిషు ఏకైకశో గతయః. (41)

స ఏ వేదం జగద్ధాతా
భగవాన్ ధర్మరూపధృక్ ।
పుష్ణాతి స్థాపయన్విశ్వం
తిర్యఙ్నర సురాత్మభిః ॥ - 42

**టీ :-** బ్రహ్మరూపేణ స్రష్ట ృత్వ ముక్త్వా విష్ణురూపేణ పాలకత్త్వమాహ – స ఇతి. స ఏవ భగవాన్, తిర్యగాద్యవతారైః ఇదం విశ్వం స్థాపయన్, పాలయన్. ధర్మరూపేణ పుష్ణాతి. భోగైస్సంవర్ధయతి. (42)

తతః కాలాగ్ని రుద్రాత్మా
యత్సృష్టమిదమాత్మనః ।
సన్నియచ్ఛతి కాలేన
ఘనానీక మివానిలః ॥ - 43

ఋషులు మొదలగు వారికి ఉపలక్షణములగు అర్థములు గలవి – అన్యాభ్యాం గుణాభ్యాం స్వభావో గుణః ఉపహన్యతేఽ ను విధ్యతే – ఇతరములైన రెండు గుణముల చేత స్వభావము మిశ్రితమగును. (41)

**తా.** ఆ భగవానుడే ఈ జగత్తును ధారణ పోషణ చేయుట కొఱకు ధర్మరూప (విశ్వ) విష్ణురూపమును ధరించియుండినను పశుపక్ష్యాదులు, మనుష్యులు, దేవతలు మొదలగు అవతారములు స్వీకరించుచు ఈ విశ్వమును పాలనము, పోషణము చేయుచుండును.

**టీ.** బ్రహ్మరూపేణ స్రష్టృత్వముక్త్వా విష్ణు రూపేణ పాలకత్వమాహ–బ్రహ్మరూపము చేత సృష్టిచేయు లక్షణమును చెప్పి విష్ణురూపము చేత అతని పాలకత్వమును చెప్పుచున్నాడు – స ఏవ భగవాంస్తిర్యగాద్యవతారైరిదం విశ్వం స్థాపయన్ పాలయన్ ధర్మరూపేణ పుష్ణాతి భోగైః సంవర్ధయతి – ఆ భగవానుడే తిర్యక్కులు మొదలగు అవతారములతో ఈ విశ్వమును స్థాపించుచు, పాలించుచు, ధర్మరూపముతో భోగములచే వృద్ధి చేయును. (42)

**తా.** అటుపిమ్మట కాలాగ్ని రుద్ర రూపుడై తన చేతనే సృష్టింపబడిన ఈ విశ్వమును – మేఘములను గాలి చెల్లాచెదరు చేయునట్లు – సంహరించును.

**టీ:-** రుద్రరూపేణ సంహర్తృమాహ – తతఇతి. ఆత్మనస్స కాశాద్యదిదం సృష్టం. తత్కాలాదిరూపేణ సన్నియచ్చతి. సంహరతి. (43)

ఇత్థం భావేన కథితో
భగవాన్ భగవత్తమః ।
నేత్థం భావేన హి పరం
ద్రష్టుమర్హంతి సూరయః ॥ - **44**

**టీ** :- కర్తృత్వాద్యనువాదేన దశమస్య శుద్ధిమాహ – ఇత్థం భావేనేతి. భగవాన్ అతిశయేన భగవాన్ భగవత్తమః ఇత్థం భావేన స్రష్ట ృత్వాది రూపేణ. శ్రు. ‘ తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః. సో ఽ కామయత బహుస్యాం ప్రజాయే యయే’ తీత్యాది శ్రుత్యా కథితః. సూరయస్తు పరం కేవలం ఏవం రూపేణ ద్రష్టుంనార్హంతి. (44)

నాస్య కర్మణి జన్మాదౌ
పరస్యాను విధీయతే ।
కర్తృత్వ ప్రతిషేధార్థం
మాయయారోపితం హి తత్ ॥ - **45**

**టీ.** రుద్రరూపేణ సంహర్తృత్వమాహ తతఇతి – ‘తతః’ అను ఈ శ్లోకముతో రుద్రరూపమున ఆతని జగత్సంహారకత్వమును చెప్పుచున్నాడు – ఆత్మనః సకాశాద్యదిదం సృష్టం తత్సన్నియచ్ఛతి – తనతోఁబాటుగ ఏ విశ్వము సృష్టింపబడినదో దానిని సంహరించును.(43)

**తా.** అచింత్యైశ్వర్యము గల భగవానుని గూర్చి మహాత్ములీప్రకారముగానే చెప్పుదురు. కాని ఆతడింతకన్నను అధికతముడగుటచే తత్త్వజ్ఞానులైన వారాతని గూర్చి ఇంతమాత్రమే భావింపరాదు. పృథివ్యప్తేజో వాయ్వాకాశ కాల దిగాత్మ మనస్సులు తొమ్మిది ద్రవ్యములు, ఇవి జీవ జ్ఞేయ విషయములు, జీవాచింత్యమగు దశమ పదార్థము పరమాత్మ.

**టీ.** కర్తృత్వాద్యపవాదేన దశమస్య శుద్ధి మాహ – కర్తృత్వము మొదలగు వానిని తిరస్కరించుటతో సనాతనుడైన పరమాత్ముని శుద్ధత్వమును చెప్పుచున్నాడు. (దదాతి, దధతి వా శమ మితి దశమః?) ఇత్థం భావేన స్రష్ట ృత్వాది రూపేణ ‘తస్మాద్వా ఏ తస్మాదాత్మన ఆకాశః సంభూతః; ‘సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయ’ ఇత్యాది శ్రుత్యా కథితః – ఇట్టి భావనతో సృష్టి చేయుట మొదలగు వాని రూపమున, ‘అట్టి ఆత్మనుండి ఆకాశము పుట్టెను’, అతడు అనేకములగుదునని సంకల్పించెను, మున్నగు శ్రుతి వాక్యములతో చెప్పబడినది – సూరయస్తు పరం కేవల మేవం రూపేణైవ ద్రష్టుం నార్హంతి – పండితులైననో కేవలుడైన పరమాత్ముని ఈ రూపమున (కర్తృత్వాది రూపమున) చూచుటకు అర్హులు కారు.(చూడరు) **(44)**

**తా.** సృష్టి రచన మొదలుగ కర్మలు నిరూపించియు, పరమాత్మకు ఎట్టి కర్తృత్వమును గాని శ్రుత్యాదులు, చెప్పియుండలేదు. మాయచేత ఆరోపింపబడిన సృష్ట్యాది కర్మ అంతయును అతని (పరమేశ్వరుని) కర్తృత్వమును నిషేధించుటకొఱకే.

**టీ** :- తత్కిం యతఃనేతి. అస్య విశ్వస్య జన్మాదౌ కర్మణి పరస్య ఈశ్వరస్య ఇత్థంభావః కర్తృత్వం నాస్తి. శ్రుత్యాదితాత్పర్యేణ స ప్రతిపాద్యతే, కింత్వనువిధీయతే అనువర్త్యతే కిమర్థం కర్తృత్వ ప్రతిషేధార్థం. హి యతో మాయయా తత్ ఆరోపితం ప్రకాశితం తథాచ శ్రుతిః – ' నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం. ఇంద్రో మాయాభిః పురురూప ఇయ్యత' ఇత్యాద్యా. (45)

**టీ.** తత్కిమ్ – కర్తృత్వాది రూపమున చూచుట సరికాదనుట యేమి?– యతః అస్య విశ్వస్య జన్మాదౌ కర్మణి పరమేశ్వరస్య ఇత్థం భావః – ఏలయన ఈ విశ్వము యొక్క పుట్టుక మొదలగు కర్మయందు పరమేశ్వరునకు – కర్తృత్వం నాస్తి – కర్తృత్వము లేదను నిట్టి భావమే – శ్రుత్యపి తాత్పర్యేణ నప్రతిపాద్యతే – శ్రుతికూడ ఈశ్వరునకు కర్తృత్వము కలదనుటను తత్పరత్వముతో ప్రతిపాదింపదు+–కింతు అనువిధీయతే, అనూద్యతే – కాని వ్యావహారికముగ జరిగిన దానిని జరిగినట్లుగ అనువదించున్నది – కిమర్థమ్ – ఎందులకు?– కర్తృత్వ ప్రతిషేధార్థమ్ – అతని కర్తృత్వమును నిషేధించుటకు – హి యతో మాయయారోపితమ్ ప్రకాశితమ్ – మఱియింకేలననగా (సృష్టి) మాయచేత ఆరోపింపబడినది ప్రకాశితమైనది కనుక – తథాచశ్రుతిః – శ్రుతియు అటులే చెప్పుచున్నది – "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనమ్", "ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే" ఇత్యాద్యాః – పరమాత్మ పరిచ్ఛేదము (భాగము) లేనిది. క్రియలేనిది, చాంచల్యము లేనిది. అల్పము కానిది, కల్మషము లేనిది" – "పరమాత్మ, మాయచే విస్తృతమైన రూపములుగ ప్రకాశించుచుండును" అను మొదలగునవి. (45)

అయం తు బ్రహ్మణః కల్పః
సవికల్ప ఉదాహృత ।
విధిః సాధారణో యత్ర
సర్గాః ప్రాకృత వైకృతాః ॥ - 46

**తా.** ఇది బ్రహ్మకల్పము, అవాంతరకల్పములతో సహా ఉదహరింపబడినది. మహాకల్పమున ప్రాకృతములు, అవాంతరకల్పమున వైకృతములు అని తప్ప అన్ని కల్పములయందు సృష్టి క్రమములు సాధారణముగనే అనగా ఒకే విధముగనుండును. (మహాకల్ప ప్రారంభమున ప్రకృతి నుండి క్రమముగ మహత్తత్త్వాదుల ఉత్పత్తి యగును. ఇక కల్పములందు ప్రారంభమున ప్రాకృత సృష్టి యథాతథముగ నుండును కాని చరాచర, ప్రాణి సృష్టి యగు వైకృత సృష్టి నవీన పద్ధతిలో నగును.)

**టీ:-** ఉక్తమర్థముపసంహరతి - అయమితి. బ్రహ్మస్సంబంధీకల్పః. వికల్పో ఽ వాంతరకల్పః. తత్సహిత ఉదాహృతః ఉదాహరణత్వేన సంక్షేపత ఉక్తః. యత్ర మహాకల్పే. ప్రాకృత మహదాదిసర్గాః అవాంతరకల్పే చ వైకృతాః స్థావరాదిసర్గాః ఇత్యయం విధిః ప్రకారః అన్యైః మహాకల్పాదిభిః సాధారణః. (46)

పరిమాణం చ కాలస్య
కల్ప లక్షణ విగ్రహమ్ ।
యథా పురస్తాద్వ్యాఖ్యాస్యే
పాద్మం కల్పమథో శృణు ॥ -47

**టీ :-** వక్ష్యమాణం విస్తరం ప్రతిజానీతే - పరిమాణమితి. పరిమాణం స్థూలం సూక్ష్మం చ కల్పస్య లక్షణం నేహ నిరూపయతి. తద్విగ్రహం అవాంతరకల్ప మన్వంతరాది రూపం తద్విభాగం యథావత్ విస్తరేణ పురస్తాత్తృతీయస్కంధే తత్ర చ పాద్మం కల్పమథో ఇతి కార్త్స్న్యేన వ్యాఖ్యాయమానం శృణు. (47)

**టీ.** ఉక్తమర్థముపసంహరతి - చెప్పిన అంశమును సమాప్తి చేయుచున్నాడు- అయంత్వితి - 'అయంతు' అను ఈ శ్లోకము ద్వారా - బ్రహ్మణః సంబంధి కల్పో మహాకల్పో, వికల్పోఽ వాంతరః తత్సహిత ఉదాహరణత్వేన సంక్షేపత ఉక్తః - బ్రహ్మసంబంధమగు కల్పము మహాకల్పము, వికల్పము అవాంతరకల్పము ఈ రెండింటిని ఉదాహరణత్వముతో సంక్షేపముగ చెప్పినాడు - కథం భూతః - ఎట్టిది?- యత్ర మహాకల్పే ప్రాకృతాః మహదాది సర్గాః - మహాకల్పమునందలిది మహదాదుల ప్రాకృత సృష్టి - అవాంతర కల్పేచ వైకృతాః - అవాంతర కల్పమునందు వికృత సృష్టులు - స్థావరా విసర్గాఇత్యయం విధిః ప్రకారః అన్యైర్మహా కల్పాదిభిః సాధారణ ః - స్థావరాదుల సృష్టి ప్రకారము మహాకల్పాదులందలి ప్రాకృత సృష్టులతో సమానము.(46)

**తా.** కాలము యొక్క పరిమాణము, కల్పము మరియు దాని అంతర్గతములైన మన్వంతరముల వర్ణనము రాబోవు స్కంధమునందలి అధ్యాయములలో వ్యాఖ్యానించెదను. పాద్మకల్ప వర్ణనమిపుడు సావధానుడవై వినుము.

**టీ.** వక్ష్యమాణం విస్తరం ప్రతిజానీ తే - చెప్పబోవు వివరము తెలుపును - పరిమాణం స్థూలం సూక్ష్మంచ కల్పస్య లక్షణ మియానేవంరూప ఇతి - కల్పము యొక్క పరిమాణము, అది స్థూలమైనది లేక సూక్ష్మమైనది దాని లక్షణమింతటిది దాని రూపమిది అని - తద్విగ్రహమవాంతరకల్పం మన్వంతరాదిరూపం, విభాగంచ యథావద్విస్తరేణ పురస్తాత్తృతీయస్కంధే వ్యాఖ్యాస్యామి - అవాంతరకల్పము, మన్వంతరాదులస్వరూపము దాని విభాగము ఉన్నది ఉన్నట్లుగ విపులముగా ముందు రాబోవు మూడవ స్కంధమున వ్యాఖ్యానింతును - తత్ర పాద్మం కల్ప మథో ఇతి కార్త్స్న్యేన వ్యాఖ్యాయమానం శ్రుణు అచట, 'ఇక పాద్మంకల్పం' అని విస్తారముగ వ్యాఖ్యానింపబోవుటను వినుము'.(47)






**శౌనక ఉవాచ**

యదాహనో భవాన్సూత
క్షత్తా భాగవతోత్తమః ।
చచార తీర్థాని భువ
స్త్యక్త్వా బంధూన్సుదుస్త్యజాన్ ॥ - 48

**టీ** :- యదర్థం సృష్ట్యాదినిరూపణం తదేవ సాక్షాత్ శ్రోతుకామః కథాంతరం పృచ్ఛతి – యథేతి. క్షత్తా విదురః భువస్సంబంధీని తీర్థాని యద్వా భువః క్షేత్రాణి. (48)

**శౌనకుడిట్లనెను.**

**తా.** సూతమహర్షీ! తాము మాకు చెప్పినట్లుగా భాగవతోత్తముడైన విదురుడు, విడుచుటకు శక్యము కాని బంధుజనులను విడిచి ఈ భూమి యందలి పుణ్యతీర్థములను ఎట్లు తిరిగెను.

**టీ.** సృష్ట్యాది నిరూపణ సంబంధమగు ఏ విషయము కలదో, దానినే సాక్షాత్తుగ వినఁ గోరుచున్న వాడై వేఱొక కథను గూర్చి అడుగుచున్నాడు – యదాహేతి – యదాహ అను ఈ శ్లోకముతో – (యదర్థం సృష్ట్యాది నిరూపణం తదేవ సాక్షాచ్ఛ్రోతుకామః కథాంతరం పృచ్ఛతి) క్షత్తా – విదురుడు – భువః సంబంధాని తీర్థాని – భూమికి సంబంధించిన తీర్థములను–యద్వా – లేక – భువః క్షేత్రాణి చేతి – భూమికి సంబంధించిన క్షేత్రములను' అని – **(48)**

కుత్ర కౌషారవేస్తస్య
సంవాదో ఽ ధ్యాత్మసంశ్రితః ।
యద్వా సభగవాంస్తస్మై
పృష్టస్తత్త్వమువాచ హ ॥ - 49

**టీ** :- కుత్రేతి. కౌషారవేః మైత్రేయస్య తస్య క్షుత్తుశ్చ ఆధ్యాత్మజ్ఞానం సంశ్రితః సంవాదః పరమాత్మ విషయక ఇత్యర్థః (49)

**తా.** అతనికి మైత్రేయ ఋషితో అధ్యాత్మతత్త్వ సంబంధమగు సంవాదమెచ్చట జరిగెను? విదురుడు ప్రశ్నించిన మీదటనే ఆ ఋషి, తత్త్వమును వివరించి యుండెనా?

**టీ.** కౌషారవేర్మైత్రేయస్య తస్యక్షత్తుశ్చాధ్యాత్మజ్ఞాన సంశ్రితః సంవాదః – మైత్రేయునకును విదురునకును ఆధ్యాత్మికజ్ఞాన సంబంధమగు సంవాదము – (49)









బ్రూహి నస్తదిదం సౌమ్య
విదురస్య విచేష్టితమ్ ।
బంధుత్యాగ నిమిత్తం
చ తథైవాగత వాన్పునః ॥ - 50

**తా.** సౌమ్యుడా! విదురుని యొక్క బంధుత్యాగ నిమిత్తమైన చేష్ట యెందులకు చేయవలసి వచ్చెనో, మఱల అతడు ఎందులకు తిరిగి వచ్చెనో మాకుఁజెప్పుడు.

**టీ :-** బ్రూహీతి. పునరాగతవాన్ తత్ర నిమిత్తం బ్రూహి. (50)

**టీ.** పునరాగతవాన్ తత్ర చ నిమిత్తం బ్రూహి మఱల తిరిగివచ్చెను. దానికిని కారణము చెప్పుము. (50)

***సూత ఉవాచ***

రాజ్ఞా పరీక్షితా పృష్టో
యదవోచన్మహామునిః ।
తద్వో ఉ భిధ్యాస్యే శృణుత
రాజ్ఞః ప్రశ్నానుసారతః ॥ - 51

***సూతుడిట్లనెను.***

**తా.** రాజగు పరీక్షిత్తుతో అడుగబడిన ప్రశ్నకు, ఆ ప్రశ్ననుసరించి, శుక మహర్షి యేమి సమాధానము చెప్పెనో దానిని మీకు వివరింతును వినుడు.

**టీ :-** రాజ్ఞేతి. రాజ్ఞా పృష్ట ఇతి అయమర్థః యద్యూయం పృచ్ఛత ఇదమేన రాజాపి శుకం పృష్టవాన్. శుకో ఉ పి విదురమైత్రేయసంవాదం పురస్కృత్య యే పూర్వం రాజ్ఞా కృతాః ప్రశ్నాః తదనుసారేణ సర్వం పురాణార్థం అవోచత్ తదేవాహం వో ఉ భిధాస్యామి తథైవ శృణుతేతి. (51)

**టీ.** రాజ్ఞా పృష్ట ఇతి – "రాజుచే అడుగఁబడెను" అని – అయమర్థః – దీని యర్థము – మీరిప్పుడడిగినదే, రాజు, శుక మహర్షినడిగెను. (యద్యూయం పృచ్ఛథ ఇదమేవ రాజాపి శుకం పృష్టవాన్) – శుకోఉ పి విదురమైత్రేయ సంవాదం పురస్కృత్య యే పూర్వం రాజ్ఞా కృతాః ప్రశ్నాస్తదనుసారేణ సర్వం పురాణార్థమవోచత్ – శుక మహర్షి కూడ విదుర మైత్రేయ సంవాదమును పురస్కరించుకొని, ఏ ప్రశ్నలు రాజుచే అడుగబడెనో వానిననుసరించి పురాణార్థమంతయును స్పష్టము చేసెను – తదేవాహం వోఉ భిధాస్యామి. తథైవ శృణుతేతి – అదియే నేనును మీకు చెప్పుచున్నాను. అటులే విందురుగాక అని – 'శ్రీమద్భాగవతం యేన స్వబ్రహ్మముఖతోమితమ్ బ్రహ్మనారదయోః ప్రోక్తం తం వందే గురుమీశ్వరమ్' –

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణేஉష్టా దశ సాహస్ర్యాం పారమహంస్యాం సంహితాయాం ద్వితీయస్కంధే పురుష సంస్థాను వర్ణనం నామ దశమోஉ ధ్యాయః!!

**శ్రీమద్భాగవత టీకాయాం శ్రీధరస్వామి విరచితాయాం**

**భావార్థ దీపికాయాం**

**ద్వితీయ స్కంధః సమాప్తః**

**శ్రీకృష్ణార్పణమస్తు !!**

బ్రహ్మమగునెవని స్వీయముఖము నుండి వెలువడి, బ్రహ్మదేవునకును, అతనిచే నారదునకును, వారిచే పరంపరగ నితరులకును బోధింపబడినదో, అట్టి గురువగు నీశ్వరునకు నమస్కరించుచున్నాను – 'యత్సూత్రయంత్రితం విశ్వం నరీనర్తి జగత్త్రయమ్, సంతస్తమేవ పృచ్ఛంతు యదత్ర స్ఖలితం మమ – ఎవని మాయాసూత్రము చేత ఈ విశ్వమంతయు నియంత్రింపబడియున్నదో, ముజ్జగములును ఎవని మాయచేత అతిశయముగ మఱల మఱల నర్తించుచున్నవో, అంతర్యామి రూపమున నాచేత ఈ భాగవతమును వెలవరింప జేయుచున్నాడో, అట్టి ఈశ్వరుని గూర్చియే సత్పురుషులు ప్రశ్నించుచుందురు గాక – ద్వితీయస్కంధ సంబంధి పద భావార్థ దీపికా, ఉద్దీప్యతామియం సద్భిర్యథాస్యాత్తత్త్వ దీపికా – శ్రీమద్భాగవతమునకు సంబంధించిన పదముల యొక్కయు అర్థముల యొక్కయు భావములను దీపింపజేసెడు ఈ భావార్థదీపిక యనెడు టీక సత్పురుషుల చేత భగవత్తత్త్వము ఎట్లు ప్రకాశితమగునో అట్లు చేయబడును గాక – ఈక్షంతా మిచ్ఛయా సంతః క్షమంతాం మమసాహసమ్, మయాహి స్వీయ బోధాయ కృతమేతన్న సర్వతః – సత్పురుషులు దీనిని యిష్టముతో చూచెదరుగాక, నా సాహసమును మన్నింతురు గాక, ఇది నా స్వీయావగాహన కొఱకు నాచే చేయబడినది. కాని అందఱి కొఱకును కాదు. (51)

శ్రీమద్భాగవత మహాపురాణమున, అష్టాదశ సాహస్ర్యమున, పారమహంస్య సంహితయందు రెండస్కంధమున, పురుష సంస్థానువర్ణనమను పదియవ అధ్యాయము సమాప్తము.

**శ్రీధరస్వామిచే రచింపబడినభావార్థ దీపిక యను శ్రీమద్భాగవత టీక యందు రెండవ స్కంధము నందలి పదియవ అధ్యాయము సమాప్తము. ద్వితీయ స్కంధము సమాప్తము.**

